**SUNDARAYYA VIGNANA KENDRAM**
1-8-1/B/25/A, Bagh Lingampalli
Hyderabad – 500 044, Andhra Pradesh, India

## Bibliographic Record Target

నరసింహము, కూచి.

శ్రీగౌరాంగచరిత్రము / కూచి నరసింహముచేఁ దెలుఁగున రచియింపఁబడినది.- 1. కూర్పు.- పిఠాపురము : శ్రీ విద్వజ్జన మనోరంజనీ ముద్రాక్షరశాల, 1912-1914.

2 parts. ;20 cm.

Record no. 426

Narasiṃhamu, Kūci.

Śrīgaurāṅgacaritramu / Kūci Narasiṃhamucēm̐ Delum̐guna raciyimpam̐baḍinadi.- 1. kūrpu.- Piṭhāpuramu : Śrī Vidvajjana Manōrañjanī Mudrākṣaraśāla, 1912-1914.

2 parts. ;20 cm.

Record no. 426

35 mm microfilm

Image placement: IA (IIA) IB IIB      Date filming began:

# LORD GAURANGA.

## IN TELUGU VERSE

## PART I.

BY


KUCHI NARASIMHAM, B.A.

Head Master, R. Ch. High School,

PITHAPURAM.






...anoranjani

1912.

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః.

# శ్రీగౌరాంగచరిత్రము.

## ప్రథమభాగము.


పీఠికాపురోన్నతపాఠశాలాప్రధానోపాధ్యాయుఁడగు

కూచి నరసింహముచేఁ

దెలుఁగున రచియింపఁబడినది.



మొదటికూర్పు 1000 ప్రతులు.





పిఠాపురమునందలి

శ్రీ విద్వజ్జన మనోరంజనీ ముద్రాక్షరశాలయందు

ముద్రితమై ప్రకటింపఁబడియె.

1912.

Gentle reader,

The hero of the book I have ventured to place before you is not a mythological, but historical personage that lived in India, the land of great saints and sages, more than four centuries ago. He was a great genius and an adept in Sanscrit Grammar and Logic. He was also a formidable debater, who could humble the greatest and most renowned scholars of his time in oral controversies. Gauranga's brilliant parts and depth of learning are, by themselves, enough to rouse your interest; but this was only the human side of Gauranga.

There was a higher, nobler, and I have no hesitation to say, a divine phase of the individual, which exercised a mysterious influence upon those that came in contact with him and forced them into the belief that he was an incarnation of Sri Krishna, who, they thought, reappeared in a gold-coloured body as Gauranga.

He came to the world to cleanse and vivify a decaying society and resuscitate the dying *bhakthi* in the heart of the worldling; and this he did in a manner which no mortal could imitate. It is why he was and is, to this day, considered an *avatar*. The blessed men who are born from time to time to restore the moral and spiritual equilibrium of a community, weighed down with sin and corruption, are rightly regarded as *avatars*; and none would deny Gauranga a place among them.

He was the fulfilment of the genuine supplications of a few sincere *bhakthas*, who had devoutly prayed for another advent of Sri Krishna. His was a work of repairing and reviving, not one of destroying and substituting. The manifestation of superhuman powers in converting the

worst specimens of humanity into staunch devotees of Krishna, and the performance of miracles, such as the healing of the sick by touch, look and word, and the winning over to his side the most chronic cases of depravity and scepticism, with his bewitching presence and a heart overflowing with the 'milk of human kindness' and selfless love, should justify the elevation of Gauranga above the level of man.

God in flesh, he was now Radha the worshipper, now Sri Krishna, the Worshipped. His pilgrimage to Gaya, where he beheld the lotus-feet of Vishnu in the sacred temple, was the turning point of his life. It changed a naughty lad and proud *savant* into the meekest of *bhakthas.* The tears of *bhakthi* washed away the human and left the divine in him to work the many wonders detailed in this book.

Books like this may not add a pie to your income, nor contribute in the least to worldly advancement, but will, by no means, be unwelcome companions in moments, when you long for relief from the surfeit of worldly pleasures or deliverance from the troubles and turmoils of life which come to man in spite of his best efforts to guard against them. They come to pour a soothing balm upon your mind oppressed with gnawing cares and give you a foretaste of a better and happier existence.

Lord Gauranga taught more by example than by precept, and conquered evil rather by love than fear and fight. Tears dissolved the sins of the most hardened wretch; the loving look melted the most pitiless and stubborn heart; and the divine touch transformed the blackest sinner into the purest saint and *bhaktha.* For the behoof of his disciples he became an ideal *bhaktha* himself, and it needs no



saying, that he acted his part with consummate skill.

To those who believe neither in a *before* nor in a *beyond*, or covet nothing more than the gifts of this world, "Gauranga's life" may not be of much benefit; but to one whose aims and ideals of life transcend the pleasures of the sense and the intellect, I have no doubt that it will do some useful service.

Mr. Shishir Kumar Ghose, a distinguished author and a great *bhaktha* himself, has written the biography in choice English prose under the title of 'Lord Gauranga or Salvation for all' with materials gathered from the several Sanscrit and Bengali works extant on the great man. He got it printed and published at the 'Patrika' office Calcutta, in two parts, of the first of which and two chapters of the second my humble work is a free rendering into Telugu verse. I have put it into verse advisedly; for poetry is certainly a more fitting garb for *bhakthi* than prose.

If I am spared, and if this part meets with any appreciable degree of public recognition, in other words, if you, my friend, do not feel it out of date, and one too many in the growing modern Telugu literature, I shall, God willing, also attempt the translation of the rest of Part II and complete the work.

I trust the greatness of the hero, coupled with your kind indulgence will cover the many defects of my translation. May you feel the soul-uplifting and sanctifying touch of Lord Gauranga and have in abundance the blessings of *bhakthi* and eternal joy from Him! Good-bye!

PITHAPURAM.
10-5-1912.

Your well-wishing,

K. NARASIMHAM.

శ్రీరామ.

# పీఠిక.



ఆంధ్రమహాజనులారా!

ఈగ్రంథ ముత్తరహిందుస్థానమున నవద్వీపపట్టణంబున నవతరించిన యొకమహాపురుషుని చరిత్రము. శుష్కతర్కములును ననుభవరహితము లైనవాజ్మాత్రవేదాంతములును బ్రబలి దేశము పాడగుచుండఁగా శ్రీమద్భగవద్గీతావాక్యానుసారముగ నీయన యుద్భవించి భక్తిమార్గోత్కృష్టతనుస్థాపించి యొందఱినో తరింపఁజేసెనని గ్రంథములవలనఁ గానవచ్చుచున్నది. ఈకారణముచేతనే యుత్తరదేశమున బహుజను లీయన నపరకృష్ణావతారముగ భావించి పూజించుచున్నారు. ఈయనకు నిమియనియు విశ్వంభరుఁడనియు గౌరాంగుఁడనియుఁ జైతన్యస్వామియనియుఁ బెక్కునామములుగలవు. ఈయనజన్మించి యిప్పటికి నాలుగువందల యిరువదియేండ్ల కెక్కుడైనది. ఇతఁడు కల్పితపురుషుఁడుగాఁడు.

వంగ గీర్వాణ భాషాగ్రంథములననుసరించి యీయనపావనచరిత్రము నాంగ్లేయభాషలో వచనకావ్యముగ మృదుమధురశైలిని మహాభక్తుఁడైన 'శిశిరకుమారఘోషు' గారురచియించి కలకత్తాలోనున్న శ్రీ 'పత్రికా' ముద్రాక్షరశాలయందు రెండుసంపుటములుగ ముద్రింపించిరి. నేను నరసాపురమున నుపాధ్యాయుఁడనుగా నున్నప్పు డీగ్రంథముం జదువుట తటస్థించెను. అప్పుడు కొన్నికొన్నిపట్లు హృదయముఁ గరఁగించి కన్నీళ్లుగాఱిపించు నంతరసవంతములుగఁ గాన్పించినవి. బ్రదికియుండిన భగవత్కృపచే నెప్పుడో యీగ్రంథమాంధ్రీకరించి జ-



న్మము సఫలముగావించుకొనవలయు ననుతలంపొక్కటి కలిగెను. పిమ్మట నేను శ్రీ రామకృష్ణపరమహంసచరిత్రమును దద్బోధనములును బద్యములుగ వ్రాయునప్పుడం దచ్చటచ్చట శ్రీగౌరాంగుభక్తింగూర్చి యామహామహునిచే నుడువఁబడిన గౌరవప్రశంసాసూచకభాషణంబులాతలంపును బలపఱిచెను.

ఎట్టకేలకు నాయుద్యమము నెఱవేర్చుకొనఁబూని కొంతభాగ, మనఁగా నిరువదియాశ్వాసములకథను, బద్యరూపముగాఁ దెనిఁగించి యందుఁ గొన్నియాశ్వాసములు తణుకులో నున్నసువర్ణలేఖాపత్రికలోఁ బ్రచురింపించితిని.

దినదినాభివృద్ధిఁ గాంచుచున్న కుక్షింభరి వ్యాపారాదిక్లేశములచే వలయు తీఱుపాటులేమింజేసి యిప్పటికింతటితోఁ జాలించి యయినంతవఱ కొకభాగముగఁ దీయింప నిశ్చయించినాఁడను.

అయినదొక సగమునకెక్కువ. కావలసినది పదునాలుగాశ్వాసములభాగము, సగమునకుందక్కువ. తీఱికచూచుకొని, యీప్రకటింపఁబడిన ప్రథమభాగమునందుఁ జదువరులకుండు నాదరణముం జూచికొని గ్రంథము పూర్ణముచేయువలయు ననుకుతూహలముగలదు. ఈనామనోరథము సఫలమగునో విఫలమగునో యది భగవదధీనము.

ఏతద్గ్రంథాంధ్రీకరణమునకు నన్నుఁ బ్రేరేచినది శ్రీగౌరాంగస్వామి దివ్యానందప్రదప్రశస్తభక్తిగాని నాయల్పకవితాకౌశలముగాదు. రసపుష్టికై కథాసత్యభంగముగాకుండ నచ్చటచ్చట నించుకపెంచి వర్ణించితిని. కొన్నిచోట్లఁ గుదించుటయుంగూడఁ జేసితిని. భాషాంతరీకరణ సౌకర్యాదులకోస మిట్లు గావింపవలసివచ్చెను.

ఇందెంతైన దోషములున్నచోఁ బెద్దలు నన్నుమన్నించి వాత్స

ల్యపూర్వకముగ వానిఁగనఁబఱిచి మత్కృతజ్ఞతాభివందనము లందు కొందుఁగాత !

నా మొదటిగ్రంథమునందువలెనే యిందుంగూడ నక్కడక్కడ 'నించు' గాగమయతులును 'వండుక' వంటిక్త్వార్థకరూపములును, విపులముగ రేఫ శకటరేఫములకు యతిప్రాసములును గానంబడును. ఇండ్లలో మాటలాడుకొనునట్లే గ్రంథముల వ్రాయుఁడనియు యతిప్రాసముల నావలకు సాగనంపుఁడనియు బోధించుకాలమున నీకొలఁదిస్వాతంత్ర్య మంతగణనీయము కాదనియు క్షంతవ్యమనియు నాయభిప్రాయము.

పిఠాపురము.
10-5-1912.

ఇట్లు విన్నవించువిధేయుఁడు,
కూచి నరసింహము.

శ్రీరస్తు.

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః

# శ్రీ గౌరాంగచరిత్రము.

## ప్రథమాశ్వాసము.

శ్రీకమలోద్భవాండము వ ♦ శీకృతకాయముగా గ్రహించి జీ
వాకృతి నందు నిండు పర ♦ మాత్మయె తానయి మానుషత్వముం
గైకొని భక్తవర్యులకుఁ ♦ గన్నులపండువు సేయ రాముఁడై
యేకరుణాకరుం డవత ♦ రించె నతండలరించు మత్కృతిన్.

గీ. ఐహికార్థపరిశ్రమ ♦ మందుఁ జిక్కి
మనము నపు డప్ప లౌకిక ♦ మార్గమునకుఁ
ద్రిప్పి నేనెట్లొ శ్రీరామ ♦ కృష్ణ పరమ
హంస చరితంబు వ్రాసి ధ ♦ న్యతనుగంటి. 2

చ. ఒకఫలము న్భుజింప మఱి ♦ యొక్కఫలంబు మెసంగఁ బుట్టుఁ గో
రిక మనమందు నీగతిని ♦ వృత్తి మహాపథవర్తన ప్రబో
ధకుఁడగు నొక్క యోగిచరి ♦ తంబు లిఖించి ముగింప నట్టివా
నికథ మఱొండు వ్రాయఁగ జ ♦ నించెను గోరిక నాకు నెమ్మదిన్. 3

గీ. భరతఖండోత్తరమున ను ♦ ద్భవమునొంది
భక్తి మూర్తిభవించి చూ ♦ పట్టెననఁగ

విద్యుదాభశరీరుఁడై ♦ వెలసెనొకఁడు
భూమి గౌరాంగచైతన్య ♦ నామములను. 4

గీ. ధారిణి నవరకృష్ణావ ♦ తారమైన
యతని పావనకథను బ ♦ ద్యాత్మకముగఁ
దనివితీరంగ వ్రాసి త ♦ ద్గ్రంథమేను
వెండి మారామునకై సమ ♦ ర్పించువాఁడ. 5

చ. తరళతమంబు మానసము ♦ దాఁటుచునుండును గోఁతిరీతి బి
త్తరులయురోజభూధ్రముల ♦ దండకు నర్థముపైకి దాని నే
యురులబిగించిన న్నిలువ ♦ దుండదు తిన్నగఁ గాని భక్తులా
పురుషుల చెయ్వులంజొనుపఁ ♦ బొందు నొకించుక శాంతి వెంటనే.

గీ. ఎప్పుడును గాకపోయిన ♦ నిట్టి భక్త
చర్యలను గూర్చి చింతించి ♦ వ్రాయుచుండు
నప్పుడైనను సచ్చింత ♦ నామృతంబుఁ
గుదురుపడుచును నామది ♦ గ్రోలఁగల్గు. 7

గీ. కాన నాకిట్టిలాభంబుఁ ♦ గలుగఁజేయు
నుత్తమోత్తమ చైతన్య ♦ వృత్తములను
నేను బద్యాత్మకముగ నాం ♦ ధ్రీకరించి
యొనయుదును రూఢిగా మద ♦ భీష్టసిద్ధి. 8

గీ. జానకీనాథ! శ్రీరామ ♦ చంద్ర! త్వత్ప
దాంబుజములను దెలిపి యై ♦ నప్పుడెల్ల
నామనమునందు నిల్పి నీ ♦ నామమును వ
చించుటయెతక్క వేఱొండు ♦ చేతఁగాదు. 9

సీ. హారమంజి ముత్యాల ♦ సరము లిచ్చెదనన్న
నీకయ్యె నెలవు ర ♦ త్నాకరంబు



సిరులఁ గైకొని నీదు ♦ చెంతఁ జేరుదునన్నఁ
గలిమిచేడియ నీకుఁ ♦ గాంతయయ్యె
శాంతిచే నిన్ను మె ♦ ప్పింతునాయన్న నీ
క్రేవనే నివసించు ♦ క్ష్మావధూటి
వాగ్విజృంభణము గ ♦ న్పట్టవేఁడుదునన్న
వేనోళ్లఁబిలువ నీ ♦ పానువయ్యె

గీ. నీవిగానట్టి కించిజ్జ్ఞ ♦ తావిశిష్ట
మనుజధర్మంబు లెనసిన ♦ మనసుతోడ
నట్టులిట్టులు పద్యంబు ♦ లల్లి భక్తి
నెదుటఁబెట్టితిఁ గృతి స్వీక ♦ రింపు రామ. 10

గీ. అగ్ర శాఖాధరామరు ♦ లందు వినుతిఁ
గాంచు కూచివంశమున జ ♦ న్మించినాఁడఁ
బీఠికాపుర వాసుండ ♦ వెంకనార్యు
నకును బుల్లమాంబకు జ్యేష్ఠ ♦ నందనుండ. 11

క. నరసింహాఖ్యుఁడ నేనీ
వఱకొక కృతి నీ కొసఁగిన ♦ వాఁడను భక్తిన్
గరములు జోడించితినో
కరుణాకర! నన్ను దీనుఁ ♦ గావుము రామా! 12

మ. పనిలేకుండినచోఁ గవిత్వమును జె ♦ ప్పంబోవు లేమానవుం
డనుకాలం బరుదెంచెఁ దత్కవిత భ ♦ క్త్యావిష్క్రియారంభమై
నను వీక్షించుట గల్గుటెట్లు? ధరలో ♦ నన్యత్ర కాంతాద్యుపా
ర్జన లోలాత్ములకు న్సుభక్తికిని దూ ♦ రంబయ్య రామప్రభూ! 13

మ. మొదటం జేసిన రామకృష్ణచరితం ♦ బున్వేఁడఁగా స్వీకరిం
చి దయన్బ్రోచితివింక రెండవకృతి ♦ న్జేపట్టి రక్షింపు త

ప్పడు దీని న్నినుఁబోలుపూజ్యుసుగుణ ♦ ప్రాజ్యున్వరున్జూచి నే
మదినూహించితి నీయఁద్వాదృశుఁడు రా ♦ మా!యొక్కఁ నీవేసుమా.

ఉ. అక్కయుఁ జెల్లెలు న్నవతు ♦ లౌదురు నీకు గృహంబునందు నే
చిక్కులు గల్గ వాఁడిని ♦ జెందవు కయ్యముల ; న్విరాళిచేఁ
బొక్కుచుఁ గృష్ణ కృష్ణయని ♦ బొబ్బలువెట్టెడి కన్నెయిద్ది పెం
పెక్కనయోనిసంభవ మ ♦ హీసుతవంటిది సుమ్మి రాఘవా. 15

గీ. పెద్దకృతికన్యశాంతిని ♦ వృత్తిపథము
వదల కొకచాయనుండు నీ ♦ వంటిచాన
రెండవది ప్రౌఢ నినువంచి ♦ హృదయకర్ష
ణంబుసేయక యూరకుం ♦ డదుర రామ ! 16

గీ. ఇన దక్షిణనాయక ♦ ఖ్యాతిఁగాంచు
నీవు సమవర్తనంబున ♦ నిన్నుఁగట్టు
కొనిన కాంతల నొకరీతి ♦ మనుతు వనెడు
నాసతో దీని నీపాలు ♦ చేసినాఁడ. 17

చ. పలుకులఁ దేనెలూరఁగను ♦ భాగవతంబుఁ దెనుంగుచేసి నీ
పొలఁతిఁగ దానినిచ్చెఁగద ♦ పోతన ; దానను నాకు బందుగై
వెలయునతండు ; నీవు మము ♦ భేదముసేయక చూడఁగావలెం
దెలివికిఁ బేదనైనఁ గుల ♦ దృష్టిని దక్కువఁగాను వానికిన్. 18

గీ. ఇంక నొకమాటచెప్పి చా ♦ లింతురామ !
యనృత జడదుఃఖమయతను ♦ జనిత కష్ట
ములను దొలఁగించి నామనం ♦ బును ద్వదీయ
విమల చరణాబ్జములఁ గట్టి ♦ వేయుమయ్య. 19



## క థా ప్రా రం భ ము.

సీ. ఈరేడువందల ♦ యెనుబదియాఱవ
యాంగ్లేయవర్షంబు ♦ నందు ఫాల్గు
నమునందు మంచి పు ♦ న్నమరేయి శుభముహూ
ర్తంబునఁ జంద్రోప ♦ రాగకాల
మరుదెంచెనని జను ♦ ల్హారిహరియని కేక
లిడుతఱి గంగకు ♦ నిరుకెలఁకుల
నలరారి కళలకు ♦ నెలవౌ నవద్వీప
పట్టణంబున మహా ♦ భాగవిప్ర

గీ. వరశచీజగన్నాథ గ ♦ ర్భమునఁ బుట్టె
దివ్యమంగళ విగ్రహో ♦ ద్దీపితుండు
కృష్ణు నవతారమని కీర్తి ♦ కెక్కినట్టి
నరశిఖామణి గౌరాంగ ♦ నామకుండు. 1

క. మును శ్రీకృష్ణుఁడుపుట్టిన
ఘన సద్గ్రహకూట యుక్త ♦ కాలమె గౌరాం
గుని భవ్యజననకాలం
బని చెప్పఁగఁ జొచ్చిరచటి ♦ జ్యోతిషికవరుల్. 2

గీ. అఖిలవిద్యలకును గాణ ♦ యాచియైన
యా నవద్వీప మణ్డల ♦ రారుచుండె
సకల శాస్త్రజ్ఞపండిత ♦ సార్వభౌమ
బిరుదభృద్వాసుదేవుఁడ ♦ న్విప్రుచేత. 3

ఆ. చదువు చదువులకును ♦ సద్భక్తియే ముఖ్య
మైన యర్థమనుచు ♦ నఖిలపండి

తాళి నొప్పఁ జేసి ♦ పాలించుకొఱకుఁ జై
తన్యుఁ డుదయమందె ♦ ధరనటండ్రు. 4

గీ. ఆజగన్నాథ మిశ్రుగృ ♦ హంబుపొంత
నొకవిపులనింబ పృథ్వీజ ♦ ముండ దాని
క్రిందఁ గట్టిన యొకశాల ♦ యందు నుదయ
మందె గౌరాంగుఁ డఖిల లో ♦ కావనుండు. 5

క. భూపతన మైనవెంటనె
యాపాపఁడు జీవచిహ్న ♦ మగపఱుపమి నఁ
తాపముఁజెందుచు సావిక
యాపిరిఁ దెప్పింపఁజేసె ♦ నుపచారములన్. 6

గీ. పెద్దవడికిని దేఱి యా ♦ పిరినిగొనఁగ
సాగె శిశువంత మంతర ♦ సాని, తల్లి,
తండ్రి, యచటికి వచ్చిన ♦ తక్కుబంధు
వరులు నలరిరి పాపఁడు ♦ బ్రదికెనంచు. 7

గీ. మాతకడుపునఁ బండ్రెండు ♦ మాసములును
నిలిచి పదుమూఁడవనెల నీ ♦ వలకు వచ్చెఁ
గాన సామాన్యశిశువుల ♦ కంటె మిగులఁ
బెద్దమేనను బుట్టె నా ♦ ముద్దుబిడ్డ. 8

గీ. తండ్రి విశ్వంభరుండని ♦ తల్లి నిమియ
టంచు నతనిఁ బిలుతురు ; స ♦ న్న్యాసమందు
వెనుక శ్రీకృష్ణచైతన్యుఁ ♦ డనెడుపేరు
వచ్చె నతనికి హరిభక్తిఁ ♦ దెచ్చుకతన. 9

క. కరఁగించిన బంగారమ్ము
తెఱఁగున మిసమిసలుగ్రుక్క ♦ దివ్యతనువుతో



మెఱయుటచేఁ దద్భక్తులు
గరమర్మిలిఁ బిలుతురతని ♦ గౌరాంగాఖ్యన్. 10

గీ. తొలుత నెనమండ్రుకూఁతులు ♦ గలిగి యితని
తల్లిదండ్రుల కవల నం ♦ దఱును బోయి
రంతటను బుట్టె విశ్వరూ ♦ పాహ్వయుండు ;
పిదపఁ బదియేండ్ల కీతఁ డా ♦ విర్భవించె. 11

చ. చిడిముడిఁ జెందుపాదములఁ ♦ జిన్నెలుసూపెడు మోముతోడఁ బు
త్తడి నిరసించు మైజిగిని ♦ దామరసంబులఁ గేరుకన్నులన్
దుడుకుల లేఁతనవ్వులను ♦ దోరపుమేననుఁ గన్నవారికిన్
గడపటి బిడ్డమైయితఁడు ♦ గన్నుల పండువుసేయు నిచ్చలున్. 12

ఉ. అందఱఁ బోలియుండక వ ♦ యస్సునుదాఁటిన యున్నతత్వమున్
బొంది దృఢత్వమున్గలిగి ♦ పూర్ణశరీర సుఖాప్తి మించి త
న్నందఱు సుందరుల్గరము ♦ లిచ్చుచు దగ్గఱఁ దీయఁగోరినన్
సందిటఁ జిక్కకుండ నిమి ♦ చానలఁ దా నలయించుఁ బ్రోడయై.

గీ. ఎప్పుడేనియు బాలకుం ♦ డేడ్పువెట్టఁ
దల్లిదండ్రుల చిత్తము ♦ ల్దల్లడిల్లు
నర్భకుఁడు మిన్నకుండు నే ♦ డ్పంతవదలి
తనచెవికి హరినామంబు ♦ దాఁకఁగానె. 14

ఉ. ప్రాఁకువయస్సునం దుడుకు ♦ పాటున బాటకు గంగచెంతకుం
బ్రాఁకునొ యేమొ బాలుఁడని ♦ మాతయుఁ దండ్రియు వానిపై పుఱా
నీక యతండునిల్చుకడ ♦ నే నిలుచుందురు ; కష్టమేని స్వ
ర్లోకసుఖంబుగాదె ! సుత ♦ లోలత గన్నులఁ గన్నవారికిన్. 15

ఆ. వెనుక నెవ్వరైనఁ ♦ దనుఁబట్టవచ్చిన
దొరకక నిమిశిశువు ♦ పరువులిడును

వానిఁజూచి శచి య ♦ పారమోదంబందుఁ
దోడివారి వచ్చి ♦ చూడుఁడనుచు. 16

క. ఇరుగుపొరుగువారలుఁ దన
కొఱకై శ్రమమెంత పుచ్చు♦కొనిన నృసిగాఁ
దిరుగక పలుదుండగముల
నెఱకాఁడై చేయుచుండు ♦ నిమి యెల్లపుడున్. 17

వ. ఒక్కనాఁ డతండు. 18

క. వికవికనవ్వుచుఁ, బ్రాఁకెడు
నొక పాముంబట్టి చేత ♦ నూఁపి విడిచెఁ గా
ని కఱవ కదివోయెను బా
లకుఁ డమ్మా! బ్రదికెనం చ ♦ లర నచటిజనుల్. 19

ఆ. నగలుదాల్చి పట్ట ♦ పగ లితం డొకవీథి
నాడుకొనుచునుండ ♦ నచటి కొక్క
మేఘమాలియనెడు ♦ మేటితెక్కలికాఁడు
వచ్చి వానిఁగొంచు ♦ వడిగఁ జనుచు. 20

ఆ. తొడవు లొలిచి బాలు ♦ డోర్చెడుబుద్ధితో
సాగి కొంతదవ్వు ♦ చంకబిడ్డఁ
గ్రిందదించి యగ్ని ♦ కీలలఁ గ్రందు ప
ఱచెడు నతనిమేని ♦ రుచులఁగాంచి. 21

క. వాఁ డిట్లనిచింతించెను
వీఁ డెక్కడినరుఁడు? కాఁడు ♦ పృథ్వీస్థలి ను
న్నాఁడే యిట్టిఁడు? నిర్జరు
పోఁడిమి గంధర్వసారుఁ ♦ బొడచూపునిటన్. 22



ఆ. శిశువుఁజంప నాకుఁ ♦ జేతు లెట్లాడును
జోరకృత్యమెంత ♦ క్రూరవృత్తి
యింత పాపినంచు ♦ నెఱుఁగనైతిని నేను
వీని నింటియొద్ద ♦ విడిచివత్తు. 23

క. అని బాలకు ముద్దిడి యూ
తనిఁగొని మెల్లఁగను డించెఁ ♦ దద్గృహముకడన్
వెనుకటి వృత్తిని వీడుచు
మునిపోల్కి మిగిలినకాల ♦ ముం డాఁ గడపెన్. 24

వ. ఇంక గౌరాంగు నింటిలోనివారు. 25

శా. బాలుం డెక్కడికేగెనంచు వెదకం♦బల్త్రోవలంబోయి యె
మూల న్వానినిగాంచ కింటికడ ఱొ ♦ మ్ముల్గొట్టికొంచేడ్చు న
వ్వేళం దిన్నఁగవచ్చి తండ్రితొడపై ♦ బిడ్డండు గూర్చుండి ము
న్నేలాపోయెనో యెట్లుక్రమ్మఱిలి తా ♦ నేతెంచెనో చెప్పినన్. 26

క. మానాయన! యని కన్నుల
నానందాశ్రువులుగాఱ ♦ నతివత్సలతన్
సూనునిఁ గౌఁగిటఁ జేర్చుచు
మై నిమురఁగఁ జొచ్చిరతని ♦ మాతయుఁ బితయున్ 27

సీ. తప్తకాంచనతుల్య ♦ తనుదీప్తితోడఁ గెం
దళుకులమించు పా ♦ దములతోడ
క్తమల్లికుక ♦ రంబులతోఁ బక్వ
బింబంబుఁ బోలెడు ♦ పెదవితోడ
మకరంద సిక్తతా ♦ మరస కించిత్క్లిన్న
రక్తరేఖోరు నే ♦ త్రములతోడఁ
మూఁచి పోసినరీతి ♦ స్థూలసూక్ష్మవిభాగ
లలితమౌ నవయువ ♦ లక్ష్మితోడ

గీ. సోయగపుఁజూడ్కులను మంచి ♦ సొబగునడల
ముద్దులొలికెడు నగవుల ♦ మోదమొసఁగు
బాలకునిఁజూచి యెవఁడో దై ♦ వంబువచ్చి
పుట్టెనం చాడఁజొచ్చి రా ♦ ప్రోలిజనులు. 28

శా. చంకం బాలునిఁబెట్టుకొన్న చెలి వి ♦ స్ఫారప్రమోదాత్మయై
సంకోచించును డింప; డింభకుఁ డవి ♦ శ్రాంతి న్పురీసంవస
త్పంకేజాక్షులయొద్ద నుండు నిఁక నం ♦ బన్యాఁగాఁ జేయ సా
యంకాలంబునఁ గాని వీలుపడదా ♦ రా! యెట్టి బాలుండొకో. 29

మ. నిమి నిద్రించెడుకాలమందు నెదపై ♦ నిండారు శీతాంశు బిం
బము గాన్పించు; మిడుంగురుల్గనఁబడున్ ♦ మైనంతటన్, సుప్త్యాగా
రములో వింత మెఱుంగురూపము లవా ♦ర్యప్రక్రియ న్ద్రిమ్మరున్
గొమరుండుండు తెఱంగుఁ జూచి శచి పొ ♦ ల్కున్ సోఁకుడస్భీతిచేన్.

శా. రక్షోభూతపిశాచబృందములు నా ♦ రాకేందు బింబాస్యునిం
గక్షుల్గట్టుక రేఁగివచ్చి నిసిలో ♦ గగ్గోలుగావింత్రు సం
రక్షింపుం డసురారులార; యని మం ♦ త్రప్రార్థనల్సేసి తా
రక్షల్గట్టును మాత బాలకునికిం ♦ ద్రాసార్త చిత్తాబ్జయై. 31

చ. పితశయనించుస్థానమునన్ ♦ బిల్లఁడుగూడఁ బరున్న మేలటం
చతనిని లేపి వెళ్లుమని ♦ యాతని తండ్రినిఁగూడఁ బిల్చి నా
థ! తనయుఁ దీసికొండనఁగఁ ♦ దండ్రిని దాకొనుబిడ్డయొద్ద శ్రా
వ్యతరపుఁ గింకిణీరవము ♦ లచ్చెరువై వినవచ్చెఁ దల్లికిన్. 32

ఆ. తండ్రిగూడవినుచుఁ ♦ దద్రిక్తపదకింకి
ణీక్వణం బతండు ♦ నెలఁతతోడఁ
బలికె నల్లకృష్ణ ♦ బాలకుండు మనకు
ముద్దుబిడ్డఁడౌచుఁ ♦ బుట్టెనంచు. 33



క. ఎది యెట్లున్నను బోనిం
డు; దయాన్వితులౌచు మనబు ♦ డుత దేవతలో
ముదురే! యనుశచి, పతితో
మది ముమ్మరమైనయట్టి ♦ మాతృప్రేమన్ 34

క. కొన్నాళ్లకుఁ దలిదండ్రులు
చిన్నికుమారునకుఁ జదువుఁ ♦ జెప్పించుటకై
తన్నగరపాఠశాలకు
నన్నిమి బాలకునిఁబంప ♦ నతఁడు దుడుకఁడై. 35

గీ. తల్లి తలదువ్వి మంచివ ♦ స్త్రములు దొడిగి
బడికిఁ బొమ్మని పంప నా ♦ వైపుసనక
యాటలమరగి వీథుల ♦ నాడి ప్రొద్దు
పాంసుధూసరితాంగుఁడై ♦ వచ్చుమఱల. 36

ఆ. తల్లియొడలుగడిగి ♦ తెల్లనివలువలు
తొడిగి తిరుగఁబంప ♦ బడికిఁజనక
తొంటిరీతి నతఁడు ♦ దుండగీఁడై సంచ
రించి చిక్కువెట్టు ♦ తెచ్చి మాత. 37

చ. అనుదినమాడియాడి కడ ♦ కర్భకుఁ డింటికిరాఁగ మాత, నా
యన! గడు డస్సినావుగద ♦ రా! ముఖపద్మము వాడిపోయె నెం
డను; దనువంతఁ జెమ్మటల ♦ నానెను నీకెటు బుద్ధిసెప్పినన్
వినవుగదాయటంచుఁ దిని ♦ పించును సూనునకోరెమర్మిలిన్. 38

ఆ. ఇల్లుమఱచి యెప్పు ♦ డేనియు గౌరాంగుఁ
డాటలాడుచుండ ♦ నతనిఁబట్టఁ
దల్లి వెంటఁబడినఁ ♦ దాఁ బర్వులిడు నామె
కందకుండ ముద్దు ♦ టమగుదోయి. 39

క. వెనువెంటనె వడివడి నడ
చినఁ దాఁ జిక్కమిని రెండు ♦ చేతులు ఫాలం
బున నిడి రోఁజుచు నశ్రువు
లను రాలిచి మాత నిలువ ♦ లజ్జన్నిమియున్. 40

ఆ. వడిగనేగి మాత ♦ మెడచుట్టుఁ గరములు
రెండుఁ గదియఁజేసి ♦ వ్రేలియాడ
మున్నువడ్డకష్ట ♦ ముల నన్ని మఱచుచు
శచి సుఖించు బాలు ♦ స్పర్శముననుఁ. 41

క. ఎన్నెన్ని దుడుకులొనరిచి
నన్నిమి సహింపఁబడఁట ఘ ♦ నంబగు ప్రేమన్
దన్నుఁ గనిపెంచు నాశచి
కన్నులఁ దడిపెట్టనట్టి ♦ కతమునసైనన్. 42
నాలుగైదేండ్ల ప్రాయంపు ♦ బాలుఁడౌచుఁ
జూపఱందఱు వివశులై ♦ చూడనతఁడు
నర్తనముసేయు; వారలా ♦ నందబాష్ప
ములను రాలుతు రైహికం ♦ బులనుమఱచి. 43

క. నర్తనము సేయుచోటన్
వర్తించెడువారు నాడ ♦ వాంఛించియు దు
ష్కీర్తి భయంబున నృత్యము
గర్తవ్యము గాదటంచుఁ ♦ గావింపరటుల్. 44

ఆ. బాబు! నృత్యమాడ ♦ వా! యొక్కసారి యం
చాఁడువారుఁ బురుషు ♦ లతనిఁ బిలిచి
చక్కెరయును బండ్లుఁ ♦ గ్రుక్కి చేదోయిని
ముద్దులిడుదు రతని ♦ మోవినంటి. 45



సీ. పున్నమజాబిల్లిఁ ♦ బోలు మోమలరార
నవయవపుంజ సౌ ♦ ష్ఠవముమీఱ
నారోగ్యలక్ష్మివి ♦ హారవాటికయాచు
రంగారు వెడఁదయు ♦ రమ్ముగ్రాలఁ
బిశికిటఁబట్టంగ ♦ వీలైన లేఁగౌను
చుట్టుఁగట్టిన పట్టు ♦ దట్టియొప్ప
ననువుగా నొసటఁ బె ♦ ట్టిన ముద్దుతిలకంబు
నెమ్మోమునకు వింత ♦ నీటొసంగఁ
గీ. దిమిర సన్నిభ కేశపా ♦ శముననిడిన
క్రొంబసిఁడి రంగుపూలొక ♦ డంబుఁదేర
డింభకుండింట నర్తించు ♦ ఠీవిఁగాంచు
భాగ్యమేభాగ్య మితరంబు ♦ భాగ్యమౌనె? 46

క. హరిహరియని నిమియాడెడు
తఱి శచియును జూచునట్టి ♦ తరుణీమణులున్
గరతాళంబుల వేయుచుఁ
బరవశలై పోదు రెసటి ♦ బాలునిభంగిన్. 47

మ. నిమి నాట్యంబును జల్పద్రష్టలకెవే ♦ నిందృష్టముల్గావుగా
తమ ప్రేమాలన్నిలుచుండు బాలుఁడొకఁడే ♦ తక్కం; బ్రపంచంబుదుః
ఖమయంబ న్వచనంబు గల్లయగు లో ♦ కంబెల్ల నానందపూ
ర్ణ మహాంభోనిధి వీచికానిచయమ ♦ గ్నంబట్టు కన్పట్టెడున్. 48

గీ. తోడిబాలురతోఁ జేరి ♦ యాడునపుడు
వారుఁగూడను జైతన్య ♦ బాలుతోడ
నాడలుదెలియక నాట్యంబు ♦ నొనరుపుదురు
పొరలుదురు నేలపై హరి ♦ హరియటంచుఁ. 49

క. విని యాకేకలు వీథిని
దనతనయుని చేష్టలనుచుఁ ♦ దత్క్షణమటకుం
జనుదెంచి ధూళిఁ దులుపుచుఁ
గొనిపోవును దల్లి బాల ♦ కు స్వగృహమునకున్. 50

సీ. అడవిపూదండలు ♦ మెడచుట్టు ధరియించి
యన్యోన్యహస్తగ్ర ♦ హణమొనర్చి
నిమిసఖు ల్గుమిఁగట్టి ♦ నిమిచుట్టు హరిహరీ
యనిపాడుచొకదిన ♦ మందు నర్త
నముసల్పుచున్న రా ♦ నముఁ జేయు చెలువొప్ప
నపు డొకముదుసలి ♦ యైన పండి
తుం డటు వోవుచుఁ ♦ ద్రోవఁ జిత్రముఁ జూడ
నొక్కింతసేపు దా ♦ నుండి వివశుఁ

ఆ. డౌచు వారిఁ జేరి ♦ యాతండుఁ గూడ శ్రీ
హరిహరీయటంచు ♦ నాడసాగె
సద్దు వినుచువచ్చి ♦ శచి నిమిఁ గొనిపోవ
వృద్ధపండితుండు ♦ స్మృతిని బొరసి. 51

క. ఇదియేమి చోద్యమో! నా
కుఁ దగునె? యిటువంటి బాల ♦ కులతో నాటల్
ముదిమనము వికలమయ్యెం
గద! యని పరువెత్తె నెడను ♦ గదిరిన లజ్జన్. 52

చ. సతి సుతపక్షపాతమున ♦ సాత్వికుఁ డల్లరివాఁడు గాఁడు మా
సుతుఁ డిదియేమి పాప మొక ♦ చోటను నిల్వఁగ నీయరర్భకుల్
రతనమువంటి పాపనికి ♦ రట్టులు అవ్వలు దెత్తురమ్మ! యం
చితరులపైన నేరమిడు; ♦ నెవ్వతె దూఱును గన్నబిడ్డనిన్? 53



సీ. ఒకమాపునందు న ♦ ర్భకుని జోకొట్టఁ దా
మఱచి కన్మూసిన ♦ మాతయురము
పైనెక్కి తత్కర ♦ ద్వయము చేతులఁబట్టి
యట్టిట్టు నిమియూఁగి ♦ యాడుచుండఁ
దల్లి బాలకుఁ జూచి ♦ దగ్గఱగాఁ దీసి
వెఱ్ఱివాఁడవుగదా! ♦ కుఱ్ఱ! యనినఁ
దల్లి! నేఁ గాను నేఁ ♦ దక్కఁ దక్కినవార
లందఱు పిచ్చివాం ♦ డ్రనియె బిడ్డ;

ఆ. నాలుగేండ్లకూన ♦ నాతోడ నెటువల్కె
నో! వినుండటంచు ♦ నువిద పతిని
బిలిచి చెప్ప దంప ♦ తు లతిమోదాశ్చర్య
ములను జెంది నిమికి ♦ ముద్దులిడిరి. 54

మ. పురిలోనుండెడు తక్కుబాలుర క్రియ♦న్బొత్తంబు చేనూని తా
నరుగంబోవక పాఠశాలకును గౌ ♦ రాంగుండు క్రీడాభినో
దరతి న్గంగకు జెంగట న్దిరుగఁ గ్రో ♦ ధస్వాంతుఁడై యొక్కనాఁ
డరిగె న్బెత్తముఁ దాల్చి తండ్రి సుత శి ♦ క్షానూన సంరంభియై. 55

క. అరుగు జగన్నాథ ధరా
మరు వెంట న్వచియు నరిగె ♦ మాతృప్రేమన్
స్మరసుకుమారుఁ గుమారున్
గొఱకొఱ లాడుచును దండ్రి ♦ గొట్టునటంచున్. 56

క. చేరెడు కన్నులతో బం
గారపు బొమ్మవలె గంగ ♦ గట్టున సఖులా
రా! రండని యాడెడు నా
గౌరాంగునిబట్టి తండ్రి ♦ కసరుచునుండన్. 57

చ. వడివడివచ్చి మాత నిమి ♦ బాలకు వెన్కకుఁదీసి యొక్కచే,
నొడయని చేతివేత్రమును ♦ నొయ్యన రెండవచేతలాగి యీ
బుడుతనిఁగొట్ట నింతచల ♦ మున్వహియింపఁగనేల యాగ్రహం
బుడిగి క్షమింపుఁడంచుఁ బతి ♦ నెట్టులకో బతిమాలె దీనయై. 58

క. జనకుని కనలుంగని త
త్తనయుఁడు తనపెదవు లతను ♦ ధనువుపగిది వం
చి, నయనముల శోకాశ్రువు
లను నింపిన, నతనిమోము ♦ లత్తుకయయ్యెన్. 59

క. అటులేడ్చెడు బాలకునిం
దటుకునఁ గౌఁగిటను గ్రుచ్చి ♦ తండ్రీ! నాకెం
తటి పాపమురా! నినుఁ గొ
ట్టుటయని శచితోడ జనకుఁ ♦ డు న్విలపించెన్. 60

గీ. తండ్రిభయ మన్న భయమును ♦ దక్క నిమికి
మాతయెడ నెంతమాత్రము ♦ భీతిలేదు
పంచవర్ష వయస్కుఁడై ♦ పాఠముల న
తండు సదువక క్రీడలఁ ♦ దవులు నెపుడు. 61

గీ. పూర్వకాలంపుఁ బాలఁతుల ♦ పోల్కి శచియు
ఛాందసాచార విసర సం ♦ సక్తయౌచు
నుండుటీక్షించి నిమి బాల ♦ కుండు నాపె
నవియివియు నంటి విసిగించు ♦ నాగడమున. 62

ఆ. ముట్టరాని శునక ♦ ముఖ్యమృగంబులు
వండి విడిచినట్టి ♦ కుండపెంకు
లంటి తల్లిమనసు ♦ నార్తి నొందించెడి
బాలుఁజూచి యామె ♦ వలికెనిట్లు. 63



శా. ఔరా! బాలక! యుత్తమోత్తమపు బ్రా♦హ్మణ్యంబుఁ బ్రాపించి, యా
చారంబందున వీతిహోత్రుఁడను న♦చ్ఛఖ్యాతిఁ బెంపెక్కు నా
సూరిగ్రామణికి న్జనించి, యకటా! ♦ శూద్రుల్ప్రవర్తించు నీ
దారింబోవఁగఁ బాడియే? కులము నిం♦దం జెందదే యిట్టిచోన్?

క. చక్కఁగఁ బాఠము చదువుచు
నక్కడ కిక్కడకుఁబోయి ♦ యవగడములలోఁ
జిక్కి చెడ కితరబాలుర
కెక్కుడుగా నుండఁగూడ ♦ దే? నాతండ్రీ. 65

క. అనుమాటలు నిమివిని యో
జననీ! బాహ్యమగునట్టి ♦ శౌచంబిల నె
వ్వనికగునమ్మా ఫలకర?
మన నివ్వెఱఁగొంది స్థాణు ♦ వై శచి నిలిచెన్. 66

ఉ. కొంటెతనంబు మానవని ♦ కోపముతో నొకనాఁడు తల్లి వె
న్నంటి చనంగ నామెకతఁ ♦ డందక పర్వులువెట్టి వీథిలోఁ
బెంటలపోగులెక్క, నటు ♦ వెళ్లుట కంకిలియౌట నామె నీ
వంటెసుతుండు పుట్టఁడిల ♦ వత్స! యనెన్శ్రమసంకులాత్మయై. 67

చ. ఒకదినమందుఁ బంచమకు♦లోద్భవుఁడొక్కఁడు వ్రాపుచుండఁగాం
కక నిమి వానిఁదాఁకి శచి ♦ గట్టిగఁ గూఁకలువెట్టుచుండ నా
మెకడకునేగి ముట్టుకొన ♦ మేకొన, భీతిని ధూర్తయంచు నిం
టికిఁజని సేసెనామె నిమి ♦ నిం జొరనీక కవాటబంధమున్. 68

సీ. మోమిచ్చి నాతండ్రి ♦ ముద్దుగైకొమ్మన్న
వలదని యాస్యము ♦ వ్వలకుఁద్రిప్పు
తేనెపల్కులు పల్కు ♦ దే? యన్న నౌదల
వంచి తా మూతి బి ♦ గించుకొనును

నామాటలాలింప ♦ వేమన్నఁ జేదోయి
ముసిముసినగవుల ♦ మొగముఁగప్పఁ
బలుక విప్పవేనీవు ♦ వార్ధకంబున నన్నుఁ
బోషింతువా ! యన్న ♦ మోవివిఱుచు

గీ. నేను బోయినతరువాత ♦ నిన్ను నెవరు
చూచి నామాడ్కిలాలింపఁ ♦ జొత్తురన్న
మిన్నకుండును బలుకక; ♦ కన్నతల్లి
నిట్లువేధించు నిమి ధూర్త ♦ వృత్తిఁదాల్చి. 69

క. మాతృకుమారకు లెడనెడ
నీతీరున జగడమాడి ♦ యిర్వురు మరలన్
గాతుకమున నన్యోన్య
ప్రీతి న్మెలఁగుదురు మఱచి ♦ వేరంబెల్లన్. 70

ఉ. ఐదవయేఁట నొక్కదిన ♦ మందున బాలుఁ డకారణంబుగా
ఖేదపరీతచిత్తుఁడయి ♦ కేల్గవఁ గన్నులుమూసికొంచు మో
మూఁదగ నేడ్చుచోనతని ♦ నూఱటపుచ్చఁగఁ జెంతకేగి నీ
కేదిర గావలెన్నలుకు ♦ మీ ! యని రాతని తల్లిదండ్రియున్. 71

ఉ. ఎంతగవేఁడినన్బదు లొ ♦ కింతయుఁబల్కమిఁ దల్లిడాసి నీ
వింతగనేడ్చుటలనిమి ! ♦ యీవిటులేడ్చిన మాదుగుండె ల
త్యంతవిచారసంకులము ♦ లై చెడిపోవును గన్నతండ్రి! నీ
చింతకు మూలమెయ్యదియొ ♦ చెప్పుము తీర్చెద శక్తిగల్గినన్. 72

వ. అన నాబాలుం డిట్లనియె. 73

గీ. అమ్మ! యేకాదశీతిథి ♦ యగుటనేఁడు
మనయిరుగువారు జగదీశుఁ ♦ డును హిరణ్యుఁ
డును జనార్దనుకొఱకుఁ జే ♦ సిన నివేద్య



వస్తువులనన్ని నేఁ దిన ♦ వలయుఁ దెమ్మ! 74

ఆ. ఇట్లు వెక్కివెక్కి ♦ యేడ్చెడుబాలుని
మాటలాలకించి ♦ మాతపితయు
నెల్లెఱుంగు నేఁడె ♦ యేకాదశియని నై
వేద్యమిడుదురనియుఁ ♦ బిల్లవాఁడు. 75

క. అని నివ్వెఱపడి వారలు
వనరంగాఁ జొచ్చిరిట్టి ♦ పాపపుఁబని చె
ల్లునె? యెట్టులియ్యఁదగుఁ గృ
ష్ణునకొసఁగుపదార్థములను ♦ సుతునకటంచున్. 76

మ. కరపృష్ఠంబున నశ్రులన్నలుపు నా ♦ గౌరాంగునింజూచి హా
నిర ! యోబాలక ! నీకుఁ గృష్ణుకొఱకై ♦ నిర్ధారితంబైన యో
గిరమున్గోరఁగఁ గోరు మింకొకటియే ♦ క్రీడాపదార్థంబు నేఁ
ద్వరగాఁదెత్తుమటంచుఁ బల్కిరి శచీ ♦ తన్వంగియున్మిశ్రుఁడున్. 77

క. వలదొండేదియు నడె గా
వలయునటం చూఱడిలక ♦ బాలకుఁడను నా
పలుకులు హిరణ్యజగదీ
శులు విని యేతెంచిరి నిమిఁ ♦ జూడన్దోడ్తోన్. 78

ఉ. లాలిత దివ్యవిగ్రహ వి ♦ లాస కళాపరిపూర్ణుఁడైన యా
బాలకుఁజూచి మర్త్యుఁడగు ♦ వాఁడిటువల్కుటయెట్లు? బాలగో
పాలుఁడె వీనిఁజొచ్చె మన ♦ పాలిటిదైవమటంచు భక్త్యముల్
బాలుని ముందుపెట్టి రతి ♦ భక్తినివారలు, గోరినట్టుగన్. 79

గీ. పెట్టి మాముద్దునిమిబాల ! ♦ విందు లార
గింపు తినునది యలచిన్ని ♦ కృష్ణుఁడుగద
యంచుఁబలికిరి; వీరలే ♦ యైరి పిదప

నతనిశిష్యులలో ముఖ్యు ♦ లైనవారు. 80

గీ. కొన్ని తాఁదిని సఖులకుఁ ♦ గొన్ని వెట్టి
పాఱవైచెను మిగిలిన ♦ వస్తువులను
మాత చూచుచునుండెన ♦ చేతనయయి
వట్టికన్నుల నిలఁబడి ♦ ప్రతిమరీతి. 81

ఉ. పుత్త్రుఁడిబొమ్మకీచెనఁటి ♦ బుద్ధులువుట్టెను దయ్యమంటెనో?
చిత్తముచంచలించి యిటు ♦ సేయుచునుండెనో బాలకుండటం
చత్తరళాయతాక్షి శచి ♦ యాదనుడెందము గొందలింప నా
పత్త్రగనైకదృష్టి మది ♦ పైదలులంబిలిపించి యిట్లనెన్. 82

సీ. నాపైన నిమిషిఁ బ్రా ♦ ణంబెన్నఁడును సన్నుఁ
గూడనిమాటయో ♦ కొట్టియునఁడు
తెలివితేటల నన ♦ దృశుఁడు వాఁడీపురి
లోనుండు బాలుర ♦ లోనసెల్ల
దుండగీఁడై యింటి ♦ కుండలన్నింటిని
వ్రక్కలుసేసిన ♦ వగవఁగాని
దేవతలకుఁబెట్టు ♦ పావనమై వేద్య
వస్తువుల్మ్రింగు ని ♦ ర్భయతతోడ

ఆ. వంటకంబులంటు ♦ వలదన బాలుండు
దానెదేవుఁడంచుఁ ♦ డానుదాఁకు
వస్తువులు పవిత్ర ♦ వస్తువులగునంచుఁ
దగనిమాటలాడుఁ ♦ దల్లులార! 83

క. ఏమియొనర్చుటకైనను
నామది గుదురుపడదంగ ♦ నామణులారా!
స్వామికృపయెట్టులున్నదొ!



యీమతకరి కొమరుప్రాంత ♦ యెట్లున్నదియో! 84

వ. అనుటయు 85

గీ. మంత్రవేత్తలభార్యలు ♦ మహితసాంగ
వేదవేదాంతపారగ ♦ వృద్ధవనిత
లామెదైన్యంబుఁగాంచి య ♦ త్యంతఖిన్న
చిత్తలై తమపతుల ద ♦ ర్శించివచ్చి. 86

క. మావారినడిగివచ్చితి
మోవనితా! నీదుబిడ్డ ♦ నొకచెనఁటిగ్రహం
బావేశించెనఁటమ్మా!
గావింపుము శక్తిపూజ ♦ గ్రహమువదలెడున్. 87

చ. అని శచితోడ వృద్ధసతు ♦ లాడెడువేళ మెఱుంగుఁడీఁగెలా
గున నరుదెంచి కట్టెదుటఁ ♦ గుఱ్ఱఁడు నిల్వఁగఁజూచి వారిలో
ననుగడువృద్ధయావనిత ♦ నాయన! భూసురవంశమందుఁ గ
ల్గినకొమరుండవేల యిటు ♦ గేలియొనర్చెదవయ్య! వేల్పులన్. 88

ఆ. గౌరవింపుబాబు! ♦ పాఱులవేల్పుల
ననిన నొరులయెడల ♦ నాదరంబు
భీతియేలనాకుఁ? ♦ బెఱవారె ననుఁజూచి
భయము భక్తిగలిగి ♦ బ్రదుకవలయు. 89

క. అన నిమిశచియావాక్యము
లనువిని విన్నారె! తల్లు ♦ లారా! యీబి
డ్డనిమిడిమేలపుఁజేష్టల
ననవేగమ శక్తిఁగొల్వ ♦ మనిరావనితల్. 90

చ. ఒకనిమిఁజూడనీక శచి ♦ యొక్కతెయున్ బచనంబుసేసి బా
లకునకుఁబెంచి పంపి పది ♦ లంబుగ భక్ష్యములన్నిచీరలో

నొకయెడఁగూర్చి శక్తికిడ ♦ నొంటరిగాఁ జనుచుండవచ్చెఁ ద
ల్లికి నెదురౌచు బాలుఁడుని ♦ లింప కళావిభవోజ్జ్వలాంగుఁడై. 91

ఆ. తల్లిమొగముసూచి ♦ తాగ్రహించెనో లేక
తాను సర్వవేత్త ♦ యైనకతనఁ
దెలిసికొనెనొకాని ♦ తిన్నఁగభక్ష్యముల్
మూసినట్టిచెఱఁగు ♦ ముట్టికొనుచు. 92

క. చిఱునవ్వు నవ్వుచమ్మా !
త్వరపడి యెటకేగుచుంటి ♦ భక్ష్యంబులనీ
చెఱఁగున దాఁచెదవెందుల
కెఱిఁగింపుమటంచుఁ దల్లి ♦ కెదురైపలికెన్. 93

క. ఏలా యడ్డంబయ్యెదు
బాలక ! నీవెచటనుండి ♦ వచ్చితివిటకున్
మేలైన ఖాద్యమధురఫ
లాళుల్గొనివత్తు నీకు ♦ నరుగుముతండ్రీ ! 94

క. అని శచిమఱపింపఁగఁ బూ
నిననిమి, యోయమ్మ ! యిపుడె ♦ నేనాఁకొంటిన్
దినెదను దెమ్మనియాచీ
రనుడాఁచిన కొన్ని బలిమి ♦ గ్రహియించిచనెన్. 95

క. బుడుతఁడొనర్చిన ఘోరపు
దుడుకుఁబనిం గాంచి తల్లి ♦ దుఃఖంబున వి
పుత్రుఁడవా ! కావా ! దుష్టుఁడ !
పడి గంగానదిని దనువుఁ ♦ బాసెదనిపుడే. 96

వ. అన నావాక్యంబులాలకించి చిఱునవ్వుతోఁ గొమరుండిట్లనియె. 97

గీ. సంతపింపకుమాయమ్మ ! ♦ శక్తి నేను



దిన్నవంటకములచేతఁ ♦ దృప్తిఁజెంది
సంతసించునుగాని యొ ♦ క్కింతయేనిఁ
గోపపడదిది నిజమను ♦ కొనుముతల్లి ! 98

గీ. అనినమాటలువిని శచి ♦ యోర ! దుష్ట
బాలకా ! నీకుఁ జెప్పెదు ♦ వాఁడెవండు
లేఁడనుచు బిడ్డకును గీడు ♦ మూఁడునేమొ
యనెడు చింతను దేవళం ♦ బునకునరిగె. 99

క. అనరానిమాటలాడుచు
నొనరింపఁగరానిపనుల ♦ నొనరింపుచు నా
తనయుండజ్ఞానంబున
జననీ ! నీకెగ్గుఁజేసె ♦ సైరింపఁగదే. 100

మ. అని శక్తిన్బలుమాఱువేఁడికొనె సా ♦ ష్టాంగప్రణామంబులన్
గొనుమంచుంబొనరించి బాలకునిపైఁ ♦ గ్రోధంబుఁజూపింపకుం
డనురక్షింపుము దీనురాలననుచు ♦ న్నానాప్రకారంబులన్
గనుల న్బాష్పకణంబు లుప్పతిలఁగాఁ ♦ గంజాక్షిభీతాత్మయై. 101

గీ. ఇంతిప్రార్థనశక్తి గ్ర ♦ హింపకుండ
నామెసుతుపైని గినిసెనొ ♦ యేమొకాని
తల్లి పూజోపవాసవ్ర ♦ తంబులు నిమి
కించుకేనియు మేలు గా ♦ వింపవయ్యె. 102

చ. సలలితధీబలాన్వితుఁడు ♦ శబ్దకళానిపుణుండు వైద్యమం
దలఘుయశంబుఁ గాంచిన మ ♦ హాప్రతిభాఢ్యుఁడు నొమురారినా
వెలయునతండొకండు దన ♦ విద్యలమైకము నెత్తికెక్క వి
చ్చలవిడిఁ దానెబ్రహ్మమని ♦ చాటుచునుండెఁ బురంబులోపలన్.

ఉ. పొంతనె దేవుఁడుండ జన ♦ ముల్చననేటికిఁ బుణ్యవాటికిన్

భ్రాంతి నెవండొ వేల్పనుచు ♦ భక్తిని బూజలొనర్పనేల చి
త్తాంతరసీమఁ దేజరిలు ♦ నాత్మనుఁగాంచక యంచు మెట్ట వే
దాంతపుమాటలాడి యతఁ ♦ డాస్తికబుద్ధి నడంచుచుండినన్. 104

మ. తనతో నాడెడు బాలకాళిఁగొని చై ♦ తన్యార్భుఁ డద్వైత మూ
ర్తి నిజాత్ముండని చప్పటల్చఱచి పృ ♦ థ్వీక్ జ్ఞానబీజంబు లీ
యనయే! చల్లెడువాఁడు పౌరజనులా ♦ రా! యింక దైవంబు లేఁ
డనవచ్చుంజుఁడియంచుఁ బండితుని హా ♦ స్యంబాడఁ గ్రోధాత్ముఁడై

గీ. ఔర! డింభక! యంచు ము ♦ రారిగుప్తుఁ
డక్షులెఱ్ఱగఁజేసి గౌ ♦ రాంగుఁజూచి
నన్నధిక్షేపమును జేయు ♦ నరుఁడు పుడమి
నింక జన్మింపవలెనని ♦ యెఱుఁగవటర! 105

క. వాదింప శక్తిగల్గిన
వాదమునకు డీకొనంగ ♦ వచ్చునుమాతో
భేద మెఱుంగక తులువా!
యీదబ్బఱదబ్బులాడ ♦ నేమిఫలమురా! 107

మ. అను నామాటలనాలకించి నిమి ♦ యబ్బా! యేమిపాండిత్యమ
య్యా! నిను న్నీవెఱుఁగంగవచ్చినవెకా ♦ వా! యీప్రగల్భంబులా
త్మను గన్గొంటివె స్వానుభూతి? నిఁక బో ♦ ధ్యంబెద్ది బోధంబుల
న్గొనువారెవ్వరు బోధకుండెవఁడు నా ♦ కుం గొంతబోధింపుమా! 108

క. వాదమునకు రమ్మంటివి
వాదించెడువాఁడెవండొ ♦ వాదంబెదియో
వాదపరాభూతుండెవఁ
డో దబ్బఱలనఁగ నేవి ♦ యో నుడువఁగదే. 109

గీ. అర్థవిద్వాంసు నెఱుక య ♦ నర్థదాయి



నమ్మ, తనకును దాఁజెప్ప ♦ నరవితతికి
బాగుపడఁగోరుదేని ద ♦ బ్బఱలువదలు
నాది దబ్బఱగాదది ♦ నీదెసుమ్మి. 110

క. బోలెఁడహంభావంబును
నీలోఁబెట్టికొని యిట్లు ♦ నెదవు మురారీ!
చాలు నిఁక 'కేదైవము' నని
ప్రేలినచో నీకుశిక్ష ♦ విధియింతుఁజుమీ. 111

మ. అని స్వర్ణప్రతిమానహస్తమున దం ♦ డాచార్యునింగొట్టి యే
మనుజుండేనియు శక్తిఁదాఁటిన యసం ♦ బద్ధప్రలాపంబులా
డిన నేనిట్టులె బుద్ధిఁదెత్తునని రూ ♦ ఢిన్జేసికొమ్మంచు నే
గను గౌరాంగుఁడు లేఁతనవ్వులఁ బునః ♦ క్రీడావినోదార్థియై. 112

ఉ. బాలకరప్రఘాతమునఁ ♦ బండితుఁడల్గియుఁ దొల్తనజ్ఞతో
న్మాలనసుప్రశస్తమగు ♦ ముద్దులబిడ్డని తాఁకుదాఁక నా
భీల తమోఘనగ్రహము ♦ వీడఁగ భక్తినిబద్ధచిత్తుఁడై
బాలకుఁడే గురుండనుచు ♦ వత్సగృహంబునకేగెఁ జెచ్చెరన్. 113

గీ. ఏగి గౌరాంగునడుగుల ♦ కెఱఁగఁగానె
యతనిజనకుండు గాంచి యే ♦ మయ్య! యిట్లు
సేయన్యాయమె? నీకు మా ♦ శిశువు బ్రదుక
గిట్టదయ్యాయటంచుఁ దాఁ ♦ గినిసిపలికె. 114

క. ఓయీ! కన్నులు దెఱవని
మాయర్భకుపదములకు న ♦ మస్కారంబుల్
నీయట్టివాఁడు సేసిన
నాయువు క్షీణంబుగాద ♦ టయ్యా! మురారీ! 115

చ. అని పలుమాఱుదుఃఖమున ♦ నాతఁడువల్క మురారిసూరి, "నీ

తనయుఁడు వందనార్హుఁడగు ♦ దైవసముండొ మనుష్యమాత్రుఁడో
కనెదవునుమ్మ నీవచిర ♦ కాలమున న్బలుమాటలేల నేఁ
జనెద ననుజ్ఞదీసికొని ♦ శౌరియె నీసుతుఁడయ్యె" నంచనెన్. 116

చ. ఇటులు మురారివల్కి తన ♦ యింటికి వేగమయేగి రాధికా
విటుఁ బురుడించుబాలకుని ♦ విగ్రహమున్మదిలోననిల్పి వె
న్కటితెఱఁగంతమాని తన ♦ గ్రంథములొక్కెడఁ గట్టిపెట్టి యు
త్కటహరిపాద భక్త్యమృత ♦ ధారలఁ గ్రోలుచునుండెనిచ్చలున్.



క. రామా! మేఘశ్యామా!
సోమార్కాకారమహిత ♦ సుందరనయనా!
భూమిజన దుఃఖహరణా!
స్వామీ! యోగివరచిత్త ♦ సదననివాసీ. 118



శ్రీరస్తు.

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః

# శ్రీ గౌరాంగచరిత్రము



## ద్వితీయాశ్వాసము.

శా. కౌసల్యాలలనాకరాంబురుహ యు ♦ గ్మంబందుఁ జాంపేయశో
లాసమ్యఙ్మృదుశయ్యలన్నిదుర స ♦ ల్పంజాలి యెవ్వాఁడు స
త్యాసక్తిన్బితృవాక్యపాలనపరుం ♦ డై వల్కలచ్ఛన్నుఁడై
త్రాసంబందక యేఁగెఁగానలకు నా ♦ రాముండు నన్బ్రోవుతన్. 1



ఆ. విశ్వరూపనామ ♦ భృద్బాలుఁడు నిమికి
నగ్రజుండటంచు ♦ నంటిమిగద
వానికిపుడువచ్చెఁ ♦ బదియాఱువర్షముల్
నిమికి నాఱువత్స ♦ రములువచ్చె. 2

గీ. తమ్ముఁడు జనించుటకుమున్న ♦ దనకు మేన
మామశిశువును సుందర ♦ మంగళాంగుఁ
డైనలోకనాథాఖ్యుని ♦ పైని మిగుల
విశ్వరూపునకును బ్రేమ ♦ వెలసియుండె. 3

క. తమ్ముఁడు పుట్టినపిమ్మట
నమ్ముద్దులమేనమఱఁది ♦ యందలివాత్స

ల్యమ్ము గ్రమమ్ముగ జాఱుచుఁ
దమ్మునిపై ముమ్మరముగఁ ♦ దవులుచుఁ గ్రమ్మెన్. 4

ఉ. అండజవాహనాంశ జని ♦ తాకృతి, సుందరుఁ, దమ్ము విశ్వరూ
పుం డనిశంబు నెత్తుకొని ♦ ముద్దులువెట్టి కవుంగిలించి మా
ర్తాండనిభప్రభానిచయ ♦ రంజితహృత్సరసీజుఁడౌచుఁ దా
నుండె గృహంబునందున న ♦ నూనముదామృతవార్ధిమగ్నుఁడై. 5

క. తనయొడను విశ్వరూపుఁడు
గనఁబఱిచెడి వత్సలతకు ♦ గౌరాంగుఁడుగూ
డను ద్రికరణశుద్ధిగ నా
తనిపై నగపఱచుభక్తి ♦ తాత్పర్యములన్. 6

ఆ. ప్రొద్దుపొడువఁగానె ♦ పురిపాఠశాలకు
విశ్వరూపుఁడేగి ♦ విద్దెఁగఱచి
మరల వచ్చుచుండు ♦ మధ్యాహ్నమగు వెన్క
స్వగృహమునకు; నిట్లు ♦ సమువుచుండి. 7

క. సవయస్కులవలె నాటలఁ
దవులక మిశ్రాగ్రిసుతుఁడు ♦ తత్త్వార్థవిచా
రవిశేషపరిశ్రమమునఁ
బవలెల్లను గడపుఁదనదు ♦ ప్రాక్సుకృతమునన్. 8

శా. పూతప్రస్తుతవర్తన ప్రకటిత ♦ ప్రోద్యన్మహాత్మ్యాఢ్యుఁడ
ద్వైతాచార్యసమాఖ్యుఁ డాత్మవిమల ♦ ధ్యానైకనిష్ఠాసము
ద్ధూతాంతర్గతకల్మషుండుఁ బురమం ♦ దున్నాపురంబుండ సం
ప్రీతిన్బాలకుఁడేగె వానికడ కు ♦ ద్వేలాపవర్గేచ్ఛతోన్. 9

శా. వానిన్వీరినిఁ జూడకర్భకుఁడు న ♦ ద్వైతార్యుఁడు స్వర్కరా
క్షీర న్యాయముగా మెలంగు చతిభ ♦ క్తిన్సక్తిఁ దుండౌ హరిన్



జేరంజేసెడు యోగముఖ్యపథము ♦ ల్చింతించి యేకాగ్రతో
దారప్రక్రియలాచరింపుదురు ని ♦ త్యంబు న్రహస్యంబునన్. 10

మ. సతతాన్యోన్య సమాదృతిన్వెలయుచు ♦ న్సత్యాదిసద్ధర్మసం
తతి నానాఁటికి క్షీణమౌటకుఁ గడు ♦ న్సంతాపముం జెంది యుం
చిత భక్తిన్బలవింతు రెప్పుడుఁ గృపా ♦ సింధుండు శ్రీకృష్ణుఁ డీ
క్షితిపైఁ బుట్టెనో పుట్టునోయిఁకను దా ♦ శీఘ్రంబయంచిద్దఱున్. 11

గీ. ఎప్పుడైహికలోలురై ♦ యిలను దిరుగు
జనవితతిఁ జూచి చాల నా ♦ శ్చర్యమంది
యనిశమాముష్మికార్థచిం ♦ తనమునంద
ప్రొద్దుపుత్తురు విశ్వరూ ♦ పుండునతఁడు. 12

ఉ. వేళకు భోజనంబునకు ♦ వెన్కటియట్టుల రామిఁ దల్లియా
బాలకుఁ బిల్వఁగా నిమిని ♦ బంపిన నాతఁడు వోయి యన్న! రా
వేలర! బువ్వకంచుఁ గడు ♦ నింపగు మాటలఁ బిల్చి చేతులన్
వ్రేళులఁ బట్టిలాగి త్వర ♦ పెట్టుచునుండును విశ్వరూపునిన్. 13

క. ఆతఱి గౌరాంగుని న
ద్వైతుఁడు పరికించి కృష్ణ ♦ దైవాంశావి
ర్భూతుండుగాక నరసం
జాతుండే వీఁడటంచుఁ ♦ జర్చించుమదిన్. 14

క. చామీకరలాలనదభి
రామాంగుఁడు, పూర్ణవికచ ♦ రాజీవాక్షుం,
డీముద్దుమోములక్ష్మీ
భామాపతి మోమటంచుఁ ♦ బలుకువివశుఁడై. 15

ఆ. మనలఁగన్నతండ్రి ♦ వనజాక్షుఁడందఱ
నుద్ధరించుకొఱకు ♦ నుదయమందెఁ

జూడు విశ్వరూప! ♦ సుందరాకార నీ
యనుజునంచుఁబలుకు ♦ నతిముదమున. 16

ఆ. విశ్వరూప! నిమిని ♦ వీక్షించువెంటనే
మనసదేమొకాని ♦ మాటలను వ
చింపరానిముదముఁ ♦ జెంది యాతనికడ
కీడ్వఁబడునతండు ♦ కృష్ణుఁడయ్య. 17

వ. అని యద్వైతాచార్యుండు చిరకాలోపాసితప్రియదైవతంబు నయనగతంబై పురోభాగంబున నిలువ విమలాంతఃకరణుం డగుభక్తశ్రేష్ఠునకుంగల్గు మహానందంబున నోలలాడుచు, విశ్వరూపుండును దాను నచిరకాలంబున భువిపై నవతరించుననుకొన్న శ్రీకృష్ణపరబ్రహ్మం బీదివ్యమంగళవిగ్రహుం డగుగౌరాంగుండేయని దృఢనిశ్చయుండయ్యె నిట్లుండ. 18

గీ. షోడశాబ్దంబులయ్యెను ♦ జూచుచుండ
విశ్వరూపునకొక యలి ♦ వేణిఁ బరిణ
యంబు సేయంగవలెనంచు ♦ నతనితల్లి
దండ్రు లామోదభరితులై ♦ తలఁచుచుండ. 19

మత్త. వారివల్లను వీరివల్ల వి ♦ వాహవార్త చెవింబడన్
మేరమీఱిన యార్తిఁజెందుచు ♦ మిశ్రసూనుఁడెటొక్క యీ
బారిఁదాఁటుట దైవమా! తల ♦ వ్రాఁతయాయిదియంచనన్
సారసౌఖ్యులపొందు వట్టివి ♦ సంబెయాఁగద జ్ఞానికిన్. 20

ఉ. మొట్టలువెట్టుగ్రంథములు ♦ బుద్బుదతుల్యము జీవమంచు నేఁ
గుఱ్ఱతనంబునుండియును ♦ గోవిదసంగతినుండఁ గోరితిన్
వెఱ్ఱివికారలీల నడ ♦ పింపక చిత్తము; నిప్పుడయ్యొ! నా
యట్టువివాహభారవహ ♦ నార్తికినయ్యె నిఁకేమిసేయుదున్. 21



గీ. పెండ్లివలదన్న నీమాట ♦ వినుచు నాదు
తల్లిదండ్రులు మతిచెడి ♦ తల్లడింత్రు
వారిసంతుష్టికొఱకు వి ♦ వాహమైతి
నేని నాయాత్మకృషియంత ♦ నేటఁగలియు. 21

ఆ. ఆత్మవిద్యఁజూడ ♦ నంతంబుగనరాదు
బ్రతుకుఁజూడ మూఁడు ♦ వాసరములు
స్వతరణార్థమునకె ♦ చాలనికాల ము
ద్వాహసౌఖ్యములకు ♦ వలనుపడునె? 22

ఆ. కంఠమునకుబండఁ ♦ గట్టుక జలరాశి
నీఁదఁజూచుటల్లె ♦ యించుఁబోండ్ల
వలుఁదగుబ్బకౌఁగి ♦ ళులఁజిక్కి సంసార
సింధుతరణమునకు ♦ సిద్ధపడుట. 24

గీ. ముందువ్రాయిన నుయ్యి పి ♦ ఱుందగొయ్యి
యయ్యె మత్ప్రస్తుతస్థితి ♦ యంచు విశ్వ
రూపుఁ డాలోచనముసేసి ♦ రూఢిఁ జేసి
కొనెను జివరకుఁ బెండ్లికాఁ ♦ గూడదనుచు. 25

శా. సంసారంబుననుంటినేనిఁ దరుణీ ♦ సంపర్కముల్దప్పవీ
సంసృత్యాధులఁ జిక్కకుండుటకునై ♦ సన్న్యాసమేదిక్కు, మ
త్సంసారత్యజనంబునాజనకుల ♦ న్సంతప్తులన్ జేసినన్
హింసంగాసిల దస్మదాత్మ; యదె యు ♦ త్కృష్టంపు మార్గంబిలన్.

గీ. పాటలంబగు నధరంబుఁ ♦ బసిఁడిమేనుఁ
దామరలఁగేరు వదనంబుఁ ♦ దళుకుఁగనులు
మొలకనవ్వులుఁ గలయట్టి ♦ ముద్దుబాలుఁ
జిట్టితమ్ముని నిమిని నే ♦ నెట్టువిడుతు. 27

మ. అని యొక్కించుక యెంచి వంశమున స♦న్న్యాసంబునొక్కండుగై
కొనఁ దద్వంశజులెల్ల నందుదురు ము♦క్తుల్ పాపముల్వాసి యం
చనుగ్రంథంబు; లదెట్లుగల్లయగు? స♦న్న్యాసాశ్రమంబూనఁ ద
మ్మునిపై మోహముఁగూడఁజంపి చనెవ♦న్మోక్షార్థియై చెచ్చెరన్.

క. అని విశ్వరూపుఁడెఱుకన్
దనమనసుం ద్రిప్పికొనుచుఁ ♦ దనగృహమునకున్
వెనుకటియట్టులు నని యిం
టనుగనెఁ దనమఱఁది లోక ♦ నాథాఖ్యకునిన్. 29

ఆ. అతనితోడఁ దనదు ♦ యత్నంబు సెప్పిన
"నిన్నుఁబాసి నేను ♦ నిల్వలేను
వెంటవత్తునయ్య ♦ విశ్వరూపుఁడ" యన
వల్లెయనియెఁ దాను ♦ బాలుతోడ. 30

ఆ. వారియుద్యమంబు ♦ పరులెఱుంగకయుండ
డాఁచి నాఁటిరాత్రి ♦ లేచి యిర్వు
రరుగఁదలఁచుకొనిరి ♦ యంతట నరుదెంచె
మాపుఁగూడ; విశ్వ ♦ రూపుఁడపుడు. 31

ఉ. పావనపుస్తకంబొకటి ♦ పట్టుకచేతను, మాతపొంతకుం
దావడినేగి, యమ్మ! యిది ♦ తమ్మునికీవలెఁజుమ్మి వాఁడు వి
ద్యావిధి యోగ్యమౌ వయసు ♦ నందినవెన్కనటన్నఁ దల్లి శం
కావిలచిత్తయౌచుఁ దన ♦ యా! యిటువల్కెదవేల యంచనెన్.

గీ. తమ్మునకుఁ జేతులారఁ బు♦స్తకమునీవె
యీయవచ్చు నతఁడు నీవు ♦ నింటనొక్క
చోటనే యుంద్రుగావున; ♦ సుతుఁడ! నన్ను
నిమ్మనుటకును గతమేమొ ♦ యెఱుఁగఁజెప్పు. 33



క. అను తల్లిప్రశ్నమునకుం
దనయుఁడు చిఱునవ్వునవ్వి ♦ తల్లీ నీయొ
ద్దనయుండనిమ్ము గ్రంథము
పనివచ్చినయప్పు డడిగి ♦ పట్టుకపోదున్. 34

గీ. భద్రముగనుంచు మాయమ్మ! ♦ ప్రాలుమాల
కద్ది తమ్మునకును జాల ♦ ననువుపడును
జీవము లశాశ్వతము లందు ♦ చేత నింత
చెప్పఁగావలసివచ్చెను ♦ జింతపడకు. 35

గీ. ఇట్టులతఁ డాడుమాట లా ♦ లించి యవ్వ
యెల్ల నిజములెయని శచి ♦ యెంచెఁగాని
తన్నువిడనాడి యారేయిఁ ♦ దరలిపోవుఁ
బెద్దకొడుకని కలనైన ♦ బెగడదయ్యె. 36

గీ. ఆమె వట్టియమాయికు ♦ రాలుగాన
సుతమనోగతభావంబు ♦ సూడలేక
యాతఁడిచ్చినపుస్తక ♦ మందికొని గృ
హమ్ములోపలడాఁపఁ జ ♦ య్యనను జనియె. 37

చ. జనములు సుప్తిలోనడఁగి ♦ స్థాణువులైపడియుండునట్టి రా
త్రిని గనువిచ్చి మిశ్రజుఁడు ♦ దిన్నగ మాతులపుత్రునొద్దకుం
జని యఱచేత మెల్లఁగను ♦ జాగ్రదవస్థకు వానిఁదెచ్చి వ
చ్చె నతనితోడ నిల్వెడలి ♦ చేతను గవ్వయుఁదీసికోకయే. 38

ఆ. కూడ నొక్కటియును ♦ గొనిపోఁడు సంపూర్ణ
వీతరాగుఁడౌచు ♦ నాతఁడెప్డు
వదలఁజాలని భగ ♦ వద్గీతయను గ్రంథ
మొండుఁ గట్టుఁబుట్ట ♦ మొండుఁదక్క. 39

క. తనయిల్లు వదలి వెళ్లుట
కును మున్నిహలోకబంధ ♦ కోటులఁ దనచె
మ్మనమునఁ దలంచి యిట్లని
యెను దాఁగరుణరససిక్త ♦ హృదయుండగుచున్. 40

ఉ. మత్తనుహేతుభూతులగు ♦ మాత ! పితా ! మిమువీడి యావనా
యత్త సమస్తభోగవిభ ♦ వాదుల నవ్వలఁద్రోసి మోక్షసం
పత్తికినై విరాగమతిఁ ♦ బర్విడనుంటిని మీరు క్రోధసం
చిత్తులుగాక నానతులఁ ♦ జేకొనిపంపుఁడి మానిదుఃఖముల్. 41

క. మృదులాంగా ! గౌరాంగా !
యదయతనిన్విడిచిపోవ ♦ నై యున్నాఁడన్
మదిఁగుందకుమా ! తమ్ముఁడ
బ్రదికెదు సుఖజీవివౌచుఁ ♦ బరమాత్మకృపన్. 42

ఆ. ఒండురెండుఁగాక ♦ యొక పదియాఱువ
ర్షములు మాతపోల్కిఁ ♦ జల్లనైన
నీదుగర్భమందు ♦ నెలవిచ్చి నన్బెంచి
తో గృహమ్మ ! సెలవు ♦ నొసఁగవమ్మ ! 43

గీ. గంగయనుమేఖలనుదాల్చి ♦ కామ్యసుఖద
విద్యలకుఁ బుట్టినిల్లయి ♦ వెలయుచుండు
నోనవద్వీపపురి ! నీవు ♦ నానమస్కృ
తులనుగైకొమ్మ, మరల రా ♦ వలనుపడదు. 44

ఆ. నలినపత్రగత స ♦ లిలమట్టు లైహిక
పంకమంటకుండ ♦ భక్తిపరత
నవనిమెలఁగునట్టి ♦ యద్వైతదేశిక !
మ్రొక్కి నీకు నేను ♦ బురమువిడుతు. 45



వ. ఇట్లు పూర్వకృతపరిచయంబు లగుచేతనాచేతన వస్తునిచయంబు వీ
డ్కొని కేవల తురీయాశ్రమ స్వీకరణ పరాయణచిత్తుండై విశ్వ
రూపుండు లోకనాథుతోడం గంగచెంతకుంజని యన్నిలింపాపగ
నానడిరేయిఁదరింప నావ యెచ్చటంగానమి భగవద్గీతాగ్రంథంబుఁ
బట్టుకొనిన వామకరంబదితడియకుండఁ బైకెత్తియీఁది దాఁటనిశ్చ
యించుకొనియె. అంత నీఁతయం దనుపమానప్రజ్ఞావంతు లగుని
ర్వు రనతిశ్రమంబున నాతరంగిణిం దరియించి యెండకుం జిక్కక
తిండిలేమికిస్రుక్కక భిక్షాన్నంబున క్షున్నివారణంబు సేసికొనుచు
నేళ్ళనీళ్లం దప్పివాపికొనుచుఁ దరుమూలంబుల శయనించుచుఁ బ
శ్చిమాభిముఖులై చనిచని మార్గంబున నొక్కయెడ శ్రీజగన్నాథ
శాఖాంతర్భూతుండును, నష్టాంగ యోగవిదురుండును సతత బ్ర
హ్మావలోకన పటిష్ఠసమీచీ నాంతఃకరణుండును నగు నొక్కసం
యమీంద్రుం గాంచి తదనుగ్రహపాత్రులై యున్నయంత. 46

గీ. విశ్వరూపుని తెలివికి ♦ విమలభక్తి
కతనిశుశ్రూషలకును సం ♦ యమివరుండు
మెచ్చి దయతోడ నాతని ♦ కిచ్చె వాంఛి
తాపవర్గార్థదాయి స ♦ న్న్యాసపదవి. 47

గీ. శంకరారణ్యపురియను ♦ సంజ్ఞనాతఁ
డాశ్రమముఁ బుచ్చుకొనుతఱి ♦ నంది, పిదప
లోకనాథుని సత్కృపా ♦ లోకనమునఁ
జేసి సన్న్యాసిఁగైకొనె ♦ శిష్యునిగను. 48

గీ. శంకరారణ్యునకుఁ బరి ♦ చర్యసల్పు
చుండి యాతనిదండక ♦ మండలువులు
మోసికొని యాతఁ డెచటికిఁ ♦ బోవుచుండు

నచటికే లోకనాథుండు ♦ నరుగుచుండు. 49

వ. ఇట్లుండ నవద్వీపపట్టణంబున. 50

చ. మఱునటినాఁడు లేచి జన ♦ మండలి పశ్చిమమార్గగాములై
యరిగిరి బాలురం చెఱిఁగి ♦ యచ్చెరువందుచు మిశ్రుడాసి యెం
దఱనువిచారపెట్టిచనెఁ ♦ దాను విరాగత విశ్వరూపుఁ డె
త్తెఱఁగునఁ జేసెనోర! యెటు ♦ తీఱును మీ వ్యథయంచుఁ బల్కఁగన్.

ఆ. విషయసౌఖ్యములను ♦ విడనాడి కొడుకుస
న్న్యాసియాటకేగె ♦ నంచుఁ దెల్ల
వాఱఁగానె తెలిసి ♦ వనరెడుమిశ్రుండు
నతనిసతి మఱింత ♦ యడలిరపుడు. 52

క. మాతండ్రి విశ్వరూపా!
నీతలిదండ్రులు గృహస్థ ♦ నియతిన్సుఖులై
ప్రీతిన్మనుచుండఁగ నీ
వ్రాఁతయె జోగివయితిరుగ ♦ బాల్యమునందున్. 53

సీ. మృష్టాన్నములమేము ♦ మెసవికండలు వెంప
భిక్షాన్నమా నీకు ♦ విందుఁగుడుపు
సరిగవల్వలమేము ♦ ధరియింపఁగా నీకుఁ
గాషాయచేలమా ♦ కట్టుబట్ట
పఱుపులపై మేము ♦ పవ్వళింపఁగ వట్టి
కఱకునేలయె పట్టుఁ ♦ బఱపు నీకు
చందనలేపన ♦ సౌఖ్యముల్గాకుండ
భూతిలేపనమమై ♦ పూఁత నీకుఁ

గీ. బర్వసుఖములఁ దాంబూల ♦ చర్వణములఁ
గులుకుచుండఁగ మేమయో! ♦ కొడుక! నీవు



దండమునుగక్షపాల, క ♦ మండలువును
దాల్చి యూరూరఁ దిరుగుదే? ♦ తండ్రి! యెపుడు. 54

క. తలనరసినముదుసలి బదు
గులమిటు సౌఖ్యములనడుమఁ ♦ గుందుచునుండన్
లలితంపు లేఁతవయసునఁ
బలుకష్టములందు సౌఖ్య ♦ పడెదవెకుఱ్ఱా! 55

సీ. పల్లెత్తుమాట యె ♦ వ్వరినేని యాడవం
చసదృశపాండిత్య ♦ మందితంచు
షోడశవత్సర ♦ స్ఫుటమనోజ్ఞాకార
నవమోహనాంగ సుం ♦ దరుఁడవంచుఁ
బరమార్థచింతన ♦ పటిమచే వర్తన
యోగ్యతచే శుక ♦ యోగివనుచు
మానోముపంటయి ♦ మ్మాడ్కిఁ దోఁచెనటంచు
నీవంటిబిడ్డ జ ♦ న్మింపఁడంచుఁ

గీ. బురజనులునిన్ను వేనోళ్లఁ ♦ బొగడుచుండఁ
బొంగి నీవునుఁ గోడలు ♦ చెంగటను మె
లంగఁ జూడఁగఁ గోరు మ ♦ మ్మంగలార్పఁ
జేయఁగా నీవు సన్న్యసిం ♦ చితివె? పుత్ర! 56

ఉ. బాలక! నీవుమమ్ముఁ గనుఁ ♦ బ్రేమినఁ జూడుము నీదుతమ్ముఁడీ
వేళ నెటుండెనో పరిత ♦ పించెడి మమ్ము విషణ్ణచిత్తుఁడై
లోలితపాటలోష్ఠమున ♦ లోఁగని యశ్రులనిండు కన్నులన్
ఫాలము చెమ్మగిల్లఁ బయి ♦ వంకకు నాస్యము నెత్తి చూచుచున్. 57

వ. ఇట్లు కన్నీరు మున్నీరై పాఱ వృద్ధదంపతులు పెద్దకొడుకుం దలఁచుకొ
ని విలపించుచుండిరందు వివేకవంతుండును బహుసద్గ్రంథావలోకన

సమార్జిత తత్త్వజ్ఞానసంపన్నుండు నగుజగన్నాథమిశ్రుండెట్టకేల
కు నాదుఃఖంబునుండి వెలువడి యశాశ్వతకపటశరీర సంసారసుఖం
బులుఁద్రోసి సన్న్యాసంబుఁగైకొనిన కొమరుం డేమితప్పుసేసెనని వి
తర్కించిచూచి తనయజ్ఞానంబునకు వెఱఁగంది శుద్ధాంతఃకరణుం
డై యిట్లని భగవంతుంబ్రార్థించె. 58

ఉ. అజ్ఞతవిశ్వరూపునకు ♦ నైదురపిల్లితిఁగాని ధాత్రిలోఁ
బ్రాజ్ఞులు పట్టుమార్గము నె ♦ వాఁడునుబట్టెను పట్టిలోకదు
ష్ప్రాజ్ఞులఁజిక్కి యైహికవి ♦ చారములన్జెడిపోఁడుగాన స
ర్వజ్ఞుఁడ! నాదుమొఱ్ఱవిని ♦ వానిని జిక్కులుపెట్టఁబోకుమా! 59

గీ. ఆత్మసన్న్యాసధర్మంబు ♦ లతఁడువిడిచి
పెట్టి మరలగృహస్థుఁడో ♦ భీరువో నో
యేమొ! యటుగాకయుండర ♦ క్షింపుదేవ!
వాఁడుపసివాఁడు సన్న్యాస ♦ పదవిఁబూనె. 60

గీ. పైడిపైకినిబైదలి ♦ పైకినెప్పు
డేని సన్న్యాసిమనసుఁ బో ♦ నిచ్చెనేని
యిహపరంబులకునుగాక ♦ యీల్గుఁగాన
నతని నాబామునుండి కా ♦ పాడుమయ్య! 61

క. అనిశాంతించినపిమ్మటఁ
దనభార్యంజూచి యిట్లు ♦ తాఁబలికెను నీ
తనయునికై యేందులకిఁక
వనటంజెందెదవుమూఢ ♦ వనితలభంగిన్. 62

ఆ. వాఁడుసన్న్యసించి ♦ వానితోమనముఁ ద
రించునట్లుసేసె ♦ నింతి! చూడు
చాలవయసుదాఁటి ♦ సంసారమునమున్న



మనకుగతినిజూపె ♦ మనసుతుండు. 63

వ. ఇట్లీశ్వరువశమితదుఃఖులైయుండ గౌరాంగుండును దుఃఖంబుమా
ని తల్లిదండ్రులంజూచి యిట్లనియెఁ. 64

ఉ. అమ్మరో! తండ్రి! యన్నవిడ♦నాడుచు మిమ్ము మొఱంగిపోయెనం
చుమ్మలికంబునొందకుఁడి ♦ యుల్లములందున నేను యుక్తకా
లమ్మున మీరుమెచ్చుపను ♦ లంబొనరించుచు విద్యనేర్చుచున్
మిమ్ములసౌఖ్యపెట్టెద కు ♦ మింపుఁడి వెన్కటిదుఃఖమ్ములన్. 65

ఆ. అనుచుఁ జిలుకపల్కు ♦ లాడెడునిమిబాలుఁ
గౌఁగిలించుకొనుచుఁ ♦ గన్నుఁగవల
మోదబాష్పపూర ♦ ములు గాఱ వారలు
ముద్దుపెట్టిరతని ♦ మోమునిమిరి. 66

వ. విశ్వరూపుం డాశ్రమస్వీకారంబుసేసినపిదప రెండేండ్లకుఁ బూనాప
ట్టణప్రాంతస్థ పాండురంగపురంబున నాసన్నమరణుండై సమాధిం
బూరసి బ్రహ్మనిష్ఠాగరిష్ఠానుభావ్యంబగు ననాయాసమరణంబుఁజెందె
నప్పుడు శివానందుం డచ్చటనుండిచూచెనని తత్సుతుండగు కర్ణ
పూరుఁడనువాఁడు వానిగ్రంథంబులం దొక్కెదానిలో వ్రాసె మ
ఱియు. 67

గీ. శిష్యపరివేష్టితుండును ♦ శిష్టుఁడయిన
శంకరారణ్యునసువులు ♦ జాఱునప్పు
డతనిమైనుండి కోటిసూ ♦ ర్యప్రకాశ
నిచయనిభదివ్యతేజంబు ♦ నింగికెగసె. 68

గీ. ఇందులకుసాక్షిగా శివా ♦ నందుఁడుండి
పిదపఁబోయెనుదా నవ ♦ ద్వీపమునకుఁ
గాని యాపట్టణమున నొ ♦ క్కనికినైన

శంకరారణ్యు మృతిఁజెప్పఁ ♦ గొంకెనతఁడు. 69

క. అన్నగతించినస్థానం
బున్నిమి పందొమ్మిదేండ్లు ♦ ప్రాయినవెనుకన్
దన్నగరమునకుఁజని కాం
చెన్నర్మిలి శోకబాష్ప ♦ సిక్తాక్షులతోన్. 70



క. వెలిదమ్ములఁబోలెడుక
న్నులతోఁ దావచెల్మి కాని ♦ న్యూనముసేయన్
వలఁతియగుమోముతో భ
క్తులతాపంబార్చు ముక్తి ♦ దుఁడవౌ రామా! 71



శ్రీరస్తు.

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః

# శ్రీ గౌరాంగచరిత్రము.

తృతీయాశ్వాసము.



ఉ. భూతభవిష్యదర్థపరి ♦ బోధనిరంతరమోదసర్వవి
జ్ఞాతృతలున్నఁగైకనుడి ♦ నెత్తినిదాల్చి వనంబె యిల్లుగా
సీతయునీవునుండి పిత ♦ చేటునకేడ్చితి వజ్ఞుపోల్కి నీ
చేఁతలు చూడఁజూడఁగను ♦ జిట్టలుమాయలమారి రాఘవా! 1



గీ. "అన్నపోయెనటంచును ♦ ఖిన్నులగుచు
సుఱిక్కకుఁడి మిమ్మువదలుచు ♦ నొక్కగడియ
నైనఁబోకుండ నాతండు ♦ లేనికొదువ
గానరాకుండ మీముప్పు ♦ గడపువాఁడ" 2

క. అని నిమి తలిదండ్రులతో
మునువల్కినపల్కు పొల్లు ♦ పోకుండఁగఁ దా
వెనుకటియాటలనల్లరి
పనులన్నియుమాని చదువు ♦ పై మనసుంచెన్. 3

గీ. ఉంచి తనతండ్రి నెపుడుఁ బీ ♦ డించుఁ జదువుఁ
జెప్పు మంచాతఁడును శచి ♦ చిన్నికొమరుఁ
బెట్టుకొని పెద్దకొమరుండు ♦ వెట్టినట్టి
యమితదుఃఖానలంబు చ ♦ ల్లార్చుకొనిరి. 4

మ. తొడపై బిడ్డనిగూరుచుండుమని సం♦తోషంబుతో బాబు! నీ
దుడుకుల్వోయెనె? యంచుఁ బెన్నెఱుల స♦స్తోకానురాగంబునన్
ముడిగా నైచుచుఁ దండ్రివిద్యఁ గఱపం♦బ్రోద్భూతబాష్పంబులన్
దడియాకన్నులఁ జూచిచూచి శచి యా♦నందించు డెందంబునన్. 5

వ. ఇట్లుండ నొక్కనాఁడు. 6

గీ. తల్లిదండ్రులు గృహదేవ ♦ తకునొసంగు
తములపాకులనిమిదిని ♦ తత్క్షణంబ
స్మృతినిబాయుచు మూర్ఛను ♦ జెంది వ్రాలి
కాళ్ళుసేతులుఁ గదలింప ♦ కయపరుండె. 7

ఆ. అంతఁ దల్లిదండ్రి ♦ యతనికెనుచితోప
చారములనొనర్చి ♦ తేఱుకొనఁగఁ
జేసియేలబాల ♦ స్మృతిఁదప్పి యిమ్మాడ్కి
సోలితనిననిట్లు ♦ సుతుఁడువల్కె. 8

ఆ. అన్నవిశ్వరూపుఁ ♦ డర్మిలి ననుఁదీసి
కొనుచుఁబోయి ముద్దుఁ ♦ గుజ్జ! నేను
సన్న్యసించినట్లె ♦ సన్న్యసింపుమునీవు
ననిననతనితోడ ♦ నంటెనిట్లు. 9

శా. అన్నా! బాలుఁడనయ్య! యేనెఱుఁగ స ♦ న్న్యాసంబు నానేమొన
న్మన్నింపంగదవయ్య! నీనుడువులం ♦ బాటింపలేనందుకై
నిన్నున్నన్నునుగన్నవారి సుఖుల ♦ జ్జేయంగ నిల్లంటియుం



డస్మీవానతియిమ్ము! దైవమునుగా ♦ డన్గొల్చి సేవించెదన్. 10

ఆ. అనిన నీవుచెప్పి ♦ నట్లకావింపుము
నానమస్కృతులను ♦ నాయనకును
నమ్మకును నొసంగు ♦ మర్భక! యనినన్న
నింటియొద్దవిడిచి ♦ యేగెనతఁడు. 11

సీ. అనినిమి తానుగాం ♦ చినరీతినంతయుఁ
జెప్పఁగాఁ గన్నీళ్ళఁ ♦ దొప్పదోఁగి
జననీజనకులు వి ♦ చారించిరప్పుడు
విశ్వరూపుండు జ్ఞ ♦ ప్తికినిరాఁగ
నందుజగన్నాథుఁ ♦ డంతరంగంబున
"విద్యచేతనెకదా ♦ పెద్దకొడుకు
జ్ఞాననేత్రోన్మీల ♦ నముఁజెంది యైహికా
ర్థములన్నిక్షణభంగు ♦ రములటంచుఁ

ఆ. దలఁచి బాల్యమందె ♦ తాసన్న్యసించి మ
మ్ములనువదలిపోయె ♦ బుడుతఁడితఁడుఁ
గూడఁజదివి పెద్ద ♦ కొమరునివలె సన్న్య
సించిపోవునేమొ" ♦ యంచునెంచి. 12

గీ. బాబు! విశ్వంభరా! నాదు ♦ పదములాన
నేఁటినుండియు విద్యను ♦ నేర్చితేని
యంచు నిమిబాలునకుఁగట్టి ♦ యానవెట్టఁ
జదువునప్పటినుండియు ♦ వదలెనతఁడు. 13

చ. వదలుచుఁ బూర్వభంగి సరి ♦ బాలురతోడుత నాటలాడుచున్
మొదటను శైశవంబునను ♦ బోయినపోకలమించి ధూర్తుఁడై
కదిరి పురీనివాసులను ♦ గష్టముపెట్ట సహింపలేక యే

మిదుడుకఁడర్భకుండనుచు ♦ మిశ్రునితో మొఱవెట్టిరందఱున్. 14

చ. ననుఁగనినవ్వెనంచొకఁడు, ♦ నాదెసఁజూచుచు వెక్కిరించెనం
చునొకఁడు, నీతనూజుఁడొక ♦ చోటను నిల్వక సద్దుచేయుచున్
బనులనుదోఁచనీయఁ డను ♦ వాఁడొకఁడున్, నిమివంటి కొంటెవా
నిని గనమంచునొక్కరుఁడు ♦ నేరములెంచఁగ సాగిరచ్చటన్. 15

క. కొందఱుసని శచితో నీ
నందనుఁడేమమ్మ! పురము ♦ నన్గలమమ్మున్
దొందరపెట్టెడునీకివె
వందనములు! నిమిని జక్కఁ ♦ బఱుపుముతల్లీ! 16

వ. అనియిట్లు శచియొద్దకు స్త్రీలును జగన్నాథునొద్దకుఁ బురుషులును జని బాలకుండు పెట్టునాఱడిం జెప్పుకొని యీపలుగాకితనంబులేల మానుమని తనయునికిం బుద్ధిసెప్పరాదా యన వారలిట్లనిరి. 17

చ. పురజనులార! మాకొకఁడె ♦ పుత్త్రికుఁడిప్పుడు, మీకుమారుఁ గా
నరయుచువానిదుండగము ♦ లన్నిటిపైఁపుఁడి శిక్ష సేసినన్
బురివిడనాడి యన్నవలెఁ ♦ బోవునటంచును భీతిఁజెంది యం
దఱనిటు వేఁడికొంటిమి వృ ♦ థాపననీకుఁడి మాదు ప్రార్థనల్. 18

క. అని పొరిఁబంపివేసిన
వెనుకను శచి నిమినిబిల్చి ♦ బిడ్డా! నీకీ
జననిందయేలరా! తి
న్ననిత్రోవలఁద్రొక్కి తిరిగి ♦ నన్మేల్గాదే! 19

వ. అనిననందులకు గౌరాంగుఁడు స్మితాననుండై యిట్లనియె. 20

ఆ. నాదితప్పగాదు ♦ మీదియేతప్పిద
మమ్మ! చదువవలద ♦ టంచునాకు
నొట్టువెట్టియిట్టి ♦ రట్టులుదెప్పించి



కోపపడెదరేమి ♦ కొమరుమీఁద. 21

ఆ. ఇట్లువల్కునిమికి ♦ నేమియుఁ బ్రత్యుత్త
రంబునీయలేక ♦ క్షమముగాను
బిడ్డమఱలునెడు ♦ వెఱ్ఱియాశనుదాల్చి
యరిగెఁ దల్లియప్పు ♦ డతనివిడిచి. 22

క. కాని నిమిధూర్తబాలుఁడు
నానాఁటికి దుష్టవర్త ♦ నంబతిశయమున్
బూనంబురవాస్తవ్యులఁ
దానెపుడలయించునాక ♦ తాయతనమునన్. 23

సీ. దేవపూజార్థంబు ♦ దెచ్చినపూలస్వ
శీర్షంబుపైఁబూజఁ ♦ జేసికొనును
వేల్పులకొసఁగునై ♦ వేద్యవస్తువులాత్మ
వక్త్రగహ్వరమున ♦ వైచుకొనును
గంగకునీఁతకొ ♦ ట్టంగనేగుచుఁదాను
గంటలకొలఁది న ♦ క్కడనెయుండు
నందులోమున్గి స్నా ♦ నాగతవృద్ధులఁ
బదములఁబట్టి య ♦ వ్వారిముంచు

గీ. నిట్లుజనములఁ గలఁతనొం ♦ దించునట్టి
బాలుగౌరాంగునెటనైనఁ ♦ బట్టికట్టి
గట్టిశిక్షను జేసినఁ ♦ గాకలొంగఁ
డంచు శచితోడఁ బురివార ♦ లనిరి యరిగి 24

క. తానట్టికొంటెపనుల జ
నానీకమునకునొనర్ప ♦ నైనిమియున్నన్
బూనఁడుసేయఁగ నెన్నఁడుఁ

బ్రాణాపాయకరములగు ♦ పనులనుమాత్రన్. 25

గీ. అయిననీఱవ్వపడలేక ♦ యతనితల్లి
యొక్కనాఁడాఁచికొనలేని ♦ యక్కసూని
సిగ్గువచ్చెడునట్టులు ♦ శిక్షఁజేయ
నతనివెంటనుజనె వేత్ర ♦ హస్తయగుచు. 26

ఉ. ఎంతఁగమాతపర్విడిన ♦ నించుకచిక్కక బాలుఁడామెఁ బె
న్వంతలఁబెట్టిపెట్టి చిఱు ♦ నవ్వుల బూటకమైనయేడ్పులన్
బ్రాంతమునందునన్నిఖిల ♦ భాండములుండఁగ వానినెక్కి యా
చెంతకురావులేయని శ ♦ చిన్హాసియించిన నామెఖిన్నయై. 27

క. ఓనిమిదుష్టార్భక యివి
యేనా! మావిశ్వరూపుఁ ♦ డేగినపిదపన్
మీనాయనమున్నన్ను
న్వానివలె న్సౌఖ్యపెట్టు ♦ పనులనియడిగెన్. 28

వ. అందులకు గౌరాంగుండిట్లనియె. 29

శా. అమ్మా! నాదియెతప్పిదంబు? భువివి ♦ ద్యంగాదటేమెల్లయ
ర్థమ్ముల్గాంచుట, యుక్తమెద్దియొయయు ♦ క్తంబెదియో మూఢచి
త్తమ్ముల్పాడఁగఁగల్గునే? సుతులనం ♦ ధభ్రష్టులజ్జేయువా
రమ్మా! దోషులువిద్యమానుమనున ♦ య్యల్ మంచిదన్మాతలున్.

క. అనిపాటలఁబాడుచునిమి
తనకుండలకోటపైని ♦ దక్కుచునుండన్
గని శచియేమియుఁదోఁచక
కనులన్బాష్పంబులురలఁ ♦ గావిలపించెన్. 31

ఆ. తత్క్షణంబనిమియుఁ ♦ దపియించి, యమ్మరో.
చదువులేనియట్టి ♦ సంతుఁగనిన



వారిసౌఖ్యమీవు ♦ పరికింపఁగానిట్లు
చేసినాఁడనీవు ♦ చింతపడకు. 32

క. అని యెంగిలికుండలపో
గునుదిగి శచియొద్దకేగి ♦ కుఱ్ఱఁడుసుఖవ
ర్ధనకరకరయుగ్మంబునఁ
దనమాతంగౌఁగిలించి ♦ తాపమువాపెన్. 33

ఆ. చుట్టుపట్లనున్న ♦ సుదతులంతయుఁజూచి
చదువుచెప్పరాదె ♦ శచి! యటంచు
నామెనేరపెట్టి ♦ రంతటనామెయు
బాలుతోడనాథు ♦ పజ్జకరిగి. 34

గీ. పాడువడుచుండె బిడ్డఁడీ ♦ పాపమేమి?
విద్యవలదంచునానను ♦ బెట్టినారు
వాఁడుసతతంబుఁ జదువంచుఁ ♦ బలవరించు
నిష్టుడైననువిద్యఁజె ♦ ప్పింపరాదె? 35

ఆ. అనుచుసాధ్విపిభుని ♦ మనసునుగరఁగింప
నెట్టకేలకాతఁ ♦ డియ్యకొనియె
నర్భకుండుఁబోయి ♦ యనుదినంబును విద్యఁ
గఱచుచుండె దుండ ♦ గములమాని. 36

ఆ. మంచినీళ్లకెక్కు ♦ మత్స్యంబుమాడ్కి న
సదృశమైనబుద్ధిఁ ♦ గదిరియేఁడు
వట్టునట్టివిద్యఁ ♦ బడయుఁదానొకపూఁట
సర్వవేత్తగూడఁ ♦ జదువవలెనె! 37

వ. ఇట్లు దినదినప్రవర్ధమానుండౌచు గౌరాంగుండు నవవర్షవయస్కుం
డయ్యెనంత నుపనయనయోగ్యం బగువయసువచ్చెనని తలిదండ్రు

లొక్క శుభముహూర్తంబున ముద్దుబిడ్డని వడుగుజేయ నిశ్చయిం
చుకొనిరి. 38

గీ. వపనమును జేసి తలయంటి ♦ బాలకునకుఁ
బసుపునలఁదినకాయంబు ♦ పైనిజన్ని
దంబు వేయఁగఁజూచు జ ♦ నంబునకును
భక్తియాకారమట్టుచూ ♦ పట్టెవటువు. 39

చ. వెనుకబలిశుమావిభుని ♦ వేఁడఁగవచ్చినపొట్టివేల్పొ? చూ
చినజనులన్విమోహవశ ♦ చిత్తులఁజేసినగోపబాలుఁడో
జననమునొందెనీగతిని ♦ క్ష్మాతలమందునటంచునింతయుం
తనినుఘవంగరానిముద ♦ మందుచుఁ జూపఱువల్కిరత్తఱిన్. 40

గీ. నిమికి బ్రహ్మోపదేశంబు ♦ నియతిమైజ
నకుఁడుసేసెడుచో మైఁబు ♦ లకలువుట్టి
స్మృతినిదప్పించిపడవైచెఁ ♦ జిన్నికొమరుఁ
జూపఱందఱువెఱఁగంది ♦ చూచుచుండ. 41

చ. ధరణితలంబుచెమ్మగిలె ♦ ధారలుగాస్రవియించునశ్రులన్
బరమపవిత్రభక్తిరస ♦ భారవికంపితదేహవల్లిసుం
దరతరభాసమానసము ♦ దంచిత మంగళదివ్యతేజమున్
బొరసెనుబారవశ్యమును ♦ బొందిరిబాలకుమాడ్కిఁద్రష్టలున్. 42

గీ. చివరకచ్చటివారలు ♦ స్మృతికివచ్చి
మించుఁదెగడెడు గౌరాంగు ♦ మేనుఁగాంచి
తనకుఁదగినట్టినెలవని ♦ తలఁచియందు
వేణుగోపాలబాలుఁడే ♦ విడిసెననిరి. 43

క. వటువున్స్మృతిఁబొరసినపి
మ్మటనటకేతెంచినట్టి ♦ మహనీయులునీ



వటువైతివేమి యని యడు
గుటకు న్శంకించి రెదురు ♦ కొని బాలకునిన్. 44

క. అంత న్భిక్షులఁ గొనుటకుఁ
జెంతకు రమ్మనుచు బాలు ♦ చేవ్రేళులకుం
గొంతులుగలబటువు లిడిరి
వింతగదా! సర్వదాత ♦ భిక్షు ల్గొనుటల్. 45

చ. వచ్చినవారియందు నొక ♦ పాఱుఁడు గర్భదరిద్రుఁ డౌటచే
నిచ్చుటకేమియు న్దొరక ♦ కిచ్చెను బ్రేముడి నొక్కవక్కఁ; దా
నచ్చెఱుకానుక న్శమలు ♦ చమ్మ యటంచును బిడ్డ పిల్వఁగా
వచ్చె గృహంబునుండి శచి ♦ వత్సనుజూచెడికౌతుకంబునన్. 46

సీ. వచ్చి కట్టెదుట ను ♦ వర్ణపాంచాలిక
వడువున నున్న య ♦ ర్భకుని గాంచె
మేనిచుట్టును గను ♦ ల్మిఱుమిట్లు గొల్పెడు
విద్యుదుజ్జ్వలపరి ♦ వేష ముండెఁ
దనకు గాదిలిబిడ్డఁ ♦ డనుమాటయే కాని
ధైర్యంబు లేదయ్యె ♦ దరికిఁ జనఁగ
దూరంబుగా నుండి ♦ భీరువై పరికంపి
తాంగయై తేఱి చూ ♦ డంగ లేక

గీ. నిలువఁబడియున్న శచిఁ గాంచి ♦ నిమి వచించె
"మైనదలి పోవుచున్నాఁడ ♦ మఱల వత్తు
నేను విడిచెకితనువె నీ ♦ సూనుఁ డద్ది
భద్రముగఁ గాచుకొనవమ్మ ♦ పడఁతి" యంచు. 47

గీ. అటులు గౌరాంగుఁ డాడి తా ♦ నవనిఁ గూలె
మొదలువిఱిగినవృక్షంబు ♦ పోల్కి నప్పు

డింతవఱకును మేనాక్రి ♦ మించినట్టి
దివ్యతేజంబుదోఁచెన ♦ దృశ్యమయ్యె. 48

వ. అంత. 49

క. వడివడి మాతయుమతిసెడి
కొడుకుకడకునేగి యెత్తి ♦ కొని తేఱిచితా
నడిగెను దండ్రీ! యిట్టులు
వడిపోయితివెందుచేతఁ ♦ బల్కుమటంచున్. 50

క. ఈమాటలు నీచూపులు
నీమూర్ఛంజెందివ్రాలి ♦ యిలపైఁబడుటల్
నామదిఁ గళవళపెట్టెడు
నాముద్దులకుట్టి! కార ♦ ణమునుడువఁగదే! 51

గీ. అనుచువేఁడెడుశచితోడ ♦ నాతఁడేమి
యెఱుఁగననిచెప్పఁగానామె ♦ వెఱఁగుఁజెంది
యిద్దిదేవతావేశమ ♦ హిమమునిజము
కానిచో నిట్టితెఱఁగులు ♦ గలవెయిలను? 52

వ. అనునిశ్చయంబుతో మనంబుకుదురుపఱచుకొని కాలంబుఁగడపుకొనుచుండె. నిమియుఁ దనకొంటెతనంబులెల్లమాని విష్ణుసుదర్శనాఖ్యులంబరఁగు నిర్వురుపండితులాపట్టణంబుననుండ వారియొద్ద నప్రతిమానబుద్ధికౌశలంబున విద్యఁగఱచుచుండె. 53

ఉ. చెప్పినపాఠముల్మఱలఁ ♦ జెప్పఁగనక్కఱలేదు బాలకుం
డెప్పుడువల్లెవేయుట యొ ♦ కింతయెఱుంగము చెప్పువానిలోఁ
దప్పులుపట్టునీప్రతిభ ♦ ధారణశక్తియు నద్భుతంబులీ
యొప్పులకుప్పవంటి వటు ♦ వొక్కఁడుఁగానఁగరాఁడు మేదినిన్. 54

క. అనియొజ్జలు వొగడినకొలఁ



దిని మేధావిపులబలము ♦ దీపింపఁగఁజె
ప్పినశాస్త్రార్థములన్నిటిఁ
గొనకొని బాలకుఁడుచూఱ ♦ గొనునిమిషమునన్. 55

గీ. ఊర బాలునిధీశక్తి ♦ మాఱుమ్రోయ
నుప్పతింతురు పసివాని ♦ నూరివార
లంచు శచి నిమి యింటికే ♦ తెంచునపుడు
దిగఁదుడిచిపోసి యతనికి ♦ "దృష్టి" దీయు. 56

సీ. విశ్వరూపుఁడు దమ్ము ♦ విడిచిపోయినవంత
దంపతుల్మఱచి మో ♦ దముననుండ
గౌరాంగునసమాన ♦ కల్యవిద్యాప్రౌఢి
మంబునకునుబొంగి ♦ మలఁగుచుండఁ
బ్రాప్తార్థసంతుష్టి ♦ వడసియాతిథ్యంబు
నెఱపుచుగృహమేధి ♦ నియతినుండ
కలియుగస్వర్గంబు ♦ గా ముద్దునిమిబాలుఁ
గఱవాఱఁగనుగాంచి ♦ మురియుచుండఁ

గీ. గట్ట!! గృహమునకొక్కయి ♦ క్కట్టువచ్చెఁ
సంతతమ్మొక్కరీతిని ♦ జనదు కాల
మల్లపరమాత్మయేసుతుం ♦ డైననేమి?
కడవఁజాలఁడుప్రారబ్ధ ♦ కర్మమెవఁడు. 57

సీ. తనుగతవాతపి ♦ త్తశ్లేష్మములఁదాఱు
మాఱుసేసెడుకాఁక ♦ మంత్రిగాఁగ
జిహ్వానార్చెడుడప్పి ♦ సేనానిగాఁగ, గా
త్రప్రకంపంబు ర ♦ థంబుగాఁగ
గొంతునవెక్కిళ్లు ♦ ఘోటకంబులుగాఁగఁ

జిత్తవిస్మృతి శేరి ♦ సిడముగాఁగఁ
గఫముస్వేదంబాది ♦ గాఁగలలక్షణం
బులుహాళాంతకారికా ♦ ల్బలముగాఁగ
గీ. వడివడిగవచ్చుశ్వాసంబు ♦ లడిదములుగ
మాఱుకొనిమిశ్రుప్రాణము ♦ ల్బాఱుకొనఁగఁ
బాఱుపైకల్లజార్తిభూ ♦ పాలమాళి
దాడివెడలుచువచ్చెనా ♦ ద్ధత్యమునను. 58
గీ. వసుధనన్నొదకబుణాను ♦ బంధమింకఁ
దనకుఁదీఱెనటంచును ♦ దలఁచిమిశ్రుఁ
డతనిభార్యనుసుతుని ర ♦ మ్మనుచుఁబిలిచి
భార్యనంకకుఁదిరిగితాఁ ♦ బలికెనిట్లు. 59
చ. వనితరో! యెన్నియేండ్లు ధర ♦ పైఁబ్రదుకందలపోసియున్నఁ దాఁ
జనవలెమానవుండెపుడొ ♦ సర్వము వెన్కనుద్రోసిపుచ్చి వ
చ్చెనుసమయంబునాకిపుడు ♦ చింతనుజెందక పిల్లవానివం
తనుబడనీక యూఱడిలి ♦ ధైర్యమువానికిఁగూడఁ జెప్పుమా! 60
గీ. పెద్దవాఁడు సన్న్యాసియై ♦ విడిచిపోయె
నేను నిప్పుడొ యిఁకనొ ని ♦ న్విడిచిపోదు
నుర్విలో నొక్కనిమియె నీ ♦ కున్నయాతఁ
డెట్లుకాపాడుకొందువొ ♦ యింక వాని. 61
వ. అనుభర్తవాక్యంబులకు నపారమైకందావరోధనకరంబగుదుఃఖంబు
న మాఱునల్కనేరక శిరఃకంపంబుననే ప్రత్యుత్తరంబొసంగుచుఁ
గన్నీరుకాలువలైపాఱ శచియేడ్చుచు మిన్నకుండె నప్పుడు జగన్నా
థమిశ్రుండు గౌరాంగా! యిటురమ్మనిచేరఁబిలిచి యాతనిశిరంబుపైఁ
దనకరంబునిడి యించుక మరణబాధ శాంతించినట్లు గనంబడ నత



నితో నిట్లనియె. 62
క. తనయా! నిన్నెట్టుక చిం
తనుమానుచు సౌఖ్యపడఁగఁ ♦ దలఁచినమాలో
నను నేఁబోవుచునుంటిని
జననియొకద యింక నీకు ♦ జనకుఁడుగూడన్. 63
చ. పెనిమిటిపోయెనంచు విల ♦ పించెడు తల్లినిగష్టపెట్టకుం
డను సకలోపచారములొ ♦నర్చుచుఁ దిన్నఁగఁజూడుమయ్య! యిం
టనెనివసించియుండుచు ధ ♦ నంబును విద్యయు నంగ్రహించి నే
ర్పునమనుమయ్య! నేఁగఱవు ♦ బోధమిఁకేదియులేదు పుత్త్రకా! 64
గీ. అనుచు నాయాసమందెడు ♦ నయ్యతోడఁ
గడలివలెఁబొర్లివచ్చుదుః ♦ ఖంబుఁబట్టు
కొనఁగఁజాలకకన్నీళ్లు ♦ గుక్కుకొనుచు
నెట్టకేలకు గౌరాంగుఁ ♦ డిట్టులనియె. 65
గీ. తండ్రి యమృతసుధామధురశ ♦ బ్దంబు నే వ
చించుభాగ్యంబునేఁటితోఁ ♦ జెల్లెనయ్య!
యెవరిపాల్సేసి నన్నుఁ బో ♦ యెదవు నీవు
విద్య నాకెవ్వరయ్య చె ♦ ప్పింతురిఁక. 66
ఆ. అనుపలుకులు మిశ్రుఁ ♦ డాలించి నాకోర్కె
నిండుగాను దీఱ ♦ కుండ నేగు
చుంటి నేను నిన్ను ♦ నోబిడ్డ సర్వేశు
పాలుసేసి పోదు ♦ భయముపడకు. 67
ఆ. తండ్రిపోయెనంచుఁ ♦ దల్లడిల్లకునిమి!
తండ్రుడెంతకాల ♦ ముండ్రుబ్రదికి
యువనినంచుఁబలికి ♦ యలసివెంటనెమిశ్రుఁ

డసువులను దొఱంగి ♦ యరిగె దివికి. 68

క. భవబాధలనెడువహ్నిని
దవులుచు దగ్ధులగునజ్ఞ ♦ తతి నిలను హిమాం
బువువంటిత్వత్కృపాసిం
ధువున న్దేలించి తన్పు ♦ దువు శ్రీరామా. 69

శ్రీరస్తు.

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః

# శ్రీ గౌరాంగచరిత్రము.

## చతుర్థాశ్వాసము.

చ. వెరవున గాధినందనుఁడు ♦ పిన్నఱికంబున నస్త్రశాస్త్రముల్
గఱపిన నేర్చి రక్కసుల ♦ గండడఁగించి పురారివిల్లుచూ
పఱు వాగడంగఁ ద్రుంచి పిద ♦ ప న్ధరణీసుతఁ బెండ్లియాడు న
త్తఱిఁగలనీదు నెమ్మొగము ♦ దాశరథీ! యొకసారిచూపవే! 1

ఉ. ద్వాదశవర్షమాత్రమగు ♦ ప్రాయమువచ్చినబాలు, నింటిలోఁ
బేవఱికంబుఁ, దాను విల ♦ పించిన ధైర్యముదూలిబిడ్డఁడున్
ఖేదము నొంది స్రుక్కఁనగు ♦ కీడును, నెమ్మది నెంచియెంచి యె
ట్లోదిగమ్రింగి దుఃఖము త ♦ లోదరి పెంచుచునుండెఁ బాలకున్. 2

గీ. ఇంటఁగుడుచుట కిద్దఱే ♦ యుంటఁ జేసి
మెలఁకువను వెచ్చమును జేసి ♦ మెలఁత దనకు
శక్యమైనంతవఱకు సం ♦ సారవహన
కార్యమొనరించుచుండె దుః ♦ ఖంబుమఱచి. 3

వ. గౌరాంగుని చదువుమాట యెట్లోయని చింతించుచుండి యచ

టం దనకుఁ గూర్చువారితో నాలోచించి శచి, తత్పట్టణనివాసియుఁ బరిపూర్ణవ్యాకరణశాస్త్రవేత్తయు నగుగంగాదాసభట్టాచార్యునొద్దఁ దనకొమరు నప్పగింపనిశ్చయించుకొని యొకనాఁడు వానిం గొని యటకరిగి. 4

ఉ. పండితసార్వభౌమ ! యిటు ♦ వచ్చితి నే విని మీయశంబు, బా
లుం డితఁ డజ్ఞుఁ డీపృథివి ♦ లోపలఁ దండ్రికి నోఁచఁడయ్యె, మీ
యండయెసర్వమాతనికి ♦ నమ్మయుఁ జచ్చినదానిసాటియే
యుండియుఁ గూడ, మానిమికె ♦ దొయొకవిద్యను నేర్పిప్రోవరే? 5

క. అని శచి గౌరాంగుని నా
తనియడుగులపై నివేయఁ ♦ దల్లీ ! నీపు
త్త్రునివంటిశిష్యుఁ డిమ్మహిఁ
బనుపడు టేయొక్క పెద్ద ♦ భాగ్యముసుమ్మా ! 6

ఆ. బాలుకొఱకునీవు ♦ పరితాపమొందకు
పేవ, దిక్కులేని ♦ బిడ్డఁడనుచుఁ
గొఱఁత లేకవిద్యఁ ♦ గఱపెద నీబిడ్డ
కంచుఁ జెప్పిపంపె ♦ నతివనతఁడు. 7

గీ. తల్లిపన్పుననతనిప ♦ దంబులకు నె
ఱంగిపడియుండునట్టి గౌ ♦ రాంగు లేవ
నెత్తి దీవించె నాతఁడు ♦ వృద్ధిఁగాంచు
పండితాగ్రేసరుండవై ♦ వసుధనంచు. 8

శా. గంగాదాసగురూపదేశకలన ♦ న్గౌరాంగుఁడంతంత కు
త్తుంగజ్ఞానవికాసచిత్తగరిమ ♦ న్దోఁబాఠశాలం బఠిం
పంగం బోయిన వారికెక్కుడయి స ♦ మ్మానంబులం బొందుచుం
డం గర్వంబులు డించి భీతిలుదు రేం ♦ డ్లం బెద్దలౌ వారలున్. 9



వ. ఇట్లునిమి పదునాల్గువత్సరంబులవాఁడై యుదయంబునఁ బాఠశాలకుం బోయి మధ్యాహ్నంబునఁ బూర్వాభ్యస్తవిషయంబులఁ బునఃపఠనంబుసేసికొనుచు బుద్ధివిశేషంబునఁ దనకొక్కండు నీడు లేఁడను ప్రతీతింగాంచి పెంపెక్కుచుండె. అలంకారశాస్త్రవిశారదుండగు కమలాకాంతుండును దంత్రసారగ్రంథకర్తయగు కృష్ణానందుండును మురారిగుప్తుండును మున్నగాఁగలయేండ్లు గడచిన పెక్కురు మేధావంతు లతనిసహపాఠులుగా నుండిరి. తఱచుగ వారితో శాస్త్రార్థచర్చలకుం జొరఁబడి యనాయాసంబున వారినోటుపఱిచి బాలుం డెంతెంతపండితుల నివ్వెఱపాటునం బెట్టుచుండు. బాల్యంబునందీతండు వాదించి యోడించి చీకాకుపెట్టినవార లే పిదప నీతని ముఖ్యభక్తులైరి. మఱియు నొక్కవిశేషంబుగలదు. వైష్ణవపండితులన్నఁ దనతండ్రియంత వయసుగలవారైనను డీకొని కురంగసంఘంబుపైఁ బడుసింగంబుచాడ్పున వారిపైఁ గవిసి శాస్త్రవాదంబు సేసి తలవంపులుగావించి వారి నలమటపెట్టుచుండు. 10

శా. స్నానంబాడఁగ గంగకేగి యటకు ♦ న్స్నానంబుసేయంగ నే
తేనింబండితులేగుదెంచినవిన ♦ మ్రీభూతకాయంబుతోఁ
దానొయ్యంజని వందనంబులిడి వా ♦ దంబాడి వారోటముం
గానంజేసి చనున్మఱొక్కదెసకు ♦ న్గౌరాంగుఁడుత్సేకియై. 11

గీ. రేవురేవుననిటు చెల ♦ రేఁగి పండి
తులపిలుకుదూల్చి యావ్రిక్క ♦ దురముసేయ
నరులు లేమిని నిమియూఁది ♦ యరిగియెదుటి
తీరమునకోర్చు నచ్చటి ♦ వారిఁగూడ. 12

సీ. గ్రంథంబుసేయుటే ♦ కడిఁదికష్టపుఁబని
యందుమహార్ణవ ♦ మట్టులుండు

శాస్త్రింబుపై వ్యాఖ్య ♦ సరసంబుగాఁ జేయు
టతికష్టమైనకా ♦ ర్యంబుపూన
నిట్టిచో గౌరాంగుఁ ♦ డీలేఁతవయసున
వ్యాకరణంబుపై ♦ వ్యాఖ్యవ్రాసి
యిలపై సరస్వతీ ♦ నిలయమన్ప్రఖ్యాతి
వడయునవద్వీప ♦ పట్టణమున

ఆ. నుండునట్టిదండి ♦ పండితమండలి
పూర్వపక్షవాద ♦ ములకుఁజిక్క
కుండ వారినుతుల ♦ నొంది శాశ్వతకీర్తి
వఱలునట్లుదానిఁ ♦ బ్రకటపఱిచె. 13

గీ. ప్రాణదేహంబులట్ల యీ ♦ వసుధఁ గాలు
సర్వశబ్దశాస్త్రములలో ♦ వ్యాకరణము
నందుఁ గూలంకషప్రజ్ఞ ♦ నందుపిదపఁ
దర్కశాస్త్రాభ్యసనకాంక్షఁ ♦ దవిలెనతఁడు. 14

ఆ. వాసుదేవసార్వ ♦ భౌముఁడన్నైయాయి
కుండు పాఠశాల ♦ యొండుగంగ
కవలఁబెట్టివిద్య ♦ ఖ్యాతిగాఁగఱపుచు
నుండనిమియుఁ జదువు ♦ చుండెనచట. 15

ఉ. వ్యాకరణాదిశాస్త్రముల ♦ నన్నియుసాంతము చేసి తర్కవి
ద్యాకుశలత్వముంబడయ ♦ నాతనియొద్దకుఁబోవు శిష్యులం
జేకొని వాసుదేవుఁడొగిఁ ♦ జెప్పఁగనోరిమివిద్య, యారయా
వాకిటనుండుబండకును ♦ వచ్చును దర్కమటండురందఱున్. 16

ఆ. అతనియొద్దఁజదువు ♦ నట్టిశిష్యాళిలో
విద్యయందుబుద్ధి ♦ వికసనమున



సాటిగాంచరాని ♦ మేటిరఘునాథుఁ
డనునొకండుబలిసి ♦ యచటనుండె. 17

ఉ. ఏరినిజీరికింగొనఁడు ♦ కెంతటివారలనైన, నూరిలో
నూరినటంచునేనిఁ దల ♦ నూపఁగనీయఁడు, వాదభిక్షులన్
గోరునుబండితాళి, సర ♦ కుంగొనఁ డొజ్జలువచ్చియున్న, ని
ష్మైరఘునాథుఁడుం డెఁగడు ♦ మత్తిలి, కాంచక క్రిందుమీఁదులన్.

క. గురునెఱుక దాఁటుజ్ఞానముఁ
బొరసితినిఁక న్యాయశాస్త్రి ♦ పూర్ణప్రజ్ఞా
కరుఁడనగు నాకుమాఱట
ధరలోలేఁడెవ్వఁడంచుఁ ♦ దలపోయునెదన్. 19

మ. నిమిబాలుండటఁ జేరి ధీమహిమ నా ♦ నిన్మించిపోవంగఁగాం
చిమనఁబచ్చెరువీర్ష్యయుంబొరయఁగాఁ ♦ జింతించెనాతండు, వీ
నిమహత్త్వంబుమహాద్భుతంబ, యెపుడే ♦ నిన్వీనిఁదర్కంబునం
దుమహిన్నైల్చెదుపోటుమానిసి యొకం ♦ డుంబుట్టఁడంచున్మదిన్. 20

ఆ. తార్కికౌఘమందుఁ ♦ దలమానికంబనై
యెదురులేనికీర్తి ♦ నెనయఁదలఁచు
కొన్న నాకుఁబెద్ద ♦ కుత్తుకయురియయ్యె
బాలుతర్కశాస్త్రి ♦ పఠనమిపుడు. 21

వ. అనియిట్లు పరిపరివిధంబులఁ బరితపించుచుండి యొక్కనాఁడు వేళ
గానివేళ వంటఁ జేసికొనుచుండ నిమివ్రాయి చిఱునవ్వుతో నన్నా!
యీదినం బింతయాలసించి భుజించుటకుఁ గతంబేమియనియడిగిన
రఘునాథుండిట్లనియె. 22

క. పనివడి హేత్వాభాసం
బును గుఱుఁడొండిచ్చినన్ను ♦ స్ఫుటపఱుపుమటం

చన నదియోజించుచును
టిని మదికిందోఁచ దిప్ప ♦ టికినైననఖా ! 23

క. సరియైనయుత్తరంబును
గురువునకర్పించికాని ♦ కుడువనటంచున్
గొఱమాలినశపథముఁగొనఁ
గఱవయ్యెనునేఁడు యుక్త ♦ కాలాన్నంబున్. 24

మ. అనుమాటల్విని మందహాసమున నా ♦ యాభాసమున్నాకుఁగూ
డను దెల్పన్వలనైనఁజెప్పమని వేఁ ♦ డన్బాలుఁ, డాతండు ని
ట్లనిచెప్పె; రఘునాథ ! దానికిదిగా ♦ దా ! యుత్తరంబంచుఁ బ
ల్కెనుగౌరాంగుఁడు, నివ్వెఱంబొరసి యా♦లించె రఘుండత్తఱిన్.

క. విని యీసమయస్ఫూర్తియు
ఘనధిషణాశక్తి యెట్లు ♦ గదిరెనటంచున్
దనకుంగలతొలిగర్వం
బును రఘునాథుండుదొఱఁగి ♦ పోఁడిమిదక్కెన్. 26

వ. మఱియు. 27

సీ. తర్కశాస్త్రమున నిం ♦ తటివాఁడు లేఁడని
యనిపించుకొనవలె ♦ ననెడునాస
రఘునాథుఁడొక్క త ♦ ర్కగ్రంథమీవఱ
కే వ్రాసి దానికి ♦ నిడెనుదీధి
తియనునామంబంత ♦ ధీశాలిగౌరాంగు
గ్రంథమొక్కటినీవు ♦ వ్రాయుమంచు
నతనిసహాధ్యాయు ♦ లందఱుఁబ్రోత్సాహ
పఱుపఁగా నిమిగూడ ♦ వ్రాసెనొకటి

గీ. యద్దిరఘునాథుఁడెఱిఁగి యీ ♦ న్యాయవాట



నిమియుఁ దనవంటివాఁడేయ ♦ నిమదినెంచి
చదువుమన్నను జదువునో ♦ చదువఁడొయను
శంకతో వానియొద్దకుఁ ♦ జనియెనతఁడు. 28

క. చనిగౌరాంగా ! యెదియో
యొనరిచితఁట గ్రంథమద్ది ♦ యొకసారివినన్
మనమాసపడెడునాకున్
ఎనిపింతే ? యన్ననతఁడు ♦ వినియిట్లనియెన్. 29

ఆ. పడవపైనిమనము ♦ పాఠశాలకునెల్లి
సనెడుతఱినినీదు ♦ మనసుఁదీర్తు
గంగమీఁదవీచు ♦ గాలిలోఁగూర్చుండి
నాదుగ్రంథమును వి ♦ నంగవచ్చు. 30

క. అనిమఱునాఁడిద్దఱు గం
గను దాఁటుచుఁబోవునట్టి ♦ కాలంబునఁదా
నొనరించినగ్రంథమునది
వెనునిమిరఘుఁడద్దివినుచు ♦ విస్మయమందెన్. 31

ఉ. మాటలపొందు వాదగరి ♦ మంబును దుష్ప్రతిపక్షవాక్యలా
పాటనపాటవంబుగను ♦ పట్టెడుయుక్తి రఘుండుగాంచి యీ
పాటిదెనాదుదీధితి ప్ర ♦ భావమటంచు మనంబునుక్కఁ జే
డ్పాటునుజెంద నాతనిక ♦ డన్వెడలించెను బాష్పపూరముల్. 32

ఉ. కోవిదువంతఁగాంచి నిమి ♦ గూడనుజింతిలి మిత్రమా ! యిదే
మీ ! వనరంగఁజొచ్చితన ♦ మిశ్రజ ! త్వత్కృతమైనగ్రంథము
న్నేవిననాదుదీధితికి ♦ నేఁడెనివాపజలంబువచ్చె న
న్నావనదోఁపనాకిటులు ♦ వచ్చెనుగన్నులనీళ్లువెల్లుగన్. 33

గీ. పూర్ణయౌవనభాగ్యంబుఁ ♦ బొందఘోరుల

మించుమైచాయదొడవుల ♦ మెఱుపుఁగల్గు
నాతిఁజూచినయట్టులు ♦ సూతురయ్య
పీతదంతకృశాంగియా ♦ వృద్ధనిలను! 34

మ. అనుదినోక్తులనాలకించి యిదియ ♦ య్యా! నీకుదుఃఖంబుఁదె
చ్చినగ్రంథంబు! వృథాప్రయాసముగదా! ♦ చింతింపఁదర్కంబదె
వ్వనికిన్మేలునుగీడుఁగూడ నొనరిం ♦ పన్లేదుదీనిన్సఖా!
కనరాకుండఁగనడంతునంచునది గం ♦ గన్వైచెనిశ్చింతుఁడై. 35

గీ. వైచిరఘునాథ! దీధితి ♦ వసుధనింక
ఖ్యాతికెక్కనుగొఱమాలి ♦ నట్టిచింత
స్వాంతమునుబట్టవలదని ♦ పలికె మంద
హాసవదనంబుతోడ గౌ♦రాంగుఁడపుడు. 36

క. నిమివ్రాసినన్యాయగ్రం
థము నాశమునొందనిట్లు ♦ ధరణిరఘునిగ్రం
థముదీధితియయ్యెఁ బ్రమా
ణము; నిమిదర్కంబువిడిచె ♦ నాఁటంగోలెన్. 37

ఉ. అంతటఁషోడశాబ్దసువ ♦ యస్కతఁగాంచి స్వతంత్రశక్తిఁ ద
త్ప్రాంతమునందు విద్యగఱ ♦ పన్బడిరొక్కటివెట్ట నిశ్చిత
స్వాంతుఁడుగాఁగనానిమి; ద్వి ♦ శాస్త్రవిదుండగువానియొద్ద క
త్యంతముదాత్తులైపఠన ♦ తత్పరతన్జనుదెంచిరందఱున్. 38

సీ. పుణ్యాత్ముఁడునువిత్త ♦ పూర్ణుఁడునైపుర
మందునున్నట్టి ము ♦ కుందసంజ
యాఖ్యభూసురవర్యుఁ ♦ డాతనిపూజన
సదనమిచ్చెనుబాఠ ♦ శాలకొఱకు
నందుగౌరాంగుండు ♦ వ్యాకరణంబును



జెప్పుచుండెనువచ్చు ♦ శిష్యులకు న
తనికంటెఁగూడఁ బె ♦ ద్దలు శిష్యులైవచ్చి
నేర్చుచుండిరివిద్య ♦ నియతితోడ

గీ. నీతఱినివల్లభాచార్య ♦ కూఁతురైన
లక్ష్మియనుకన్యఁదెచ్చి పి ♦ ల్లనికిఁ బెండ్లి
చేసిరప్పుడుశచి, పెండ్లి ♦ కోసమటకు
వచ్చినమహాత్ములనుగాంచి ♦ పలికెనిట్లు. 39

చ. పరిణయదర్శనోత్సుకత ♦ వచ్చినబంధుగులార! సత్కళా
పరిణతచిత్తులార! నిమి, ♦ బాలుఁడు; తండ్రిగతించెనిర్ధనుం
డెఱుఁగఁడుమంచిచెడ్డలిఁక ♦ నెట్టులొ వీనిగృహస్థుఁజేసి మా
చిఱుతనిలోపముల్గణన ♦ సేయక దీవనలిండుమ్రొక్కెదన్. 40

క. అనిశచిదైన్యంబునఁ బ
ల్కినవెంటనె పెండ్లికొడుకు ♦ లేచిముఖాబ్జం
బును బ్రక్కకుఁద్రిప్పుచునే
డ్చెను దనమృదులాంగమంత ♦ స్విన్నముగాఁగన్. 41

వ. అంతట శచి పరికంపితచిత్తయై కొమరుదరికిం జని కన్నీళ్లుదుడిచి యి
ట్లనియె. 42

ఉ. బాలక! యూరకేవిటులు ♦ పచ్చనిగుడ్డలతోడనుండి క
న్నీళులుగాఱనేడ్చెదవు ♦ నీతియె? నీవొకయింటివాఁడవై
యాలునునీవులేఁజిలుక ♦ లట్లుమెలంగఁగఁజూడఁగోరు న
న్నేలర దుఃఖపెట్టియల ♦ యించెదునేసుఖముంటగిట్టదో? 43

వ. అనువచనంబులకు గౌరాంగుండిట్లనియె. 44

శా. తల్లీ! నాయశమాటనాస్మృతికిఁగా ♦ దా! తెచ్చితామీఁదనా
కెల్లన్జ్ఞప్తికివచ్చెశైశవసుఖా ♦ నేకప్రవృత్తు; ల్వ్యథా

క్లుప్తార్థము; లల్లభ్రాతృవిరహ ♦ క్లేశంబుఁబెల్లయ్యె; నా
యుల్లంబందలిదుఃఖమంత నిటుపై ♦ కుబ్బెన్సబాష్పంబుగా. 45

గీ. అన్నయును దండ్రియు సజీవు ♦ లౌచునిచట
నుండిరేనెట్లుశోభిల్లుఁ ♦ బెండిలియని
వగచుచుండెడునిమితోడ ♦ వగవఁదొడఁగెఁ
గూడదనినట్టిశచియును ♦ గూడనపుడు. 46

వ. అంతం గొంతవడి కీయసమయార్హంబగువిచారంబున కాదికారణం బాత్మదోషంబేయని పశ్చాత్తప్తయై శచితానూఱడిల్లి కుమారునూఱడించె. 47

సీ. గురువౌచుశాస్త్రము ♦ ల్గఱపుచుండియునిమి
బాలచేష్టలఁదాను ♦ వదలకుండ
వీథులలోఁబర్వ ♦ వెట్టిశిష్యులతోడ
బుడుతలవలెగంగ ♦ మున్గుచుండుఁ
బట్టుఁబుట్టముఁగట్టి ♦ మట్టాడినడివీథిఁ
గేరడములువల్కు ♦ వారివీరి
నందుగొందులనైన ♦ శాస్త్రచర్చలుసేసి
పండితగజముల ♦ భంగపఱుచుఁ

గీ. గరఁగిపోసినస్వర్ణవి ♦ గ్రహముపోల్కి
నూరనీరీతిఁదిరిగెడు ♦ నొజ్జలయెడ
శిష్యులకు భయభక్తులు ♦ సెడకయుండి
యంతకంతకు హెచ్చిల్లె ♦ నతనిపైని. 48

ఉ. పండితులీసుమైనెదుటఁ ♦ బల్కఁగలేక పరోక్షమందు నె
న్నండునుగానమీయవగు ♦ ణంబులు; దర్కము శబ్దశాస్త్రము
న్నిండుగనభ్యసించెనఁట; ♦ నేర్చిన నేఱువనిండుగాని తా



నుండు తెఱుంగులించుకయు ♦ నొప్పవుదేశికులైనవారికిన్. 49

క. అని దూఱఁగఁజొచ్చిరి శచి
తనయుని నతఁడించుకైనఁ ♦ దనమ్రోలను బ
ల్కనిపల్కు లెక్కసేయక
చనుచుండెను వెన్కనున్న ♦ సరణినెయపుడున్. 50

ఆ. విచ్చుకత్తివ్రాలె ♦ విడివడినిమియొద్ద
నెట్టిసూరినైన ♦ నెదురుకొనుచు
సిగ్గుఁ బిఱికితనము ♦ శిరముపంచుటయంతెఁ
బంకజాక్షులెదురు ♦ పడినయపుడె. 51

వ. వంగదేశంబప్పుడు మహమ్మదీయుల రాజ్యంబుననుండుటచే హుస్సేన్షాయనునాతండు దానికిఁ బరిపాలకుండుగానుండె. దైవజ్ఞుండొక్కఁడువచ్చి హిందువొక్కండు దానికిఁ బ్రభువుగాఁగలండని చెప్పిన గౌరాంగు రూపలావణ్యమనీషాబలంబులుగాంచి ప్రజలీతఁడే యా చెప్పఁబడిన భవిష్యత్ప్రభువని మనంబుల నువ్విళ్లూరుచుండిరి. కాని యోర్వలేని కొందఱు పాఠశాలాధ్యక్షులును విద్వాంసులు నాతని యసమక్షంబున నాక్షేపింపసాగిరి. 52

ఇప్పుడిప్పుడెవచ్చె ♦ నీభోగభాగ్యంబు
లెఱుఁగమేతొంటిపే ♦ దఱికమంత
చదువుసెప్పెడువారి ♦ సరణియే యీక్రిందు
మీఁదునుగాంచక ♦ మిడిసిపడుట
తవరయోవిద్యలఁ ♦ డాటోటుకాఁడొ యె
వ్వరుధ్రువంబుగఁజెప్ప ♦ వలఁతులిచట
మితిలేనిగర్వంబు ♦ నతిరాజసంబును
విగ్రహపుష్టిరీ ♦ వియునుగలవు

గీ. వట్టిగొడ్డునకార్పులు ♦ వలసినన్ని
లోఁతులేనట్టిగుంటల ♦ లోననున్న
చేఁపలకుసద్దుమెండని ♦ చెప్పవినమె?
యంచుఁదొడఁగిరి గేలిసే ♦ యంగనిమిని. 53

ఆ. ఇట్టులనెడుశూరు ♦ లెదురుగా నిమియున్న
మొగిచికేలు, పిల్లు ♦ లగతినుందు
రంతెకాని యొక్కఁ ♦ డతనిమాటకుమాఱు
వాకొనంగఁజాలు ♦ వాఁడులేఁడు. 54

శా. చింతల్లేవు మనంబునందు నిమికిన్, ♦ జిన్మోదవంతుండగుం
బొంత న్నెక్కొని ముచ్చటించునతఁడు, ♦ న్బాల్వారుబోధించు వృ
త్తాంతంబుల్సుమనోమనోహరములౌ ♦ న్న్యాసప్రధానంబులై,
వంతంబెట్టదు నవ్వులాటయెవనిం ♦ బ్రజ్ఞానదంబాటచేన్. 55

మ. తనకుంగల్గిన ప్రజ్ఞయోగ్యతయుఁ జి ♦ త్తస్వచ్ఛతాయుక్తియొ
వ్వనికిన్ లేదనికాంచి దూఱులకు నో ♦ వ్వంబోక నిత్యాత్మతు
ష్టినివర్తించుచు మైపసిండిమిసలం ♦ జెన్నారు గౌరాంగునిం
గనులంజూచినవారి పుణ్యమును భా ♦ గ్యంబెన్నఁగాశక్యమే? 56

సీ. అద్వైతుశిష్యుల ♦ యందొక్కరుండును
వైష్ణవుండునుమంచి ♦ పాటకాఁడు
నడిజవ్వనంపుఁ బా ♦ ఱుఁడుఁ "జట్టికాంగు" దే
శస్థుఁడు శ్రోత్రియ ♦ సత్తముండు
ను "ముకుందదత్త" నా ♦ మముగలవాఁడును
నగువానిపైకి గౌ ♦ రాంగుఁడెపుడుఁ
గవిసివాదంబులఁ ♦ గాఱియపెట్టుచుం
డఁగ నిమియుండు క ♦ డకునుబోక



ఆ. యొండుత్రోవఁజనుచు ♦ నుండుముకుందుఁ; డి
ట్లుండ నొక్కనాఁడ ♦ తండు, నిమియు
శిష్యులొక్కచోటఁ ♦ జేరియుండుటసూచి
యన్యమార్గమంటి ♦ యరుగుచుండ. 57

గీ. కాంచి యతఁడుముకుందుండు ♦ గాఁడె? యేల
తారసిల్లినఁ దానిట్లు ♦ పాఱిపోవు
ననుచునిమి యన, నెద్దియో ♦ పనిగలుగఁగ
నరిగెఁగాఁబోలునని శిష్యుఁ ♦ డనియెనంత. 58

గీ. కాము తనవంటిభక్తుఁడఁ ♦ గాను నేను
వట్టియపవిత్రజల్పము ♦ ల్వాఁగుదునని
తలఁచియాభక్తమాళి నా ♦ దరికిరాఁడ
టంచు నిమివల్కనవ్వుచు ♦ నతనిఁబిల్చి. 59

ఉ. ఏలముకుంద నన్నుఁగని ♦ యీడకునాడకుఁబోయె దీవు, నే
మాలనె? నన్మొఱంగి యిఁక ♦ మాత్రము నీవరుగంగలేవులే!
తాళుమొకింతవైష్ణవమ ♦ తంబును నేనును గొందుఁగాని నీ
పోలిక దొంగవైష్ణవముఁ ♦ బూనను నమ్ముము నాదుపల్కులన్.

చ. అపుడిటువంటివైష్ణవుఁడ ♦ నాదుననన్వెను! వేల్పులెల్ల ని
ష్కపటపుభక్తి నాకుఁబడి ♦ గాపులుగాఁ బడియుండ్రువాకిట;
న్నిపుణతబానిసీనిఁగను ♦ నిన్నుఁబొనర్చెద, నీడమాడ్కి న
న్నెపుడును నీవువెన్తవులు ♦ దింకెటుతప్పకపోదువంచనన్. 61

క. ఈమాటలువిని కొందఱి
దేమీ! నిమియిట్టిబుద్ధి ♦ హీనుఁడె? హరిసే
వామహితు గేలిసేయుట
సేమమె యీతనికటంచుఁ ♦ జెప్పికొనిరటన్. 62

గీ. గిల్లిజగడంబుఁ దెచ్చునీ ♦ పిల్లవాఁడు
సాధుసంతాపమేల తాఁ ♦ జలుపవలయు
నంచుఁ గొందఱువల్కిరి ♦ యతనిభాష
ణంబునకుఁ గొందఱెంతయు ♦ నవ్విరపుడు. 63

శా. న్యాయాభ్యాసియు నందగాఁడు నిమిప్రా♦యంబంతప్రాయంబునుం
డాయన్వచ్చినవాఁడు భక్తవర స ♦ న్మాన్యుండు గౌరాంగుమై
చాయంబోలి గదాధరుండు మెలఁగ ♦ న్శాస్త్రార్థవాదంబుచే
నాయాసంబునుబెట్టువాని నిమి వి ♦ ద్యావాప్తగర్వంబునన్. 64

గీ. ఎన్ని బొమ్ములు వెట్టిన ♦ నన్ని యోర్చి
యతఁడు సేసెడుహాస్యంబు ♦ లన్ని యోర్చి
తగవులకు రాకయుండగ ♦ దాధరుండు
దప్పుకొనిపోవ సాధువై ♦ తలఁచుచుండ. 65

ఉ. జిత్తులమారిబాలుఁడు వి ♦ శేషము లేమి గదాధరాయటం
చత్తఱి మెల్లమెల్లఁగను ♦ హాళివివాదమునందు దించితాఁ
జిత్తమువచ్చినట్లతనిఁ ♦ జిక్కులు వెట్టఁగ నుత్తరంబుకై
తత్తఱపాటుఁజెందుచు గ ♦ దాధరుఁ డశ్రులు రాల్చుచున్నెడ. 66

క. సాధులలో సాధువగు గ
దాధరు నిమి యేడిపించుఁ ♦ దా దుష్టత; నీ
బాధల కష్టుఁ జెయాతఁడు?
శ్రీధరుమార్గములు సూడఁ ♦ జిట్టలు జగతిన్. 67

సీ. నిమితండ్రికినిగూర్చు ♦ నెయ్యుఁడు, ఖ్యాతియం
దద్వైతుతరువాత ♦ నంతవాఁడుఁ,
దనభార్యమాలినీ ♦ తన్వంగితోఁ దాను
నిమి బాల్యదశయందు ♦ నెమ్మిఁ బెంచి



నట్టివాఁడును, వైష్ణ ♦ వాగ్రేసరుఁడు, నగు
శ్రీవాసుఁ డెదురువ ♦ చ్చినతఱి నిమి
సేతులుజోడించి ♦ శిరమువాంచి నమస్క
రించి వినమ్రుఁడై ♦ యెదుటనిలువ

గీ. నద్దియెల్లఁ బ్రపత్తియే ♦ యంచు నెంచి
మోసపోవుచు వెఱ్ఱి శ్రీ ♦ వాసుఁడపుడు
నతులఁగైకొని తనదు నౌ ♦ న్నత్యమంతఁ
బయలుపఱుచుట కతనితోఁ ♦ బలికెనిట్లు. 68

శా. ఓరీ! ధూర్తనిమీ! యయుక్తకరణో♦ద్యోగుండవై యిప్పుడీ
పేరీతిన్జనుచుంటి వెచ్చటికి? నె ♦ న్నే శాస్త్రముల్నేర్చి తం
చూరంగల్గినసూరులందఱను నీ ♦ వోడించితంచున్సరిన్
వారున్వీరును జెప్పవింటి! సరినీ ♦ పాండిత్యసంక్షోభముల్. 69

క. వాదంబుల శాస్త్రంబులఁ
గాదుర నరులెందుముక్తిఁ ♦ గాంచుట గర్వో
న్మాదము డంబముఁ బెంచుచు
నాదను గల్గించునవి య ♦ టంచున్గనుమా! 70

ఆ. యుక్తవర్తనమున ♦ కురుముక్తిదాయక
కృష్ణపాదసేవ ♦ కితరమైన
శాస్త్రసంచయములు ♦ సరిరావు! సరిరావు!
వానిఁ బడసి సౌఖ్య ♦ పడుము కుఱ్ఱ! 71

వ. ఆకాలంబున క్షీణదశలోనున్న వైష్ణవమతంబు నిరంకుశప్రజ్ఞావం
తుఁ డగునిమి యందుం జేరినఁ బునరుద్ధారణంబు నొందుననునాస
నిట్లు శ్రీవాసుండువల్కిన కపటవాక్యంబులకు గౌరాంగుండు లో
లోనవ్వుకొనుచుఁ బైకిమాత్రము వానిఁ దదేకదృష్టిగా వినువానివ

లె నటించి భయభక్తియుక్తుండుంబోలె గడగడలాడుచు వంగి చెవి
యొగ్గి నిలుచుండి యతండు విరమితవాక్యుండైన పిమ్మట నిట్లనియె.

ఉ. పండితమౌళివైతివి గద ♦ బాల్యమునందునఁ గొన్నినాళ్లు ద
క్ష్మాండితిమై లభించు విభ ♦ వంబులనుం జవిచూడనీరె? యె
న్నండుఁ గవానిపై విసువు ♦ నాకుజనించునొ తత్క్షణంబదా
సుండ నెయాదుఁ గృష్ణునకు ♦ క్షుద్రసుఖంబులనెల్ల వీడుచున్. 73

గీ. ‘‘ అప్పుడుతమవంటియొక వైష్ణ ♦ వాగ్రగణ్యు
కొలకు నెచ్చటికైన నే ♦ నరిగి ’’ యనుచు
సంతసిమిపట్టలేక కొం ♦ డంతనవ్వు
నవ్వెరక్తిమమోహమున ♦ నివ్వటిలఁగ. 74

క. ఈవాలకమ్మున గనుఁగొని
శ్రీవాసుఁడులోనఁ గుపిత ♦ చిత్తుండయ్యెన్
పైవారి కేమిసూపక
నీవిట్టులు నవ్వెదేమి ♦ నిమి? యనినవ్వెన్. 75

వ. వెనుకఁ గలకత్తాప్రాంతస్థ కుమారహట్టమునం దునికిగలవాఁడును
బ్రస్తుతంబు నవద్వీపంబున సర్వజన సమ్మాన్యుండై యున్నవాఁడు
ను భగవద్భక్తాగ్రేసరుండగుమాధవేంద్రపూరియను నాతనిశిష్యుం
డును శ్రీకృష్ణ పాదారవింద భక్తిక్షీరార్ణవంబున రేయింబవలునో
లలాడుచుండువాఁడును నగునీశ్వరపూరియను సన్న్యాసి కొక్కనా
డు గౌరాంగుం డెదురైవచ్చి. 76

క. చేమోడ్చి వందనంబిడి
స్వామీ! మాయింటఁగుడువ ♦ వలె నేఁడనఁగా
నేమనెనొ యెఱుఁగకుండఁగ
నే మంచిదటంచుఁబల్కె ♦ నీశ్వరుఁడు వెసన్. 77



చ. తెలిచినకన్నుమూయక యె ♦ దివ్యమహాద్యుతిఁ దేజరిల్లు సుం
దరనిమికాయమంతయును ♦ దాఁబరికించుచు నిట్టియందమె
వ్వరికడఁజూడలే దితఁడు ♦ పద్మదళాక్షుఁడొ పుష్పబాణుఁడో
సురపతినందనుండొ యని ♦ చొక్కి యతీశ్వరుఁడెంచుచుండఁగన్.

వ. గౌరాంగుఁడు వానిఁ బరధ్యానంబునుండి తొలఁగించి. 79

గీ. ఓతపసిరాయ! నన్నిట్లు ♦ సూతురేమి?
నాయొడలనున్నదే దర్శ ♦ నీయమైన
దెద్దియేనియు? నటులైన ♦ నింటికేగు
దెంచినప్పుడు గనవచ్చు ♦ నంచునవ్వె. 80

గీ. వానినింటికిఁగొనిపోయి ♦ భోనమిడిన
వెనుక నొక్కింత శాస్త్రార్థ ♦ విషయమైన
చర్చజరిగిన యానిమే ♦ షంబులోనె
నిమికి నీశ్వరునకు నెంతొ ♦ నెయ్యమయ్యె. 81

గీ. రాధికాకృష్ణులకును బ ♦ రస్పరంబుఁ
గల్గుననురాగమునుగూర్చి ♦ గ్రంథమప్పు
డొందువ్రాయుచునది యీశ్వ ♦ రుండు ప్రీతిఁ
గనఁబఱిచె సవరణసేయు ♦ మనుచు నిమికి. 82

గీ. పదునెనిమిదేండ్లప్రాయంపుఁ ♦ బండితుఁడు
దప్పులన్నియు సవరించి ♦ యొప్పసేసె
ముందువచ్చెడునిమిలీల ♦ లందుఁగూడె
నీయతియె యాఱువర్షంబు ♦ లేగువెన్క. 83

గీ. వెనుక జందెంబువేసిన ♦ వేళయందు
వచ్చినటువంటి యావింత ♦ వ్యాధి మూర్ఛ
మరల నిమిఁబట్టి యెన్నాళ్లౌ ♦ వఱకొగాని

విడిచిపోకుండఁ దల్లికి ♦ నడలుగొల్పె. 84

గీ. వెఱ్ఱివాఁడయ్యెనంచును ♦ వేల్పువచ్చి
చొచ్చెనంచును దయ్యంబు ♦ సోఁకెనంచు
వచ్చిచూచినవారెల్ల ♦ నిచ్చవచ్చి
నట్టులాడంగఁజొచ్చి ర ♦ య్యవసరమున. 85

గీ. పిల్లవాఁడుగదా! యింత ♦ విద్యఁగఱవ
లేఁతమది రాపిడికిఁ దాళ ♦ లేక యిట్లు
చెదరిపోయెనటంచును ♦ జెప్పఁదొడఁగె
నీర్ష్య మదిఁ గప్పపండిత ♦ బృందమపుడు. 86

క. శంకింపక యీబాలుని
సంకెలలన్వైచి యొక్క ♦ చక్కింబెట్టన్
జంకి యిటుసేయఁబోవఁడు
కొంకక బంధింపుమనిరి ♦ కూళలుశచితోన్. 87

క. అపుడమితశోకమున వాఁ
డిపుడెవ్వనికేమిసేసె ♦ నిటుసేయుటకున్
దపియించున న్మఱంతగఁ
దపియింపంజేయకుఁడని ♦ తల్లివచించెన్. 88

వ. వచించియు వారిమాటలు నిజమేమో యనితలంచి లేనిరోగంబున
కై తనయుని జికిత్సలచే శచి గష్టపెట్టె. 89

గీ. కొన్నినాళ్లకుఁ గ్రమముగాఁ ♦ గుదిరెవ్యాధి
వ్యాధిపోవఁగ దేహదా ♦ ర్ఢ్యంబుహెచ్చె
మున్నుచేసెడు దుండగ ♦ మ్ములునుగొంత
వఱకు శమియించె రుజయునో ♦ నరిచెమేలు. 90



సీ. పందొమ్మిదవయేఁడు ♦ వచ్చె నప్పుడునిమి
కంతఁదాస్థాపించి ♦ నట్టిపాఠ
శాలఁబోషింప వి ♦ శాలవిత్తార్జన
మునకుఁగాఁబోలును ♦ బూర్వదిశకుఁ
జని యటఁగొన్నాళ్లు ♦ స్థావరంబుగనుండు
టకునెంచి తల్లిక ♦ డకునుబోయి
యెట్టకేలకు నామె ♦ నీకొనఁగాఁజేసి
బహుశిష్యపాళితో ♦ గృహమువదలి

గీ. దాఁటి పద్మానదిని దాని ♦ దరిని నున్న
యొక్కగ్రామంబునను నిమి ♦ యున్న నతని
ఖ్యాతి ముందుగవచ్చెను ♦ గాన వేన
వేలువచ్చిరి శిష్యులై ♦ విద్యకొఱకు. 91

శా. బాలుండొక్కఁడు మోహనాంగుఁ డతుల ♦ ప్రజ్ఞాధురీణుండు ను
ద్వేలోపార్జిత సత్కళానిచయు సం ♦ దీప్తాత్ముఁడు స్వీటి కీ
వేళన్వచ్చెను జూచివత్త మటకు ♦ న్వేరండటంచు న్పురిన్
స్త్రీలు న్పూరుషులెందఱో చనిరి ద ♦ ర్శింపంగ గౌరాంగునిన్. 92

వ. విశ్వంభరుం డిచటఁ జేసిన యద్భుతచర్యలన్నియుం దపన మిశ్రవిర
చితం బగుతపనవిజయంబను గ్రంథంబున న్గాన్పింపఁగలవు. ఈయు
న్నతపదమునందున్న బ్రాహ్మణుఁడు పరమాత్మతత్త్వంబుఁగూర్చియు
ముక్తినింగూర్చియుఁ బెక్కుసందేహంబులు గలవాఁడై కడపట
శ్రీగౌరాంగుబోధంబుచే విచ్ఛిన్నసంశయుండై యతనికి దాసుండ
య్యెనని తద్గ్రంథంబున వ్రాయఁబడియుండె. 93

మ. ఒకనాఁడందఱు శిష్యులున్గొలువఁ దా ♦ నుండంగ నీబ్రాహ్మణుం
డు, కటాక్షింపుమటంచు వచ్చి నిమికెం ♦ తో భక్తిమ్రొక్కంగ,నా

ల్లక గౌరాంగుఁడు లేవనెత్తి యిదిమే ♦ లా! యెప్పుడుం జేయఁబో
వకుఁడీయిట్టులు, మీరుపెద్దలును నే ♦ బాలుండనున్ భూసురా!

గీ. తనయ! యని పిల్చుటకుఁగూడఁ ♦ దగిన వయసు
నందునున్నట్టి నాకు సా ♦ ష్టాంగనతులు
మీరుసేయుట న్యాయమే? ♦ మీ రెఱుంగ
నట్టి ధర్మంబు లెచ్చట ♦ నైనఁ గలవె? 95

వ. అనిన నందులకుం దపసమిశ్రుం డిట్లనియె. 96

సీ. తొలుత నామొఱ్ఱలఁ ♦ దుదముట్టఁగావిని
వెనుకఁ జీకొట్టు త ♦ ప్పిదములున్న
మృత్యుదేవత చెంత ♦ మ్రింగనైయున్నది
ముందుమార్గము సూపఁ ♦ బోఁడెవండు
నానేర మొక్కింత ♦ యేనియు లేదిందుఁ
గనఁబడునందఱ ♦ కడకునేగి
యడిగితి నందుచే ♦ నంతకంతకు హెచ్చె
స్వాంతంబునందలి ♦ సంశయంబు

ఆ. లంతెకాని వాంఛి ♦ తార్థదాయి యొకండు
నవని దొరకఁడయ్యె ♦ నంత నిన్న
దీర్ఘచింతతోడ ♦ దేవునిఁ బ్రార్థించి
మంచినిద్ర నాద ♦ మఱచియుండ. 97

మ. కలలో మంగళవిగ్రహుం డొకఁడు దాఁ ♦ గాన్పించి నీసంశయం
బులు గౌరాంగుఁడు దీర్చువానికడకుం ♦ బొమ్మావు శీఘ్రంబుగా
నిలలో నందఱ నుద్ధరించుకొఱకా ♦ యీశుండె గౌరాంగుఁడై
లలితాకారమున న్జనించెనని ప ♦ ల్కన్నేను మేల్కాంచితిన్. 98

గీ. మేలుకొని చెచ్చెరనువచ్చి ♦ మీపదాబ్జ



ములపయిఁ బడితి సందియం ♦ బులను డుల్చి
నాకు గతిసూపి ప్రోవుమా ♦ నీకుఁ దప్ప
దంటి నిదియంత నానేర ♦ మా? మహాత్మ! 99

మ. అన గౌరాంగుఁడు సిబ్బితిన్వలె స్మితా ♦ స్యంబొరగాఁజేసి యి
ట్లనె స్వప్నంబునఁగాంచి విన్నయది స ♦ త్యంబౌను విప్రోత్తమా!
మనసే యిన్నివినోదముల్గొలిపెఁ జు ♦ మ్మా! యైనను న్నాకుఁదోఁ
చినమార్గంబున నీకుఁ దోడుపడుదు ♦ న్జింతింపకయ్యా యిఁకన్. 100

క. మనవెనుకవార లింతకు
మును పే వేసిరొకత్రోవఁ ♦ బోవఁగవలయున్
మనుజు లదియంటి యని దా
నిని స్పష్టముగా నతనికి ♦ నిమి బోధించెన్. 101

గీ. సంశయముఁదీర్చి తపనమి ♦ శ్రా! కళత్ర
యుతుఁడవై నీవు కాశిలో ♦ నుండుమయ్య
యచటికేవచ్చువఱకన్న ♦ నాతఁడట్ల
చలిపె నాబాల గురునాజ్ఞ ♦ తలనుదాల్చి. 102

గీ. ప్రాగ్విషయమందు నిమి యొక్క ♦ వర్షముండి
యచటిప్రజలను దాఁ జాల ♦ నలరఁజేయ
వారలందఱు నతఁడు దై ♦ వంబెయనెడు
బుద్ధి నాతని ననిశంబుఁ ♦ బొగడుచుండ్రు. 103

వ. అందులకు జను లిప్పటికిఁగూడ నాదేశంబునఁ బాడుకొను నీక్రింది
పాటయే తార్కాణంబు, 104

ద్వి. పాపులు! దుష్టులు! ♦ పతితమానవులుఁ
దాపసకుంజరుల్! ♦ ధన్యసాధువులు
విమలచితులు! మీరు ♦ వేవేగరండు!

నిమి పిల్చుచున్నాఁడు ♦ నిర్నిద్రులౌచు
స్వామిబోధించిన ♦ పలుకులాలించి
యామార్గముననె మీ ♦ రందఱుననుఁడు
హరినామమనునావ ♦ నాతఁడు ముక్తి
కొఱకుఁ గావించి భ ♦ క్తులనందునుంచి
దయతోడఁ దాఁ గర్ణ ♦ ధారుఁడై వారి
భయదసంసృతి దుఃఖ ♦ వార్ధిదాఁటించుఁ
గృపఁజేయు నుపకృతి ♦ కిని మాఱుగోరఁ
డెపుడుఁ దా నొకగవ్వ ♦ యేని దక్షిణగ
నీమంచిసమయంబు ♦ వృథసేయఁబోకుఁ
డీమహాత్మునికెన ♦ యెవ్వరు లేరు. 105

క. గౌరాంగుఁ డొక్కయేఁడట
నీరీతిన్గడపి మరల ♦ నేతెంచెను వి
స్ఫారయశస్కుండయి తన
యూరికి శిష్యులకునెల్ల ♦ నుల్లము లలరన్. 106

గీ. వచ్చువెంటనె శచి తన ♦ పట్టితోడ
నతనిసతి లక్ష్మి మరణించె ♦ ననెడు ఘోర
వార్త చెప్పుట తప్పక ♦ వచ్చెనంచుఁ
జెప్పి వాపోయె నక్కునఁ ♦ జేర్చి సుతుని. 107

సీ. కట్టకట్టలుగఁ బ్రా ♦ గ్భాగంబునందుండి
వచ్చినశిష్యులుఁ ♦ బ్రాంతశిష్య
లందఱు నిమి బడి ♦ యందుఁ గ్రిక్కిఱిసినఁ
బల్లవసుమఫల ♦ భరితమైన
విపులభూజంబట్లు ♦ వీక్షణానందదా



యకమౌచు నది ద్రష్ట ♦ లకునుదోఁచె
బహుళంబుగా ధన ♦ వస్త్రధాన్యంబులు
నిమియింట సతతంబు ♦ నెలకొనియెను

ఆ. గాని యొక్కటేని ♦ గౌరాంగుఁడంటఁడు
దల్లిచేతఁబెట్టు ♦ ధనమునంత
నిట్టు లతనికీర్తి ♦ యెంతయు దెసలందు
నవిరళముగ వ్యాప్త ♦ మౌచునుండ. 108

మ. కవియు న్గీర్తిత సర్వశాస్త్రవిదుఁడు ♦ న్గాశ్మీరవాసుండుఁ గే
శవనామాంచితుఁ డెల్లదేశముల సం♦చారంబుఁ గావించి శా
స్త్రివచఃపాటవమొప్పఁ బండితుల వా♦దంబందుఁ దూఁటాడి యిం
కెవరున్లేరు జయింప నాకనుచు నూ♦హించె న్మదోద్రిక్తుఁడై. 109

క. తనలోఁ దానిట్లూహిం
వ నవద్వీపంబు చిత్త ♦ పథమునఁబడెఁ దో
డనె యతఁడే నటకుంజని
తునుమాడెద నచటి పండి ♦ తులనని తలఁచెన్. 110

క. తలఁచినవెంటనె మదగజ
ములు సేవకులశ్వతతులు ♦ ముందరనడువన్
జెలఁగి నవద్వీపమునకు
వెలువడి కేశవుఁడు వచ్చి ♦ విడిసెఁ బురమునన్. 111

గీ. విడిసి యేపండితుండైన ♦ విద్దెలందుఁ
బోరినన్నోర్చనేఁ గోలు ♦ పోదు నాదు
వసువసనదూష్య వారణా ♦ శ్వంబులెల్లఁ
గానిచో నవద్వీపంబు ♦ గాదుమీది. 112

క. అని వార్తఁబంపఁ బట్టణ

మునఁ గలపండితులు వాద ♦ మున కెపుడేనిన్
వెనుదీయనివారైనను
బొనుఁగుపడిరి యిపుడు కేశ ♦ వుని వార్తలకున్. 113

క. ఇమ్మహి నేపండితుఁడు
న్నమ్ముల నోడించునంచు ♦ మదినెంచము ద
ర్కమ్మును వ్యాకరణము మా
సొమ్మను విశ్రుతినివినని ♦ చోటులుగలవే? 114

వ. అయినను. 115

గీ. శారదోపాసనా బల ♦ శాలియౌచుఁ
బండితుల వీఁడు వేధించు ♦ చుండునంచు
వినెద మింకనోర్చుటెట్టులు ♦ వీనిమనము.
వాణియేవచ్చి జయమిచ్చు ♦ వానికెపుడు. 116

ఉ. ఈపగిది న్మనోవ్యథ ద ♦ హింపఁగ గ్రుక్కుచునుండె నా నవ
ద్వీపవిపశ్చిదాళి, పరితి ♦ వీరుఁడు మారొక్కనలేమిఁ గేశవుం
డాపురినిల్చియుండెఁ బరి ♦ హాసముసేయుచు, నంత నానిలిం
పాపగ చెంత నొక్కనిసి ♦ యందు నిమి ప్రభృతుల్సెలంగుచున్.

క. చల్లని మలయానిలములు
మెల్లఁగ వీవంగఁ గుముద ♦ మిత్రుఁడు ధరపైఁ
దెల్లనివెన్నెలఁ జల్లఁగఁ
బెల్లుగఁ గావించుచుండ ♦ విద్యాచర్చల్. 118

శా. ఆదారిన్జనుచుండి కేశవుఁడు శి ♦ ష్యానీకముల్గూడ రాఁ
గాఁ, దా వారిప్రసంగముల్వినుటకు ♦ న్గౌతూహలంబంది య
చ్చోఁ దర్పంబుననిల్చెఁ; బండితుని శి ♦ ష్యుం డొక్కరుండంత వీ
రే దిగ్విశ్రుతకీర్తి కేశవులటం ♦ చే తెంచి చెప్పె న్వెసన్. 119



మ. విని చైతన్యుఁడు గేశవార్యుఁ డిటకే ♦ విచ్చేసెనేయంచు లే
చి నయంబారఁగ నేగి మ్రొక్కులిడి వేం ♦ చేయుండి శాస్త్రజ్ఞమం
డన! మాభాగ్య మదింత యంతయని యె ♦ న్నన్జాల మీవేళ సం
చనఁగాఁ గేశవుఁడుబ్బి మధ్యమునఁ దా ♦ నాసీనుఁడయ్యెన్వడిన్. 120

వ. కూర్చుండి కేశవుండు నిమివంకఁ జూచి. 121

క. నీ వలనిమిపండితుఁడవు
గావా! బాల్యంబునందె ♦ కాంచితి వఁట వి
ద్యావిశ్రుతి; వ్యాకరణము
నావెలసెడు చిఱుతవిద్య ♦ నా! కలచి తనన్. 122

వ. అందులకు గౌరాంగుఁడు వినమిత గాత్రుండై యిట్లనియె. 123

శా. న్యాయ వ్యాకరణాది శాస్త్రములఁ బూ ♦ ర్ణఖ్యాతి నార్జించి దు
ర్జేయప్రజ్ఞ సమస్తసూరితతికి ♦ న్జేమోదుఁ దెప్పించి త
య్యా! యెట్లీడగు నీదుపాండితికి నా ♦ యల్పాక్షరజ్ఞానమే
దో యెక్కించుక స్వోదరార్తి హరణో ♦ ద్యోగుండనై నేర్చితిన్.

క. నీయట్టి కుజ్ఞవానికి
నీయడఁకువ యొప్పుఁగాని ♦ యీపురజనముల్
నీయట్టి బుద్ధిమంతుం
డేయెడ లేఁడనుచుఁ బలుక ♦ నేవింటి నిమీ! 125

క. అని కేశవపండితుఁ డపు
డన నిమి యిట్లనె మహాత్మ! ♦ యఘశోషణపా
వన సలిలాత్మికయగు గం
గను బ్రార్థనసల్పు మాదు ♦ కర్ణము లలరన్ 126

క. ఈగతిఁబల్కిన నిర్ఝర
వేగంబున వినెదువారు ♦ వెఱఁగందఁగ నా

భాగీరథిపై నొనరిచి
యాగడియనె శ్లోకశతము ♦ నాతఁడు సదివెన్. 127

చ. పలుకులతీరుఁ బండితుని ♦ వాగ్ఝరిఁగాంచుచుఁ జుట్టునున్న శి
ష్యులు బళిరా! కవీశ్వరుని ♦ చోద్యమటంచు నపారభక్తి వి
హ్వలమతులౌచు శ్రీహరిని ♦ వాకొనుచుండిరి మాటిమాటికిం
బలువురిలోన నొక్క నిమి ♦ మాత్రమ యుండెను నిశ్చలాత్ముఁడై.

క. మనగురు వీపండితునకు
నెన యెట్లగునంచు నెంచి ♦ హృదయగతంబౌ
వనటం జిక్కెను నిమియొ
ద్దను జదివెడు శిష్యవితతి ♦ దత్తఱపడుచున్. 129

వ. అంత. 130

ఉ. పండితవర్యుతో నిమి ప్ర ♦ పత్తిని "కేశవసూరి! పృథ్వి నొ
క్కండెనగాఁడు మీకు; శత ♦ కంబున నొక్కటి దీసి దానియం
దుండెడు నర్థమున్రసము ♦ నొప్పఁగఁ జెప్పుఁడు దేటతెల్లగా
దండమొనర్తుమీ" కనిన ♦ దానికి నాతఁడు పొంగి యిట్లనెన్. 131

క. శ్లోకములు నూఱు సెప్పితి
వాకొను దేనికిని మనసు ♦ పడితో యందున్
గైకొని యర్థముఁ దెల్పుచు
నీకోరికఁ దీర్తుననిన ♦ నిమి వెన్వెంటన్. 132

గీ. దీని కర్థము సెప్పుము ♦ ధీవిశాల!
యనుచు మధ్యంబునందుండు ♦ నట్టి శ్లోక
మొండు గళగళఁ జదువంగఁ ♦ బండితుండు
చేష్టలఱి చూచె నిదియేమి ♦ చిత్రమనుచు. 133



మ. శ్రమ మెంతోపడి శారదాంబ నెపుడు ♦ న్సద్భక్తిఁ బూజించి శా
స్త్రములందు న్గవిత న్విశారదుఁడనై ♦ రాజిల్లితిన్గాని యీ
క్రమము న్జూడఁగ లేదు పృథ్వినెట నా ♦ కంటె న్విశేషంబుగా
విమలంబౌమది వాణిఁబూజసలిపె ♦ న్వీఁడంచు యోజించెదన్. 134

క. అని మదిలో శంకించుచుఁ
దనయా! శ్రుతిధారివౌచుఁ ♦ దలఁచెద నిన్నే
లన మొదలుఁ దుదయుఁ గాకుం
డను నడిశ్లోకంబు వచ్చు ♦ ట గడున్వెఱఁగా. 135

వ. అనిన గౌరాంగుం డిట్లనియె. 136

ఆ. నలువరాణి కృపను ♦ నరులందుఁ గొందఱు
గవితయందుఁ బటిమ ♦ గలిగియుండ
నొక్కసారి వినిన ♦ యుక్తుల మదినూఁది
కొంద ఱవనినుండఁ ♦ గూడదయ్య? 137

క. అను పల్కులవిని కేశవుఁ
డనుమానము నిజమెయయ్యె ♦ ననుకొని గౌరాం
గుని నించుక తా గౌరవ
మును జేయఁగఁదొడఁగె భక్త ♦ పురుషుఁ డటంచున్. 138

క. నిమి వినుమని మధ్యశ్లో
కమునకు నర్థమును జెప్పి ♦ కమ్రాలంకా
రముల న్గేశవుఁ డగపటి
చి మహామోదంబుఁ గొల్పెఁ ♦ జిత్రోక్తులతోన్. 139

ఉ. అంతయు నైనపిమ్మట "మ ♦ హాత్మ! కృతార్థులమైతి మేము నీ
వింత కవిత్వధోరణిఁ, గ ♦ విత్వములోని గుణంబులెంచి మా
కెంతయు సంతసంబిడితి ♦ వింకను శ్లోకములోని దోషముల్

గొంత పరీక్ష సేయుటకుఁ ♦ గోవిదమాళి! యనుజ్ఞ యిచ్చెదే?" 140

క. అని చెలువప్పున నిమివ
ల్కినఁ దోఁకం ద్రొక్క త్రాఁచు ♦ లీల సమర్థం
బున నొడుగలచి యిపుడే
మని వదరితి వోరిబాల ♦ కా! నాయెదుటన్ 141

వ. అని కేశవుం డంతటితోఁ గసిదీఱక. 142

గీ. న్యాయ శబ్దశాస్త్రము లిట్టు ♦ లట్లు సదివి
తిక్క నలంకారశాస్త్రి మిం ♦ తేని యెఱుఁగ
విలను నిన్ననో మొన్ననో ♦ కలిగి యిట్లు
విఱ్ఱవీఁగెదె మత్తిల్లి ♦ కుఱ్ఱవాఁడ. 143

గీ. సకల వేదవేదాంగ శా ♦ స్త్రప్రకాండ
పూర్ణవేత్తల తలపైని ♦ మొట్టు నాక
విత్వమందలి గుణదోష ♦ వితతినెట్లు
నీవు సూడఁగఁగలవురా ♦ నిమికుమార! 144

వ. అని క్రోధస్వాంతుండై కేశవుండు పలుకు పలుకులకు మందస్మిత వ
దనారవిందుండై నిమి యిట్లనియె. 145

క. సూరివరా! శాస్త్రాలం
కారంబులు నేల మీఁదు ♦ కవితను నెటులోఁ
దాటిన పొరపాటులనే
నారయ నాఁగేశవుండ ♦ హా! హా! యనుచున్. 146

క. కనఁబఱుపుము దోషము నిమి
కనఁబఱుపవయేని సూరి ♦ గాఁ డితఁడంచున్
జనులకు నేఁ బ్రకటపఱుతు
నన నిమి చిత్తంబటంచు ♦ ననె నాతనితోన్. 147



మ. అని శ్లోకంబునఁ గల్గుదోషములఁ దా ♦ నైదింటినిం జూపి యే
మని చెప్పంగలవయ్య కేశవుఁడ! యీ ♦ యైదింటి సిద్ధాంతముం
బొనరింపం దగుయుక్తులన్న నవియే ♦ వొ పొందు లేశమ్ముఁ బొం
దనివాక్యంబులఁబల్కెఁ బండితుఁడు స్వ ♦ స్నంబైనయాస్యంబుతోన్

క. కళవళమునఁ దా నెదియో
పలికెను గేశవుఁడుగాని ♦ ప్రస్తుత విషయం
బులకు సరిపడమి గేలిని
జలుపంగాఁదొడఁగె నచటి ♦ జనతతి యతనిన్. 149

క. కోపముఁ దాపము లజ్జయు
దీపించి మనంబునందు ♦ ధీహృత్కలనా
టోపంబున దిగ్విజయిని
నాపండితుఁ డెచ్చె నప్పు ♦ డశ్రులవఱకున్. 150

గీ. అపుడు నిమిపొయి పండితేం ♦ ద్రా! యిటేల
విన్నఁబోయెద వింత క ♦ విత్వపటిమ
గలుగు టబ్రంబుగాదె త ♦ ప్పులకునేమి?
రెండుమూఁడున్న నవి లెక్క ♦ యుండునయ్య? 151

గీ. చాలరాతిరియయ్యెఁ గే ♦ శవుఁడ చూడు
మేగుదము మనమందఱ ♦ మింటి కిపుడు
వలసినను శాస్త్రవిషయ సం ♦ వాదమెల్లి
చేయవచ్చును నాకింక ♦ సెలవొసంగు. 152

వ. అని పల్కిన. 153

గీ. శత్రుకృతమైన దుఃఖోప ♦ శాంతి హృదయ
శల్యమై యేఁచెఁ గేశవు ♦ శవముపగిది
నాతఁడు బసకుఁజని భోజ ♦ నాదులను దొ

ఱంగి దురపిల్లెఁ గన్నీళ్లు ♦ రాలనిట్లు. 154

మ. చపలా! శారద! నిన్ను నమ్మికొని య♦శ్రాంతంబు సేవించి నీ
కృపనే కోరుచునున్న నాకిపుడు దు♦ష్కీర్తి న్బ్రసాదించితే
యపచారంబులు నీకొనర్చితినొ య♦న్యాయంబుగా నన్ను ఖే
దపడం జేసితి వొక్కబాలకునికై ♦ దాక్షిణ్య హీనాత్మికా. 155

గీ. ఇట్లు గనులెఱ్ఱవాఱగా ♦ నేడ్చి యేడ్చి
చివర కాయాసమున నిద్రఁ ♦ జెంద నొక్క
పండువెన్నెల మైచాయ ♦ పసలనెసఁగు
సకియ గలలోనఁ గేశవు ♦ నకునుదోఁచె. 156

వ. కనంబడి యాతనితో నిట్లనియె. 157

శా. ఓరీ! కేశవ! నేను శారదను ని♦న్నోడించి పెంపెక్కు నా
గౌరాంగుం డఖిలప్రపంచ పరిర♦క్షాదక్షుఁడౌ కృష్ణుఁ డె
వ్వారు న్విద్దెల మత్తిలంజనదు ని♦ర్వాణాప్తికింగాని వి
ద్యారంభంబులు శృంగభంగములకే ♦ యంచు న్విచారింపుమా!

క. చరములనచరంబుల నన
వరతము శాసించి యేలు ♦ వాఁడౌ లక్ష్మీ
వరు నెదురుకొనుటకును నా
తరమే గొంతమ్మకోర్కి ♦ తగునే నీకున్. 159

క. వనజాక్షుఁడు నిన్నోర్చుట
యును గూడం బరిభవిల్లు ♦ నొకలాభముగా
వెనువెంటనె నిమియింటికిఁ
జని పదములపైని బడుచు ♦ శరణను వత్సా! 160

వ. అను నాత్మోపాసిత యగు దేవివాక్యంబులవలనఁ బశ్చాత్తప్తుండై కేశవుం డట్లకావించెదనని నిశ్చయించుకొని మఱునాఁడు లేచి ప్రాతః



కాలకృత్యంబులు దీర్చికొని. 161

చ. వడి నిమియింటికేగి వఱు♦వాతను నాతఁడు సుప్తివీడి వ
చ్చెడుతఱిఁ దత్పదాబ్జములఁ ♦ జేతులఁదాఁకి నమస్కరించి దా
సుఁడఁ గరుణాకటాక్షు పరి♦చుంబితుఁజేయుమునన్ను స్వామి! నా
వుడు స్మితచంచలోష్ఠముల ♦ పొల్పెసఁగ న్నిమిసూచి యిట్లనెన్.

మ. కలవే యీవిపరీతకృత్యములు లో♦కంబందుఁ ద్వచ్ఛిష్య శి
ష్యులకు న్నిష్యుఁడనౌటయే యతుల భా♦గ్యోదారతన్గాంచు న
ట్టులు యోజించెదు నాపదంబులను రెం♦డుంబట్టి యిమ్మాడ్కి సే
వలుగావించెదు కేశవార్య తగునే ♦ బాలార్చ నాప్రక్రియల్. 163

ఆ. లెమ్ము పండితేంద్ర! ♦ లేచి కావలసిన
యర్థమేదియున్న ♦ నడుగు మిపుడు
మీదు కోర్కెఁదీర్చి ♦ మిమ్ముఁదన్పుట కెక్క
డైనకార్య ముఁడు ♦ నయ్య నాకు. 164

గీ. అనిన నా కేశవుఁడు దన ♦ యుపజయంబు
మొదలుకొని యంతవఱకును ♦ గదిరిసట్టి
వింతలన్నియుఁ జెప్పి పా ♦ పినగు నన్నుఁ
గృపను వీక్షించి వేగ ర ♦ క్షింపుమనియె. 165

చ. అన నిమి సత్కృపామతి ర ♦ హస్యసుబోధము లేమిచేసెనో
కనఁగను రాదుగాని వెను ♦ కంగల మత్సరమెల్ల వీడి వెం
టనె తనఘోటకద్విప ధ ♦ నంబులనన్నిటిఁ దోసిపుచ్చి యే
గెను బరిపక్వచిత్తతను ♦ గేశవుఁ డప్పుడు వీతరాగుఁడై. 166

గీ. దిగ్విజయకాంక్షవచ్చిన ♦ దృప్త పండి
తాగ్రిగణ్యుని వైభవం ♦ బంతఁదోఁచి
గోఁచిపెట్టించి వెడలంగఁ ♦ గొట్టెఁ బురము

నుండి సామాన్యుఁడే నిమి ♦ పండితుండు. 167

క. విత్త యశోవిభవంబుల
పొత్తుల నతఁ డెటకుఁ గదలి ♦ పోయెనొ జ్ఞానా
యత్తం బగుచిత్తంబున
నెత్తెఱఁగున మనెనొ పిదప ♦ నెఱుఁగఁ డెవండున్. 168

ఉ. ముద్దులు మూటగట్టునను ♦ మోమున బంగరుఁ గేరుమేననున్
విద్దెలభోజుఁడై రిపుల ♦ వీఁచమడంచుచు నోసి! చెంతనే
పొద్దుమెలంగు నీసుతుఁడు ♦ పుణ్యము నానదినీదె ధాత్రి నే
ముద్దియునీకు నద్దియగుఁ ♦ బూర్వసమార్జిత భాగ్యమందునన్. 169

క. అని యగ్గించిరి శచిఁ బుర
వనిత ల్శచియు న్బ్రిమోద ♦ వతియయ్యెను గా
ని నిమికిజోడై స్నుషయో
ర్తును గృహమున లేదటంచుఁ ♦ దొయ్యలిపొక్కున్. 170

క. కులమును గుణము న్శీలము
లలితాకారంబున తుల ♦ లావణ్యంబున్
గలముద్దుగుమ్మ నిమి పెం
డిలిగాఁగ న్గూచు టొక్క ♦ టే కొఱఁతగదా! 171

ఆ. విభుఁడు బ్రదికియున్న ♦ విశ్వరూపుండైన
నింటనిలిచియున్న ♦ నిట్లు బాలుఁ
డొంటిపోఁగువాని ♦ యోజనుండునె నేను
బడుగు బ్రతికియున్న ♦ ఫలముగలదె? 172

క. కొడుకుఁజూచినఁ జదువులఁ
బడియుండుటెకాని తన వి ♦ వాహంబునకై
తొడరం డిఁక నేపుణ్యా



త్ముఁడు వీనికిఁ బిల్లనిచ్చి ♦ ముచ్చటదీర్చున్. 173

వ. అని శచి యిట్లు నిమిపెండ్లికై రేయింబవళ్లు చింతించుచుండె. 174

గీ. ఆనవద్వీపమందు ధ ♦ నాధికుండుఁ
బండితుండును వైదిక ♦ బ్రాహ్మణుండు
నిమి తెగనుగల్గి నాతఁడు ♦ నిర్మలాత్ముఁ
డును వెలయు సనాతనమిశ్రుఁ ♦ డనునొకండు. 175

క. అతనికి విష్ణుప్రియ నా
నతనుని ముల్కి యనఁదగిన ♦ యంభోజదళా
యత నేత్రయొక్కరిత కొమ
రితగా జన్మించియెసఁగె ♦ శ్రీదేవివలెన్. 176

సీ. ఒకనాఁడు మందాకి ♦ నికి శచి సుతునితో
స్నానార్థమరుగ న ♦ చ్చటికె స్నాన
మాడంగ విష్ణుప్రి ♦ యయుఁగూడ నేతేర
గౌరాంగుఁ డామెకుఁ ♦ గనులఁబడియెఁ
జూచినంతనె నిమి ♦ సుందరరూప లా
వణ్యంబులకుఁ బర ♦ వశతఁజెంది
విష్ణుప్రియాకన్య ♦ విపుల మోహావేశ
చిత్తయై యిట్టులు ♦ చింతసేసె

ఆ. „వీనిచెట్టఁబట్టి ♦ వీని గాఢాలింగ
నములఁజిక్కి ప్రాణ ♦ నాథయనుచుఁ
జనవుతోడ నతని ♦ సయ్యాటలనుదేలు
చుంట కెవతెనోఁచె ♦ నొక్క యిలను?" 17-7

క. అని తలఁచుచు శచి గంగకు
ననుదినమును వచ్చుచుండ ♦ నామెకడకుఁ దాఁ

జని కరపద్మంబుల మో
డ్చి నమస్కృతు లాచరించి ♦ సేవకుఁ డొడఁగెన్. 178

వ. అప్పుడు. 179

చ. కలికి మెఱుఁగుమైపసయుఁ ♦ గ్రమవచోగుణరాజిఁగాంచ యీ
చిలుకలకొల్కి కోడలయి ♦ చెంగటనుండఁగఁ జూచుభాగ్య మె
ట్లలవడు నాకటంచు శచి ♦ యామెను డగ్గఱి మోహనాంగి నీ
కలవల రాజుఁబోలు మగఁ ♦ డయ్యెడుమంచు నొనర్చెదీవనల్. 180

గీ. ఇట్లు శచివల్క సిగ్గుచే ♦ నెఱ్ఱవాఱెఁ
జిగురుఁబోఁడికిఁ జెక్కిళ్లు ♦ శిరమువాంచి
మాఱువల్కఁగ లేకున్న ♦ మగువ మొగము
ప్రేమతో నెత్తి శచి ముద్దు ♦ వెట్టెనపుడు. 181

వ. ఇట్లు విష్ణుప్రియశచికిం జన్వై ప్రతిదినంబు నామెవచ్చుటకుమున్న గంగయొద్దకుం జని శచికై యెదురుసూచుచుండి యామెరాకఁ గని వికసిత వదనారవిందయై మణిఖచిత కనకవలయంబులరవళులు సెవులకు విందుఁగొల్పఁ గరపల్లవంబులుమోడ్చి నమస్కరించి శీఘ్రంబ పెండ్లికొమరితవుగమ్మను నాశీర్వాదం బెప్పటియట్ల గ్రహించి యామెదెచ్చిన వస్త్రంబులెల్ల నుదికిపెట్టి జలపూర్ణకలశంబు గొంత దూరంబువఱకు మోసి తరువాత నామెబుజంబులపై కెత్తుచుండు నిట్లుండ నొక్కనాఁ డనురాగసిక్తహృదయయై శచి విష్ణుప్రియంజూచి యిట్లనియె. 182

ఉ. అమ్మ! శిరీషపుష్ప మృదు ♦ లాంగకము ల్వసివాళ్లు సెంద నా
కిమ్మెయి నేల తోడుపడు ♦ దే! గృహకృత్యములందు భోగభా
గ్యమ్ముల పుట్టినిల్లెగద ♦ యయ్యెను నీకును బుట్టినిల్లు మీ
యమ్మయుఁ దండ్రిసూచినను ♦ నాఱడిపెట్టరె యిట్టుసేసినన్. 183



క. కోమలి నీవాగర్భ
శ్రీమతివై యిట్టిపనులు ♦ సేయుచునున్నన్
భూమిజను ల్నినునవ్వుదు
రేమో యని కొంకు నాదు ♦ హృదయము తరుణీ! 184

క. అన విష్ణుప్రియ శచిక
ల్లన నిట్లనుఁ బూజ్యురాల ♦ లక్షల్గలవా
రును నీయట్టి మహాత్ముల
కెనయే నీసేవ పుణ్య ♦ కృత్యముగాదే? 185

క. నలుగురు నవ్వుదురనియెడు
నలుకేటికి నాకు మనము ♦ నందలి వాంఛల్
పొలుపొందువృద్ధులకు సే
వలుసలిపిన నంచు నిట్టి ♦ పనులనొనర్తున్. 186

గీ. నాదు నుపచారములఁ గరు ♦ ణను గ్రహించి
చేయుమాశీస్సు నాకోర్కె ♦ సిద్ధిఁబొందఁ
బడతి! నీయింటవసియించి ♦ కుడిచి కట్టఁ
గలుగుటే కన్నియలకు భా ♦ గ్యంబుగాదె? 187

వ అని మోహగర్భితంబు లగువాక్యంబులఁ దనకు గౌరాంగునిమీఁదం గలమక్కువ చెప్పకయచెప్పి విష్ణుప్రియ యహర్నిశం బాతనిపై విరాళిం దవిలియుండె. 188

క. చిఱుతతనపుఁజేడియ నిటు
మఱులుకొనంజేసె నొక్క ♦ మాఱే దృగ్గో
చరుఁడై గౌరాంగుం డ
బ్బురమాఁగద! యాతఁ డెట్టి ♦ ప్రోడయొ జగతిన్. 189

క. ధనవంతుల మనుగర్వం

బున నాజనకుండు జనని ♦ పొందళ్కులమే
నను నొప్పనందగానిని
నను జతసేయంగ జంకి ♦ నన్నేఁచెదరే? 190

క. ధనమా! నీకివె నావం
దనములు గౌరాంగునకును ♦ నాకును మధ్యం
బునవచ్చి పెండ్లి చెడఁగొ
ట్టను జూచెదవేమొ యక్క ♦ టా! నిర్దయతన్. 191

క. పేదల యింటంబుట్టిన
నోదయితా! దీన నన్ను ♦ నోముమటంచున్
బాదంబులపైఁ బడుదును
గాదా నిమి నన్ను భార్య ♦ గాఁ గైకొనఁగన్. 192

క. ధనవంతుల గర్భంబున
జనియించితి నైననేమి? ♦ సకలకలాభి
జ్ఞునితోడ సాటియెట్లగు
దును విద్వాంసులకు నిలను ♦ దులయే ధనికుల్. 193

క. హృదయం బర్పించితి నే
నిదివఱకే నిమికి; నన్ను ♦ నితరులకీయన్
మది నూహింపకుఁడని నే
నెదురై యననెండొనర్తు ♦ రే! తలిదండ్రుల్. 194

క. డోలాందోళితమతి నిటు
బాలామణి కళవళమునఁ ♦ బల్కుచు నిమిపై
వ్రాలిన చిత్తముఁద్రిప్పన్
జాలక తలపోయునతని ♦ సౌందర్యంబున్. 195

క. గంగావగాహమును గౌ



రాంగుం డొనరించువేళ ♦ నారసితిఁగదా!
గంగాతోయము లాతని
బంగారపు మేనిమిసల ♦ భాసిలె నరుదై. 196

క. పుట్టించె నన్నుధనికఁగఁ
గట్టఁడివిధియట్టుగాక ♦ గంగాంబువుగాఁ
బుట్టించిన నిమిఁ గౌఁగిటఁ
బట్టెడు భాగ్యంబునాకుఁ ♦ బట్టునుగాదే! 197

క. తనవలె నందముగలదా
నిని గాననియేమొ మరల ♦ నిమి యీమందా
కినిచెంతఁ ద్రొక్కిచూడఁడు
కొనసాగునె భాగ్యహీన ♦ కోర్కులు జగతిన్. 198

మ. మరుఁడా! యెంతటిజోదవీవు ననుఁ గొ♦మ్మన్బట్టి వేధించుచున్
బురుషుండౌ నిమినిల్చి యుండుకడకుం ♦ బోనోపవేమయ్యొ నీ
విరితూఁపుల్మలయానిలంబులళులు ♦ స్వ్రీడావిహీనుండ! మా
యరవిందాస్యల నేఁచుమన్నఁ దెగి శౌ ♦ ర్యంబంత చూపింతువే?

క. "పూపవయసు సుందరి యీ
పాపను బాధించుటమిత ♦ పాపము నారా
రాపిడికి నిలువలేద" ని
పాపీ! తలపోసి దీని ♦ వదలఁగరాదే. 200

గీ. లక్ష్మి నీపొందుఁగాంచక ♦ లయముఁజెందెఁ
గాని నిమి! నీదుభార్యయ ♦ న్ఖ్యాతిఁగాంచె
నట్టిభాగ్యంబె నాకు నీ ♦ యంగవలదె
మత్సుకృతమింకఁ గలయిక ♦ మాటపిదప. 201

ఉ. నీపయిచేలకిచ్చెదవు ♦ నిత్యముఁ గౌఁగిలి; దానిపాటిగా

నే! పరచింత లేకెపుడు ♦ నిన్నుఁదలంచుచు నున్న నేను, నా
పాపమె? ప్రాణనాథ! నిసి ♦ స్వప్నమునందునఁ గన్నుమూసి నీ
రూపముఁగాంచి సందిటను ♦ గ్రుచ్చుట కంకిలి సేయఁగల్గుదే? 202

గీ. నిమితను స్పర్శసుఖమంత ♦ నీదెవసన
మా! మనకుఁ గల్గునెయ్యంబు ♦ మదినిదాల్చి
యెప్పుడో మంచిసమయంబు ♦ నెంచి నాదు
వృత్తమాత్మేశుతో విన్న ♦ వింపరాదె! 203

క. నిను నుదికి పిడిచి వేదన
లను బెట్టితినంచుఁ దావ ♦ లంపు బలమునన్
నను విడనాడకు కోపం
బున, నటు నేఁజేయలేదు ♦ పుట్టమ! యీర్ష్యన్. 204

ఉ. మారవికారము ల్తనదు ♦ మానసము న్వికలంబుసేయ నా
హారవిహారముల్దొఱఁగి ♦ హా! నిమి! చిత్తజరూప! యంచు నా
సారసనేత్రి యిట్టు లని ♦ శంబు విరాళినిగుంది వాడిని
స్సారసరోజకుట్మలము ♦ చందమునొందెను జూచుచుండఁగన్. 205

గీ. తండ్రి పండ్లను దెచ్చినఁ ♦ దాను వడిగ
మంచిమంచివి లేఁజేత ♦ నెంచివానిఁ
జాటుననుగొని గంగకు ♦ స్నానమాడ
వచ్చిన శచి చేతులఁబెట్టి ♦ వచ్చుఁ జెలువ. 206

సీ. పతికిఁ బచ్చనిపట్టు ♦ బట్టలు ప్రియమంచు
ధరియించునవ్వియే ♦ తానుఁగూడ
సిందూరతిలకంబు ♦ చెలువునికింపంచు
నొసట నద్దియె తాను ♦ నూలుకొల్పు
విభునకు మక్కువ ♦ విరులపైననితన



నెఱులలోఁ బూవులఁ ♦ దుఱుముకొనును
మంచిగంధముపైని ♦ మనసు నాథునకంచుఁ
దానునలందుఁ జం ♦ దనము నొడల

ఆ. నిట్లు నవ్వునంచు ♦ నట్లె తానవ్వును
నడచునిట్టులంచు ♦ నడచునట్లు
బాలవడసెను నిమి ♦ పోలిక సారూప్య
ముక్తిఁ జెందునట్టి ♦ భక్తునివలె. 207

క. తొడవులు వల్లభునకు సరి
పడవేఁ జూరఁబోవు నింటి ♦ వారివడువున
న్నడువవలెనంచుఁ గోమలి
వడివడి తనభూషలొలిచి ♦ వైవఁదొడంగున్. 208

క. చక్కని కన్నియచెలికే
చక్కని గనఁబడినదీని ♦ చక్కఁదనముకై
మక్కువపడి ప్రాణేశుఁడు
చిక్కునె నన్వదలియుంచుఁ ♦ జింతించుమదిన్. 209

క. చింతించి తనసొగసు నా
యింతిసొగసు వీనిరెంట ♦ నెక్కువయెదియో
సొంతపుటద్దమునఁ బరీ
క్షింతమటంచు చతివయటులె ♦ సేయు గృహమునన్. 210

ఉ. ఎవ్వనినైన విప్రశచి ♦ యేటికిఁబంపదు పెండ్లిమాటకీ
నెవ్వగవొంవ నాదు జన ♦ నీజనకు ల్సరియందురేమొ! వా
క్రువ్వక యట్లు వారు తమ ♦ కూఁతురు వాంఛకు వేఱొనర్తురే
నివ్విడయాసలన్వదలి ♦ యీల్గుదుఁగా నిమినిం దలంచుచున్. 211

వ. అని యిట్లు విష్ణుప్రియయనన్యాయత్తచిత్తంబున గౌరాంగునిపై

మనోజ్ఞమృదులంబగు కోడమమేను భరింపలేని మోహంబుం జెంది
వాపోవుచుండె నంత. 212

గీ. మగువచిన్నెలుసూచి యా ♦ మొగముసూచి
తొవలఱేకులవంటి కం ♦ దోయిసూచి
చక్కఁదనమును సుగుణపుం ♦ జంబుసూచి
యాత్మసుతుపైని గూఢ మో ♦ హంబుసూచి 213

గీ. ఒక్కనాఁడు శచీకాంత ♦ యొక్కవృద్ధ
విప్రవరు రాయబారిగాఁ ♦ బెండ్లిమాట
లాడ నాసనాతనమిశ్రు ♦ నంతికమున
కంపె ఫలము దైవాధీన ♦ మంచునెంచి. 214

ఆ. వీటనుండి బాలు ♦ వృత్తాంతమంతయు
వీనులలరఁ దాను ♦ వెనుకవినిన
యాతఁడౌట నాస ♦ నాతనమిశ్రుండు
మంచిదనియె పెండ్లి ♦ మాటకపుడు. 215

ఆ. వీరినాల్కనుండి ♦ వారినాలుకనుండి
నిమికిఁ బరిణయంబు ♦ నేఁడో రేపొ
యనెడు వార్తవినిన ♦ యాతనిమిత్రుల
మోములింతయయ్యె ♦ మోదమునను. 216

సీ. పట్టణంబునను సం ♦ పన్న గృహస్థుండు
గాయస్థకులజుండు ♦ ఖాన్బిరుదము
వూనిన యాతండు ♦ భూస్వాపతేయుండు
[illegible] బుద్ధిమంతుండను ♦ పురుషుఁడొకఁడు
నిమిబాలు పెండ్లివె ♦ చ్చమునెల్ల నేభరి
యింతునటంచు వ ♦ చింపఁగానె



పాఠశాలకుఁ దన ♦ ప్రార్థనాగార మి
చ్చినపురూష్వత నామ ♦ ధనికభూసు

ఆ. రుండునేను భాగ ♦ ముండెదనని పల్క
వల్లదు పేదపాఱు ♦ పరిణయంబు
పగిదిఁగాక రాచ ♦ వారిపెండ్లివలెఁ గా
వింతుననియె బుద్ధి ♦ మంతుఁ డపుడు. 217

క. పారరహిత సంతోష
పోరితులై మాదుగురువు ♦ పెండ్లియటంచున్
గౌరాంగునిశిష్యులు సం
భారములన్దెచ్చి యింట ♦ బైచిరి తోడ్తోఁ. 218

ఉ. మూరుతమేగుదేర శచి ♦ పుత్త్రుని మజ్జనమాడఁజేసి బం
గారపురంగుఁ జేలలను ♦ గట్టఁగఁజేసి యలంకరింపఁ ద
చ్చారుతరాస్యమండలము ♦ శారదపూర్ణ సుధాంశుబింబ శృం
గారముఁదాల్చి చూపఱకుఁ ♦ గన్నులపండువుసేసె నెంతయున్

మ. కలలన్జాగ్రదవస్థలందు నిమి సాం ♦ గత్యంబె కాంక్షించు నా
లలనారత్నము సంతసంబిపుడు తె ♦ ల్పంజాలు నెవ్వాఁడు ప
ల్కులఁ బద్యంబుల? ముక్తుఁడే తెలియఁగ ♦ ల్గుందానిఁగాదేనియా
చెలియై పుట్టినవాఁడెఱుంగనగు స్వా ♦ త్మీనానుభూతిప్రభన్. 220

క. తలయంటి జలకమారిచి
తలఁ దుడిచినపిదపఁ గమ్మ ♦ తావులయగరుల్
చెలికత్తెలు విష్ణుప్రియ
కులలిన్బాగవేసి రొడలు ♦ గుమగుమలాడన్ 221

ఆ. అందగానినిమిని ♦ బొందఁబోవుచునుంటి
వింక మమ్ముఁజూతు ♦ వే! లతాంగి!

యంచు మేలమాడు ♦ నించుఁబోండ్లకు మాఱు
వల్క లేక మోము ♦ వాంచెముగుద. 222

సీ. కల్యాణతిలకంబుఁ ♦ గలికికినిడెనోర్తు
బుగ్గఁ జుక్కనుబెట్టెఁ ♦ బోలఁతియోర్తు
నగలుంచె నొడలిపై ♦ నారీమణికినోర్తు
విరులఁబెన్నెఱులలోఁ ♦ జెరివెనోర్తు
బంగారుసరిగవ ♦ ల్వనుగట్టె నొక్కర్తె
పసుపుఁబారాణియుఁ ♦ బ్రామెనొకతె
కనుదమ్ములకుఁగాటు ♦ కనుబెట్టెనొక్కర్తె
మంచిగంధమలందె ♦ మైనొకర్తె

గీ. మరునిపుష్పాంబకము నాఁగ ♦ మగువనిట్లు
తీర్చి యాసోయగము సూచి ♦ తెఱవలెల్ల
మరులుకొని కన్నెచెక్కిళ్ల ♦ వరుసనంటి
ముద్దులిడి రామెనును సిగ్గు ♦ మోమునెత్తె. 223

క. పంకేరుహాక్షి ! తనప
ర్యంకమునకు నిన్ను రమ్మ ♦ టంచు న్నాచే
శంకింపక నిమిముద్దుల
నుంకువగాఁ బంపవాని ♦ నొసఁగితిమిచటన్. 224

క. అని వదినె వావివరుసలఁ
దనరెడు చిగురాకుఁబోండ్లు ♦ తనునవ్విన నె
ఱ్ఱని మోవిఁ జిందులాడెడు
గొనబగు లేనవ్వులొలయఁ ♦ గోమలియొప్పెన్. 225

గీ. ఇట్టి విష్ణుప్రియాకన్య ♦ నెలమిఁ దనదు
నూరుతలమున మిశ్రుండు ♦ గూరుచుండఁ



బెట్టికొని నిమిపదములఁ ♦ బట్టి కడిగి
పట్టి నాతనిచేతిలోఁ ♦ బెట్టెనపుడు. 226

క. నారీమణి గౌరాంగుఁడు
నారయు సభ్యతతికనుల ♦ కగపడిరి మహో
దారులిటు భువికి లక్ష్మీ
నారాయణు లేగుదెంచి ♦ నారాయనఁగన్. 227

మ. కనులార న్నిమినాథుఁ జూడఁగదె నీ ♦ కన్రెప్పల న్విప్పి యం
చను మోహంబొకవంక, నీమగనియా ♦ స్యం బిప్పుడే చూతువే
కనకాంగీ జనులెందఱో యెదుటఁ బ్ర ♦ క్కన్నిల్చియుండంగ నం
చను వ్రీడాభర మొక్కవంక నలక ♦ న్యన్లాగి యూఁగింపఁగన్.

వ. పురోహితు లప్పుడు విధిప్రకారంబు నూత్నవధూవరు లన్యోన్యావలోకనంబు సేసికొనవలయునని నుడివి సిగ్గునకు సిగ్గుఁదెప్పించి వలపునకు విజయంబొసంగిరంత నిరభ్యంతరంబుగ దంపతులకుఁ బరస్పర వీక్షణానందంబు నొసంగుటకై వారిచుట్టు నించుకసే పొక్కతెరఁగట్టి వేదమంత్రంబులు సదువుచుండి రప్పుడు. 229

మ. నిమిచూపు ల్తరుణీవిలోకనము లెం ♦ తేఁ గూర్మిసంధిల్లి లో
కమునం దిర్వురుఁగూడి యేకమయి సౌ ♦ ఖ్యంబందుఁ డింకంచువా
రి మహామోహగుణానుబంధములఁ గూ ♦ ర్చెన్గట్టిగా నంతమం
త్రములాఁగెన్ దెరవ్రాలెఁ జూపు మెఱపు ♦ ల్దాల్చెన్వినమ్రత్వమున్.

ఆ. పెండ్లియయ్యె నిమికి ♦ విష్ణుప్రియయు నత్త
వారి యింటికరిగె ♦ సారెతోడ
శచికిఁ గ్రొత్తయోర్పు ♦ శక్తియు వచ్చెను
ముద్దుఁగోడలు గృహ ♦ మునకు రాఁగ. 231

క. విత్తముతోఁ దనుజనకుఁడు

పుత్తెంచిన నేగుదెంచి ♦ పూర్ణప్రేమన్
బిత్తరి యత్తకుఁ బతికిన్
జిత్తములలరంగ నెపుడు ♦ సేవల్సేయున్. 232

శా. బీదల్సాదులు యోగులింటికడకు ♦ న్వేంచేయఁ దానత్తకున్
జేదోడై యతిభక్తితోఁ బచనమై ♦ చిత్ప్రియంబు గాన్పింప భ
క్ష్యాదుల్ప్రచ్చురఁజేసి-వడ్డనలచే ♦ నాతిథ్యసత్కారస
మ్మోదంబుల్ప్రచరింప వారిదుదురం ♦ భోజాక్షికి న్దీవనల్. 233

క. క్రొత్తదియని పెద్దదియని
యొత్తుడుపనిఁ దగులనీయ ♦ రొండొరులకు వా
రత్తకునుం గోడలికిని
బొత్తొనగూడుటది యెంత ♦ పుణ్యంబింటన్. 234

అందము, సర్వశాస్త్రముల ♦ యందు నిరర్గళమైన ప్రజ్ఞయున్,
డెందమునందు శాంతి, మహ ♦ నీయమనోహరలక్షణోత్కరం
బిందిరవేణిపత్ని, గణు ♦ తింపఁగరానియశంబుఁ, గల్గి చె
న్నొందెడు భాగ్యశాలి నిమి ♦ కొడ్లనయే తలపోయ నిమ్మహిన్. 235

సీ. బంగారుఫలకంబు ♦ వలెనుండె ఫాలంబు
వెడఁదలై సోగలై ♦ వెలసెఁగనులు
బొమలు నీలపువిండ్ల ♦ పోలికనలరారె
నలువున దీర్ఘమై ♦ చెలఁగెఁగురులు
జానులవఱకుండె ♦ జాళువాసేతులు
వీపుపొన్నరఁటాకు ♦ బెడఁగుఁజూపె
నురము శ్రీదేవికి ♦ నునికిపట్టైయొప్పె
నడుము శూన్యాంగమై ♦ బడలియుండె

గీ. నిట్టిసొబగులకుప్పయై ♦ పట్టువల్వ



వల్లెవాటుగ వైచి యా ♦ పట్టణమునఁ
దిరుగుచును నిమి నవపుష్ప ♦ శరునిపోల్కి
మోదమునొసంగెఁ దనుఁజూచు ♦ పురజనులకు. 236

ఉ. అప్రతిమానరూపు నిమి ♦ నారయుచేడెలు వానిమంగళాం
గప్రభ దివ్యసుందర వి ♦ కాసమున న్విమలానురాగ భ
క్తిప్రమదాత్మలౌదు; రొక ♦ తేనియుఁ బొందదు వంతలోన వి
ష్ణుప్రియయేల యీతనికి ♦ సుందరియయ్యె నటంచు నీసునన్. 237

శా. కంటంజూచుటకో కళావిదుఁడౌ ♦ గౌరాంగుతోఁగూడి తా
రుంటంగోరియొ మూఁకగట్టి జనము ♦ ల్సోల్లాసచిత్తంబుతో
నింటంజేరుదు; రాతఁ డిల్వదలి యొం ♦ డేనేగ వారందఱున్
వెంటంబోవుదు రంచుచే నిమియొకం ♦ డేయుంటలేదెప్పుడున్. 238

చ. జనులకు నేత్రపర్వమిటు ♦ సల్పుచు నానిమి ప్రోవనోర్వలే
మిని రిపులైనవారదిగొ ♦ మిత్రులతోఁ బరివారవారముల్
వెనుకొనిరాఁగ రాజువలెఁ ♦ బెల్లున వీధిని బోవుచున్నవాఁ
డని నిమివైపు వ్రేళ్లనిడి ♦ హాస్యమొనర్తురు తుచ్ఛబుద్ధులై. 239

చ. సరకులవిత్తమంచు నిమి ♦ సాగి బజారునకొక్కనాఁడు నె
య్యురఁగొనిపోవుచుండ నొకఁ ♦ డోనిమి! పట్టుకరావు డబ్బు నె
వ్వరు సరకిత్తురయ్య! యనఁ ♦ బ్రస్తుతమందున నాకు నింటిద
గ్గఱఁ గనరాదు విత్తమనఁ ♦ గా నతఁడప్పునఁదీయుదేయనన్. 240

క. అరువునకును మాకోసఖ?
సరిపడదది నీతిగాదు ♦ సరసోక్తులనో
పరిహాసములనొ విప్రుల
వెరవుఁగొనుచు నీవనలనొ ♦ విలిచెదసరకుల్." 241

క. అని కిలకిలనవ్వుచు నిమి

దనమిత్త్రినివీవుచేతఁ ♦ దట్టుచు వేర
మ్మనిచని బజారునకుఁ దెం
పున నొకబట్టలదుకాణ ♦ మును జొచ్చేవడిన్. 242

చ. పనివడివచ్చినట్లు నిమి ♦ వర్తకుఁడా! యొకమంచిచీరఁ దె
మ్మన వెలగల్గుకొంబెడఁగు ♦ టంబరమొక్కటిదెచ్చి యాతఁడి
చ్చిన నది చూచిచూచిబళి! ♦ చేతను విత్తములేదుగాని చె
ప్పినవెల వీనికిచ్చికొన ♦ వేడుకవుట్టెడు దీనిఁజూచినన్. 243

క. అనినిమి మిత్రులతోఁ జె
ప్పినయట్టులు వర్తకుండు ♦ వినవలెనని ప
ల్కినవాతం డరువునకుం
గొనవచ్చునటన్న వర్త ♦ కున కిట్లనియెన్. 244

క. అరువున కెన్నండేనిన్
సరకులఁ గొనఁగూడదంచు ♦ సమయంబొం డీ
వఱకేను జేసికొంటిని
మఱచుట శపథంబు నీతి ♦ మంతులకగునే? 245

మ. అనుమాటల్విని వర్తకుండెటులు వ ♦ స్త్రార్థంబుఁ గోల్పోదు నీ
తనికీచేలము నూరకేయొసఁగి చి ♦ త్తంబొప్పదే యట్లు సే
యునటం చించుకకొంకి యాతని మనో ♦ జ్ఞాకారముంగాంచు వెం
టనె విత్తేచ్ఛ యడంగిపోవ నిమితో ♦ డంబల్కె వాఁ డిమ్మెయిన్.

ఆ. కోమలాంగ! నీకుఁ ♦ గోర్కి యీచీరపై
నెంతగలదొ యెఱుఁగ ♦ నిపుడు నిన్ను
నూరకేగుమనుట ♦ కొల్లదు చిత్తంబు.
దీవనలనొసంగి ♦ దీనిఁగొనుము 247

క. అని కోకను నిమిహస్తం



బునననిడి జోహారుసేయ ♦ మునిమునిసినగవుల్
మొనకొనఁ గుబేరుఁడవు గ
మ్మని యతఁ డాశీర్వదించి ♦ యరిగె సఖులతోన్. 248

సీ. పార్వణచంద్ర ప్ర ♦ భాభాసితంబైన
చొక్కపునెమ్మోముఁ ♦ జూచి యొకఁడు
నధరరక్త ప్రవా ♦ ళాంచితస్మిత చంద్రి
కాప్రసారంబులఁ ♦ గాంచియొకఁడు
ముక్కుసంపెఁగక్రింద ♦ నెక్కొని తులకించు
నూనూఁగుమీసాల ♦ ను గనియొకఁడు
నవరసామోద జ ♦ నకపాండితీపుష్ట
విద్యాప్రసంగము ♦ ల్వినియొకండు



గీ. మోహపడి నిమిచూపులె ♦ ముదలగాఁగ
విలువగలవస్తువులను జే ♦ తులనుబెట్టి
యొకనమస్కృతిఁ జేయుదు ♦ రొక్కఁడేని
యనఁడు వెలనిచ్చిపొమ్మని ♦ యతనితోడ. 249

ఉ. అంగడివీధిఁ దానుగని ♦ నట్టి యమూల్యపదార్థరాసు లి
బ్భంగివెసంగ్రహించి పిద ♦ ప న్నిమి పెక్కుగుణంబులొ వెలన్
సంగడికాండ్రచేతను బ ♦ జారునకంపె వణిగ్జనాళికిన్
యంగ, విలాసమాత్రముగ ♦ దా! నిమికీ విపరీతకృత్యముల్. 250

క. గౌరాంగుఁడు విపణీస్థలి
నారీతి సపర్యలంది ♦ యరిగెడు వేళన్
జేరంజనె శ్రీధరుఁడను
పాఱుం డాపణమునిడిన ♦ వాకిటికడకున్. 251

మ. హరిభక్తుండును వైష్ణవుండునయి దై ♦ న్యాంభోధిలోమున్గి పే

దటికం బేఁచఁ గృశించి తానొకనిష ♦ ద్యన్నెట్టుక ద్దానిలో
నరఁటాకులొ్మకలైన వస్తువులు ని ♦ త్యంబమ్మి జీవించు శ్రీ
ధరునింగేలియొనర్పనేగ నిమి మి ♦ త్రశ్రేణి వెన్నాడిరాన్. 252

గీ. శ్రీధరుం డదిగాంచి యో ♦ చిన్నవాఁడ
నేను నిఱుపేద నన్ను మ ♦ న్నించి మఱొక
దెసకుఁ జనుమయ్య నన్ను బా ♦ ధింపకయ్య
కడుపు కక్కుఱితిని నుంటిఁ ♦ గావుమయ్య. 253

మ. అన దీనోక్తులనాలకించి నిమిక ♦ ట్టా! యిట్టులావస్తువు
ల్గొనవే తెచ్చినవారిఁ జూచెదవు నీ ♦ కుంజెల్లునే యిట్టి వ
ర్తనము ల్చెడ్డవివస్తువుల్వేలయు దీ ♦ ర్ణంబంచు నండ్రిందత్రై
నను నేబట్టుకపోవువానివెల యం ♦ తన్నీకు నేనిచ్చెదన్. 254

వ. అని పల్కిన నమాయికుం డగుశ్రీధరుండు వెఱంగుపడి యిట్లనియె.

ఉ. చెడ్డవిగావు వస్తువులు ♦ సేయనియర్ఘముఁ జెప్పలేదు న
న్నొడ్డులువెట్టెదేల నిమి! ♦ చూడు మసత్యములాడ కెప్పుడున్
బిడ్డలు యోగ్యులౌమరిలఁ ♦ బెర్గుకొలందిని నీమపట్టునన్
దొడ్డతనంబు రాదుగద ♦ ధూర్తుఁడ! యెంతవయస్సు వచ్చినన్.

క. అన విని గౌరాంగుఁడు గం
గను బూజలఁదన్పదీవు ♦ గంగానదికిన్
జనకుఁడనగు నాయడుగుల
కును మ్రొక్కవు శ్రీధరా! త ♦ గునె యీనడతల్. 257

వ. అని పల్కిన జగత్పావని యగుమందాకినిం దూలవుచ్చు నిమివా
క్యంబు లాలించి. 258

క. హరిహరి! యని కర్ణంబులఁ
గరాంగుళులఁజొన్పి నీవు ♦ గంగామాతన్



బరికించియైన నుడుగవు
కొఱగాని కుభాషణములఁ ♦ గుఱ్ఱాయనుచున్. 259

గీ. పట్టరానట్టి దుఃఖంబుఁ ♦ గట్టలుకయుఁ
జెంది రాపడినిలిచెను ♦ శ్రీధరుండు
గాని కొన్నాళ్లకితఁడె య ♦ క్కజముగాను
జేరె భక్తిని గౌరాంగు ♦ శిష్యులందు. 260

క. మలినం బగుకనకం బిం
గలమునఁబడి శుద్ధిసేయు ♦ కర్మకరునియ
ట్టులె కష్టములిడి మలినా
త్మల శుద్ధాత్ములఁగఁజేసె ♦ దవుగా రామా! 261

శ్రీరస్తు.

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః

# శ్రీ గౌరాంగచరిత్రము.

## పంచమాశ్వాసము.

చ. అమలుఁడ, వహ్నితత్త్వముల ♦ కాదివి, పూర్ణుఁడ వెల్లకర్మమం
త్రములనుదాఁటి తేజరిలు ♦ దైవమవయ్యు సమస్తకర్మముల్
క్రమముగఁజల్పి మంత్రములఁ ♦ గైకొనుటంతయు లోకసంగ్రహా
ర్థముగద దేవదేవ! రఘు ♦ రామ! దయామయ! దీనబాంధవా! 1

సీ. గర్వకాపట్య వి ♦ కారమొందని చిత్త
మార్యసన్నుతమహౌ ♦ దార్యగుణము
భూతదయాళుత్వ ♦ మును ధీవికాసంబు
నిర్దోష సరసపాం ♦ డిత్యగరిమ
జనవశీకరణ మో ♦ హనశరంబై యొప్పు
తళ్కుబంగారు టం ♦ దంపుమేను
నిత్యమోదంబుతో ♦ నిండియుండును మనం
బంచు సాటించు స్మే ♦ రాననంబుఁ
గీ. దాల్చి పలువురు నెయ్యురఁ ♦ దుష్టిపఱచెఁ
గాని యిప్పుడు శత్రులౌ ♦ కాపురుషుల



శుద్ధచిత్తులఁగాఁజేసి ♦ సుహృదులుగ నొ
నర్చి నిమికడ శాకర్ష ♦ ణంబుచేసె. 2

క. ఇరువదిమూఁడేండ్లవయ
స్సురుదెంచె నతనికి నిప్పు ♦ డంతట నొకనాఁ
డరిగి నిమి భక్తిముకుళిత
కరపద్మములలరఁ దల్లి ♦ కడ నిట్లనియెన్. 3

గీ. అమ్మ! గయకేగి శ్రాద్ధక ♦ ర్మమ్మొనర్చి
తనువునకుఁ గారణంబైన ♦ తండ్రిఋణముఁ
దీర్చికొందును గావున ♦ దీవనలను
జేసి నన్నచ్చటికిఁ బంపు ♦ శీఘ్రముగను. 4

చ. అన శచి, పుత్ర! నిన్విడిచి ♦ యర్ధనిమేషము నిల్వలేని దా
నను గయకేగుదన్న నెటు ♦ నామదినిల్పుదునాఁ, బితౄణమో
చనమునకుం గడంగునను ♦ సంకెలలంటిన వానియట్టు లిం
టను బడియుండుమంటి తగు ♦ నా! జననీ తలపోసిచూడుమా! 5

క. అను పల్కులవిని శచియా
తనికి న్మార్వల్కలేక ♦ తనయా! నీచె
ప్పినయట్ల సేయనిచ్చెదఁ
జని క్రమ్మఱవత్తువేని ♦ చయ్యనఁ బురికిన్. 6

వ. అనిచెప్పిన గౌరాంగుండు వల్లెయనియె నాకాలంబున నవద్వీపంబు
నుండి గయాప్రయాణంబు రమారమి యొక్కమాసంబు పట్టెడున
ది. అది కడుదుర్ఘటంబు నతిప్రయాసకరంబునైనను బెక్కండ్రిత
నితో యాత్రకేగ నియ్యకొనిరి. వారిలో గౌరాంగ మాతృష్వస్ప
పతియగు చంద్రశేఖరుండను నాతండుం గలఁడు. 7

గీ. భాద్రపదమాసమందున ♦ బయలుదేఱి

యందఱురుగుచు యాత్రకు ♦ నధ్వజనిత
మైన దేహశ్రమంబంత ♦ నపనయింప
నడుమ సాగిరి సత్కథ ♦ ల్నుడువుకొనుచు. 8

గీ. సాగి యేగినకొలఁది వి ♦ శ్వంభరుండు
తొంటి నవ్వులు మాటలు ♦ దొఱఁగి యొక్క
వింతమౌనంబు గంభీర ♦ శాంతవృత్తి
దాల్చి పథికులనివ్వెఱఁ ♦ దగులఁజేసె. 9

చ. నడుమ మనుమందరంబనెడు ♦ నామముగల్గు పురంబుడాసి పో
యెడుతఱిఁ బెల్లుగన్దవిలి ♦ యేఁచె నిమిన్ జ్వర, మంత మేము సే
సెడునది యేమటంచతని ♦ స్నేహితులందఱుఁ గుంది యాడ్గిలం
బడి; రయినన్గ్రమంబుగను ♦ బాగుపడెన్ జ్వరరుగ్ణకాయమున్. 10

వ. కాని తజ్జ్వరస్పృష్టుండై నదిమొదలు. 11

క. పరవశత, పరధ్యానము
పొరయుచు నిమి మౌనముద్రిఁ ♦ బూనెను నడలన్
దెరువున నయ్యెనుమందము
లెఱుఁగరు కారణము వీని ♦ కెద్దియొ యెవరున్. 12

గీ. ఇట్లు సనిసని కాంచి ర ♦ హేంద్రశాయి
కాటపల్లై నపూతగ ♦ యాపురంబుఁ
బురముఁగను వెంట దేహ ము ♦ ప్పొంగె నిమికి
నంతఁ గ్రైమోడ్పులొనరించె ♦ నతఁడు భక్తి. 13

గీ. గయఁ బ్రవేశించి నిమి పితృ ♦ కర్మములను
జేసె నన్నిటిఁగాని యా ♦ చేయునట్టి
కర్మములయందు మనము ల ♦ గ్నంబుగాదు
వేఱుచింతను బడియున్న ♦ కారణమున. 14



మ. గయలో నంచితశాస్త్రచోదిత మహా ♦ కర్మంబుల న్పైతృక
క్రియలన్జల్పి గదా ధరాలయములోఁ ♦ గృష్ణాంఘ్రి శుభ్రాంబుజ
ద్వయముఞ్జూడఁగనేగి యానిమియట ♦ న్భక్తిప్రపత్త్యర్చనా
ప్రియులై విష్ణుభజించు నుత్తమజన ♦ శ్రేణిన్గనె న్వేడ్కతోన్. 15

సీ. పద్మాసనస్థుఁడై ♦ పంచామృతస్నాన
మొక్కఁడనర్పించు ♦ చుండెనొకఁడు
పూలఁజేతులఁగొని ♦ పులకితాంగంబుతో
నుబ్బిపూజించుచు ♦ నుండెనొకఁడు
కమ్మనికర్పూర ♦ ఖండముల్వెలిగించి
నిండుహారతులిచ్చు ♦ చుండెనొకఁడు
హరిహరీయనుచు సా ♦ ష్టాంగప్రణామంబు
లుర్విపైఁ గావించు ♦ చుండెనొకఁడు

గీ. శ్వాసములఁగట్టి నయనము ♦ ల్వాల్చియొకఁడు
ధ్యానమొనరించుచుండెఁ జి ♦ త్తాబ్జమందె
యిట్లు కన్నులవైకుంఠ ♦ మట్లవెలయు
నాలయంబునుజొచ్చె గౌ ♦ రాంగుఁడపుడు. 16

గీ. భక్తిసమ్మోదజనక స ♦ ప్రణవనాద
వేదమంత్రప్రకాండము ♦ ల్విప్రవర్యు
లాలయంబంత మాఱు మ్రో ♦ యంగనెలుఁగు
లెత్తి చదువుచునుండిరి ♦ హృద్యముగను. 17

క. ఈరీతి నున్నయెడకున్
గౌరాంగుండేగఁగానె ♦ కాంచనదీప్తిన్
గేరెడు సుందరవిగ్రహ
మారసి యాభక్తులెల్ల ♦ స్వాంతములందున్. 18

సీ. విష్ణుపాదంబులీ ♦ వేళ దర్శింపఁగా
దివినుండివచ్చిన ♦ దివిజపతియొ
భక్తులమమురాగ ♦ సక్తులఁగాఁజేయ
నరుదెంచినట్టి సాం ♦ గాంగజుండొ
సకలజనావనో ♦ త్సుకతనిట్లవతరిం
చిన దివ్య తేజ స్వి ♦ సిద్ధవరుఁడొ
యటుగాక మాయొజ్జ ♦ లాలించి సాక్షాత్క
రించి ప్రేమాలనునిల్చు ♦ శ్రీవిభుండొ
గీ. కాని కల్గునె యొల్లకీ ♦ గరగరికయ
టంచు నాశ్చర్యపడుచు గౌరాంగుఁడుండు
దెసకు ఱెప్పలుమూయక ♦ దృష్టిఁబఱపి
యరయుచుండిరి మోదవి ♦ హ్వలతఁజెంది. 19

మ. నిమియో యాలయసంప్రవిష్టుఁడయి వా ♦ నిస్వాని వీక్షింపక
ల్లమహాతేజముఁ గ్రిక్కు ముద్దుటడుగు ♦ ల్గాంచంగ వాంఛించి సం
భ్రమమేపారఁగనేగి పద్మనిభ నే ♦ త్రద్వంద్వమావిష్ణు పా
దములన్గీల్కొనఁజేసి యట్టైనిలిచెన్ ♦ ధ్యానాత్తచిత్తంబుతోన్. 20

చ. నిగిడినచూపుఁ ద్రిప్పఁగను ♦ నేరక యిట్టులుగొంతసేపు చూ
డఁగనిమి, వానికన్నులను ♦ డాసె నొకించుక చెమ్మయంతఁ బె
ల్లుగగుమిగూడె బాష్పములు ♦ లోఁగక; పిమ్మటనవ్వి గన్నులన్
డిగి ప్రవహించెవాహినుల ♦ తేవనుసంతతధారగట్టుచున్. 21

మ. విమలాబ్జాయత నేత్రియుగ్మమున నా ♦ విర్భావముంజెంది, గం
డములన్ధారలువాఱె, యాపిదపఁ గం ♦ ఠంబంటి, వేడిగ్గి, తో
రములై యొమ్మున రెండుప్రక్కలను బ ♦ ర్వంజొచ్చి, యానందబా
ష్పము లార్ద్రింబులఁజేసెఁ బుట్టమును దే ♦ వస్థానమొక్కుమ్మడిన్.



గీ. ఇట్టి సంతోషబాష్పంబు ♦ లుట్టిపడెడు
తఱి నిమి సొబగులేశమ్ముఁ ♦ దఱఁగిపోదు
కాయమధరంబుమాత్రము ♦ కదలఁజొచ్చెఁ
దంబుఱను మీటనూఁగాడు ♦ తంతులవలె. 23

చ. జవజవలాడుకాళ్లఁగని ♦ భూస్థలిపైఁబడిపోవు భక్తపుం
గవుఁడని యందఱు న్నిమిని ♦ గాఁగిటఁ బట్టఁగనేగిరైనఁ గ
న్గవ మిఱుమిట్లుగొల్పు తను ♦ కాంతులనారసి సాహసించి చే
రువ కరుగంగఁజాలక పి ♦ ఱుందనునిల్చిరి భీతచిత్తులై. 24

వ. అప్పు డీశ్వరపురి దేవదర్శనార్థమై యాలయంబుసొచ్చి యీ తెఱంగంతఁ బరికించి భక్తిపారవశ్యంబున నిలువలేక నేలపైవ్రాలనున్న నిమిదేహంబును ధన్యంబు లగుతనహస్తంబులం బిగియఁబట్టినఁదోడనె స్మృతింబొరసి ప్రమోదాశ్రుపూరితంబు లగునయనంబుల నతని నవలోకించి. 25

ఉ. ధన్యుఁడనైతి నేఁడిచటఁ ♦ దావుపవిత్రము నీవు భక్తస
న్మాన్యుఁడ వేగుదేరఁగ స ♦ మస్తముఁ బూతతరత్వమందె నే
నన్యముఁగోర మత్కృతము ♦ లైనయఘంబులఁ బాపుమంచుఁ జై
తన్యుఁడు దీనవాక్యములఁ ♦ దాపసువేఁడి నమస్కరించుచున్. 26

క. కనులిప్పుడె నేఁదెఱచితి
ననఘా! నీవేనియిచట ♦ ధ్యానంబుననుం
డిన సుకృతులలో నెవరే
ని ననుఁ రక్షించు పుణ్య ♦ నియతిన్గొనరే? 27

గీ. ఐహికవిషయ పంకమం ♦ దడఁగినేను
జేయఁగూడని కార్యము ♦ ల్సేసినాఁడ
నార్తరక్షణమునకు నీ ♦ యట్టిభక్తు

శేకదా సాధనములు స ♦ ర్వేశ్వరునకు. 28

ఉ. ఈధరఁ బూరుషార్థమన ♦ నెద్దియొ నాకు నెఱుంగనయ్యె నో
సాధువరా! ననున్ననుమి ♦ జాగునకోర్వను జిన్నికృష్ణుపై
రాధికసూపినట్టి యను ♦ రాగ మొకించుక నాకుఁ దెచ్చి నా
యాధినిమాన్పి బ్రోవుమ ద ♦ యామయ! నీకు జోహారుసేసెదన్.

వ. అను విపరీతవాక్యంబులకు విస్మయంపడి యీశ్వరపురిభక్తి విసమి
తగాత్రుండై యేకీకృతకరద్వయుండై స్వర్ణవిగ్రహంబుంబోలె నిలి
చియున్న గౌరాంగునెదుటంబడి యిట్లనియె. 30

గీ. నిను నవద్వీపమందుఁ గాం ♦ చినదిమొదలు
నీవె నాహృదయంబున ♦ నెలవుకొంటి
రాధయును గృష్ణుఁడును మదా ♦ రాధితులయి
నను దలఁచినప్పు డీవె నా ♦ కనులఁబడెదు. 31

చ. పుడమి సమస్తమున్గృపను ♦ బ్రోవఁగఁ బుట్టినవాఁడవీవు నే
జడుఁడను బెద్దసేయుదువె ♦ సాధువునంచిటు నన్ను మోహనాం
గుఁడ! జనరక్షణార్థము స ♦ ఖుండనుగాన నిమిత్తకారణా
ర్థుఁడననితోఁచెనేఁ బనుపు ♦ మొప్పినసేవకు నేను దాసుఁడన్. 32

గీ. వర్ణభేదంబె కాని యో ♦ పరమపురుష!
నీవు కృష్ణుఁడవును గృష్ణుఁ ♦ డీవుఁజుమ్మి
యతఁడు కృష్ణాంగుఁ డీవు గౌ ♦ రాంగుఁడవును
నేనెఱుంగుదు నీగుట్టు ♦ నిర్మలాత్మ! 33

ఆ. ఇటులునుడివినట్టి ♦ యీశ్వరునకు మాఱు
వల్కకుండ నిమి ప్రి ♦ పత్తివదలి
బసకుఁజనియె నచటి ♦ భక్తులుఁగూడను
జనిరి వారివారి ♦ సదనములకు. 34



క. ఆయీశ్వరపురిమాత్రము
పాయఁగలేక నిమి నతని ♦ బసకున్వెంటన్
బోయియట వంటసల్పెడు
నాయతనయునాబ్జుఁగనియె ♦ నాగౌరాంగున్. 35

మ. కని నాపుణ్య మదింతయంతయని వ ♦ ర్ణింపలే నాఁకటన్
జనుదేర న్భుజియింప సిద్ధమయి లె ♦ స్సన్వండఁగాఁ బడ్డయో
దనభాగ్యం బెదురయ్యెనంచుఁ జతుర ♦ త్వాఁబొప్ప నాసాధువా
డిన లేలెమ్మిది స్వీకరింపుమని వేఁ ♦ డెన్వాని గౌరాంగుఁడున్. 36

క. ఓవిమలుఁడ నేఁడినిన్
నీవెటులఁగదనుబాప ♦ నేర్తునిన నతం,
డేవండుకొనెద మరల
న్నీవిది భుజియింపుమనియె ♦ నిమి యీశ్వరుతోన్. 37

క. అనఁ బురియీఁకలి నీవు
న్గొనియుండఁగ వచ్చునేను ♦ గుడువననఁగ న
ట్లనఁగూడదు తిని మఱిపో
మ్మని నిమి యాతనికి బల్మి ♦ నన్నము వెట్టెన్. 38

వ. వారిట్లన్యోన్య ప్రేమానుబద్ధులైయుండ నొక్క సుముహూర్తం
బునఁ గపట మానుషవేషధారి యగుగౌరాంగుం డీశ్వరపురివలన
మంత్రోపదేశంబు వడసె. 39

చ. పనివడి సన్ను బోధపఱు ♦ పన్నియమించె జగద్విభుండు నా
దనఁ జనదంచు నీశ్వరుఁడ ♦ జాదిసురర్షభులం దరింపఁగా
నొనరుపఁజాలు వేలుపున ♦ కొయ్యనఁజెప్పెను గోపికాప్రియా
యనమయటన్న మంత్రవర ♦ మందలియర్థముఁ గర్ణమందునన్. 40

చ. పురియిటు మంత్రిరాజమును ♦ బోధమొనర్చిన వెంట నిర్వురున్

గరములబిగ్గ నొండొరులఁ ♦ గౌఁగిటఁబట్టికొనంగ మోదసం
భరిత హృదంతరాళగత ♦ బాష్పతరంగిణులుబ్బి యక్షిగ
హ్వరములనుండి శీతలజ ♦ లాపగలై స్రవియించెఁ జెక్కులన్. 41

ఆ. పోయె ధైర్య మొరులు ♦ పొడగాంచఁగారాని
చింత యొండుచిత్త ♦ సీమనంటె
ధ్యాన మొక్కచోటఁ ♦ దనువొక్కచోటను
బెట్టు నిమియదొక్క ♦ విధముగాను. 42

సీ. వాడినపద్మంబు ♦ వలె వ్రాల్చు నెమ్మోము
వెఱ్ఱిచూపులుసూచు ♦ వినఁడుమాట
వినినఁ జొప్పడనిరీ ♦ తిని బల్కుఁబల్కని
మీలిత నయనుఁడై ♦ మిన్నకుండుఁ
గరములుసాఁచి యా ♦ కసమువంకకుఁ జూచు
నుర్వి కెవ్వఁడొవచ్చు ♦ చున్నమాడ్కి
నెదురుసూచెడునాతఁ ♦ డేతెంచినట్టులా
నంద చంద్రికముఖ ♦ మందుఁదాల్చు

ఆ. నుడియుడి యేడ్చు ♦ నూరక ; తనలోన
గొణఁగుకొనును లోని ♦ గుట్టుడాఁచు
నెయ్యుఁ డెవ్వఁడైన ♦ నిమి ! యిది యేమన్న
సిగ్గుపడు నతండు ♦ చేడెపగిది. 43

వ. ఇట్లుండ నొక్కనాఁడు. 44

గీ. ఎచటనున్నావురా ! తండ్రి ! ♦ కృష్ణ ! యనెడు
నార్తరవమును విని యొకం ♦ డచటికేగి
భూమిపై వ్రాలి మూర్ఛను ♦ బొందినట్టు
లున్న గౌరాంగుఁ బొడగాంచి ♦ యుమ్మలించి. 45



ఆ. ఓర్పుతోడఁ జేరి ♦ యుచితోపచారముల్
సేసి నిమికి మరల ♦ స్మృతినిదెచ్చెఁ
గాని కూరుచుండఁ ♦ గాలేక యాతఁడు
స్సంచు దుఃఖపడి వ ♦ చించెనిట్లు. 46

ఆ. ఓయి కన్నతండ్రి! ♦ యోకృష్ణ! నినుఁబాసి
యింతదనుక నెట్లొ ♦ యేబ్రదికితి
నింక నిలువఁజాల ♦ నెచ్చట డాఁగక
నీదు బిడ్డయుసురు ♦ నిలుపుమయ్య. 47

క. అని మరల న్మూర్ఛిల్లినఁ
గను నెయ్యురు దేర్చిరతనిఁ ♦ గ్రమ్మఱనంతన్
గనువిచ్చి యశ్రులొలుకుచు
వనట న్నిమిదొంటిమాడ్కి ♦ వాచఱచెను దాన్. 48

ఆ. నాథ ! దేవదేవ ! ♦ నాతండ్రి ! నీవుండ
నట్టిధరణివట్టి ♦ యడవి, గొడ్డు
నేలయును, నెడారి, ♦ నీరంధ్రతమమును,
లేనిచోటు నీవు ♦ లేనిచోటు. 49

వ. అని బాష్పంబులం దొప్పదోఁగుకన్నులతో విన్నఁబోయిన వదనంబుతో వాపోవు గౌరాంగునకు దుఃఖోపశమనంబు సేయఁబోయిన వారలలో నెట్టి ధైర్యశాలియు ధైర్యంబు తూలిపోవ నిమి నోదార్చుటకు మాఱుగ వానితోఁ జేరి తానును విలపింపందొడంగెనంత నిమి కొంతవడికిం దెలిసి స్వపరివారజనంబులతో నిట్లనియె. 50

క. నను బృందావనమునకున్
జననిం డోమిత్రులార ! ♦ చనియట శ్రీకృ
ష్ణుని జూడకుండ మనపురి

కినిబోవఁగ నుల్ల మిచ్చ ♦ గింపదు నాకున్. 51

క. బృందావనమునఁ దప్పక
కందును శ్రీకృష్ణు; హృదయ ♦ కంజమదేమో
చెందెను శూన్యత; కృష్ణుం
డందు న్నివసించుదాఁక ♦ నందదు తుష్టిన్. 52

క. నాతల్లితోడ వేగమ
యే తెంతునటంచుఁ జెప్పి ♦ యేరామికి దుః
ఖాతురయై కినియకనా
చేఁతల క్షమియింపుమనుచుఁ ♦ జెప్పఁడి మీరల్. 53

గీ. అస్వతంత్రుఁడనేను న ♦ న్నమ్మనుండి
యీడ్చికొనిపోవుచున్నాఁడు ♦ కృష్ణమూర్తి
వాఁడులేకుండ నేనింక ♦ బ్రదుకలేను
గూర్చువారైన ననకుఁడి ♦ కూడదనుచు. 54

వ. అనిపల్కి గమనోద్యుక్తుండై లేవంబోయిన మిత్రులందఱుంగూడి చేతులం బట్టికొని నిమిని లేవకుండఁజేసి రందుముఖ్యబంధువగు చంద్రశేఖరుం డేమిసేయుటకుం దోఁచక. 55

ఉ. కన్నులతెప్పలట్లు నిమిఁ ♦ గాచుచు శీఘ్రమ వానిఁదెచ్చి నా
కన్నులఁబెట్టుమయ్య! యని ♦ గద్గదకంఠముతోడ నొప్పగిం
చెన్నిమి నాకుఁదల్లి; యిటు ♦ చేసెను వీఁడిపుడేమిసేయువాఁ
డన్నలినాక్ష! కృష్ణ! యని ♦ డంకతనంబఱియేడ్చె డగ్గఱన్. 56

వ. మఱియు నతండు నేలపైఁ జదికిలఁబడి కరంబు ఫాలంబునం గీలించి.

గీ. తల్లిధనమును బ్రాణమీ ♦ తనయుఁడెట్లు
సెప్పినప్పటికిని మాట ♦ చెవినిబెట్టఁ
డే నవద్వీపమునకేగి ♦ యేమిచెప్ప



వాఁడ శచితోడనని దుఃఖ ♦ పడుచునుండ. 58

గీ. ఏమితోఁచెనో నిమికేవం ♦ డెఱుఁగఁడప్పు
డింటికింబోవుటకు నతం ♦ డియ్యకొనియెఁ
గాని యెప్పటియట్ల మా ♦ ర్గంబునందుఁ
బూర్ణమా పరధ్యానంబుఁ ♦ బూనియుండె. 59



క. ఇరులినుఁడు దోఁచువెంటనె
విరిసెడుగతి ఘోరతమము ♦ విరియునుగాని
న్స్మరియించిన వెన్వెంటనె
ధరలో నెవ్వానికైన ♦ దశరథరామా. 60



శ్రీరస్తు.

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః

# శ్రీ గౌరాంగచరిత్రము.

## షష్ఠాశ్వాసము.

ఉ. జ్ఞానము బుద్ధిమాంద్యమున ♦ నాకు లభించునటన్న ధైర్యమున్
బూనను, గర్మమన్గహన ♦ భూమిఁ జొరంబడి నెగ్గలేను, నే
దీనుఁడ రామ! వైషయిక ♦ దృక్పరిపీడిత మన్మనంబు త్వ
ద్ధ్యానము నిత్యము న్దలుపు ♦ నట్టులు సేసి భవార్తిఁ బాపుమా. 1

ఆ. గయకుఁ బోయి మరల ♦ గౌరాంగుఁ డేతెంచు
చుంటఁ బూర్వమెఱిఁగి ♦ యూరివార
లెదురువోయి కాంచి ♦ రిందు సమాకృష్ట
జలధిగతినిఁ బొంగు ♦ స్వాంతములను. 2

శా. మేంద్రించెన్నాదియాత్రమాట, మెటుఁదా ♦ ల్మింజెందదుఃల్లంబు, లోఁ
[illegible]చెన్నినుఁ జూచు వాంఛ, గృహమం ♦ దీభూత మైత్రోఁచె, మీ
[illegible]డ్రె న్నాశ్వతసౌఖ్యదక్రియల సం ♦ భావించి వేవచ్చితే
[illegible]డీ! నాకడకంచు నిల్చె శచి మో ♦ దంబందుచు న్వాకిటన్. 3
[illegible]ఖ్యాతుఁడైన య ♦ ల్లుండు మరల
[illegible]వచ్చుచున్నాఁడు పురికను ♦ వార్త దెలిసి



యత్తమామలు వియ్యపు ♦ రాలి యింటి
కడకువచ్చిరి యత్యంత ♦ కౌతుకమున. 4

అ. ప్రియునిఁగాంచు వేడ్క ♦ విష్ణుప్రియాకాంత
తలుపు వెనుక నిలిచి ♦ కలికి సిగ్గు
బొలుకఁ దొంగిచూచు ♦ చుండెను గ్రొక్కారు
మెఱుఁగుఁ డీఁగలాగు ♦ మెఱయుచుండి. 5

క. ఏతెంచి భక్తితో నిమి
మాతృపదద్వయముకు న ♦ మస్కృతి సేయన్
బ్రీతిమెయి న్శచిగొమరున్
జేతులతో లేవనెత్తి ♦ చేర్చె నురమునన్. 6

ఆ. ఇశ్లె యచటనున్న ♦ వృద్ధవిప్రుల కెల్ల
నెఱఁగి నిమియొవండు ♦ నెన్నఁ డేని
వెనుకఁ జూడనట్టి ♦ వినయంబు భక్తియుఁ
జూపి నిల్వఁ దల్లి ♦ సూచి మదిని. 7

సీ. మాటె మానిమితోంటి ♦ మావాఁడు గాఁడమ్మ
వింత నమ్రితలు గా ♦ న్పించునమ్మ
సంసారియై తన ♦ సాటివారలలోనఁ
గీర్తిసంపాదించి ♦ గృహము నిల్పి
కాంతతో సకలభో ♦ గంబు లనుభవించి
బిడ్డపాపలఁ గని ♦ పెద్దకాల
ముర్విపై వెలసి నా ♦ యుల్ల మలరఁ జేసి
తన్నుఁ గన్నట్టి న ♦ న్మన్న సేయు

గీ. ననుచు నేనుంటి గంపంత ♦ యాసతోడఁ
దొంటిపల్కులు నవ్వులుఁ ♦ దుఱఁగలింప

వైహికవిషయములయందు ♦ నరయ వీని
చిత్తమదియేమొ కడుశుద్ధా ♦ సీనమయ్యె. 8

క. అనియెంచి యింటిలోనికిఁ
దనసుతుఁ దీసికొనిపోవఁ ♦ దలఁచి యచటనుం
డిన జనులకడ సెలవుఁ గై
కొనుమనఁగా నట్లసేసెఁ ♦ గొమరుఁడు తోడ్తోన్. 9

వ. సుతవిశ్లేషదుఃఖంబు వాపుకొనఁ దానొక్కతెయుఁ గఱవాఱబిడ్డని తోఁ భవనాంతరంబున మాటాడనెంచికొని యున్నశచితోఁ నాతండమ్మా! మురారిసదాశివ శ్రీమానులతోఁ నొకరహస్యంబు చెప్పవలయుఁగాన వారల రావింపుమని పల్క నామె యట్లకావించె, నంత నాముప్వురుమిత్రు లాసాయంకాలమున నేతెంచి నిమీ! యాత్రావృత్తాంతంబు లేమియని యడుగ నాతండు గాంధర్వగానమధురంబులగు నిజస్వనంబుల సరసాలంకారభూయిష్ఠంబులై చమత్కారగర్భితంబులగు నిర్దుష్టవచోధారల మహాకవింబోలె గయాప్రయాణంబు వర్ణించుచు. 10

చ. చివరకు మిత్రులార! గయఁ ♦ జేరి గదాధరునాలయంబుఁ గ
న్గవ యలరారఁగంటి గుడి ♦ కావలి పూజరులంత దీనబాం
ధవుఁ డగుకృష్ణుపావనప ♦ దంబులఁజూపిరి నాకు, నాదుచూ
డ్కివఱపి వానినుండి మఱి ♦ డింపఁగనేరక యట్టెనిల్చితిన్. 11

క. అని మఱి పలుకంజాలక
తనువున్ స్మృతిఁదప్పి యతఁడు ♦ ధరపైవ్రాల్చెన్
గనియది చికిత్సలొనరిం
పనుబూనె మురారి దాను ♦ వైద్యుండగుటన్. 12

ఉ. తెప్పిఱి కొంతసేపటి క ♦ తిశ్రమమందుచు వెక్కివెక్కి తా



చెప్పటియట్లసోలి నిమి ♦ హృద్గతబాధలవిప్పి మాటలన్
జెప్పఁగలేక బాష్పపరి ♦ షిక్తదృగంచలుఁడౌచు నేదినా
కిప్పుడుదిక్కు రక్షకుఁడ! ♦ కృష్ణ! యనె న్వడిఁదేఱి క్రమ్మఱన్. 13

క. అలుఁగువలెఁ బెద్దదుఃఖము
నెలకొని యిటనున్నదంచు ♦ నిమి తనయెద వ్రే
ళులనంటిచూపె వారికిఁ
బలుకులు కంఠమునఁజిక్కి ♦ వైకి వెడలమిన్. 14

వ. ఎట్టకేలకు బాష్పవృష్టిఁ దెరల్చుకొని దుఃఖంబుడిపికొని గౌరాంగుండు.

ఉ. అంబుజ సన్నిభంబులగు ♦ నక్షులఁజూచుచు మిత్రులార! యి
ల్లంబుననుండె దుఃఖమన ♦ లంబయి యెవ్వరితోడఁ జెప్పరా
దుంబడుపాట్లు మీరు దయ ♦ తోడుత నెల్లియొవత్తురేని శు
క్లాంబరునింటి కచ్చట బ ♦ యల్పఱతున్ సకలంబు మీకనన్. 16

క. మంచిదని నిమిని వీడ్కొని
యంచితమతిఁ జూచినట్టి ♦ యద్భుతములు దా
మెంచుకొని మఱల నవి వ
ర్ణించుకొనుచు గృహములకు న ♦ రిగిరాముగురున్. 17

క. ఒకఁడేని వెనుక నిమివా
లకమున్నని వానికిట్టి ♦ లాలితభక్తి
ప్రకృతియెద లోఁబొడమున
నకొనియెనే? యెట్లుపుట్టె ♦ నో! యీబుద్ధుల్. 18

క. అద్దముల వంటికన్నుల
యొద్ద న్బాష్పంబులొదవి ♦ యొడ్లనగడిమిన్
బ్రద్దలుగఁ గోసికొని పై
కుద్దవిడి న్బాబునదుల ♦ యోజన్బాఱెన్. 19

క. తడిసెను దేహంబంతయుఁ
దడిసెను వస్త్రంబు నేలఁ ♦ దడిసెను గన్నీ
ళ్లుడుగక యీచిత్రం బీ
పుడమి న్మానవులయందుఁ ♦ బొడచూపునెటుల్? 20

క. కలఁడొక్కఁడు దైవము భ
క్తులచిత్తముఁబట్టి లాగి ♦ కొని వారల ని
ట్టులుసేయుఁ గానిచో నిమి
విలపించునె యుక్కుఁదక్కి ♦ విరహిణిపోల్కిన్. 21

వ. అని నుడువుకొనుచు మురారి సదాశివ శ్రీమానులు వారివారియిండ్లకుం జనిరిఁక గౌరాంగు గృహంబులోన. 22

క. మగఁ డేతెంచినదాదిగఁ
బగలంచలలోనఁ దేటి ♦ పరికింపఁగరా
దుగదా! యని విష్ణుప్రియ
వగనుండెను రాత్రి యెపుడు ♦ వచ్చునటంచున్ 23

క. జిలిబిలియను రాగంబెద
నలముకొనఁగ వ్రొష్ణదేహ ♦ నైతి వలుకకే
కలికీయనుగతిఁ బులుఁగుల
పలుకులతోఁ గూర్మిమెయి వి ♦ భావరివచ్చెన్. 24

సీ. విష్ణుప్రియాకాంత ♦ వేగమ గృహకృత్య
ములఁ దీర్చికొని భక్ష్య ♦ ములనమర్చి
యత్త 'నేవడ్డింతు' ♦ నని చెప్పఁ దానేగి
తలదువ్వుకొని పుష్ప ♦ ములను ముడుచు
కొని కన్నులను గాటు ♦ కనుదీర్చి సొగసుగాఁ
దిలకంబు నొసటను ♦ దిద్ది వంగ



పండురంగున మించు ♦ వసనంబు ధరియించి
వింతవన్నియల జ ♦ వికనుదొడిగి

ఆ. కుందనంపుబొమ్మ ♦ చందంబుగా నొక్క
చేతఁబూవు లొక్క ♦ చేతఁ బచ్చ
కప్పురంపుఁ దావి ♦ గందంబుఁ దాలిచి
విభునికడకు నేగ ♦ వేచియుండె. 25

గీ. బుగులుకొను సౌరభముగల్గు ♦ పోఁకపొడుముఁ
బండుఁదములపుటాకు మ ♦ వ్వంపుమడుపు
లిందుముఖి ముద్దుమగని క ♦ ర్పించుసుఖముఁ
గోరి యూరక యువ్విళు ♦ లూరుచుండె. 26

వ. భోజనానంతరంబున శచి గౌరాంగుంజూచి తండ్రీ కడునలసియున్నవాఁడవు వేగంబపోయి పరుండి ప్రయాణశ్రమం బపనయించుకొమ్మని చెప్పిన నాతండు శయనాగారంబున కేగి వికీర్ణమల్లికాసురభిళంబును జంద్రికాధవళంబును నగుదుప్పటంబు పఱచిన మృదుతల్పంబుపైఁ గూర్చుండియుండ మెల్లమెల్లన విష్ణుప్రియ సమస్తభోగపరికరంబులతో గదిసొచ్చి మోహినీదేవతకైవడిఁ బ్రాణనాథునెదుట ముకుళిత కరకమలయై నయనద్వయంబునుండి ప్రసరించు చూపుమెఱుంగులఁ జిఱునవ్వువెన్నెలల నివ్వాళులొసంగుచు నిలువంబడియుండ. 27

చ. కలికిని గన్నుదోయి నిమి ♦ గాంచి మహాశ్రీమరుద్ధబాష్పము
ల్నిలుపఁగలేక వాని వెడ ♦ లించెను ధారలుగాఁగ; నద్ది యా
చెలువ భరింపలేకలుకుఁ ♦ జెంది మఱేమియుఁ జేయలేక కే
కలనిడె నత్తయత్తయని ♦ గద్గదకంఠ కలస్వనంబులన్ 28

క. కోడలి కేకలువిని యా

చేడియ యవియేమొయనుచుఁ ♦ జెచ్చెరఁబనులన్
వీడి పరువెత్తెఁ గొడుకుం
గోడలు నున్నట్టిగదికిఁ ♦ గొందలపడుచున్. 29

క. చని కొడుకు గాఢదుఃఖముఁ
గని శచి విలపింతువిట్లు ♦ కతమెయ్యదిరా
తనయ ! యన వెక్కియేడ్చుచు
జననికి నిమి మాఱుపల్కఁ ♦ జాలకయుండెన్. 30

మ. సుత ! నిన్గోడలిఁబెట్టుకొంచు బ్రదుకం ♦ జూడంగ నీవిట్లు న
న్నేతలంబెట్టెదు వెక్కియేడ్చి కతమే ♦ నిందెల్పవయ్యయ్యొ ! సి
బ్బితి మోహంబు వెఱంగుదుఃఖమును హృ♦ద్వీథిం బిసాళింప నే
గతినిల్చున్నదొ యీలతాఁగి కనుమా♦ గౌరాంగ ! నీముంగడన్.

క. నీయేడుపు నాయుల్లముఁ
బాయలు పాయలుగఁజీల్చి ♦ నైచెడు గౌరాం
గా ! యనిశచియనసూఱడి
యాయమనుంజూచి యిట్టు ♦ లాతఁడుపల్కెన్. 32

క. అమ్మానీన్నుపనాసము
ఖమ్మునకున్వచ్చినిలువఁ ♦ గనులకు మద్వా
క్యమ్ముల కందనియాకా
రమ్మొక్కటిదోఁచె నశ్రు ♦ రాజిజనింపన్. 33

శా. తాపింఛప్రతిమానదేహమున నం ♦ దంబైనయాస్యంబునం
దాపఘ్నాంచితలోచనంబులను సా ♦ నందస్మితజ్యోత్స్నలం
గోపీమానధనాపహార చణుఁడా ♦ గోవర్ధనోద్ధారకుం
డాపీతాంబరధారి కృష్ణుఁడెదురై ♦ యంతజ్జనె న్మాయమై. 34

సీ. వెన్నెలల్వెదచల్లు ♦ వెడఁదనేత్రంబులు



నొసటికస్తురితావి ♦ పసలబొట్టు
మోముపైముద్దుగా ♦ ముసరెడుముంగురు
ల్వంచినమరువిండ్ల ♦ వంటిబొమలు
శిరముపై మొగ్గవే ♦ సెడు శిఖిపింఛంబు
నధరసుధారసం ♦ బానుమురళి
శ్రీవత్సకౌస్తుభ ♦ శ్రీలాంఛితంబైన
కమనీయవిపుల వ ♦ క్షస్థలంబు

గీ. నన్నియునుగాంచినాఁడఁ బ్రి ♦ త్యక్షముగను
మెఱుపువలె నిట్టెవాఁడుగ ♦ న్మాఱఁగిపోయె
నమ్మ ! తలఁచినబాష్పము ♦ ల్గ్రమ్ముఁవాని
మఱవవలెనన్ననోతల్లి ! ♦ మఱవలేను. 35

వ. ఇట్లు భక్తిపారవశ్యంబునం బలుకు గౌరాంగుని సంభాషణంబులకు విస్మయానందభరితలై యత్తయుం గోడలు నారేయి గడపిరంత. 36

చ. అరుణిమఁదాల్చెఁ బూర్వదిశ ; ♦ యంబరవీథిని బుక్కపాళి తే
జఱె ; గృహదీపముల్గునికె ; ♦ నబ్జములుల్లసిలె ; న్విహంగ మో
త్కరములు రావముల్సలిపెఁ; ♦ గంజహితుండుదయించి యిండ్లలోఁ
జొరఁబడినిద్రమేల్కొలిపె ♦ సోమరులన్గరతాడనంబులన్. 37

శా. దేవార్చామతిలేచి పెందలకడ ♦ న్దీప్తప్రమోదాస్యుఁడై
శ్రీవాసాంచిత కుందనిష్కుటమున ♦ న్శ్రీమానుఁ డాసక్తిమైఁ
బూవుల్గోయఁగవచ్చి కుందకుసుమం ♦ బు ల్ద్రుంపుచుండంగ నా
శ్రీవాసుండరుదెంచి నూత్నముఖరో ♦ చిష్మంతుఁడౌ నాతనిన్. 38

క. శ్రీమానుఁడ ! నీమోమది
యేమో యొకవింతకాంతి ♦ నెసఁగెడు నేఁడా
రామము నీవుండుట నభి

రామంబై తోఁచునద్ది ♦ ర్గా! కతమేమో? 39

క. అని పృచ్ఛసేయ గౌరాం
గుని దర్శించినదిమొదలు ♦ కొని కొసవఱకున్
గనినది చెప్పి యనంతర
మనియె శ్రీమానుఁడిట్లు ♦ లాతనితోడన్. 40

క. ఆతనివీడ్కొని యింటికి
నేతెంచిన దాదిగాఁగ ♦ నేఁబొందిన యా
చేతోమోదము వాక్కుల
నీతోఁ బూర్ణముగఁజెప్ప ♦ నేరమహాత్మా! 41

శా. లోకంబంతయు దుఃఖసంకులము నా ♦ లోకోక్తి సత్యంబుగా
నాకుందోఁచదు విష్ణుభక్తి పరిపూ ♦ ర్ణత్వంబు నేమానవుం
డేకాలంబునఁదాల్చు నాతఁడపుడీ ♦ పృథ్వీతలంబందు నే
నాకానందము మించుమోదమును బొం ♦ దంజాలుఁ జిత్తంబునన్

క. నాయెద చింతలువంతలు
నేయెడకున్జనెనో యిప్డు ♦ డెఱుఁగన్బ్రహ్మాం
డాయత విభవానందము
నాయిప్పటిభక్తి సుఖము ♦ నకు రాదెనయై. 43

గీ. క్లిన్ననయనుఁడై యాత్మహ్రా ♦ త్క్లేశభార
మంత వెలిపుత్తుమీకు ర ♦ మ్మనెను నిమి స
దాశివు మురారినను నేఁడు ♦ తప్పక యల
యోగి శుక్లాంబరునిగృహం ♦ బుందునెడకు. 44

గీ. వేళయయ్యెను నేను వే ♦ వేగనరుగ
వలయునంచు శ్రీమానుండు ♦ వలికి చనఁగ
సంతసంబున నుప్పొంగు ♦ స్వాంతమునను



కృష్ణభక్తుండు శ్రీవాసుఁ ♦ డిట్టులనియె. 45

గీ. కృష్ణ! యహరహమును నీకుఁ ♦ గేలుమోడ్చి
నేను జల్పుప్రార్థనల మ ♦ న్నించినావు
కొంచె గౌరాంగుమదిఁద్రిప్పి ♦ కూర్మి నీదు
పాదపద్మంబులను గట్టి ♦ వైచినావు. 46

గీ. మహితవిద్యాప్రమత్తుఁడై ♦ మదగజంబు
భంగిఁ దిరుగుచు నెటువంటి ♦ పండితులను
బట్టి రాట్పఱచెడి మిశ్రు ♦ పట్టినెట్టి
విమలభక్తాగ్రగణ్యుఁ గా ♦ వించినావు! 47

గీ. అనెడు నీపల్కులన్నియు ♦ నాలకించి
తానునాహూతుఁడౌట గ ♦ దాధరుండు
మున్న శుక్లాంబరుని గృహం ♦ బునకు వడిగ
నేగి యచ్చట నొకమూల ♦ డాఁగియుండె. 48

ఆ. అంతఁదక్కు ముప్వ ♦ రరుదెంచి గృహబాహ్య
భాగమందునిలిచి ♦ భక్తలోక
పుంగవుఁడగునిమి యె ♦ పుడువచ్చునో యంచు
నెదురుసూచుచుండి ♦ యెదుటవారు. 49

మ. కని రాజానువిలంబ బాహు, సుభగా ♦ కారాంచితారోగ్య, యౌ
వనసత్వాఢ్యు, నిమిన్విశేషమదిరా ♦ పానప్రమత్తుంబలెన్
దనువట్టిట్టు చలింప నేత్రములు ఘూ ♦ ర్ణప్రక్రియన్దాల్ప నం
ధునియట్లధ్వము సేతులన్దడవుచు ♦ న్దోతెంచు నిర్విణ్ణునిన్. 50

ఉ. తూలుచువచ్చి యిట్లు నిమి ♦ తొల్తను నెయ్యురఁజూచి యాఁపఁగాఁ
జాలకలోనదుఃఖ, మనఁ ♦ జాలకపల్కులలోని యూహము,
ల్వ్రాలుచుఁ గృష్ణ! కృష్ణ! యని ♦ పట్టుకొనె న్నడిరాడు; ఖండమై

కూలె భరంబుచేనదియుఁ; ♦ గూలెనె వెసన్నిమి దానితోడుతన్. 51

క. నెయ్యురు మువ్వురు నప్పుడు
చయ్యనఁజని కనిరి విగత ♦ చైతన్యుండై
కొయ్యవలె నేలవ్రాలిన
యయ్యంగజ సుందరాంగుఁ ♦ డౌ గౌరాంగున్. 52

ఉ. చిప్పిలె నశ్రు, లూపిరి న ♦ శించినయట్టులుతోఁచె, గ్రుడ్లుపై
తెప్పలఁదూఱెఁ, దాలువులు ♦ రెండును దాళమువేసినట్టుగా
నొప్పఱిడాసె, నోష్ఠముల ♦ యొద్ద సితాభములైన ఫేనముల్
చొప్పడిపర్వె, నీతెఱఁగుఁ ♦ జూచి భయాకులులైరి స్నేహితుల్. 53

మ. ఉపచారంబులఁదేఱి కొంతవడి క ♦ శ్రూద్వేల సిక్తాక్షులన్
విపులార్త్యంకిత వక్త్రనీరజమున ♦ న్విశ్వంభరుండేఁచు నూ
రుపు దీర్ఘంబుగనూర్చి యంగుళుల హృ ♦ ద్రోగంబుసూచించుచున్
దపియించె న్దనమిత్రరాజికడ వా ♦ తన్బల్కలే కెమ్మెయిన్. 54

గీ. మాటలాడెడుశక్తి క్ర ♦ మ్మఱజనింప
దీనభావంబు మోమునఁ ♦ గానిపింపఁ
బెద్దదుఃఖమున నిమి హృ ♦ ద్భేదనకర
వచనములతోడ వారితోఁ ♦ బలికెనిట్లు. 55

లయగ్రాహి. పట్టితిని హస్తముల ♦ గట్టిగను గృష్ణుఁజల
పట్టి హృదయంబునను ♦ బెట్టితిని వెంటన్
బట్టువిడిపించుకొని ♦ కట్టలుక నేదెసనొ
పట్టిచనె నాతఁడిది ♦ యెట్టులు సహింతున్
పట్టిదయిపోయె హృది ♦ కుట్టుసుఱులంబడితి
నెట్టుకొని వంతకడుఁ ♦ బెట్టిదముగానన్
జుట్టుకొనెఁ బ్రాణవిభుఁ ♦ బట్టుకొని నాయసువు



లెట్టుసిలఁబెట్ట సమ ♦ కట్టెదరొ మిత్రుల్. 56

మ. అకటా! యొక్కసఖుండు నాజలధర ♦ శ్యామాంగు శ్రీకృష్ణునిన్
వికచాబ్జాయతనేత్రుఁదెచ్చి యెదుట ♦ న్బెట్టంగలేఁడయ్యె నే
నిఁకఁ బ్రాణంబుల నిల్పఁజాలననుచు ♦ న్బృథ్వీస్థలి న్నూఱువృ
శ్చికము ల్గుట్టినవానిభంగి నిమి గా ♦ సింజెందెఁ బొర్లాడుచున్. 57

చ. తనువిల దొర్లుటన్మలిన ♦ తన్బరిఁదాలిచి పాంసులిప్తమా
కనకశలాకపోలికను ♦ గ్రాలుచునుండుటచూచి జాలిని
మ్మనసిజరూపుఁడేపగిది ♦ మ్రందుచునుండెనటంచు బాష్పవృ
ష్టినిగురిపించి రొక్కమొగి ♦ డెందము డిల్లపడంగ మిత్రులున్. 58

చ. నిమియొక కొంతసేపటికి ♦ నెమ్మది శాంతినిబెట్టుకొంచు మి
త్రములనుజూచి పల్కుటకుఁ ♦ దద్దయు యత్నముసేసెఁగాని య
త్నముగొనసాగదయ్యె, వచ ♦ నంబులుకంఠముదాఁటవయ్యె, దుః
ఖమువశమై మహార్ణవము ♦ క్రైవడిఁ బొంగుచువచ్చెఁ గ్రిమ్మఱన్. 59

గీ. ఎన్నిసారులు మాటాడ ♦ నెంచిన నిమి
యన్నిసారులు విఫలంబు ♦ లయ్యెఁ గడఁక
లంత నానాఁటికిఁక రహ ♦ స్యంబుఁ జెల్మి
కాండ్రకును జెప్పశక్యంబు ♦ గాకపోయె. 60

చ. తరణిప్రతీచిఁ గ్రుంకుతఱి ♦ దారసిల న్నిమివంత కొంతపెం
పఱితెఱపన్బడన్దెసల ♦ నారసి లోపలనుండి యొక్కఘో
రరవము వెక్కులన్వెడలి ♦ కర్ణపథంబునుదాఁక నాతఁ డా
వ్వాసు దురపిల్లువారనుచుఁ ♦ బల్కె గదాధరుఁ డంచెఱుంగుచున్. 61

ఆ. ఆతఁడుండు నెడకు ♦ నరిగి గదాధరా!
యెంతభాగ్యశాలి ♦ వీవు దైవ
భక్తి బాల్యమందె ♦ పడసితివి పవిత్ర

చేష్టితములఁ దవిలి ♦ చెడితినేను. 62

క. అని నిమివల్కినఁ దోడ్తో
ననఘా! నీపాదసేవ ♦ నాసించెడుదా
సుని నన్నిటులగ్గింతురె?
యనుచు గదాధరుఁడు వాని ♦ యడుగుల కెఱఁగెన్. 63

చ. ఇపుడుదెంచునో కొమరుఁ ♦ డింకను వచ్చునో యింటికంచు నా
త్రిపదుచుఁ బాకమున్నలిపి ♦ తల్లిగృహంబున వేచియుండఁగా
నపరదిశ స్వయోజహితుఁ ♦ డస్తమితుండగువేళఁ జొచ్చె భ
స్మపిహితకాయుఁడౌచు నిజ ♦ మందిరము న్నిమిగ్లానితంద్రతన్. 64

ఆ. పంకపాతచూత ♦ ఫలముపోలికనున్న
సుతుని యొడలుగడిగి ♦ సువతి భోజ
నంబువెట్టి పిదప ♦ నకనకఁబడియున్న
కోడలికిని బెట్టి ♦ కుడిచెఁ దాను. 65

ఆ. వింతవారియెదుట ♦ వెలిపుచ్చఁ దంతరం
గస్థమైనబాధఁ ♦ గాని కూర్చు
వారు దారసిలిన ♦ వలవంతఁ దవిలెడు
చానపోల్కి నిమి వి ♦ చారమొందు. 66

గీ. యాత్రికుం బోయి మరల గృ ♦ హంబునకును
వచ్చువెన్కను బెద్దలౌ ♦ వారికడకుఁ
జని యెఱుంగుట సజ్జనా ♦ చారమౌట
సరిగె నిమియు గంగాదాస ♦ గురునికడకు. 67

క. చని సాష్టాంగనమస్కృతు
లొనరించిన నతఁడు దాని ♦ కుప్పొంగి నిమిన్
గనుఁగవ బాష్పములురలం



గను కౌఁగిటఁ జేర్చి పలికె ♦ గారవమెసఁగన్. 68

క. గౌరాంగా! నీశిష్యులు
నీరాకనె కోరియుండి ♦ నీపై భక్తిన్
వేఱొండుకడకుఁ జదువం
బోరయ్యా! నీదుపూర్వ ♦ పుణ్యంబేమో. 69

మాని. ఓనిమి! శిష్యులుపూర్వము నేర్చిన ♦ యుత్తమశాస్త్రములీవలఱకున్
మానుటచేతను విస్మృతిలోఁబడి ♦ మ్రిగ్గుచునుగావునఁ గ్రమ్మఱ వి
ద్యానియతిన్గొని పాఠము వారికిఁ ♦ దప్పక చెప్పుము నీకును మే
ల్గానను జేకుఱు మద్వచనంబున ♦ లక్ష్యము సేయకు నేగురుఁడన్. 70

గీ. ఈగురూక్తుల శిరసావ ♦ హించి పాఠ
శాల మఱునాఁడు వెట్టని ♦ శ్చయము సేసి
కొనుచు శిష్యుల నటకురం ♦ డని కడింది
శ్రద్ధతో నిమిగూడను ♦ జనఁగఁ దలఁచె. 71

శా. ప్రాతఃకాలమునందు లేచి కమలా ♦ ప్తద్యోత మానాంగుఁడై
చేతస్సందిత కృష్ణభక్తిభవస ♦ చ్చిన్మోద ధన్యాత్ముఁడై
వీతాహంకృతి లౌకికార్థవిముఖ ♦ ప్రేతౌను సంధానుఁడై
యేతెంచె న్నిమిపాఠశాలకు మనో ♦ హృన్మందయానంబులన్. 72

శా. ఈరీతిన్జనుదెంచి పుస్తకములే ♦ పీ! యన్న వేశిష్యులా
వారాది స్హారినామసంస్మరణ మొ ♦ ప్పం జేయ నాలించి దు
ర్వారంబౌవివశత్వ ముల్లమున నా ♦ పాదిల్లనద్దెట్టులో
గౌరాంగుండరికట్టి యిట్టువలికె ♦ న్గ్రమోక్తుల న్వారితోన్. 73

మ. హరినామం బదియెంతతీపి సఖులా ♦ రా! చిత్తదుఃఖచ్ఛటా
హరణంబౌఁగద పల్కనవ్వినిన వి ♦ ద్యానామవిస్తీర్ణ దు
స్తర దుగ్ధాంబుధి సన్మనీషయను మం ♦ థానంబుచేఁ ద్రిచ్చము

క్తిరమాసంగతిఁ బుట్టినట్టి సుధగా ♦ దే యద్ది భక్తాళికిన్. 74

క. అని భక్తిప్రమదాశ్రుల
మునిఁగెడు నేత్రములతోడ ♦ మురహరుకథలన్
వినిపించె నమృతతుల్య వ
చనముల నిజశిష్యులకును ♦ చైతన్యుఁడటన్. 75

చ. మఱచిరి శాస్త్రపాఠముల ♦ మాటప్రసంగ వశాంతరంగులై
మఱచిరి కాలమానము స ♦ మంచితభక్తిరస ప్రమత్తులై
మఱచిరి యిండ్లువాకిళులు ♦ మాధవసక్త మనస్కులౌచు నం
దఱు; నిమియాఁగునప్పటికి ♦ దాఁటెను భోజనవేళ వింతగన్. 76

క. పరవశతఁ దొఱఁగి స్వస్థతఁ
బొరసినపిమ్మటను జాలఁ ♦ బ్రొద్దయ్యెను నేఁ
గఱపఁగ లేనైతిని బా
లురకు న్విద్యయని చింత ♦ లోఁబడె నిమిదాన్, 77

క. పడి నాపైయలుగకుఁ డీ
యెడఁ దన్నుడిఁ దప్పితినని ♦ కృష్ణకథనముం
బడివెట్టు నాఁడు సేయుట
గడు శుభమాఁగాదె యెల్లి ♦ గఱపుదు విద్యన్. 78

క. అనియు న్మఱునాఁడును బై
దినము న్దొలుతటివిధమున ♦ దివ్యవచోధా
రను నిమి కృష్ణచరిత్రం
బునుడివి కాలంబు వెళ్లఁ ♦ బుచ్చె ముదమునన్. 79

సీ. భక్తిసంభరిత హృ ♦ త్పంకజం బుప్పొంగ
నిమిచక్కఁ జెప్పెడు ♦ సమయమందు
శ్రీకృష్ణసంసక్త ♦ చిత్తులై శిష్యులు



మఱచిపోయిన విద్య ♦ మాట, పిదప
వారలలో వయ ♦ స్వంతులు శాస్త్రమ్ము
లేశమ్ము వచ్చుట ♦ లేదటంచుఁ
బోయి గంగాదాసు ♦ మ్రోలను మొఱవెట్టు
కొని; రంత నిమినిర ♦ మ్మనుచు నతఁడు

ఆ. వార్తఁ బంపె; నిమియు ♦ వచ్చి యాతనిపాద
ములకు నెఱఁగి కేలు ♦ మోడ్చి యెదుట
నిలువఁబడఁగ వాని ♦ నిర్మలాకృతిఁ గాంచి
పలికె నిట్లు ప్రేమ ♦ మొలుక నతఁడు. 80

శా. శేషాహి న్దలదన్ను విద్యలు నిమీ! ♦ చేకూఱె; నీనాల్కవా
గ్యోషారత్నము ఱంకియై వెలసె; న ♦ య్యా! పండితేంద్రాబ్ధి సం
శోషాపాదనబాడబప్రతిభ యీ ♦ చొప్పయ్యెనే? యిప్డు నీ
వేషంబంతయు మాఱిపోయెనని నే ♦ వింటి న్విచారించితిన్. 81

ఉ. బెబ్బులిమాడ్కి నుండు నిమి! ♦ పిల్లిగ మాఱితి కృష్ణభక్తిచే
నబ్బుర మింతకంటెఁ గల ♦ దా! భువి, నైనను భక్తిమానుమన్
సెబ్బరమాట లెన్నఁడును ♦ జెప్పను వెన్కటియట్ల శిష్యులన్
దబ్బఱ సేయకుండఁ గరు ♦ ణామతి విద్యల నేర్పి ప్రోవుమా! 82

గీ. పూర్వ గురుశిష్యసంబంధ ♦ మునను నీకు
నొక్కచెప్పితి నింత నా ♦ నుడువులు మన
సునకు రుచియించె నేఁ జేయఁ ♦ జూడుమట్లు
లేనిచో నిమి! వానిని ♦ లెక్కఁగొనకు. 83

క. అనుమాటలు విని నిమి హ్రీ
వినమితవదనుఁడయి శిష్య ♦ వితతికి శాస్త్రం
బును గఱపక పోయిన త

ప్పను తమియింపుఁడని వేఁడెఁ ♦ బోరిఁబోరి గురునిన్. 84

గీ. భక్తివిస్మృతిపీడి వి ♦ శ్వంభరుండు
మాటదప్పక వెనుకటి ♦ మాడ్కి బోధ
మొనరుతును బాలురకునని ♦ యొజ్జలకడ
సెలవుగైకొని వెడలె స ♦ శిష్యుఁడగుచు. 85

శా. దారింబోవుచుఁ దొంటిరీతి నిజవి ♦ ద్యాదర్ప నిష్క్రాంత వా
గ్ధారామాధురి శిష్యులన్ననుపుచున్ ♦ గంజాప్తుఁ డస్తాగమున్
జేరంబోయెడుకాలమందు నిమివ ♦ చ్చెన్నిగ్ధుఁడున్ భక్తియో
గారూఢుం డగురత్నగర్భుఁడను వి ♦ ప్రాఖండలు న్జూడఁగన్. 86

ఆ. వచ్చి యతనియిల్లు ♦ సొచ్చి శిష్యులఁ దన
చుట్టుఁగూరుచుండఁ ♦ బెట్టికొని య
తండు పూర్వభంగి ♦ ధారాళధిషణామ
నోజ్ఞవాక్యములను ♦ నుడువుచుండ. 87

శా. రామంబాకడ సంజలోఁదనయగా ♦ రంబందు దైవార్చనా
ధామంబందున రత్నగర్భుఁడు శుచి ♦ త్వంబొప్ప ధ్యానించుచున్
శ్రీమద్భాగవతస్థ శస్తమధుర ♦ శ్రీకృష్ణ వర్ణాంచితం
బై మైపొంగఁగఁజేయు శ్లోకమొకఁడో ♦ య్యంబాడె శ్రావ్యంబుగన్.

గీ. కృష్ణవర్ణన శ్లోకంబు ♦ కెరలి నిమిచె
వులనుబడఁగానె “నాకృష్ణ! ♦ పుండరీక
నయన!” యనియార్చి సమ్మోహ ♦ నశరపతిత
యోద్ధమాడ్కిని భూమిపై ♦ యొఱగెనతఁడు. 89

గీ. ఒఱిగి నిమి పెద్దవడికిని ♦ మఱల స్మృతికి
వచ్చి శ్లోకంబు మఱియొక ♦ పరిచదువుచుఁ
గర్ణపర్వంబొనర్ప భ ♦ క్తజనవర్య



రత్నగర్భా! యటంచుఁ బ్రా ♦ ర్థనము సల్పె. 90

క. మఱలంజదువఁగ శ్లోకం
బెఱుక న్నిమిదొఱఁగి వ్రాలెఁ ♦ బృథ్వీస్థలినీ
తెఱఁగుననే జరగెను బ
ల్మఱు నాతనియొడలు గాసి ♦ మైవసివాడన్. 91

గీ. ఇదియె తొలిసారి యందఱ ♦ యెదుట భక్తిఁ
జొక్కినిమి ధరఁగూలుట ♦ చూచినట్టి
వారలుం గూడభక్తివి ♦ వశతఁజెంది
వెలువరించిరి బాష్పము ♦ ల్వెల్లువలుగ. 92

వ. అచటి కేతెంచినవారిలో గదాధరుండుండి యట్లు గౌరాంగుండు శ్లోకశ్రవణం బెన్నిసారులుచేసిన నన్నిసారులు మైమఱచి చెట్టునుండి క్రిందంబడు బంగారుఁబిచ్చుకపగిది నేలంగూలి గాసింజెందుట చూడ నోపక రత్నగర్భా! యిఁక నాశ్లోకంబుమాత్రముచదువవలదని గట్టిగఁజెప్పి మానిపించె నంతట నిమి కొంతసేపటికి యథాస్థితికివచ్చి. 93

గీ. భక్తపుంగవ! రత్నగ ♦ ర్భా! మహాత్మ!
యెంతయానంద మిప్పుడీ ♦ విడితి నాక
టంచు మించును హసియించు ♦ హస్తములను
గడిఁది ప్రేమంబునను వానిఁ ♦ గౌఁగిలించె. 94

చ. సమమగునెట్లు స్వాదుఫల ♦ సంతతభోజన సౌఖ్యసంపదల్
సమమగునెట్లు స్వర్యువతు ♦ లం బదివేవురఁ గూడుసౌఖ్యముల్
సమమగునెట్లు రాజ్యపద ♦ లభ్యసుఖంబులు రత్నగర్భుఁడా
నిమిషమునందుఁ బొందిన వి ♦ నిర్మలసౌఖ్యముతోడఁ బోల్చినన్.

గీ. ఆతఁ డాశ్లేష మొనరించి ♦ నదిమొదలుగఁ
గ్రొత్తజన్మంబు రత్నగ ♦ ర్భుండు వొంది

నట్టులై నిమి శిష్యుల ♦ యందుఁ గలసి
యతని నీడను బోలె వె ♦ న్నాడుచుండె. 96

ఆ. బంధుమిత్రశిష్య ♦ వర్గంబు గౌరాంగు
నొడలుగడుగ గంగ ♦ కడకుఁ గొంచు
స్నానమాడఁ జేసి ♦ వానిని దల్లికి
నొప్పగించె నింటి ♦ యొద్దకరిగి. 97

చ. పరదినమందు దివ్యతను ♦ భాసితుఁడై నిమి పాఠశాలయం
దుఱవగు ప్రేమవెన్నెలల ♦ యోజను గన్నులు చిమ్ముచుండ శాం
తరసము ముద్దుమోముపయిఁ ♦ దద్దయుఁ బర్వఁగఁ గూరుచుండు న
త్తఱిఁ దనశిష్యులం బిలిచె ♦ దగ్గఱకు న్ననుసైగ సేయుచున్. 98

వ. శతసహస్ర సూత్నరత్న కాంతులం గ్రక్కు నాగౌరాంగ గురుదివ్య మంగళవిగ్రహంబు తెప్పలువాల్చక దర్శించుచున్న శిష్యులాకనుసన్నలం గని వచ్చి సమీపాసీనులై యున్నంత. 99

గీ. సాయమాచుటినో లేదో ♦ చదువులందు
నేను మీకదిడాఁచక ♦ నిర్భయముగఁ
బల్కుఁడీయిప్డు నాతోడఁ ♦ బ్రాణమిత్రు
లార! యని నిమియడిగెను ♦ వారిఁ జూచి. 100

వ. అందునకు విద్యార్థులందఱు వినమితోత్తమాంగంబులతోఁ బ్రత్యుత్తరంబేమియు నీయక మిన్నకుంటఁ జూచి మఱియు నిట్లనియె. 101

ఆ. ముక్కయొకటి మీకు ♦ బోధంబు సేయుట
లేదటంచుఁ దెల్పు ♦ మీదు మాన
మెఱుఁగఁ జేయుఁడయ్య ♦ యేఁ బాఠశాలకు
వచ్చి చేయుచున్న ♦ పనులవేవొ. 102

శా. ఆమాటల్విని శిష్యుఁడొక్కరుఁడు ధై ♦ ర్యప్రేరితోత్థానుఁడై



స్వామీ! మీరిపుడన్నమాట నిజ మ ♦ శ్రాంతంబు శ్రీకృష్ణుపై
ప్రేమ న్వానిఁ దలంతు రద్ది శుభదం ♦ బే కాని మీ యొద్దకున్
మేమేతెంచితి మెందుకోస మదియే ♦ మిథ్యార్థమయ్యెం గదా! 103

క. అని కడుభయభక్తులతో
నన, నిమి దలయూఁచియూఁచి ♦ యానౌ నిజమే
వనజాక్షునుడివి మీవి
ద్యను గూరిచి మాటలాడ ♦ నైతింగాదే. 104

వ. అని పలికినంత మఱియొక శిష్యుండు లేచి యతివినయంబునఁ జేతులు జోడించి యిట్లనియె. 105

సీ. గయకు యాత్రకుఁ బోయి ♦ క్రమ్మఱవచ్చిన
దాదిగా నొకమాట ♦ మైన విద్యఁ
గూర్చిచెప్పరు నిన్న ♦ గోవిందసంకీర్త
నశ్లోకమొండు గా ♦ నంబు సేయ
నెడ తెలుంగక క్రిందఁ ♦ బడితిరియ్యది జ్ఞప్తి
లోనున్నదో లేదొ ♦ యే నెఱుంగఁ
గాని మీచర్యలఁ ♦ గనిన మేమందఱ
మును గడు నాశ్చర్య ♦ మునఁ బడితిమి

ఆ. గ్రంథమందునుండు ♦ కథలలో నేనియు
నిప్పుడేని వెన్క ♦ నెన్నఁడేని
క్షితిని మిమ్ముఁ బోలు ♦ శ్రీకృష్ణభక్త న
ఖులనుగనము కర్ణ ♦ ములను వినము. 106

క. అనుమాటలువిని యాశి
ష్యుని దెస నిమి చూచిచూచి ♦ యుత్కటబాష్పా
ర్ద్రనయనముల నాతనితో

వనె నిట్టులు దీనభావ ♦ మడర మొగమునన్. 107

ఆ. అకట! మీకు నించు ♦ కంతయు నుపయోగ
పడనివాఁడనైతిఁ ♦ బాఠనమున
కెంతయత్నపడిన ♦ నంతయు వృథయయ్యె
నంటెనేమొ నన్నుఁ ♦ దొంటిపిచ్చి? 108

క. నావుడు నందఱు నేక
గ్రీవంబుగఁ బలికిరిట్లు ♦ కేల్మోడ్చి మహా
త్మా! వెఱ్ఱి మీకుఁ బట్టుట
కేవలముంగల్ల! యూరక ♦ కే జడియకుఁడీ. 109

చ. పలికిన పల్కులన్నియును ♦ భాసిలె రత్నములట్టు లందులోఁ
గలవిపులార్థభావములు ♦ గాంచఁగ ముక్తిసుఖప్రదంబు లె
ట్లలవడు నీవచోమహిమ ♦ మన్యులకు; న్నిను వెఱ్ఱివానిగాఁ
దలఁచుటకంటెఁ బిచ్చిగల ♦ దా! మఱియొక్కటి దేశికోత్తమా?

క. పులకితశరీరముల స
శ్రులఁదోఁగెడు కన్నుఁగవల ♦ సుఖపరవశతన్
నిలఁబడితిమపుడు రాపడి
కలదే యీచేత వెఱ్ఱి ♦ గలవారలకున్. 111

వ. అనువచనంబు లాలకించి సానురాగచిత్తంబున గౌరాంగుం డిట్ల
నియె. 112

ఉ. ఇంకనుడాఁచనేల వినుఁ ♦ డీ! ప్రియశిష్యులు నారహస్యమున్
గొంకక చెప్పవాఁడఁ గల ♦ గుండును జెందకుఁడయ్య శేషప
ర్యంకుఁడు మద్ధృదంతర వి ♦ హారముసల్పుచు నైహికేప్సలి
జ్రింకులుచేయు నమ్ముదురో ♦ యీరలుచెప్పిన నమ్మకుందురో! 113

చ. ముదమున మీకు శాస్త్రములు ♦ బోధముసేయఁ దలంపఁగానెనా



ఎదుటనుదోఁచి బాలుఁడొకఁ ♦ డిందునిభాస్యుఁడు రమ్యనీలతో
యదమును బోలుమేననుఁగ ♦ రాంచితవేణువునంటుమోవి నా
యెదనలరించి కన్నులకు ♦ నెంతయుఁ బండువుసేయు నప్పుడున్.

తరల. మురళిమీఁదఁ గరాంగుళీమణి ♦ భూషణప్రభలాడఁగా
సరసిజాభము లైనకన్నులుఁ ♦ జారుపింఛమునట్టువల్
సరసఁ ద్రిక్కఁగ నాదుమ్రోలను ♦ శ్యామలాంగుఁడు నిల్చుచోఁ
బరవశత్వమునొంది కాయము ♦ వ్రీలవిస్మృతిఁ జెందుదున్. 115

క. అని పల్కినమాత్రంబున
వనజాక్షుండు నిమికనులఁ ♦ బడ నతఁడెట్లో
మనముఁ గుదురుపఱచుక యి
ట్లనె శిష్యులతోడ విస్మ ♦ యావదనమునన్. 116

శా. మీకున్నాకును నింతతో సరిసుఁడీ ♦ మిత్రోత్తము! ల్నిచ్చలున్
శ్రీకృష్ణుం డెదనిండియుంటఁ జదువు ♦ లెప్పంగఁగా దైతి; వి
ద్యాకృత్యంబున కేననర్హుఁడను శా ♦ స్త్రజ్ఞానము ల్లెస్సగాఁ
జేకూర్పంగల యొక్కప్రాజ్ఞుకడకు ♦ న్శీఘ్రంబ పోవందగున్. 117

ఆ. బాలురార! నాదు ♦ పంచేంద్రియంబులు
కృష్ణమయములయ్యెఁ ♦ గేవలంబు
నేను దొంటివాఁడఁ ♦ గా; నియ్యకొంటిమీ
రిచ్చవచ్చు నెడకు ♦ నేగుటకును. 118

క. పాయఁగలేకయ మిమ్ములఁ
బాయంగా వలసివచ్చె ♦ భద్రంబులు మీ
కేయెడఁ గూర్చెడు నాప
ద్మాయతలోచనుఁడు కృష్ణుఁ ♦ డరయుచుఁ గరుణన్. 119

క. అని కనుమూయక శిష్యులఁ

గని నిమి నన్నెపుడు మఱవఁ ♦ గోఁ జనదనుచుఁ
బొనుపడనెదలో ధైర్యము
గను దమ్ములనుండి బాష్ప ♦ కణములు రాల్చెఁ. 120
ఆ. ఆఁగలేక శిష్యు ♦ లంతట నందఱు
నొక్కమొగిని దుఃఖ ♦ మొందఁజొచ్చి
రంతు ధైర్యశాలి ♦ యగు నాతఁడొక్కరుం
డనెను దెలిపిసేసి ♦ కొనుచు నిట్లు. 121
మ. గురువర్యా! వినుమయ్య! విద్యకును మీ ♦ కుంగూడ దవ్వేతిమే
మొరులంజేరుట వట్టిమాట యిఁక సం♦న్యుల్ శాస్త్రముల్సెప్ప నే
రరు మీరీతిగ; బ్రహ్మ మాదునుదుట ♦ న్వ్రాసెంగదా యిట్లు; మా
దురదృష్టంబునడంచి కాచుటకు శ ♦ క్తుం డేమహాత్ముండగున్. 122
వ. మాకుఁ బాఠంబులు సెప్పుట తమకనుకూలంబుగాదు. వేఱొండు గురునాశ్రయించి విద్యఁగఱచుటకు మామనంబు లొల్లకున్నయవి. మాకు విశ్లేషకష్టంబు లనుభవింపక తప్పకున్నట్లున్నయది కావున నమస్కరించి సెలవుదీసికొనెదమని చెప్పి స్వామీ! భవచ్చరణసేవాలబ్ధ పూర్వాభ్యస్త విద్యావిషయంబులుమాత్రము మేమెన్నండును మఱవకుండునట్లనుగ్రహించి మమ్ము దీవింపుఁడని కన్నీళ్లు వెట్టుకొన నిరువదిమూఁడేండ్లప్రోడ యగు గౌరాంగుండు బాలకు నట్లశ్రుపూరితనయనుండై మాటలాడనేరక శిష్యుల వేర్వేఱుగఁ జేసన్నలుచేసి పిలిచి తొడపైఁ గూరుచుండఁబెట్టుకొని మూర్ధంబు మూర్కొని ముద్దాడి దివ్యానందకరం బగునిజకరంబున శరీరంబునిమిరి యెట్టకేలకు వారలతో హీనస్వరంబున నిట్లనియె. 123
ఉ. పాయుటతప్పదయ్యె నెడఁ ♦ బాయుటకున్మను దుఃఖసూదనో
పాయ మొకండు సెప్పెదఁ గృ ♦ పామతిఁజేయుఁడు నిత్యసౌఖ్య సం



ధాయిరమాపతిన్ హరిని ♦ నర్మిలిఁ బాడుద మొక్కసారి యీ
చేయుటనెంచెదజ్జదువు ♦ సెప్పిన దానికుపాయనంబుగన్. 124
గీ. కృష్ణసంకీర్తనమున నా ♦ హృదయతాప
మెల్లఁ జల్లార్పఁదగుమీర ♦ లిదివఱకును
గురుఁడనైతినిమీకు నీ ♦ కూర్మియైన
నెంచి యించుకమోమోట ♦ ముంచుఁడయ్య! 125
వ. అందులకు వారిట్లనిరి. 126
గీ. కృష్ణసంకీర్తనంబన ♦ నేమొ మాకుఁ
దెలియదు మహాత్మ! మాకద్ది ♦ తెలియఁబఱచి
పాడుఁ డిట్లనిచెప్పినఁ ♦ బాడఁగలము
మీదునాజ్ఞకు మాకెక్కు ♦ డేది యిలను? 127
సీ. అంత నానిమి గడు ♦ సంతసంబున జగ
న్మోహనాకారుఁ డం ♦ భోజనయనుఁ
డతిదయాళుఁడు సచ్చి ♦ దానందపురుషుఁడౌ
శ్రీకృష్ణమూర్తిని ♦ జెలఁగిపాడు
దమనుచు నడుమను ♦ దా భక్తివిగ్రహం
బట్ల యాసీనుఁడై ♦ యాత్మశిష్యు
లుతనచుట్టును గోడ ♦ వితమున నిలుచుండ
నఱమోడ్పుఁగన్నుల ♦ హస్తయుగము
గీ. తొడఁ దాళము వేయుచు ♦ తుంగమధుర
రమ్యగంభీర కంఠస్వ ♦ రంబుతోడ
జోత శ్రీకృష్ణవిభునకు ♦ జోతహారిక
టంచుఁ బాడెను మోదవి ♦ హ్వలతఁజె 28
క. ఈపగిదిఁ బాడుచుండఁగ

నేపారుచు భక్తిరసము ♦ హృదయమునిండన్
వ్యాపింపనూరెనశ్రులు
గూపాంబువులట్లు నిమిక ♦ గొలుకుల వెంటన్. 129

సీ. గౌరాంగుచూపులుఁ ♦ గంఠస్వనంబును
నొడలికంపంబు శి ♦ ష్యులకునెల్ల
మైకంబుపుట్టించి ♦ లోకవస్తుజ్ఞాన
మెడలించి పరమాత్మ ♦ కడకులాగి
భక్తిరసావర్త ♦ సక్తులఁగాఁజేయ
గురుభంగివారును ♦ గెరలి కృష్ణుఁ
బాడుచుఁగొందఱు ♦ వడిరి భూతలమునఁ;
గొందఱు నర్తనం ♦ బందుదిగిరి;
ఆ. వెఱ్ఱివారిపగిదిఁ ♦ బెద్దనవ్వులునవ్వి
రందుఁ గొంద; ఱెద్ది ♦ యంతవినుచు
వచ్చినట్టి పొరుగు ♦ వాగలుఁగూడ నీ
యోజసేచరించి ♦ రొడలుమఱచి. 130

క. అందఱు శ్రీకృష్ణుఁడేతమ
ముందఱ నున్నాతఁడంచు ♦ ముదితాత్మకులై
పొందళుకుమేని నిమికి
స్పందనములుసల్పి రతని ♦ పదముల చెంతన్. 131

గీ. భక్తి సంకీర్ణహృదయక ♦ వాటములను
దెఱవ నిమి-గాన, మంతటఁ ♦ దెలిసికొనిరి
శిష్యులమలాత్ములాటను ♦ జేసి నంద
నందనునిసేవ యొంతయా ♦ నందకరమొ. 132

గీ. జంతువులపోల్కి మూఢత ♦ సంచరించి



యింతవఱకును జెడినార ♦ మేమటంచు
వారిలోఁ బెక్కు రత్యంత ♦ భక్తియుక్తిఁ
జేసి నాఁటఁగోలెను హరి ♦ దాసులైరి. 133

చ. పవననిరోధకృత్యములఁ ♦ బస్తులఁ బర్ణజలాశనంబులన్
సవనముల న్శరీరజవ ♦ సత్వహృదాగమచోదితోరుక
ర్మవులను మానవాళికిఁ బ్ర♦మోద మొకించుక గల్గుఁగాక భ
క్తివలనఁగల్గు మోదనిధి ♦ కిన్సరిరా దదియెట్లుసూచినన్. 134

క. ఈసత్యమె గౌరాంగుఁడు
సేసిన తొలికీర్తనంబు ♦ చెప్పెడు; సద్భ
క్త్యాసవతుచిఁ గనఁ బఱుచుట
కీసరణిని లీలఁజూపెఁ ♦ గృష్ణుఁడు ప్రజకున్. 135

ఆ. స్పర్శవేధియనుము ♦ స్వర్ణంబుఁజేసెడు
పగిది నిమియొనర్చె ♦ భక్తులుగను
దివ్యసుఖదమగుచుఁ ♦ దేజరిల్లెడు కర
స్పర్శమునను మూఢ ♦ జనమునెల్ల. 136

గీ. కారుకఱకుటినుముఁ బంటి ♦ వారిఁ దప్త
కాంచనోజ్జ్వలులుగఁజేసె ♦ గానములను
భక్తినర్తనముల నిమి ♦ వహ్ని సదృశ
కాయశోషకములవారు ♦ గంధకుండ. 137

క. శరవిసరతుల్యబాహ్యాం
తరకష్టము లేచినరులఁ ♦ దల్లడపెట్టన్
గరుణించికావరామా!
ధరలోపల నీవుదక్క ♦ దైవముగలఁడే? 138

శ్రీరస్తు.

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః

# శ్రీ గౌరాంగచరిత్రము.

## సప్తమాశ్వాసము.

చ. జనకుఁడు లేచిపొమ్మనిన ♦ జానకి వెంటను బెట్టికొంచుఁ గా
ననములకేగె రాఘవుఁడు ♦ నానొక వెంగలియంచుఁ గూళుల
న్నను నలరావణానుజుఁడు ♦ నారదుఁడు న్బవనాత్మజుండుఁ గాం
చిన యెనలేని నీమహిమ ♦ చెందునెరామ! కొఱంతలేశమున్! 1

సీ. చెప్పినఁగాని తాఁ ♦ జేయఁడు స్నానంబుఁ
దినుమన్నఁగాని తాఁ ♦ దినఁడుతిండి
యెక్కడనో పెట్టు ♦ హృదయంబుఁగొనిపోయి
పూర్ణవిస్మృతిఁగూడఁ ♦ బొరయుఁదఱచు
భక్తిభరోద్భూత ♦ బాష్పముల్చెక్కులఁ
గార్చును మాటయొ ♦ క్కటియుననఁడు
పలికెనే శ్రీకృష్ణ ♦ పదముదక్కను వేఱు
మాటరానీయఁడు ♦ నోటనెప్పు
గీ. డొరులఁజూచుటకును బెట్టు ♦ వెఱచువార
లెప్పుడేనెదురైనను ♦ హృద్గతార్తి



బయలుపడకుండఁ జేయఁగాఁ ♦ బడును బాట్లు
నెగ్గు జతనంబులొకసారి ♦ నెగ్గకుండు. 2
ఆ. అంతరంగభక్తి ♦ నన్నియు మఱచియు
న్నట్టినిమికి నెట్టి ♦ హాని గలుగ
కుండ సతనితోడ ♦ నుందురు చెల్మికాం
డ్రైన యాగదాధ ♦ రాదులెపుడు. 3
చ. సమయమిదేయటంచు నిమి ♦ శాత్రవబృందములోని పండితు
ల్దమతమదుష్టచిత్త పరి ♦ తాపములన్నియుఁదీఱ వానిస
ద్మమునకునేగి యోశచి! ప్ర ♦ మాదముపుట్టెను బిచ్చివట్టె మీ
నిమికనిపల్కి యామెహృది ♦ నిం గలగుండును బెట్టిరెంతయున్. 4
వ. పెట్టియందుంగొంద ఱామెతో నిట్టనిరి. 5
క. కట్టి యొకచోటఁ జప్పిడి
రొట్టెలు నీరంబునెల్ల ♦ ప్రొద్దులనిడుచున్
గట్టి చికిత్సలుసేసినఁ
బట్టినయీపిచ్చి వీని ♦ వదలునొ యేమో. 6
క. వెఱవక తెలివా! నిమి రా
త్రియందుం బగటియందు ♦ దీకుగ గిటం
జొరఁబెట్టి యుంచితేనిఁ గు
దురుపడవచ్చునని రీర్ష్య ♦ తోఁ గొందఱరుల్. 7
వ. ఇట్టిమాటలు వినివిని బెగ్గడిలి శచి యొక్కనాఁడు నిమియొద్దకేగి తండ్రీ! నీతెఱంగుసూచినను బ్రజలాడుమాటలువినినను నాబొంది లోఁ బ్రాణంబులు నిలువకున్నయవి సత్యంబుగా నీకిప్పుడెట్లున్నదో చెప్పఁగదరాయన నాతండిట్లనియె. 8
గీ. ఎఱుఁగుదును నామవిస్మృతి ♦ యెరియఁజేయు

నీమనంబనియెంత దా ♦ నిని నణంచు
కొనినసేపోలిపడిపోదుఁ ♦ గనులనుండి
యశ్రుధారలు గాఱుట ♦ యాఁగదమ్మ. 9

గీ. బల్మిచే నొంతపట్టిన ♦ వాసుదేవు
దరికె చిత్తంబుగమ్మఱ ♦ నరుగుఁదల్లి!
క్రిందకును లాగివిడిచిన ♦ వృక్షశాఖ
చివ్వునను వినువీథికిఁ ♦ జేరుపగిది. 10

క. అన నేమియుఁదోఁచక శచి
తనవల్లభు ప్రాణమిత్ర ♦ తతిలో నొకఁడై
తనరెడు శ్రీవాసుకడకుఁ
జని యేడ్చుచు విన్నవించె ♦ సర్వమతనికిన్. 11

ఉ. అంత నతండువచ్చి ప్రమ ♦ దాశ్రులు గాల్వలుగట్టి చెక్కులం
దంతములేక కాఱ నయ ♦ నాంబుజము ల్తరుణారుణప్రభా
క్రాంతములై కనంబడఁగ ♦ రాజిలు నాతనిఁజూచి నివ్వెఱన్
జెంతనునిల్వఁగాంచి నిమి ♦ సేతులు మోడిచి లేచె దిగ్గునన్. 12

వ. లేచి యతివినయంబున. 13

ఉ. దూసినకత్తిపోలె సమ ♦ దుండయి పూర్వము బాల్యమందునన్
వాసి వయస్సునుంగనక ♦ పైఁబడి గేలియొనర్చినట్టి శ్రీ
వాసుని పాదపద్మములఁ ♦ బట్టి నమస్కృతిసేసి వైష్ణవా
గ్రేసర! యంచుసోలి యొఱ ♦ గె న్నిమి, భక్తిభరాకులాత్ముఁడై. 14

సీ. నిమియింటికరిగిన ♦ నిమిషంబునుండియు
శ్రీవాసుఁ డతనిపై ♦ దృష్టిఁబఱపి
లక్షణంబులు సక ♦ లంబును శ్రద్ధతోఁ
దిలకించి మతకోశ ♦ ములను భక్త



వరులదేహమునఁ గ ♦ న్పట్టునన్నట్టి చి
హ్నములన్ని గౌరాంగు ♦ నందుఁగాంచి
పులకితాంగంబుతోఁ ♦ బుత్తడిబొమ్మలా
గుననొద్ద విస్మృతిఁ ♦ గూలినట్టి

ఆ. దివ్యమంగళాకృ ♦ తిని తెప్ప వేయక
చూచిచూచి శిరము ♦ నూఁచియూఁచి
యిట్టిపూర్ణభక్తి ♦ యెటులబ్బెరాకుఱ్ఱ
వాఁడనీకటంచు ♦ వగచుచుండె. 15

వ. ఇంతలో గౌరాంగుండు మఱల స్మృతికివచ్చి దీనాననంబుతో శ్రీవా
సుంజూచి యిట్లనియె. 16

మ. మదిపాడౌటను నీకుమారునకును ♦ న్మాదంబువాటిల్లెనం
చు దురుక్తుల్ప్రిజలాడ నాజనని య ♦ స్తోకార్తి వైక్లబ్యయై
యెదియున్దోఁచకయున్నదీవిపుడు న ♦ న్వీక్షించి నారోగము
న్నదియున్నట్టులు సెప్పి పోవఁగదె పు ♦ ణ్యాత్మా! దయాంభోనిధీ

క. నాతండ్రికి నెయ్యుండవుఁ
బాతకహర కృష్ణపాద ♦ భక్తుండవునీ
వే తెంచితి మాపుణ్యము
చేతన్శ్రీవాస! మాకుఁ ♦ జెప్పుమ నిజమున్. 18

క. కలతెఱఁగు విన్నవించెద
వలసిన నేనెన్నిపాట్లు ♦ వడిన నుడుగక
శ్రులువడి నూరుచు నాక
న్నులనుండి స్రవించు వాహి ♦ నులచందమునన్. 19

క. ఇదిదక్కఁ జెప్పుటకు నొం
డెదియున్లేదనుచు నుడువ ♦ నెలనవ్వులతో

ముదిపాటుండౌ శచిదెస
కుఁదిరిగి యిట్లనియె ముదిత ♦ గుందతిచెలఁగన్. 20

శా. తల్లీ ! మూఢులువల్కుమాటలకుఁ జిం♦తంజెందుచున్నట్టు భీ
తిల్లంజేయకు నీమనంబు; జడులీ ♦ దివ్యార్థవిజ్ఞాన మె
ట్లుల్లంబందు గ్రహింపఁజాలుదురు బ్ర♦హ్మోపాసనాదిత్య సం
ఫుల్లస్వాంత సరోరుహుండుసుమి నీ ♦ పుత్రుండు నారీమణీ. 21

ఆ. అమ్మ ! నీతనూజుఁ ♦ డద్భుతంబులుసూపు
నీవెముందుగాంతు ♦ వేవచింప
నేల ? భక్తియింత ♦ యెదనుంటసూచించు
వచ్చెదేవుఁడనియొ ♦ వచ్చుననియొ. 22

వ. ఈమాటలకు నిమి యమందానందహృదయుండయి శ్రీవాసుతో ని
ట్లనియె 23

చ. జనములు నేనువెఱ్ఱినన ♦ సాగిరి; నీవును నట్లెచెప్పియుం
డిన నిటువంటిదూఱుపడ ♦ నేరక గంగనుఁజొచ్చి ప్రాణముం
దుననిడనున్న నన్ను దయ ♦ తోడుతఁబ్రోచితి దీనరక్షకా !
నిను నొకసారి గట్టిగను ♦ నమ్మిని గౌఁగిటఁ బట్టనిచ్చెదే ? 24

వ. అని సమస్త చరాచర ప్రపంచరక్షణ దక్షంబులగుభద్రోజ్జ్వల శస్త
హస్తంబులచే గౌరాంగుండు శ్రీవాసుంగదియంబట్టిన ననిర్వాచ్యం
బప్రతిమానం బసామాన్య జనానుభూతంబగు నొకవిలక్షణానందర
సం బాపాదమస్తకంబును బ్రసరింప నతండు మత్తిలి నిశ్చేష్టితుం
డై కొంతవడికిం బ్రపంచజ్ఞానంబు క్రమ్మఱఁ బడసి నిమివంకకుఁజూ
డ్కులంబఱపి యల్లన నిట్లనియె. 25

శా. ఈరారాజితదివ్యభక్తియె జనుల్ ♦ హీనాత్ములున్నాదమం
చూరంజాటిన ? దిందునాకొపఁగెదే ♦ యొక్కింత ? వమ్మాను సం
సారార్తిచ్ఛట ; నాగృహంబునకు ని ♦ చ్చల్వమ్ము తేపొద్దులన్
గౌరాంగా ! హరిఁగూడి కొల్తమెదఁగాఁ ♦ గంబోకుతుచ్ఛోక్తులన్



గీ. శాంతపురుషుఁడు నిష్వారు ♦ మహాప్రధానుఁ
డాత్మసంవేత్తయున్మత్తుఁ ♦ డంగనలకు
లొంగనిజితేంద్రియుఁడు షండ ♦ పుంగవుండు
కాక నామకదుర్మార్గ ♦ లోకమునకు. 27

వ. అనిపలికి యాశ్చర్యమగ్నుండైయున్న శ్రీవాసుంజూచి. 28

గీ. వల్లెయనె నిమిప్రమదిత ♦ స్వాంతుఁడగుచు
శచికి నలజడియొకకొంత ♦ సడలెఁగాని
గుండెలో వెన్క విశ్వరూ ♦ పుండొనర్చి
నట్టిపుండును రేపె గౌ ♦ రాంగు తెఱఁగు. 29

గీ. పెద్దకొడుకైహికవిషయ ♦ విముఖుఁడిట్లె
యగుచు సన్న్యాసియైపోయె ♦ నమ్మ ! వీని
కృష్ణభక్తియుఁ గ్రమముగాఁ ♦ గెరలి యొక్క
బిడ్డనింగూడ నెడఁబాపి ♦ వేయునేమొ ? 30

వ. అని శచి లోలోపలం దలంకుచుండియుఁ గొమరునకు వెఱ్ఱిలేదని ప
రీక్షించి చెప్పినందులకు శ్రీవాసునకుఁ గృతజ్ఞతాభివందనం బొనర్చె
నతండును వారివీడ్కొని నిజసదనంబునకుం జనియె. 31

క. జాతిని నాతింజేసితి
క్రోఁతింజేసితివి భక్త ♦ కుంజరునిగ, నీ
చేతికి రఘురామా ! ఘ
త్పాతకహరణంబు పెద్ద ♦ పనిగాదుసుమా ! 32

శ్రీరస్తు.

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః

# శ్రీగౌరాంగచరిత్రము.

## అష్టమాశ్వాసము.

చ. వడివడిరాలుభక్తిభవ ♦ బాష్పకణంబుల నేటినీళులన్
గడిగి గుహుండునీచరణ ♦ కంజములం, దరియించె, నట్టినీ
యడుగులనొక్కసారి యిటు ♦ లందఁగనిచ్చెదె నాకుఁగూడ? నీ
జడునకు సంశయాత్మునకుఁ ♦ జాఁతునె నేననకుండ రాఘవా! 1

సీ. దృఢసమున్నతకుడ్య ♦ వృతమందిరంబు శ్రీ
వాసునకుండన ♦ ప్పట్టునందుఁ
దనసోదరులు మువ్వు ♦ రును దాను నేకభాం
డాశనులయ్యు వే ♦ ఱైనయిండ్ల
వసియించుచుండి రీ ♦ వాసముల్గాక వే
ఱొండుగృహంబందు ♦ నుపలఖచిత
దైవవిగ్రహమును ♦ స్థాపించి నిత్యంబు
శ్రీవాసుఁడర్చన ♦ ల్సేయుచుండె
గీ. నిట్టిచోటికి గౌరాంగుఁ ♦ డేగుదెంచు
ఱేలభజనంబునకని యె ♦ ఱిఁగి గదాధ



రుండును మురారియును ముకుం ♦ దుండుఁ దక్క
భక్తులనుగంగసాగిరి ♦ ప్రతిదినంబు. 2

సీ. గౌరాంగుఁడన్ననో ♦ వారును వీరును
దెవులనిపల్కు వి ♦ స్మృతవిచిత్ర
నిజమనస్థితిని గా ♦ న్పించెదులక్షణం
బులు డాఁపఁజూడఁడు ♦ చెలులయెదుటఁ
గాని తానెఱుఁగని ♦ మానవులెదురైనఁ
గడఁగునెంతయువానిఁ ♦ గప్పివైవ
నుదయంబునసఖి స ♦ ముదయంబుతోఁగూడి
చని గంగకచ్చట ♦ స్నానమాడుఁ
గీ. దనకు నత్తఱిభక్తులు ♦ దారసిలినఁ
జాఁగిలింతలుసేసి త ♦ చ్చరణములకు
వారిబట్టలుపిడిచి పు ♦ ష్పములుమోచి
పలుతెఱంగుల నుపచార ♦ ములను జేయు. 3

క. అదిచూచి వారలిది నీ
కుఁదగునె విద్యాసముద్ర! ♦ కోవిదమాళీ!
యొదివెడు నశ్రులతో మా
పదములపై వ్రాలుటందు ♦ పరితాపమునన్. 4

క. అంత శిలాసదృశములగు
స్వాంతంబులనైనఁ గరఁచఁ ♦ జాలినదైన్యా
క్రాంతమగు ముద్దుమోమున
నెంతయు వినయంబున నిమి ♦ యిటువారికనున్. 5

ఉ. భక్తులుగాఁగనంబడెడు ♦ వారిని సేవలచేతఁ దన్పినన్
ముక్తసమస్తకిల్బిష స ♦ ముజ్జ్వల మానసుఁడౌచు గోపికా

నక్తుని జిన్నికృష్ణుఁ గనఁ ♦ జాలును మానవుఁడంద్రు పెద్దలీ
యుక్తులఁ బాటిగాఁగొనుట ♦ యొప్పునొ యొప్పదొ మీరె చెప్పుఁడీ!

గీ. ఈవిధంబుననైన శ్రీ ♦ కృష్ణవిభుని
జూడఁగల్గుదునో యేమొ ♦ చూడ్కులలర
నంచుఁ బేరాసతో నున్న ♦ యట్టినాకు
నడ్డుగావత్తురయ్య మ ♦ హాత్ములార? 7

క. అను దీనాలాపంబుల
విని మఱుమాటాడలేక ♦ వేగమ శ్రీకృ
ష్ణునిసందర్శనమును బొం
దునిమీ! యని దీవనలిడు ♦ దురు వారలొగిన్. 8

గీ. కృష్ణుకరుణను బడసెద ♦ వీవునిమి! యు
టన్న దీవన కానంద ♦ మందియతఁడు
కృష్ణభక్తులకృప నాకు ♦ నెపుడుగల్గె
నప్పుడే కృష్ణుకృపగల్గె ♦ నంచునుడువు. 9

గీ. సత్యమును నిష్కపటతయుఁ ♦ జారిమంబుఁ
దనువుఁగైకొనివచ్చెనో ♦ ధరణికనఁగ
వఱలు గౌరాంగుఁజూచిన ♦ వారిలోనఁ
గరఁగి చొక్కనియాతఁడొ ♦ క్కరుఁడు లేఁడు. 10

వ. వైష్ణవసంఘప్రధానుండై నవద్వీపంబున భక్తశ్రేష్ఠుం డగునద్వైతుఁ డుండెనని మున్నె చెప్పంబడియె. ఆతనిగృహంబున భక్తివైరాగ్యసంపన్ను లప్పుడప్పుడుగూడి మతగ్రంథంబులు చదువుటయు వేదగానంబు సల్పుటయు వేదాంతసంభాషణంబు లొనర్చుటయుఁ గృష్ణసంకీర్తనంబు సేయుటయుంగలదు. అట్టి యొండుసమయంబున నొక్కవైష్ణవుండు లేచి "సమస్తశాస్త్రసంపూర్ణపరిజ్ఞాగర్వంబున



నెంతెంత వారినోడించి విద్వన్మత్తేభంబులకు సింహస్వప్నంబై కొంటెతనంబున మతంబును బెద్దల వెక్కిరించుచుండు నిమి పండితుం డిప్పు డతినమ్రత్వంబుననన్యసామాన్యభక్తిం దాల్చి మర్త్యులందాఁటిన మహాపురుషుండై యున్నవాఁడ" ని విన్నవించిన నదివిని యద్వైతాచార్యుం డాశ్చర్యచిహ్నంబు లాననంబుపైఁ గానంబడ నిట్లు చింతించె. 11

సీ. మొదటినుండియు నిమి ♦ మూర్తియందొకవిల
క్షణమైనదెద్దియో ♦ కాంచుచుంటి
వాఁడు నాల్గైదేండ్ల ♦ ప్రాయంపుబాలుఁడై
తనయన్న విశ్వరూ ♦ పునిగృహంబు
నకుఁ దీసికొనిపోవ ♦ నాయింటికిని దల్లి
పన్పునఁ దఱచుగా ♦ వచ్చువాఁడు
నాదృష్టికినిమహా ♦ నందకరుండౌచుఁ
దోఁచెను గృష్ణభ ♦ క్తుఁడను నేను

గీ. పట్టిపైవన్నెలకుఁ జిక్కు ♦ వాఁడఁగాను
దక్కుబాలురకడలేని ♦ యొక్కదివ్య
తేజమాతని కాంచన ♦ దీప్తకాయ
మందు లేఁజూపుఁ దామర ♦ లందుఁగంటి. 12

ఆ. ఆతఁడెవ్వఁడంచు ♦ నప్పటినుండియుఁ
నూరకెదఁ దలంచు ♦ చుంటిఁగాని
నిన్నరాత్రివఱకు ♦ నిమియిట్టివాఁడని
సత్యమేనెఱుంగ ♦ జాలనైతి. 13

శా. గీతాంతస్థము శ్లోకమొక్కటి ననుఙ్ ♦ గ్లిష్టార్థమై యేఁచఁగాఁ
జేతోవీధిని నాదుసంశయము వి ♦ చ్ఛినంబుగాఁ జేయు మో

నేతా! యంచుపవాసముండి హరినిం ♦ దీవ్రంబుగా వేఁడి క
న్న్యాంతంజెందఁగ నేను నిన్నుఁగలనో ♦ డుంగంటి నేఁబ్రొద్దునన్. 14

శా. అందుం బేరనుబిల్చినన్నొకరుఁడో ♦ యాచార్య! లెమ్మంచు నా
సందేహంబులుదీర్చి యింక వనట ♦ న్జాలించి శాంతింపుసా
క్రిందపేక్షితమైన నీదుమనవు ♦ ల్లర్ణంబులంబెట్టుతాఁ
కందో తెంచితినేనె మోక్షగతి లో ♦ కంబందు బోధింపఁగన్. 15

క. అనిపల్కిననేఁ గనువి
చ్చి నిమిఁగనినాఁడ నెదుటఁ ♦ జిత్తజరూపున్
గనుచుండఁగనే మఱలన్
జనెనెటకో యాతఁ డింద్ర ♦ జాలికుపగిదిన్, 16

గీ. చిత్తవిభ్రమమో? యేమొ ♦ చెప్పలేను
గాని నిమి నాకుఁగలలోనఁ ♦ గనఁబడినది
మొదలుకొని యెన్నఁడును నేను ♦ బూర్వమందు
ననుభవింపని యానంద ♦ మందుచుంటి. 17

ఆ. తండ్రిపండితుండు ♦ దాతయుః బండితుం
డతఁడు పండితులకు ♦ నధికుఁడయ్యె
నట్టివాఁడు భక్తుఁ ♦ డయ్యెనేఁ బరమోప
కారియౌను బ్రజకు ♦ దారిసూపి. 18

మ. నరులంహోభుజగంబువాతఁబడి య ♦ జ్ఞానాంధకారంబునన్
దెసవున్గానక యున్నవారరయనెం ♦ తేఁ గష్టమౌ నాకయో!
కరుణాంభోనిధి! కృష్ణ! భూమిజనుల ♦ న్గాపాడరావయ్య చె
చ్చెరనంచెప్పుదు వేఁడికొంముఁగద! నా ♦ చిత్తంబున న్భక్తితోన్

గీ. ఆతఁడే యాతఁడౌనేమొ ♦ యట్టులైన
నెప్పుడో తాను నాయొద్ద ♦ కేగుదెంచి



తానె నాముద్దుఁగృష్ణుఁడం ♦ చేనెఱుంగు
నట్లుసేయఁడె? విధిగాదె ♦ యతనికిద్ది? 20

వ. అని యిట్లు తలంచుచుండ. 21

శా. పూతాత్ముండును భక్తవర్యుఁడగువి ♦ ప్రుండంచు మాతాపితల్
చేతుల్మోడ్చి నమస్కరించు పురుష ♦ శ్రేష్ఠున్ జగన్మాన్యు న
ద్వైతున్జూచి తదంచితాశ్రయబల ♦ ప్రాప్తిన్గనం గల్గుదున్
వేతల్గాంచిన కృష్ణునంచునిమి యు ♦ వ్విళ్లూరుచుండెన్మదిన్ 22

ఆ. అచ్యుతాంఘ్రియుగ్మ ♦ మందఁగాఁ జేయ న
ద్వైతచరణయుగమె ♦ పరమపావ
నమగునిచ్చెనయగు ♦ నాకుఁ గృష్ణునిఁజూపు
మనుచు నచటికేగి ♦ యడుగువాఁడ. 23

ఆ. నేను బాపినతఁడు ♦ నిర్మలాత్ముండైన
భక్తుఁడతనిఁజూచి ♦ పలుకుటెట్లు?
చనెదనే గదాధ ♦ రునిదీసికొని వెంట
నరిగి మ్రొక్కులిడుదు ♦ నతనిమ్రోల. 24

వ. అని యోజించి గౌరాంగుండు గదాధరుని వెంటంబెట్టుకొని యద్వై
తాచార్య గృహంబునకేగి భక్తినిమీలితనయనుండై భగవధ్యా
నంబుసేయుచుఁ బ్రపంచజ్ఞానంబు లేశంబును లేక నిష్ఠాబ్ధి మునింగి
యున్న యావృద్ధభక్తమౌళింగాంచి దగ్గఱి నమస్కరింపనుద్యమించి
యించుకసమీపించి పరవశుండయి యొక పెద్దకేఁకఁగూఁతతో నే
లంగూలె. 25

సీ. పాతంబురవమున ♦ ద్వైతుసమాధినుం
డితోలఁగింపఁగనె యు ♦ న్మీలితాక్షుఁ
డౌచు మూర్ఛను బలె ♦ నవనిపై పడియున్న

నిమిఁజూచి వెన్కటి ♦ నిసినిగాంచి
నట్టిస్వప్నంబెంచి ♦ యారా ! యీబంగారు
బొమ్మ మతగ్రంథ ♦ ములను జెప్పఁ
బడిన యాశ్రీకృష్ణు ♦ పావనవిగ్రహం
బట్లుకాన్పించెడు ♦ నసితవర్ణుఁ
ఆ. డాతఁడితఁడు కరఁగి ♦ నట్టికడానిమై
చాయవాఁడు భేద ♦ సరణియింతె
యొడలిపైనిదోఁచు ♦ నొకదివ్యతేజమం
చతఁడుచింత సేసె ♦ నతిముదమున. 26
క. కనుఱెప్పలవ్రాల్చక చూ
డనుజూడను భక్తియుత్క ♦ టంబై మితిమీ
ఱినసంతోషం బద్వై
తునకుం గలుగంగ, గగురు ♦ తోనిట్లనియెన్. 27
ఉ. వచ్చితె ముద్దుఁగృష్ణ? కృప ♦ వచ్చెనె నాపయినిన్ని నాళ్లకున్ ?
జొచ్చితె నాగృహంబునను ♦ జూడఁగ నేఁడెన లేనివిందవై ?
ముచ్చటదీఱెనీదునును ♦ మోముఁగనుంగొనఁ బాపసంచయం
బిచ్చటనే నశించెనిఁక ♦ నేమనిచెప్పుదు నాదుభాగ్యముల్. 28
గీ. దీనుఁడనగు నన్జూడనే ♦ తెంచి నాకు
నోజగన్మోహనాకార ! ♦ యొసఁగితీవు
నీదుదర్శన; మిదినీకు ♦ నిఖిలజీవ
రాశిపైఁగల్గు కరుణను ♦ బ్రకటపఱుచు. 29
గీ. ఎల్లయెడలను వ్యాపించు ♦ నల్ల సచ్చి
దాత్మ యీజాళువామేను ♦ నందుఁదూఱి
కడలఁగాంతులుచిమ్ము చె ♦ క్కరణిఁగ్రాలుఁ



బ్రథితకాచపాత్రస్థదీ ♦ పంబువోలె. 30
మ. అని యద్వైతుఁడు గృష్ణుఁడేసరిగనీ ♦ యాకారముం దాల్చి వ
చ్చెనటంచాత్రముతోడనేగి కుసుమ ♦ శ్రీగంధగంగాంబువుల్
గొనియేతెంచి పదంబులంగడిగి కై ♦ కొమ్మర్చనల్దేవ ! యం
చు నిమిద్దైవమునట్లుకొల్వఁదొడఁగెన్ ♦ శ్లోకంబులంబాడుచున్. 31
గీ. ముసలివాఁడును భక్తుఁడుఁ ♦ బూర్ణవేత్త
యైన యద్వైతుఁడిట్లు గౌ ♦ రాంగుఁబూజ
సేసి మ్రొక్కుటచూచి ని ♦ శ్చేష్టితుఁడయి
యనియెనిట్లు గదాధరుం ♦ డతనితోడ. 32
ఉ. భావజసుందరుండు చిఱు ♦ పాయపుఁబాలుఁడు పెద్దవారికిన్
సేవలుసేసి దీవనలఁ ♦ జేకొనఁబాత్రుఁడుగాని వారిచే
సేవలు గైకొనన్దగఁడు ♦ శిష్టుఁడవయ్యును బిల్లవానికిన్
సేవలుసేయ నీకెటులు ♦ చెల్లెనొ ధర్మువెఱుంగువానికిన్. 33
గీ. ఏమియద్వైత ! డెబ్బది ♦ యేనువర్ష
ములు వయస్సయ్యు నీకిట్టి ♦ బుద్ధిపుట్టెఁ ?
గుసుమకోమలుఁ డీబాల ♦ కుండు గొలిచి
మ్రొక్కుటకుఁ జేతులెట్లాడె ♦ నొక్కొ నీకు ?
మత్త. ఈగతిన్గినుకన్వచింపఁగ ♦ వృద్ధవిప్రుఁడు వానితో
నోగదాధర ! యేమిసేసితి ♦ నూరకాఁకరమొందె దేఁ
జాఁగిలింతలొనర్చుటెగ్గును ♦ జల్పదీతనికెన్నఁడున్
వేగఁజూతువు నీవెయీనిమి ♦ వేఁడోయంచనినవ్వుచున్. 35
ఆ. నీదుముద్దులొలుకు ♦ నెయ్యుఁడీతఁడు జగం
బునను నందఱకును ♦ ముద్దులాఁడు
సొగసుచూచికాదు ♦ చొక్కినే మ్రొక్కుట

యనగదాధరుండు ♦ మనమునందు. 36

గీ. ఈతఁడన్నట్టునిమిబాల ♦ కృష్ణుఁడేమొ?
కానిచో నిట్టిభక్తాగ్ర ♦ గణ్యుఁడైన
వాఁడు వానినిబూజింప ♦ వచ్చునెట్లు?
మాన్యుఁడద్వైతుఁ డరయసా ♦ మాన్యనరుఁడె? 37

ఆ. అయ్యొ! నిమియెదైవ ♦ మైననింకతనితోఁ
గలసిమెలసియుండఁ ♦ గలనె నేను?
నన్ను నతనివేఁడొ ♦ నర్చును దైవత్వ
మేలుగట్లఁగోసి ♦ యెడపునట్లు. 38

వ. అని తలపోయుచుండ నింతలో నిమి మూర్ఛనుండి తెరలికనువిచ్చి తనమ్రోల మోఁకజేల్లంబడియున్న యద్వైతాచార్యుంగాంచి భయభక్తివిస్మయంబులు పెనఁగొన దిగ్గునలేచి యతనికి వినయంబున సాష్టాంగనమస్కృతిఁ గావించి యిట్లనియె. 39

శా. ఓయద్వైత! భవాబ్ధిలోఁబడితి శ్వా ♦ సోత్తంభనంబయ్యె న
త్యాయాసంబుననుంటిఁ జూడుమిటు కృ ♦ ష్ణాంఘ్రిప్లవోపాయసం
ధాయిన్నిన్బడయంగఁజాలితిని నే ♦ ధన్యుండనైతిన్మహా
త్మా! యాలస్యముసేయకాయఖిలలో ♦ కాధీశుఁ జూపింపుమా! 40

క. అను దీనభాషణంబులు
విని యద్వైతుండు మౌన ♦ వృత్తినిదాల్పన్
జనియె గదాధరుఁ డింటికిఁ
గని యాతనితోడఁ జనియె ♦ గౌరాంగుండున్. 41

వ. నిమి యింటికిఁజనినతోడనె తద్దివ్యరూప సందర్శనావేశ తీవ్రత్వంబు చల్లంబడ నద్వైతుండు సంశయాత్ముండై తనలోఁ దానిట్లు వితర్కించుకొనియె. 42



క. భ్రమపడితిని నేమతిచెడి
నిమి కృష్ణుండౌనొ కాఁడొ ♦ నిజమెటు తెలియున్?
నిమి యాతఁడెయైనను జూ
పుము కృష్ణునటంచు నన్నుఁ ♦ బొసఁగునె వేఁడన్. 43

గీ దిస్సమొలతోడ వీధులఁ ♦ దిరుగుచుండె
మొన్న మొన్నటిదాఁక నీ ♦ పోఱగాఁడు
పచ్చతోలునుజూచి నే ♦ భ్రమసినాఁడ
మనజగన్నాథుసుతుఁడు బ్ర ♦ హ్మంబటంచు. 44

ఆ. ప్రజలనవ్వులాట ♦ భరియింపఁజాలనీ
పురినివిడిచి నేను ♦ బుట్టినట్టి
శాంతిపురమునకును ♦ జనియెద నిమివచ్చు
విష్ణుఁడేనినన్ను ♦ వెదకికొనుచు. 45

వ. అని సిగ్గుపడి యిఁకనటనున్నఁ దలవంపులగుననుభీతిచే నద్వైతుండొరులెఱుంగకుండ నొకఱేయి నవద్వీపంబు వెలువడి శాంతిపురంబునకుంజని యచ్చట వసియించుచుండె. 46



క. కొంచియపుఁదెలివిఁ బుస్తక
సంచయముఁజదువఁ బెక్కు ♦ సందియములు బా
ధించెడు రామా! నన్ని
శ్చంచలాత్మునిగఁజేసి ♦ సౌఖ్యమొసఁగుమా! 47



శ్రీరస్తు.

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః

# శ్రీ గౌరాంగచరిత్రము.

## నవమాశ్వాసము.

శా. ముద్ధీరత్న బలాతిరేకమున నం ♦ భోరాశి లంఘించుటల్
యుద్ధంబందున లక్ష్మణుండిరుగఁ బ్రా ♦ ణోపేతుఁ గావించుటల్
సిద్ధించెన్మను మారుతాత్మజునకున్ ♦ జేకూఱఁగా నేవి, యా
శ్రద్ధాభక్తులు నాకొసంగఁగదె శ్రీ ♦ రామా! రమావల్లభా! 1

క. శ్రీవాసునియింటికి నిమి
పోవుచునుండఁగఁ బ్రతినిశ ♦ మున నావృద్ధుం
డావేశమహిమచే నా
నావిషయంబులతనివల ♦ న నెఱుఁగఁదలఁచెన్. 2

క. హరికీర్తనమునకు గదా
ధరుఁడాదిగ ముఖ్యమిత్ర ♦ తతిరాహృదయాం
తరగతరహస్యము బయలు
వఱుపఁగ నిమి గడఁగియంత ♦ వారలెస్మూర్ఛన్. 3

ఉ. వ్రాలి యొకింత సేపటికిఁ ♦ బద్మనిభాక్షులు విప్పిచూచి మి
త్రాళికి జాలిగొల్పు వద ♦ నార్తియు నశ్రులుఁదోఁపనయ్యో! గో



పీలలనామనోవిభుఁడు ♦ పేక్షితుఁడయ్యెను మాయమయ్యెనే
మూలనుడాఁగినాఁడొ యని ♦ ముచ్చిరె నాతఁడు చేడెకైవడిన్. 4

గీ. చేతివ్రేలిచ్చికొనిపోవు ♦ శిశువువిడిచి
తటుకుననుజెప్ప కెచటికో ♦ తండ్రివ్రోవ
దిగులుపడియేడ్చు నాబిడ్డ ♦ మొగముచూచి
యింకఁబనిలేదు నిమి మోము ♦ వంకఁజూడ. 5

గీ. నిమినిగూడినవారెల్ల ♦ నిమినిజూచి
వానివలె విలపింతురు ♦ మేనుమఱచి
స్మృతికివచ్చినపిమ్మట ♦ మతులుపోయి
యిట్లొనర్చితిమేమని ♦ యెంచికొంద్రు. 6

క. మనము నరులమో! సురలమొ!
మనమున్నదియుర్వియో! య ♦ మరలోకంబో!
మననిమి నిమియో! కృష్ణుఁడో!
యని వారుదలంచుకొందు ♦ రాశ్చర్యమునన్. 7

మ. ఉదయంబందున నింటికేగి నిమియె ♦ ట్లో రాత్రియాదాఁక మా
తదరి న్గాలముఁబుచ్చియంత నిజమి ♦ త్రవ్రాత మేతేరరం
డిదె శ్రీవాసునియింటికంచుఁ జనిలో ♦ హెచ్చిల్లి బాధించునం
గదచెప్పన్గమకించి కొంతయనిప ♦ ల్కన్లేక సోలున్వెసన్. 8

మ. చెలికాని న్మెడఁగౌఁగిలించుకొని నా ♦ శ్రీకృష్ణుఁజూపించి యు
ర్మిలిఁ బ్రాణంబుల నిల్పఁబెట్టుమని ప్రా ♦ ర్థించు న్గడున్; బిమ్మటన్
గలఁడే కృష్ణునిబోలువాఁడెచట నే ♦ కాలంబునందేని నె
చ్చెలి! నిన్నర్పణచేసికొమ్మతనికి ♦ న్శీఘ్రంబునన్ బ్రేముడిన్. 9

వ. వెనుక నెన్నిసారులోఁ దెల్పంబోయి యట్లొనర్ప లేకపోయిన యాధి రహస్యం బిప్పుడు విప్పిచెప్పంగలిగి నిమి తనమిత్రులతో నిట్లనియె.

సీ. వినుఁడిసోదరులు నా ♦ వనటకు హేతువు
మఱుపడఁ గనఁబడి ♦ మాధవుండు
చక్కనిబాలకుం ♦ డొక్కప్రొద్దునఁ దమా
లంబునునిరసించు ♦ డంబుతోడ
కేనూఱువరహాల ♦ వెలచేయుసారుతో
మరులుగొల్పెడుచూపు ♦ మెఱుపుతోడఁ
జిఱునవ్వువెన్నెల ♦ ల్చిమ్ము కెమ్మోవితో
ముద్దులుగుల్కు నె ♦ మ్మోముతోడఁ
గీ. గాళ్లచిఱుగజ్జియలు గల్లు ♦ గల్లనంగ
శ్రావ్యమృదుగాన నాట్యము ♦ ల్సలిపిచలిపి
నాకు నెదురుగవచ్చి యా ♦ నందమూర్తి
మించుప్రేమను నను గౌఁగి ♦ లించుకొనియె. 11
గీ. కృష్ణునాశ్లేషమనునది ♦ స్మృతికిరాఁగ
భక్తిపరవశతనుమాట ♦ పైకిరాక
మృతునిగతి నిమిగూలెను ♦ మేదినిపయి
గొడ్డటనుగొట్టఁబడ్డట్టి ♦ కుజముమాడ్కి. 12
ఆ. దేవుఁడవతరించి ♦ దివ్యభక్తిక్రమ
మవనిసజ్జనులకు ♦ నగపఱుపఁగ
నిట్లుసేసెఁగాని ♦ యిలనుపాస్యుండైన
వానికిట్టిప్రకృతి ♦ వచ్చునెట్లు? 13
క. ఈశ్వరపురి మును చెప్పిన
శాశ్వతసుఖసంప్రదాన ♦ సన్మంత్రంబీ
విశ్వంబున నెవఁడేనియు
విశ్వాసముతోఁ జపింప ♦ వెసముక్తుండౌ. 14



క. అని విస్పష్టంబుగ స
జ్జనపాళికిఁ బూర్వరాగ ♦ జనితాఖిల దుః
ఖనివారక లక్షణములఁ
గనఁబఱుపఁగ నిట్లుసల్పె ♦ గౌరాంగుఁడిలన్. 15
చ. పగటను రాత్రియందు వఱి ♦ వాతను సంజను నెల్ల ప్రొద్దులన్
దిగులు మొగంబున న్గదుర ♦ నీరధి పొంగినయట్టు లూరకే
పొగులుచు రాల్చుబాష్పములు; ♦ భోజనమున్బొనరింప కొక్కపె
ట్టుగనిమి యూర్చునూరుపులు ♦ డొక్కలు మిక్కిలిసంచలింపఁగన్.
క. తినునాతండ్రీ! యని శచి
తనతో మొఱవెట్టఁబెట్టఁ ♦ దాఁకుందుదకున్
మునివ్రేళ్లను నిమియన్నము;
వనమాలింగూర్చియంత ♦ వలవలపొక్కన్. 17
క. ఎంగిలిపడి వెనువెంటనె
చెంగటఁబండుకొని దిండ్లు ♦ చెవులున్దడియన్
బొంగిపఱతెంచు కన్నీ
ళ్లంగాఱుచు నిమ్నస్రవంతి ♦ లాగునఁబుడమిన్. 18
గీ. భక్తిబాహ్యచిహ్నంబులై ♦ పరగునవ్వు
స్వేదరోదన రోమాంచ ♦ చిత్తవిస్మృ
తులును గంపంబునిట్టివి ♦ తొల్లిరాధ
మేనఁబుట్టినవానికి ♦ మించిపోయె. 19
గీ. అశ్రుపూరితనయన దీ ♦ నాననంబు
భక్తితీవ్రత్వమున వసి ♦ వాళ్లువాఱు
నంగమును దోఁప నిల్చు గౌ ♦ రాంగుఁ జూచి
కంటఁ దడివెట్టకుండ నొ ♦ క్కఁడుఁ జనఁడు. 20

క. ఉదయాద్యాసాయము నిమి
వదలును గన్నీళ్లుభక్తి ♦ భరితాత్ముండై;
కదిసిన హరినామము చెవిఁ
జదికిలఁబడి ద్రొర్లియూర్పుఁ ♦ జలితాంగుండై. 21

ఉ. చీఁకటివడ్డచోసదిని ♦ శీఘనియో యుదయంబాయంచుఁ జీ
కాకునఁ దర్కముజ్జలుపుఁ ♦ గాదిదిరాత్రి, దివంబె, కానిచో
సీకరణి న్ప్రభాపటలి ♦ యేచునెయంచను భక్తిసంభ్రమో
ద్రేకజకాలభాగ విప ♦ రీతమతిన్నిమి వెఱ్ఱిచాడ్పునన్. 22

గీ. అమలభక్తి ప్రవాహంబు ♦ నాఁచికొనును
వింతవారలభక్తులు ♦ చెంతకరుగఁ
గూర్చువారలు చనుదెంచి ♦ కూరుచున్న
బాంగుఁగద! భక్తిపౌర్ణిమాం ♦ బుధివిధమున. 23

సీ. త్రోవలో నెదురయ్యె ♦ నే? వాసుదేవుండు
నామనోనాథుండు ♦ శ్యామలాంగుఁ
డెటకేగెనో చూఁపి ♦ తే? ప్రాణవల్లభు
నాజగన్మోహను ♦ నబ్జవదను
నెచటకుఁబరువెత్తె ♦ నెందుడాఁగెను నాదు
శ్రీకృష్ణమూర్తివే ♦ చెప్పఁగదవె?
యంచునాసక్తితో ♦ నతిదైన్యవృత్తితో
నగపడునందఱి ♦ నడుగనిమిమె
ఆ. గంబుఁజూచి వారు ♦ కన్నీళ్లువిడుతురు
వారిమొగముచూచి ♦ పద్మనేత్రుఁ
డింకరాఁడె! యంచు ♦ నెదఁబొక్కి గౌరాంగుఁ
డేడ్చు వెక్కివెక్కి ♦ కృష్ణుఁగూర్చి. 24



గీ. తములపాకులు చేతను ♦ దాల్చి యొక్క
నాఁడురాఁగ గదాధరుం ♦ డేఁడి కృష్ణుఁ
డనుచుఁ బృచ్ఛింప నీహృద ♦ యంబులోనె
యున్నవాఁడిక నెచ్చట ♦ నుండుననియె. 25

క. ఆమాటలు నిజమనుకొని
యీమాతెటకేగునంచు ♦ నిరుకేలనుర
స్సీమను జీఱుకొనన్నిమి
దామొనయ గదాధరుండుఁ ♦ దల్లియునంతన్. 26

చ. పరువిడివచ్చి చేతులను ♦ బట్టివదల్చి యిదేమిప్రాణముల్
హరిగొను దేనఖాగ్రములఁ; ♦ బొందళుకుల్గల మేనిపైయయో!
వఱదలుగాఱురక్తమిది ♦ పాపముగాదొకో! యన్ననాతఁడే
నెఱుఁగను జేయుచేఁతల ♦ మింపుఁడనున్ గృతవందనంబులన్.

చ. మెలకువయందుఁగూరుకున ♦ మేదినిపై జలమందు గాలిలో
పల నభమందు నిప్పనను ♦ బల్లెలనాటవికస్థలంబులన్
జలజదళాక్షుఁ జక్రిధరు ♦ శ్యామలగాత్రు నతండు భక్తివి
హ్వలుఁడయిచూచు నఖులకు ♦ నన్నియుఁ గృష్ణమయంబులౌటచేన్.

క. శ్రీవాసు నింటిలోపల
నీవిధముగ నిమి విచిత్ర ♦ కృత్యంబులు మి
త్రావళికిఁ జూపునట్టివి
భావరులను లాఁతివారు ♦ వత్తురొయేమో! 29

క. అని యింటిచుట్టు నెత్తుగఁ
బెనుపడియున్నట్టిగోడఁ ♦ బెట్టినద్వారం
బును గట్టిగమూయుదురా
తనిమిత్రులు గాఢభక్తి ♦ తాత్పర్యములన్. 30

క. భంగాగమభీతిని స
త్సాంగత్యకుతూహలుండు ♦ ధన్యాత్ముండౌ
గంగాదాసుని బెట్టిరి
ప్రాంగణమునలోని కెవరు ♦ రాకుండంగన్. 31

క. తను ధారణాగతంబగు
మనుజత్వము నిత్యమైన ♦ మహనీయత్వం
బును డీకొని యీ తెఱఁగున
ననిశము రాపిడిని బెట్టు ♦ నా గౌరాంగున్. 32

మ. ధరయార్ద్రింబగునట్లు పొక్కుతఱిఁ జై ♦ తన్యున్నతంబేమి దు
ర్భరదుఃఖంబును బొందె దీవనుచు నె ♦ వ్వం డైనఁ బృచ్ఛింపఁగ
ట్ట! రమావల్లభుఁడిట్లు నన్ను విడనా ♦ డన్బృథ్విఁ జీవింప నా
తరమా యింకని కుమ్మరించు మరలన్ ♦ ధారాగతిన్ బాష్పముల్:

శా. అంతస్స్వాంతగ నట్టహాసమును జే ♦ యన్ జెంతవారల్ నిమీ!
చింతల్వ్రాయెనెయంచుఁ బల్కునిదె నా ♦ జీవేశు శ్రీకృష్ణు నా
స్వాంతంబందున హేమశృంఖలముల ♦ న్బంధించితినట్టి నా
పొంతన్నాక యిఁకేడనుండునని న ♦ వ్వున్నాఁ బ్రమోదంబునన్. 34

ఆ. ఒడలు చెమటవట్టు ♦ నొక్కప్పుడొక మాటు
తప్తలోహమట్లు ♦ తనువుక్రాఁగుఁ
గొలుములూఁదినట్లు ♦ వెలువడు శ్వాసంబు
లొక్కసారి, యాఁగు ♦ నొక్కసారి. 35

ఆ. మేను భారమాచు ♦ నేనుంగు కాయంబు
వలెనె లేవనెత్త ♦ వలను పడక
తోఁచు నొక్కమాటు ♦ తోడనేయూఁదినఁ
గదలు బెండుముక్క ♦ కరణిఁ దోఁచు. 36



ఉ. పుట్టువుచేత నిర్మలముఁ ♦ బూతమునయ్యుఁ బ్రపూర్ణతత్త్వమై
నట్టిపరాత్పరుండు విడి ♦ యన్దగు ధామముగా నొనర్పఁ జే
పట్టి వ్రజాంగనావిభుఁడు ♦ బాధలనెన్నియొ యిట్లు తొల్తఁ దాఁ
బెట్టి విదగ్ధకాంచనము ♦ వీఁక విశుద్ధముఁ జేసెఁ గాయమున్. 37

ఉ. భాగవతంబునన్వ్రజలు ♦ భక్తుల నానిమి యెంచిపల్కఁగా
సాగుధ్రువుండు భీష్ముఁడు ని ♦ శాచరబాలుఁడు రాధయున్మహా
భాగులు నారదప్రముఖ ♦ భక్తవరేణ్యులు తానెయంచు, స
ర్వాగమవేద్యతత్త్వమెద ♦ యందు వసించి వెలుంగుచుండఁగన్. 38

శా. శక్రాదుల్మునిసత్తముల్దలఁపఁగా ♦ శక్యంబుగానట్టి యా
చక్రాంకుండెదనిండి ప్రాకృతమను ♦ ష్యత్వంబు పోకార్పనే
నక్రూరుండనటంచు నాతఁడను వా ♦ క్యంబుల్మహాభక్తి ని
ర్వక్రప్రక్రియఁ బల్కుఁ దానునిమియ ♦ న్భావంబు లేకింతయున్. 39

గీ. తన్మయత్వంబు పైకొని ♦ తన్నుఁ గమ్మ
ముద్దుఁగృష్ణుఁడు తానె య ♦ న్బుద్ధిఁ జేసి
యతఁడు శైశవమందున ♦ నాడినట్టి
మాటలను బాలకృష్ణుని ♦ మాడ్కిఁ బలుకు. 40

క. నవ్విననవ్వుచు నేడ్చిన
నెవ్వగ చేనేడ్చుచిట్లు ♦ నిమిమిత్రులతం
డెవ్వరుసనుండుఁ గేవల
మవ్వరుస నె యుండురతని ♦ కాదర్శములై. 41

గీ. రేల నానందసుధయిట్లు ♦ గ్రోలివారు
ప్రాగ్దిశను బొద్దువొడువ నీ ♦ బ్రహ్మరాక్షు
సుండపుడె వచ్చి సుఖమంత ♦ సురుఁగఁ జేసె
నంచు దూఱుదురాదిత్యు ♦ నాగ్రహమున. 42

ఉ. తంబుఱ మర్దళంబుఁ గర ♦ తాళములు న్మిళితంబు సేసి యు
ల్లంబుల నాస్వనంబులను ♦ లగ్నము సేసి సుహృద్యమైన రా
గంబుల విష్ణుకీర్తనము ♦ కంఠము లెత్తుచుఁ జేసి చేసి నృ
త్యంబులు సల్పుచుందురసు ♦ రారిపదార్పితహృత్సరోజులై. 43
సీ. ఉద్బాహుఁడై నిమి ♦ యున్నేత్రపద్ముఁడై
యుచ్ఛ్రిషుఁడై నాట్య ♦ మొనరఁ జేయు
చో నొద్దనుండెడు ♦ సుహృదులలో నొకం
డతిభక్తివిస్మృతి ♦ నవనిఁ గూలు
నొక్కఁడు భూమిపై ♦ యూరక దొర్లును
హాసంబుఁ గావించు ♦ నందొకండు
వెంటనే యొక్కఁడు ♦ వెక్కియేడ్చు; నొకండొ
కనిఁ బట్టి బిట్టుతాఁ ♦ గౌఁగిలించు
ఆ. నొక్కతూరి యంద ♦ ఱొక్కగొంతుకతోడఁ
బైకి హస్తయుగముఁ ♦ బట్టి సాఁచి
హరి! హరి! హరి! హరి! య ♦ టంచు ఘోషింతురు
మహియు నింగి గలసి ♦ మాఱుమ్రోయ. 44

క. పరిపక్వమధురఫలములు
వరవిత్తారామగేహ ♦ వాహనవితతుల్
సరిరావు త్వత్పదాంబుజ
సురుచిరభక్తికిఁ ద్రిలోక ♦ సుందర! రామా! 45

శ్రీరస్తు.

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః

# శ్రీగౌరాంగచరిత్రము.

## దశమాశ్వాసము.

ఉ. అంబుధులద్రులున్నదులు ♦ లప్చరభూచర జంతువుల్ఖగో
ళంబులుఁ గుక్షిఁ దాల్చి శత ♦ లక్షదివాకరకాంతి విశ్వరూ
పంబును నీదు భక్తజన ♦ పాళికిఁ జూపితివందు రట్లు నే
నంబుదగాత్ర! చూడఁగల ♦ నా? కలనైన భవత్స్వరూపమున్. 1

చ. వలసినవస్తువట్లు వెఱ ♦ వారికి భక్తియొసంగ మోదసం
కలనలఁ దేర్చుటన్విని శు ♦ కప్రితతు ల్ఫలవృక్షరాజి క్రే
వలకును బోవునట్లు నిమి ♦ పజ్జకు నేగుదు రెందఱో మహా
త్ములు పలుచోట్లనుండి పరి ♦ తోష ఫలప్రదభక్తిభిక్షకై. 2
ఆ. గయకుఁ బోయి తెచ్చి ♦ కావలసినవారి
కెల్లరకును భక్తి ♦ యిడుదువందు
రించుకంత నాకు ♦ నిచ్చెదవే తండ్రి?
యంచు శచియు నిమిని ♦ నడిగినంత 3
గీ. అమ్మ! శ్రీకృష్ణమూర్తి, ద ♦ యాబ్ధి శుద్ధ
చిత్తులను సాధనములుగఁ ♦ జేసికొనుచు

భక్తజనులకు మేలుచో ♦ ప్పబుచు; నీవుఁ
బడయుమువు భక్తి తొందర ♦ పడకుమనియె. 4

చ. తహతహచెంది భక్తికి గ ♦ దాధరుఁ డాతనిమిత్రుఁడున్న దా
సహచరుఁడయ్యు వేఁడుటకు ♦ సందియమందుచుమాని యిర్వురున్
గృహమున నేకశయ్య శయ ♦ నించెదు రాత్రి మహాత్మ! నీయను
గ్రహ మింక రాకపోయెనని ♦ కాళ్లపయింబడి యేడ్చె దీనతన్. 5

గీ. ఏడ్చుమిత్రుని గాంగిట ♦ నెత్తి నిమి, యి
దేమి యేడ్చెదవనియన ♦ నెందఱినో త
రింపఁ జేయుచు దాసుఁ ద ♦ రింపఁ జేయ
వైతివి కదా! యనుచుఁ బల్కె ♦ నాతఁ డలఁగి. 6

క. అనఁ జిఱునవ్వులు నవ్వుచు
నెనయుదు రేపీవు గంగ ♦ కేఁగుచు స్నానం
బును జేయుతఱిని భక్తిం
గనఁదగు నానందమనుచు ♦ గౌరాంగుఁ డనెన్. 7

క. వేళాకోళపుమాటల
లీలను గనఁబడిననట్లు ♦ లెక్కింపక శ్ర
ద్ధాళువయి గదాధరుఁ డ
వ్వేళకు నదిలోనఁ గ్రుంక ♦ వెడలెం దమితోన్. 8

శా. స్నానంబాడి గదాధరుండు పరితు ♦ ష్టస్వాంతుఁడై కృష్ణభ
క్త్యానందామృత మాత్మ వెల్లిగొని మ ♦ ద్యంబట్టు చొక్కింపఁగాఁ
దానట్లాడుచు వక్రిమాగతి నిమిన్ ♦ దర్శింపనేతెంచి మో
దానుద్బుద్ధవచస్థితిన్నిలిచె బా ♦ ష్పాక్రాంత నేత్రద్వయిన్. 9

క. నిలిచి తనమెడకు బట్టన్
గలయం జుట్టుకొని మోద ♦ కంపితగాత్రో



జ్వలుఁడై నిమిగురు శ్రీపద
సలిలజములకెంతో భక్తి ♦ సాఁగిలఁబడియెన్. 10

క. చిఱునవ్వునవ్వుచు గదా
ధర! నీకిష్టార్థసిద్ధి ♦ దయచేసెన శ్రీ
వరుఁడనఁ గృతజ్ఞతను గనఁ
బఱిచెను గన్నీళ్లఁ దడిపి ♦ పదములనిమికిన్. 11

సీ. నిమి బాల్యమందున ♦ నివసించి చెంతను
దనబిడ్డరీతి న ♦ తనినిజూచు
చూడలి పైధూళిని ♦ దుడుచుచుఁ జెక్కులఁ
గన్నులబాష్పము ♦ ల్గాఱనొత్తు
చిల్లువాకిలి వీడి ♦ యిహసౌఖ్యములురోసి
సన్న్యాసియైపోయి ♦ సంచరించు
శుక్లాంబరుఁడు భక్తి ♦ సుఖమును నిజయోగ
యాత్రాదులనొకింత ♦ యైనఁ బొంద

ఆ. లేక, కర్మములను ♦ లేదుసౌఖ్యంబని
యెంచియడిగినట్టి ♦ యెల్లరకును
భక్తిసుఖమునిచ్చు ♦ వాఁడట నిమియుని
యొక్కనాఁడు వాని ♦ యొద్దకేగి. 12

క. పేరాసం గడుశ్రమపడి
ద్వారావతి మధుపురియును ♦ దక్కిన నానా
దూరస్థమహాక్షేత్రము
లారసివచ్చియును బడయ ♦ నైతినిభక్తిన్. 13

క. దేవాలయంబులెన్నియొ
దేవా! దర్శించివచ్చి ♦ తిని వేసరి, నా

కీవా ? కృష్ణశ్రీపద
సేవామృతమందు నొక్క ♦ చిన్నకణంబుల్. 14

గీ. అని యహంభావమునను శు ♦ క్లాంబరుండు
వలుకుపలుకులువిని నిమి ♦ వానిగర్వ
మును నడఁపనెంచి ద్వారావ ♦ తిని మధుపురి
యందు నక్కలుఁగుక్కలు ♦ న్నట్టువినమె? 15

వ. అని ప్రత్యుత్తరంబిచ్చిన విని శుక్లాంబరుండు గతాభిమానుండై నే
లవ్రాలి పశ్చాత్తాపసంజనిత బాష్పప్లుతలోచనుండై యిట్లనియె. 16

శా. క్షంతవ్యుండ, మహానుభావ! దురహం♦కారుండ, లేశంబు నా
స్వాంతంబందలి గర్వమున్నెడపఁగా ♦ శక్తుండఁగానైతి; గో
రంతేని న్హరిభక్తిఁ గైకొనఁగనే ♦ నర్హుండ నెట్లాదునీ
చెంతన్జేరితి నీకుఁదోఁచుపగిది ♦ న్జేపట్టిరక్షింపుమా. 17

మ. చ్యుతగర్వుండయి యట్లువేడికొను నా ♦ శుక్లాంబరుంజూచి దుః
ఖితులౌ నన్యులతాపభారమునకుఁ ♦ ఖేదించు గౌరాంగుఁడా
నతబాధాపనయక్రియాత్ముమవరే ♦ ణ్యుంబౌ కరాబ్జంబువాం
ఛితసంసిద్ధిని వేగఁబొందుమని సాఁ ♦ చెన్సత్కృపాపాంగుఁడై. 18

ఉ. అంతట రోమకూపముల ♦ నబ్రపుఁగంతులుదోఁప దేహమం
దంతట ముండ్లయట్లు పుల ♦ కాంకురము ల్పొడసూప వీణపై
తంతులరీతి నంగములు ♦ తల్లడమొందఁగ బాష్పపూరితా
క్ష్యంతరముల్స్రవింప నతఁ ♦ డందె నమానుష మోదమున్మదిన్.

ఆ. అంది దివ్యమైన ♦ యానంద మంతఃక
రణవిశుద్ధి మైమ ♦ అపునుబారసి
యొడలికక్కపాల ♦ యుబ్బొంతలూఁగ శు
క్లాంబరుండు చిందు ♦ లాడఁదొడఁగె. 20



క. ఈరీతిగఁ దన్నడిగిన
వారలకెల్లరకు భక్తి ♦ పరమానందం
బారఁగనిమి యిచ్చునమా
చారం బూరూరికడరి ♦ చయ్యనఁబ్రాకెన్. 21

గీ. ఇలను బ్రార్థనభక్తి సు ♦ ఖేచ్ఛఁదెల్పు
భక్తిసుఖవాంఛతత్ప్రాప్తి ♦ భంగకరము
లంతరంగంబునను లేవ ♦ టంచుఁజూపుఁ
బ్రార్థనస్థితి యీరీతిఁ ♦ బరిఢవిల్లు. 22

గీ. ముక్తిసాధనములలోన ♦ భక్తిమార్గ
మంతసులభంబును నమోఘ ♦ మైనత్రోవ
యొండులేదింక భక్తుల ♦ నోమువారి
కింకరుండయి మెలఁగుచుఁ ♦ గృష్ణమూర్తి. 23

క. చాలవు సద్వర్తనన
చ్ఛీలంబులుఁ బాపరహిత ♦ చిత్తము శ్రీకృ
ష్ణాలోకన సామ్రాజ్య
వ్యాలోలురకబ్బకున్న ♦ భక్తియుఁగూడన్. 24

క. శ్రీకృష్ణనిరంతర భ
క్త్యాకీర్ణమనస్సరోజుఁ ♦ డౌ గౌరాంగుం
డేకడకుఁ గృష్ణుఁజనుమన
నాకడకుంబోయి యొనఁగు ♦ నాతఁడు భక్తిన్. 25

గీ. ఇట్టిమహిమంబు వీక్షించి ♦ యెంతవింత
దేవునకుఁ బంపువెట్టునే ♦ దివ్యపురుషుఁ
డతఁడుపంపినదూతయో ♦ యితఁడతండొ
యంచు నిమిచెల్మికాండ్రులో ♦ నెంచికొండ్రు. 26

చ. వెనుకను గృష్ణుఁడై ధరణి ♦ విష్ణువుపుట్టి సమస్తదుష్టనా
శనమును శిష్టరక్షణము ♦ సల్పెను, గల్క్యవతారమూని యో
ధునిగతి ఖడ్గపాణియయి ♦ తోఁచుటదక్క మఱొండులేదు, గా
వున నిమి విష్ణునంశమునఁ ♦ బుట్టుటమెట్టగునందురంతలోఁ. 27

మ. అవతారంబునుబూనెనేని హరిసీ ♦ లాంగంబు దామంబుఁ గృ
ధ్రవిహంగాశ్వము శంఖమున్గదయుర ♦ స్థంబైన శ్రీవత్సముఁ
రవిచంద్రాత్మకనేత్రయుగ్మమును జ ♦ క్రంబిట్టి శ్రీదివ్యవై
ష్ణవచిహ్నంబులుదాల్పుఁగాదె యవిలే ♦ శంబైన లేవిక్కడన్. 28

క. ధరణికి శ్రీవిష్ణుఁడు తా
నరుదెంచునటంచుఁజెప్ప ♦ నద్వైతుఁడుము
న్నరుదెంచిన సముచితగతి
నరుదెంచెనుగాని యిట్టు ♦ లా! హరిరాకల్ ! 29

గీ. ఆజగన్నాథమిశ్రున ♦ కాత్మజుండు;
వేదపాఠుఁడు విద్యావి ♦ వాదశూరుఁ
డాఁకటనుఁజప్పి మనయట్టి ♦ యాతఁడేక
దా! నిమిని నెట్టులనఁదగు ♦ దైవమంచు? 30

క. ఐన నిమిభక్తిసుఖ మెవఁ
డేనియుఁ గాంక్షించివేఁడ ♦ నిమ్మనికృష్ణుఁ
బూని నియమించు దైవము
తానేకానియెడ నద్భు ♦ తంబిఁకఁగలదే? 31

వ. అని జనులిట్లు పరిపరివిధంబుల నిమి యథార్థస్వరూపంబుంగూర్చి
డోలాయమాన మానసులై వితర్కించుచుండ. 32

క. ఇదిగో శ్రీకృష్ణుం డ
ల్లదిగో శ్రీకృష్ణుఁడిచట ♦ కరుదెంచెనటం



చెవఁ బొంగుచు నిమియాప
ద్మదళాక్షుఁడువచ్చినటులె ♦ తత్తఱచెందున్. 33

ఉ. కన్నులు నోమ్మముల్మొగముఁ ♦ గాంచినవారికిఁ జాలిఁగొల్పుఁ బై
కొన్న ప్రశస్తభక్తి కనుఁ ♦ గొన్నజనంబుల మోహపుచ్చుఁదాఁ
గన్నవిధంబుగాఁ బరులు ♦ గాంచకపోయినఁ గృష్ణుఁడెక్కడో
సన్నిధినున్నయట్లు తన ♦ సన్నిధివారికిఁ గానవయ్యెడున్. 34

క. నిమియు న్నిమిమిత్రావళి
క్రమముగ సామాన్యజనుల ♦ కరణింగాకా
స్యములుం గనులును మదిరా
ప్రమదమ్ములై కానిపింప ♦ వర్తింతురిపురిన్. 35

క. శ్రీవాసగృహాంతరకృత
సేవాప్రార్థనలు వృద్ధి ♦ చెందుచునుండన్
రావంబు మిన్నుముట్టఁగఁ
గావింతురువారు కృష్ణ ♦ కథనము రేలన్. 36

క. తలుపుబిగియించి హరినా
మల సద్గానంబుచేయు ♦ మాన్యులఁజేరఁ
దలఁచి జను లెంతయఱచిన
దెలిసియు తెలియమినోతలుపుఁ ♦ దీయరువారల్. 37

మ. పెఱవారిన్దొరనీకపోవుటయు ని ♦ ర్వణ్ణత్వముంబూని తా
మొరులంగూడమియున్నిగూఢకృతభ ♦ క్త్యుత్కృష్టసంకీర్తనల్
కెరలంజేయఁగ నీర్ష్యఁగొందఱధము ♦ ల్కెక్రింతురీయయ్యలం
దఱు స్త్రీపానరతిన్బొనర్తురిటు న ♦ క్తంబందటంచున్బరిన్. 38

ఆ. భక్తికీర్తనంబు ♦ బహిరంగముగఁజేయ
వచ్చుఁగాని యిల్లు ♦ సొచ్చి రాత్రి

దొంగపనులుసేయ ♦ దొరకునే కైవల్య
మండ్రు గిట్టనట్టి ♦ వాండ్రు చేరి. 39

సీ. ఈయుపవాదంబు ♦ లేమియు లక్ష్యంబు
సేయక యానంద ♦ సింధుమగ్ను
లైయున్న నిమిమొద ♦ లైనవారలఁజూచి
యీర్ష్యలోనెక్కుడై ♦ యేఁచుకతన
వంగదేశంబును ♦ బాలించు మునలిమా
న్హుస్సేనుషా యను ♦ నొండు చండ
శాసనుండీదుష్ట ♦ సంఘంబుచేష్టల
నడఁపంగఁబడవల ♦ యందుఁబెట్టి

ఆ. క్రూరభటులఁబంపె ♦ వారు నేఁడోరేపొ
వచ్చి నిమిని సఖులఁ ♦ బట్టిచెఱను
వైతురనుచు నురక ♦ వదరంగఁజొచ్చిరి
కొందఱేచిపురిని ♦ గొంకులేక. 40

వ. ఇట్లుండ. 41

సీ. వైశాఖముననొక్క ♦ పగటిప్రొద్దునఁ జండ
కిరణుండు నిప్పులు ♦ గురియుచుండ
సుస్నాతుఁడై వచ్చి ♦ శుద్ధవస్త్రంబులు
దాల్చి శ్రీవాసుఁడు ♦ తలుపుమూసి
పూజాగృహస్థవి ♦ రాజితపీఠంబు
పైపట్టుదిండ్లపై ♦ వఱలుచున్న
కృష్ణవిగ్రహమున ♦ కెదురుగానిలఁబడి
కేల్మోడ్చి కూర్చుండి ♦ కేవలంబు

గీ. దైవపాదారవింద చిం ♦ తనముకొఱకు



నేత్రము ల్మూసికొనునట్టి ♦ నిమిషముననె
తలుపుదీయుము ! తీయుమ ♦ న్ధ్వనియు గ్రుద్దు
వినఁబడఁగ నెవ్వరని యాతఁ ♦ డనియెఁ గనలి. 42

క. ఏవానిఁజూడ నీవీ
సేవాగృహమందుఁజొచ్చి ♦ చిత్తముస్థిరమున్
గావింపఁ గనులుమూసితొ
యావాఁడేవచ్చెఁ దీయు ♦ మా ! తలుపు వెసన్. 43

క. అను వెడమాటలు వినఁబడఁ
గినుకమెయిన్లేచి తలుపు ♦ గెంటి తెఱచినన్
గనఁబడె నెదురుగ శ్రీవా
సునకున్ గౌరాంగుఁ డుదయ ♦ సూర్యునిపగిదిన్. 44

క. మతిచెదరఁదోఁచి సేవ
చ్చితిఁగద శ్రీవాస ! యనుచు ♦ శ్రీకృష్ణాధి
ష్ఠితకాంచన మృదుతల్పాం
చిత పీఠాసీనుఁడయ్యెఁ ♦ జెచ్చెర నిమిదాన్. 45

క. శతకోటి నభోమణులును
శతకోటిద్యుతివిశాల ♦ శంపాలతలున్
క్షితికిదిగి గదినిజొచ్చిన
గతి శ్రీవాసునకుఁదోఁచెఁ ♦ గన్నులయెదుటన్. 46

క. హరిదర్శనంబుకొఱకై
చిరకాలము పలవరించు ♦ శ్రీవాసునకున్
హరిసాక్షాత్కారము దు
ర్భరమై చిత్తభ్రమాక ♦ రంబయ్యెఁగదా ! 47

గీ. ఇందుచేతనె భక్తుల ♦ యెదుటనొక్క

సారెగాఁ గానిపింపక ♦ సచ్చిదాత్మ
యించుకించుక రుచిఁజూపి ♦ యిచ్చుఁదుదకుఁ
బూర్ణదర్శన మారూఢ ♦ పూరుషులకు. 48

శా. శ్రీవాసుం డొకకొంత సేపిటులు ని ♦ శ్చేష్టత్వముం దాల్చి స్మృ
త్యావిర్భావ మొకింతగాఁగ మరల ♦ న్హా! నేనునిద్రించి స్వ
ప్నావస్థాభ్రమఁ జిక్కియుంటినొ? సము ♦ ద్యజ్జాగ్రదున్మాదనే
త్రావస్థన్ దిలకింపఁగల్గితినొ యి ♦ ట్లంచు న్వితర్కించెఁదాన్. 49

మ. కలగాదిద్ది; యివేమినాకనులు మే ♦ ల్కన్నట్లు సాక్షుల్గదా!
కలదే యిట్టివిచిత్రదర్శనము ని ♦ క్కంబాచునెట్లొంతు? శ్యా
మలగాత్రుండెదురై కనంబడినను ♦ భాగ్యోన్నతుం జేసెనే?
కలఁడే దేవుఁడటంచు నొక్కరుఁడు సా ♦ కారుండు వీక్షింపఁగన్.

వ. అని యిట్లు సందేహసందోహాందోళితంబై. 51

క. నడవు చుక్కానిపోయిన
పడవతుపానునను వార్ధి ♦ పై యెటులుండున్
జెడి శ్రీవాసునిమనమటు
చిడిముడి పడుచుండెబాధఁ ♦ జెందుచుమిగులన్. 52

మ. జలజాక్షుండు ప్రసన్నుఁడై నరసమ ♦ క్షంబందుఁ గాన్పింప భ
క్తులడెందంబులు సంశయావృతములై ♦ తొట్రిల్లుచేమేలు; ప్ర
జ్వలితార్కద్యుతి నీలకాచపరిర ♦ క్షాదక్షనేత్రంబులే
తిలకింపన్దగుఁగాని వట్టికనులా ♦ ర్తింజెందవే? చూచినన్. 53

క. బెండడిలేని దృఢక్షో
ణిం దిరముగఁగంబమెట్లు ♦ నెలకొనునట్లే
సందేహకర్కశాశయ
మందునఁ బాదుకొనినిల్చు ♦ హరిభక్తిగదన్ 54



క. సంతోషమద్యమత్త
స్వాంతుండయి సోలిపడెడు ♦ సమయమునందున్
వింతగ నిమి శ్రీవాసుని
శాంతాలోకనముచేతఁ ♦ జయ్యనఁదేర్చెన్. 55

ఆ. తేఱుకొనినవెంట ♦ దివ్యమంగళవిగ్ర
హుండు గనులఁబడియె ♦ నుర్వినన్నుఁ
బోలువాఁడెవండు ♦ పుణ్యార్జనంబున
జన్మమిపుడునాకు ♦ సఫలమయ్యె. 56

గీ. అనుచు శ్రీవాసుఁడుప్పొంగి ♦ యంతలోన
నైహికాపేక్షచిత్తంబు ♦ నందుఁబొడమ
నే వరము వేఁడిపొందుదు ♦ నేను దృష్టి
నంచు లోలోనఁజాలఁ జిం ♦ తించుచుండె. 57

గీ. ఏదికోరెదననుకొన్న ♦ నేదియొకీడు
గానిపించుచునుండె న ♦ ద్దానఁదనకుఁ
దుష్టినొందక దేనిచేఁ ♦ దుదకెఱింగెఁ
గ్రామ్యసుఖములు దుఃఖసం ♦ కరములనుచు. 58

గీ. శ్రీమహావిష్ణువెదురైన ♦ సిగ్గులేక
తుచ్ఛలౌకికసుఖముల ♦ త్రోవఁబడితి
నిట్టిపాపులు పుడమినెం ♦ దేనిఁగలరె?
యంచు శ్రీవాసుఁడెదను దుః ♦ ఖించుచుండె. 59

గీ. అంతలోపల దుఃఖోప ♦ శాంతిఁజెంది
యుచితసత్కారములఁ జేయ ♦ నుద్యమింపఁ
గాళ్లుచేతులు నాలుక ♦ గదలవయ్యె
నింకఁబాపము! శ్రీవాసుఁ ♦ డేమిసేయు? 60

క. అంతస్సంక్షోభస్థితి
యంతయుఁ దెలిసికొని నిమి ద ♦ యామయుఁడీ వో
క్కింతజలంబును నాక
ర్పింతే స్నాతుండనౌదు ♦ శ్రీవాసయనెన్. 61

గీ. స్వామియానతి మరల శ్రీ ♦ వాసుశక్తి
మంతునిగఁ జేయ నతఁడు సం ♦ భ్రమముతోడ
నిల్లువెలువడి నీళ్లని ♦ ల్లెచటననుచుఁ
గేకలనుబెట్టుచుండ నా ♦ కిటనునిల్చి. 62

ఉ. ఆతనిసోదరుల్ గృహము ♦ నందలి కాంతలుఁ బైకివచ్చి యిం
తాతురమేలొకో యనుచు ♦ నాతనిపల్కులుఁ జూడ్కులెంచి యీ
చేఁతలుగావు పిచ్చివి వి ♦ చిత్రమదో పొడసూపఁబోలు నం
చీతొర యేమిచెప్పమని ♦ పృచ్ఛను జేసిరి వానినందఱున్. 63

గీ. చేయుతోడనె శ్రీవాసుఁ ♦ డోయిమీరు
తెండు వేగమ గంగాన ♦ దీజలంబు
లరుగుదెంచె గృహంబున ♦ కల్లశేష
శాయి ; యాతఁడు స్నానంబు ♦ సేయుననియె 64

గీ. అనినవెంటనె భక్తులా ♦ .నందఱన్ని
భాండములుపుచ్చుకొని గంగ ♦ పావనోద
కంబు చయ్యనఁ దెచ్చి గృ ♦ హంబులోన
నిడిరి సంభ్రమమభిలాష ♦ యెదఁదలిర్ప. 65

క. గౌరాంగుఁ జూడవచ్చిన
వారలు పూజాగృహంబు ♦ బైటనిలఁబడన్
గోరుదురొకరుఁడు లోపలఁ
జేరుటకించుకయు సాహ ♦ సింపఁడదేమో ! 66



క. అర్చాగారముచుట్టు న
మర్చినకటములు సరంధ్ర ♦ మధ్యములగుటన్
గూర్చున్నదివ్యపూరుషు
వర్చఃపుంజంబుపసలు ♦ పర్వెన్దెసలన్, 07

సీ. కాంచనపాంచాలి ♦ కనునిరసించెడు
పచ్చనిదివ్యరూ ♦ పంబుతోడ
వేసఁగిమధ్యాహ్న ♦ వేళసూర్యద్యుతి
ధిక్కరించెడుతను ♦ దీప్తితోడఁ
బీఁటపైనెలకొని ♦ ప్రియభక్తులందఱు
జాహ్నవీజలముల ♦ జలకమార్చ
వెలిఁగెడిగౌరాంగు ♦ వీక్షింపనోఁచని
మనుజజన్మంబు జ ♦ న్మంబుగాదు

ఆ. నీటినడుమనున్న ♦ నిమిమనోహరశరీ
రంబుపొల్చె లేఁత ♦ రంగుగాజు
కప్పులోనఁ బెట్టి ♦ కట్టినసూఱుక్రొ
క్కారుమెఱపుమిసల ♦ సారమట్లు. 68

ఉ. స్నానముచేయభూస్థలికి ♦ జాఱిస్రవించుజలంబు హీరము
క్తానిచయప్రవాహము వి ♦ ధంబునఁ దళ్కులుచిమ్మె ; బట్టతో
మేనిజలంబునొత్త నది ♦ మించెను మించును మించుకాంతితోఁ
బైనఁగడానిపూఁతగల ♦ వస్త్రమురీతి నదేమిచిత్రమో ! 69

క. స్నాతుండై యుపధానో
పేతార్చాపీఠినెక్కి ♦ వెండియు నాతం
డేతెంచిగదికి ; భక్త
వ్రాతము సేతులనుమోడ్చి ♦ బయిటన్నిలిచెన్. 70

వ. అంత. 71

సీ. పచ్చికమేయుట ♦ వదలి యఱ్ఱులువీను
లెత్తి మున్గోవులా ♦ లించినట్టి
పొదుగుపీడఁగఁ జేసి ♦ మొదవులమఱపించి
క్రేపులఁ గ్రేళ్లుఱి ♦ కించినట్టి
మొండిమొరళ్లచేఁ ♦ బొలుపారు చిగురాకుఁ
గెంపుటంగిని దొడి ♦ గించినట్టి
మసలుకొల్పుచు గొల్ల ♦ విరిబోండ్ల గృహకృత్య
విముఖులఁ జేసి ర ♦ ప్పించినట్టి

ఆ. భాగవతమునందు ♦ వర్ణింపఁబడినట్టి
యమృతమంజుమధుర ♦ మైనయట్టి
వేణునాదమొండు ♦ వినఁబడె గదినుండి
వచ్చి యచటిభక్త ♦ వారమునకు. 72

శా. వేణుప్రోద్గతనిస్వనంబు వినున ♦ వ్వేళన్జగంబంతఁ ద
ద్వేణుక్వాణమయంబుగాఁగనఁబడెఁ ♦ న్దీపించెఁ జిత్తంబు, క
ల్యాణంబయ్యెను శ్రోత్రసంతతికిఁ, బు ♦ ల్కల్వొట్టె దేహంబుపైఁ,
ప్రాణంబుల్గనెఁ బారవశ్యము, నపా ♦ రంబయ్యె మోదాశ్రువుల్.

క. గౌరాంగుఁడంత శయనా
గారమునకుఁ జనెదననఁగఁ ♦ గడువడివిండ్లన్
జారువితానముమెత్తయుఁ
జేరిచె లోపలికిఁ గూర్మి ♦ శ్రీవాసుండున్. 74

గీ. పాలనురుఁగునుబోలు దు ♦ వ్వటము మృదుల
శయ్యమీఁదనుబఱచి పు ♦ ష్పములుచల్లి
యొడసారకుండఁ దెఱలు వే ♦ యించెఁ దలుపు



లుండుచోట్ల గవాక్షము ♦ లుండుచోట్ల. 75

క. గదినుండి గదికిఁబోయెడు
నదనున గౌరాంగుదేహ ♦ మంతయు విద్యు
చ్ఛదమై నిర్మాంసంబై
ప్రిదిలినస్థూలతనుగాని ♦ పించె జనులకున్. 76

గీ. గద్దెఁగూర్చున్న గగనసం ♦ కాశమూర్తి
దీప్తికిని ఘర్మసూర్యప్ర ♦ దీప్తికున్న
తారతమ్యము సౌమ్యశ్రీ ♦ తలమొకండు
భీకరోష్ణంబొకండును ♦ వేఱులేదు. 77

గీ. మెడను జేతుల సిగచుట్టు ♦ నిడెనుబూవు
దండలెంతయు భక్తి గ ♦ దాధరుండు
కప్పురంబును బుప్పొడి ♦ గలిపి మంచి
యగరుసేర్చిన చందనం ♦ బలఁదెనొకఁడు. 78

క. చామరమువేసె నరహరి
చామీకరవిగ్రహునకు ; ♦ సర్వాధారుం
డౌ మాన్యుఁడిట్లు వఱలెను
ప్రేమంబునఁ దనదుభక్త ♦ బృందము నెదుటన్. 79

ఉ. అందముఁ, జిత్ప్రకాశము, మ ♦ హాబలసంపద, భూతిఁదాల్చి వెం
పొందెడువేల్పె కట్టెదుట ♦ నున్నయతండని ప్రార్థనంబు సే
యందలపోసి భక్తులు మ ♦ హాత్ములు, నాలుకలాడకుంట చే
దందడిబాష్పవృష్టి కనుఁ ♦ దమ్ములనుండి వెడల్చిరచ్చటన్. 80

ఆ. స్వామికొంతసేపు ♦ సననిచ్చి యీరీతిఁ
బల్కెనిట్లు భక్త ♦ వరులయెదుట
శ్రోత్రపేయమైన ♦ సురుచిరవీణార

వంబుమించునట్టి ♦ స్వరముతోడ. 81
చ. ప్రీతినరహృత్సరోజమున ♦ వాసముచేసెడు వ్యక్తి నేనెయం
చతులిత బుద్ధిశాలియగు ♦ నాతఁడెఱుంగకపోఁడు; గౌడభూ
పతికడలంగబోకుఁ డది ♦ వట్టిభయంబని మీకుఁజెప్పవ
చ్చితి, నిజరూపదర్శనము ♦ సేయఁగనిచ్చితి మిమ్ము భక్తులార్. 82
క. ఈపరినేఁ జనుదెంచుట
పాపుల శిక్షింపఁగాదు ♦ పాపపురుషులన్
గాపథమునుండి మఱలిచి
చూపించుచు భక్తిఁదెత్తు ♦ సుపథంబులకున్. 83
క. భక్తజనంబులు మోహా
సక్తిం జలుపంగవలయు ♦ సర్వవిధుల్నే
భక్తుండనౌచు సలుపుదు
ముక్తికిఁబడుపాట్లు పడుచు ♦ బోధమొనర్తున్. 84
క. ఆచరణమున సమంజస
వాచాజృంభణముచేతఁ ♦ బ్రజనేఁబేర్మిన్
గాచి ప్రపూతాత్మానం
దోచితులుగఁజేసి నన్ను ♦ నొందఁగఁజూతున్. 85
గీ. చండుఁడొకవేళ ముసలిమా ♦ నుండు మిమ్ము
బాధపెట్టఁగఁజూచిన ♦ వానికేమి
శిక్షసేయక కరుణార్ద్ర ♦ సిక్తహృదయుఁ
గానొనర్చెద మీరలే ♦ కాంతురద్ది. 86
క. శిక్షార్థముగాదు ప్రజా
రక్షార్థముపూనినాఁడఁ ♦ బ్రస్తుతరూపం
బక్షీణదయావీక్షుల



శిక్షలనగుపనులఁ జక్కఁ ♦ జేసెదఁగనుఁడీ. 87
వ. ఈతెఱంగున జగన్మోహనాకారుండు తాసీయవతారంబున నతినిపుణుండగు వెజ్జువలె జన్మ పరంపరాసమార్జితంబు లగుపాపరోగంబుల ననాయాసకరంబు లగుసాధనంబుల రూపుమాపుదునని పునఃపునరుక్తవాక్యంబుల నొక్కిచెప్పి, యచ్చట శ్రీవాసుబంధుగు నాల్గేండ్ల ప్రాయపుఁగూన నట్టాడుచుండ నక్కన్నియను 'నారాయణీ! యిటొకసారి రమ్మ'ని సైగఁజేసి, వచ్చినంత నామెపైకరంబిడి ''అమ్మా! శ్రీకృష్ణభక్తి యెట్లుండునో యొక్కసారి మాకుఁ జూపింపు'' మన నాబాలిక. 88
క. ఓనాకృష్ణా! కృష్ణా!
యోనాకృష్ణా! యటంచు ♦ నోడలెఱుఁగక భ
క్త్యానందరసాంభోనిధి
లోనన్మగ్నయయి బాష్ప ♦ లోచనయయ్యెన్. 89
గీ. అంతఁ జిఱునవ్వునవ్వి గౌ ♦ రాంగుఁడోయి!
భక్తవరులార! మిమురాజు ♦ బాధపెట్టఁ
దలఁచెనే నిట్టులేనేను ♦ సలుపువాఁడ
వానివలన మీకిసుమంత ♦ భయమువలదు. 90
క. అనుమాటలు శ్రీవాసుఁడు
విని స్వామీ! యిట్లుమీరు ♦ వెలసినపిదపన్
గనుటెట్లు రాజభయమిఁక?
ననెఁ దొట్రిలునాల్కతోడ ♦ నతిభక్తిమెయిన్. 91
ఆ. కొలఁదికాలముననె ♦ తిలకింతు నిమియెట్టి
బాలుఁడోయటంచుఁ ♦ బలికినట్టి
యమలచరితుఁడైన ♦ యద్వైతుపూర్వవా

క్రీతతియపుడు తనదు ♦ స్మృతికిరాఁగ. 92

క. హారిఁబోరి గదాధరుఁడు శ్రీ
హరి యవతారంబటంచు ♦ నతని యొడలిపై
సురభిళ చందనమలఁదుచుఁ
బరిచర్యలుసేయుచుండెఁ ♦ బరమప్రీతిన్. 93

సీ. యాత్మ్రత్రయంబుఁ గృ ♦ ష్ణాలోకనాసక్తి
ద్వారస్థమైతన ♦ ప్రక్కనిలువ
మాలిని శ్రీవాసు ♦ మానినియటనున్న
కడగొట్టుమఱఁది శ్రీ ♦ కాంతుఁబిలిచి
యేమిన్యాయంబయ్య ♦ మేము స్త్రీలమటంచు
సుందరాంగునిమాకుఁ ♦ జూపకుంట
యనిన నాదీనోక్తు ♦ లాలించి యందఱ
రానిండటన్న శ్రీ ♦ జాని, వారు

గీ. మేలిముసుఁగుల నించుక ♦ మీఁదికెత్తి
సిగ్గుఁగౌతూహలము భీతి ♦ చేరియేఁచ
దరికినేగి భక్త్యావేశ ♦ గరిమమునను
సాఁగిలంబడిరాతని ♦ చరణములకు. 94

క. చరణజలజాతములఁ ద
చ్ఛిరములు స్పృశియింప నిమివి ♦ శేషదయాంతః
కరణుఁడయి “ నాపదంబులె
యిరవగుననిశంబు మీఁదు ♦ హృదయములక ” నెన్. 95

చ. నలువురికాంతులచ్చటనె ♦ నమ్రతనుండిరిగాని యేల మా
చెలువలుమిట్టిరన్యనని ♦ చెందరు రోషమునీర్ష్య ; ముందటన్
వెలసినవాఁడు లోకపిత ♦ విష్ణుఁడుగాని నరుండుగాఁడటం



చలరుమహానుభావు లెటు ♦ లందుదు రట్టినికృష్టభావముల్ 96

వ. ఇట్లుండ. 97

గీ. ‘ అఱుగుచున్నాఁడ వత్తునే ♦ మఱల ముందు
యుక్తకాలంబునం ’ దని ♦ యొక్క కేక
వేసి నిమిమూర్ఛఁజెంది యు ♦ ర్విపయివ్రాలె
విగతజీవునివలె జను ♦ ల్బెగడువడఁగ. 98

క. శ్రీవాసాదులు వెంటనె
సేవలుపెక్కొనరించి ♦ స్మృతియాతనికిన్
రావింపఁ, దెఱచికన్గవ,
యీవైపావైపుఁబఱపె ♦ దృష్టిచయంబుల్. 99

క. ఈయిల్లు నీదిగాదా ?
యోయీశ్రీవాస! పండి ♦ తోత్తమ ! యేనా
నీయిల్లె నేనెఱుంగుదు
నీయిరవునకేను వచ్చు ♦ టేలొకో చెపుమా ? 100

క. అనినిమి యించుకయాలో
చనమున్బొనరించి నేను ♦ స్వప్నగ్రస్తుం
డనయితినేమో ! యత్తఱి
ననఁగూడనిమాటలేమి ♦ యనలేదుగదా ? 101

ఆ. ఓయిమిత్రులార ! యున్మత్తుగతి నేను
గూఁతల నుచితములఁ ♦ గూసి కృష్ణుఁ
డమరవంద్యునెడల ♦ నపరాధములఁగ్రొవ్వి
చేసినాఁడనేమొ ♦ చెప్పరాదె. 102

వ. అనునిమి ప్రశ్నంబులకును దీనాలాపంబులకు నటనున్నవారలు ‘మీరు మూర్ఛితులైతిరిగాని మఱొండులేదు’ ని ప్రత్యుత్తరం బొసంగిరి.

గీ. ఏగుచున్నాఁడ మఱల నే ♦ నేగుదెంతు
నని నిమివచించెఁ దల్లితో ♦ వెనుకనొక్క
తడవనుపనీతుఁడైన య ♦ త్తఱి, నదేప్ర
కారమున నిప్డు రెండవ ♦ సారిపల్కె. 104

ఉ. ఇంతులు మీకు నాపదము ♦ లే శరణంబులటంచు మున్న దా
నెంతయునొక్కిచెప్పిన ప ♦ రేశుఁడు, కృష్ణ! కృపాసముద్ర! నా
వంతలఁదీర్చి యైహికకు ♦ వాంఛలదోరిచి త్వత్పదాబ్జముల్
చింతనసేయునట్లు దయ ♦ సేయుమటంచిపుడుమ్మలించెదుఁ. 105

క. పరమేశుఁడు పైతెఱఁగున
మురారిమొదలైన భక్త ♦ పూరుషులగృహాం
తరములవెలయుచు వారలఁ
బరమానందమిడి గళిత ♦ పాపులఁజేసెన్. 106

చ. నిమితనబాల్యమందుఁ బురి ♦ నేలకుఁగోలకుఁదెచ్చె నాటలన్
విమల కళాపరిపూర్ణుఁడయి ♦ వేఁచెను బండితపాళిమధ్యకా
లమునను, బిమ్మటన్ విషయ ♦ లంపటతన్బడకుండఁ గృష్ణభ
క్త్యమృతరసానుభూతి ప్రజ ♦ కందఱికిట్టిదటంచుఁ జూపెఁదాన్.

ఆ. పూర్ణభక్తిచేతఁ ♦ బొందెదునురుఫలం
బఖిలవేదవేద్యుఁ ♦ డగుటయనుచుఁ
గూడఁజూపె భక్త ♦ కూటంబునకు, నిమి
బ్రహ్మమేలకాఁడు ♦ ప్రాజ్ఞదృష్టి? 108

క. లీలాగృహీతసూక్ష్మ
స్థూలశరీరుండవౌచుఁ ♦ దొలిబాములసే
వేళన్నిన్దలఁచిన ధ
న్యాళికి సాక్షాత్కరింతు ♦ వయ్యా! రామా! 109

శ్రీరస్తు.

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః

# శ్రీగౌరాంగచరిత్రము.

## ఏకాదశాశ్వాసము.

మ. తరుణప్రాయపు బుద్ధిమంతుఁడు కళ ♦ త్రప్రాప్తికై దొర్లకు
ద్ధురసంసారమహాప్రవాహతరణో ♦ ద్యోగంబునన్బెక్కుతా
తెరువుల్ద్రొక్కి యలబ్ధకాముఁడయి భీ ♦ తిన్జెంది నీపాదము
ల్దారకన్దానుగృతార్థుఁడౌనఁట దయా ♦ ఖా! రామచంద్రప్రభూ!

ఆ. వీరభూమియందు ♦ వెలసెడు నేకచ
కాఖ్యజనపదంబు ♦ నందుఁబుట్టి
వర్ధమానుఁడౌచుఁ ♦ బండ్రెండుసంవత్స
రములబాలుఁడు, నితి, ♦ గ్రాలుచుండె. 2

వ. అంత. 3

క. ఆతనితలిదండ్రులకడ
కాతత వైరాగ్యవిభవుఁ ♦ డొ నొకశ్రమణుం
డాతిథ్యముఁ గైకొనఁగా
నేతెంచి కుమారుఁ దనకు ♦ నిమ్మనివేఁడెన్. 4

క. నిమియన్న విశ్వరూపుం
డమలుఁడె యీవచ్చినట్టి ♦ యతియం; డిది గ్రం
థములన్ననఁబడమిని స
త్యమనుట కాధారమంద ♦ డాడెదునుడు వే. 5

వ. తండ్రి యీవిపరీతప్రార్థనంబువిని యెట్లుసెప్ప నేమిసేయం బాలుపో
క చూచిచూచి. 6

శా. బాలుండెందుల కీవిరాగికని న ♦ వ్వంజొచ్చి, సన్న్యాసులన్
మేలంబాడినఁబాతకంబని కడుం ♦ భీతిల్లి, యీపాపనిన్
జోలెంబుజ్జనుదాల్చు జోగియెటు పెం ♦ చున్దైవమా! యంచును
ద్వేలంబా వెతఁజెంది, తుట్టతుదక ♦ ర్పించె న్సుతున్యోగికిన్. 7

క. శ్రుత్యుదిత బ్రహ్మవిషయ
సత్యంబునుగఱచి యాత్త ♦ సన్న్యాసుండై
నిత్యానందుండయ్యెను
నిత్యాఖ్యయు నద్దికుదియ ♦ నిలిచెనతనికిన్. 8

గీ. విశ్వరూపుని తేజ మీ ♦ పిల్లవాని
మేనిలోఁదూఱెనందురు; ♦ మిత్రులుభయు
లేకమై కొంతకాల మ ♦ నేకతీర్థ
యాత్రలనుజల్పి రమితప్ర ♦ యాసమునను. 9

సీ. వింశతివర్షము ♦ ల్పెక్కుక్షేత్రంబులు
సేవించి, పుణ్యతీ ♦ ర్థావగాహ
నములుగావించి, కృ ♦ ష్ణక్రీడలనుబావ
నంబైన బృందావ ♦ నమునకరిగి,
పరిసరకాంతార ♦ వాసియై, నితి, గోప
బాలావలోకన ♦ లాలసుఁడయి,



యచ్చోట నిచ్చోట ♦ నచ్యుతాన్వేషణం
బును సల్పుచుండి, తాఁ ♦ గనియెమున్న

ఆ. గయను నియతితోడ ♦ గౌరాంగునకుఁ గృష్ణ
మంత్ర మొసఁగినట్టి ♦ మహితభక్తు
సతతకృష్ణనామ ♦ సంకీర్తనాసక్తు
నీశ్వరపురిసంజ్ఞ ♦ నెసఁగుయతిని. 10

క. నితితోఁబరేంగితాభి
జ్ఞతనీశ్వరపురివచించె ♦ "సాధూ! యెవనిన్
వెతకుచునున్నాఁడవు? శ్రీ
పతినా? యట్లైనసాయ ♦ పడెదను నీకున్. 11

ఉ. ఈపురిలేఁడుకృష్ణుఁడిపు ♦ డీవెటుకాంచఁగఁగల్గు? దానవ
ద్వీపమునన్నిమిషప్రథితిఁ ♦ దేజరిలున్నచిముద్దుబిడ్డఁడై
గోపసుతుండు; వానిఁగనఁ ♦ గోరికపుట్టినలెమ్ము పొమ్ము నీ
పాపము వాపుకొమ్మతని ♦ పాదములన్దరిసించి మిత్రమా!". 12

క. అనుపురిపల్కులు, నితి, దా
వినిచెచ్చెరనిమివసించు ♦ వీటికిఁ జనియెన్
జనివిడిసెనందనార్యుం
డనువిప్రునియింటనిమిగృ ♦ హమునకుఁజనకే. 13

వ. శ్రీనందనాచార్యుండును నిత్యానందుండు పరమభక్తాగ్రగణ్యుండని
యెఱింగి యాపాఢంబునవచ్చిన యతనికత్యాదృతి వివిధపరిచర్యలు
సేయుచు నాతిథ్యంబు నెఱపుచుండె. 14

గీ. నగరమునకింక నితిమూఁడు ♦ నాల్గుదినము
లకును రానుండ, నేతెంచు ♦ నొకమహాత్ముఁ
డంచునిమిచెప్పెనాత్మ భ ♦ క్తాళియెదుట;

వచ్చినంతనె యాతండు ♦ వచ్చెననియె. 15

గీ. పాండుబలరామునవతార ♦ మునుగనంగ
ననిపదంపడియావేశ ♦ మెనసినిమి, ని
జాశ్రులురుధిరమున్గ్రక్క ♦ నాసవంబు
తెండు లేలెండు నాదగఁ ♦ దీర్చికొండు. 16

గీ. అనియె నామాటలకు వెఱఁ ♦ గందిభక్తు
లేమిసేయుటకునుదోఁచ ♦ కోమహాత్మ!
కృష్ణభక్త్యాసవముఁగ్రోల ♦ నెవఁడు తేఁగ
లండు? మీకడనేయద్ది ♦ యుండుననిరి. 17

ఆ. అంతస్స్మృతికివచ్చి ♦ యాతఁడో ప్రియులార!
వేగపురికిఁబోయి ♦ వెదకి తెండు
వానిఁజూచువాంఛ ♦ వర్ధిల్లుచున్నది
యేమునిల్వఁజాల ♦ నింకననియె. 18

వ. అంత మురారి శ్రీవాసముకుంద నారాయణులను నల్వురు నాల్గు దెసలకుం జని నవద్వీపంబుగాలించి యెచ్చట నామహాపురుషుం గానలేక వేసారి యపరాహ్ణసమయంబునకు విన్నఁబోయిన మొగంబులతో నిమియొద్దకే తెంచిన నతండు మందస్మితవదనుండై "మన మందఱము వెదకంబోదమురం" డని. 19

క. స్నేహితులతోడనందను
గేహంబునకేగికాంచెఁ ♦ గించిదసితస
ద్దేహుఁ, బ్రాంశు, సమీచీ
నోహు, న్మక్తేహు, దారి ♦ తోత్కటమోహున్ 20

క. ముప్పదిప్రాంతపువయసున
నొప్పెడునితియోగి నీగ ♦ జోజ్జ్వలనేత్రున్



జెప్పకయ తెలిసికొని వా
రప్పుడు చాఁగిల్లిరతని ♦ యడుగులకెలమిన్. 21

క. ప్రొక్కినవారలు లేవఁగ
గ్రక్కననిమినితికి నెదురు ♦ గానిలఁబడి తా
నొక్కనుడువైననాడక
చొక్కించెఁదదేకదృష్టిఁ ♦ జూచుచునతనిన్. 22

శా. చూడంజూడనితిత్వముక్కుచెడి వి ♦ ష్ణుత్వంబుదేహంబునం
దాడంజొచ్చె, స్వతంత్రితాస్మృతులు వ ♦ మ్మైపోయె, గౌరాంగుమై
నీడంబోలెవిలోకలోకవశత ♦ న్వెన్నాడిపర్వెత్తెమా
టాడన్నేరకసంయమీంద్రుఁడపుడా ♦ హ్లాదప్రకర్షాత్ముఁడై. 23

క. లేఁగలుగోవులవెంబడి
నేగెడుక్రియనున్నయందఁ ♦ జేగిరి శ్రీవా
సాగారమునకు; నిమియా
యోగికినిజదర్శనంబు ♦ నొసఁగెవెసనటన్. 24

క. ఇరువది సంవత్సరములు
మురమర్దనుదర్శనంబు ♦ పొందెన్నా నా
పురములు దిరిగిననితి, శ్రీ
వరుఁజూడంగల్గెఁదనదు ♦ భాగ్యోన్నతిచేన్. 25

క. జలదశ్యాముఁడుమురళీ
చలదంగుళిభాసమాన ♦ శస్తకరుండున్
జలజాతాక్షుఁడు కృష్ణుఁడు
కలలోసైతంబునితికిఁ ♦ గానఁగవయ్యెన్. 26

సీ. మతములుపాడైన ♦ మహినిబుట్టును దేవ
దేవుండువానిని ♦ దిన్నఁబఱుప

దుష్టశిక్షార్థమై ♦ తోఁచె లోకంబున
రాముఁడుద్ధృతధను ♦ ర్బాణుఁడౌచు
ప్రేమావతారమై ♦ పిల్లఁగ్రోవిని బూని
శ్రీకృష్ణమూర్తియై ♦ క్షితిని వెలసె
భక్తి స్వాచరణపూ ♦ ర్వముగ బోధింపఁగా
మానితదండక ♦ మండలువులఁ

గీ. చెలఁగె గౌరాంగుఁ, డాబా ♦ హులను దోఁచె
నితికి; నిరుకేల వింటిన ♦ స్త్రతతిఁ బూని,
రెండు చేతుల మురళిధ ♦ రించి, రెంట
యోగదండంబుఁ బాత్రయు ♦ నొగి వహించి. 27

గీ. చూచి షడ్బాహురూపంబుఁ ♦ జొక్కిపడియె
నితి యతీంద్రుఁడు; నిమియంత ♦ నతనిఁ జేతఁ
దాఁకి “ లేలెమ్ము ; నీ వాంఛి ♦ తములు దీరెఁ
బడసితివి తీసికొనిపొమ్ము ♦ భక్తి ప్రజకు. 28

గీ. భక్తిప్రేమంబు జనులకుఁ ♦ బంచిపెట్టు
మెవ్వఁడైనను వలదన్న ♦ నెరియకుండ
నొసఁగు బతిమాలి బతిమాలి, ♦ యుర్వి కృష్ణ
భక్తిమయముగఁ జేయుమా ♦ సక్తి” ననియె. 29

గీ. దేనిఁ గామించి నితి చేతఁ ♦ బూనినాఁడొ
కట్టియును బుట్టి, నదిహ స్త ♦ గతముగాఁగ
వానితో నింకఁ దనకేమి ♦ పనియటంచు
వెంట రెంటినిఁ బెల్లున ♦ విఱిచివైచె. 30

క. ఏమాడ్కి సిరిగుణములు
శ్రీమద్భాగవతమందుఁ ♦ జెప్పఁబడియెనో



యామాడ్కి భక్తిగుణముల
తో మెలఁగె నితియమి నిత్య ♦ తుష్టిన్ జగతిన్. 31

క. నిమియున్నితియున్దొనకొని
సమస్తకిల్బిషహరణము ♦ సల్పి జనులను
త్తములుగఁ జేసిరి మున్శ్రీ
రమణుఁడు బలరాముఁడవని ♦ రక్షించినటుల్.

మ. మఱునాఁ డాతనిఁ గూడఁగొంచు నిజస ♦ ద్మంబుఁ బ్రవేశించి య
మ్మా ! నీపుత్త్రుని విశ్వరూపు జనస ♦ మ్మాన్యున్మదీయాగ్రజో
దరుని న్దెచ్చితిఁ జూడుమన్న నిమి, య ♦ త్యంతప్రమోదాత్మయై
యరితిన్బర్వులు వాఱి వచ్చె శచి, పు ♦ త్త్రాలోకనాసక్తయై. 33

ఆ. వచ్చి నితిని జూచి ♦ వానిపైఁ దన పెద్ద
కొమరునాకృతియును ♦ గొమరుఁ దేజ
ముండుట రసివంశ ♦ మండన ! నాభాగ్య
రాశి ! విశ్వరూప ! ♦ రమ్మటంచు. 34

చ. తనయుని దగ్గఱన్ బిలిచి ♦ తండ్రి ! నినుం గని చాలకాలమ
య్యెనుగద ! యంచు గద్గదిక ♦ నెన్నియొ ప్రేముడి పల్కులాడి వీ
పును దనచేతితో నిమిరి ♦ పొంగెడు వత్సలతన్ శిరంబు మూ
ర్కొని శచి వెల్వరించెఁ గనుఁ ♦ గొనలనుండి ప్రమోదబాష్పముల్

వ. కొంతసేపటికిఁ గన్నీళ్లాఁచికొని శచి నిమిని జూపి నితితో నిట్లనియె.

ఉ. అమ్మకు నీ విపద్దశ స ♦ మాగతమైనది యాదిపేని నీ
తమ్ముని జూచి దిద్దెడు వి ♦ ధాయకు లెవ్వరు లేమి చేయథే
చ్ఛమ్ముగ నుండెవాఁడని వి ♦ చారము నొందుచునుంటి ; నిప్పుడా
యుమ్మలికంబు వోయె, నుభ ♦ యుల్ బ్రదుకుండిఁకఁ దోడునీడలై. 37

క. అనిపల్కి నిమికరంబును

దనపెద్దకుమారుహస్త ♦ తలముననిడి నీ
యనుజుం బ్రాయకుమెన్నఁడుఁ
దనయా! యనిచెప్పి పుచ్చెఁ ♦ దల్లి యిరువురన్. 38

---

క. నీపాదంబులసేవను
బ్రాపించిన పుణ్యపురుష ♦ వర్యుండిక దు
ష్ప్రాపంచికసౌఖ్యంబుల
కైపడునే పాట్లుభక్త ♦ కల్పక! రామా! 39

---

శ్రీరస్తు.

శ్రీరామచంద్రపరబ్రహ్మణే నమః

# శ్రీ గౌరాంగచరిత్రము.

## ద్వాదశాశ్వాసము.

ఉ. వావిరియైనయజ్ఞతను ♦ వైషయిక ప్రమదేచ్ఛల న్స్వవృ
త్త్యావహకావ్యపాఠముల ♦ సంగమనోబలసంపదన్ యశ
శ్శ్రీవిగతత్వభీతినరు ♦ చిత్తముసంశయపంకిలంబుగాఁ
గా, విమలంబుసేయుదది ♦ గాంచిదయారసదృష్టి రాఘవా! 1

---

శా. శ్రీవాసానుజుఁ గృష్ణభక్తు నమలు ♦ శ్రీరామనామాంకితున్
దేవుండౌనిమిడగ్గఱన్బిలిచి శాం ♦ తిప్రాకటాభిఖ్యఁ బ్రో
ల్పావీడేత్తఱినేగిచొచ్చి గురుఁడౌ ♦ నద్వైతుఁదజ్జాయసీ
తావామాక్షినిదోడితెమ్మిటకు భ ♦ క్తశ్రేష్ఠులాయిర్వురన్. 2
మ. ఉపవాసంబుల నశ్రుపాతముల భ ♦ క్త్యుద్రిక్తవాక్యంబులన్
వపురానందవివర్జనంబుల లస ♦ ద్వ్యాపారశీలంబులన్
నిపుణుండైననుఁ దెచ్చెఁదానిలకు ; వా ♦ నిన్వానియిల్లాలినీ
విపుడేతోడ్కొనిరమ్ము నాకడకునో ♦ యీ! రామ! శాసించితిన్.
వ. అనిన మహాప్రసాదంబని యాజ్ఞఁగైకొని శ్రీరాముండు శాంతిపురం
బునకుం గదలిచనియె. 4

గీ. బుధతటక్కులకును మోస ♦ పోయితినని
సిగ్గుపడిశాంతిపురికిని ♦ శీఘ్రవేళఁ
జల్లచల్లఁగజాఱిన ♦ శాస్త్రవేత్త
యిపుడు నిమిమాటపాటించి ♦ యెట్లువినును 5

సీ. సకలవేదపురాణ ♦ శాస్త్రసారజ్ఞుండు
చుఱుకైనబుద్ధిచే ♦ మెఱయుపోఁడి
యకలంకచారిత్రుఁ ♦ డమలాంతరంగుండు
నిస్తులభక్తిచే ♦ నెగడుశిష్టుఁ
డవతారపురుషుఁడం ♦ చందఱెన్నెడువాఁడు
గురువులకెల్లర ♦ గురుగురుండు
పెక్కురుమ్ముండులు ♦ విపులవిద్యావంతు
లవనిపాలురు శిష్యు ♦ లైనమేటి

గీ. యెట్టివాగ్మలనిట్టవా ♦ కట్టుగట్టు
వాక్సమర్థతగలగట్టి ♦ పండితుండు
వందనీయుఁడు జనులక ♦ ద్వైతుఁడెట్టు
లరసిగౌరాంగుపనుపును ♦ సతకుసేయు? 6

శా. శ్రీరాముండిది యెట్టి యొంచకలల ♦ శ్రీకాంతుసందేశమె
వ్వారైనన్నిరసావహింపవలె న ♦ న్భావంబుతోనిట్టిమ
న్వారాశిన్గపిచాకళించినగతి ♦ న్భక్త్యంతరానందమే
పారన్శాంతిపురంబుసొచ్చికనెలో ♦ కాతీతునద్వైతునిన్. 7

మ. కనియాచార్యునిసన్నిధిన్నిలఁబడె ♦ న్గౌరాంగదేవుండుపం
పినవార్తన్బ్చురింపఁజాలకది తా ♦ వీక్షించి సర్వాంగకం
పనమునంబూచి యదంతమాద్యత్కృతవా ♦ గ్బంధంబటంచెంచి రా
మునితోనిట్లనె వృద్ధదేశికుఁడు మో ♦ మున్గ్రిమ్ములేనవ్వులన్ 8



సీ. రామ! నేనెఱుఁగుదు ♦ రా! మున్నమీనిమి
చేసెడుమోసంపుఁ ♦ జేష్టలెల్ల
నన్నుమీదేవుని ♦ నన్నిధికిందీసి
కొనిపోవవచ్చితే? ♦ కుఱ్ఱవాఁడ
నిమిమాయలంబడ ♦ నేబాలుఁడనుగాను
నానత్తనీకుఁ గ ♦ న్పడదుగాని
నేనెట్టివాఁడనో ♦ నీయన్న శ్రీవాసుఁ
డెఱుఁగును గొంతనీ ♦ వేగియడుగు

గీ. మొన్నమొన్నటిదాఁకమీ ♦ పురమునందు
దినములనువీధులంబడి ♦ తిరుగునిసువు
దేవుఁడైపోయెనేయిప్పు? ♦ డీవిచిత్ర
మెక్కడయెడనేనిఁగనివిని ♦ యుంటివో క్కొ? 9

క. కలికాలంబునదైవం
బిలనెన్నండైనఁబుట్టు ♦ నే? మానవుఁడై
కలుగునని యేపురాణము
వలికెనో వినియెదనొకింత ♦ వాకొన్నురామా! 10

వ. అని యద్వైతుండాడు నిష్ఠురహాస్యోక్తులానందాబ్ధిలో మునింగియు
న్న శ్రీరాము నాటమింజేసి యాతండా ముదుసలి పండితువంకఁజూచి
యిట్లనియె. 11

క. నీకఠినవాక్యములతో
నాకుంబనిలేదు రావు ♦ నాకేచదువుల్
లోకారాధ్యుఁడుపంపెను
నీకొకసందేశమద్ది ♦ నియతినివినుమా! 12

గీ. భక్తిచేతను బ్రేమచే ♦ భగవదైక్య

మున్నడసి సర్వదుఃఖవి ♦ ముక్తుఁడెట్లు
పురుషుఁడౌ దానినరులకు ♦ బోధసేయ
రమ్మని యొనర్చితఁటనీవు ♦ ప్రార్థనములు. 13
గీ. వానినాలించి భువికిఁదా ♦ వచ్చెనఁట కృ
పాళువౌ దేవదేవుండు ♦ వానిఁజూడ
నున్నవారలనున్నట్లు ♦ నిన్నునీదు
నతివఁగొని తెమ్మటంచు నా ♦ కాజ్ఞయొసఁగె. 14
వ. అని చెప్పిన. 15
మ. తొలుతన్నామునికడ్డురాఁదలఁచెనం ♦ తోమచ్చరీఁడౌచుఁగా
ని, లసద్వాక్యసుధాపరివాహగరిమ ♦ స్థిరత్వమాత్సర్యముల్
తొలఁగంబాఱఁగఁ, బండితుండు పరతం ♦ త్రుండై విచిత్రంబుగా
వెలిచెన్నన్నులనూంపి యశ్రితతిదు ♦ ర్వ్యక్షేయమోదంబునన్. 16
గీ. వెనుకనేర్చినయెల్లప్ర ♦ వృత్తిశాస్త్ర
ములవలనఁగల్గుసందేహ ♦ ములనుముఱికి
తాఁకినమనంబుబాష్పధా ♦ తంబుగాఁగఁ
బండితుండిట్లుతత్తఱ ♦ పడుచుఁబల్కె. 17
సీ. వచ్చెనే శ్రీజాని ♦ వచ్చెనే నాతండ్రి
చివరకు నామొఱ్ఱ ♦ చెవినిబడెనె!
యాలింపఁడా! సత్కృ ♦ పాళుండుగదవాఁడు
శాస్త్రగాథలకేమి? ♦ శాస్త్రములను
వేదంబులనుదాఁటి ♦ వెలయుసర్వజ్ఞుండు
చిత్రమానేనుదీ ♦ సికొనివచ్చి
తిననితాననెనఁట; ♦ ననుఁబెద్దసేయుట
కంతియేకాని నే ♦ నణువు· భూతి



ఆ. బలునిధరకునెట్లు ♦ పట్టితేఁగల్గుదు?
భారమంతనాదు ♦ పయినిబెట్టె
బుద్ధిపుట్టితానె ♦ పుడమికిదయచేసెఁ
గానివేఱులేదు; ♦ కాదె? రామ! 18
క. అనివెఱ్ఱినవ్వునవ్వుచుఁ
దనభార్యంబిలిచి యోసి! ♦ త్వరగానిపుడే
మనమిద్దఱమునవద్వీ
పనగరమునకేగవలయుఁ ♦ బయనముగమ్మా! 19
గీ. అరితి శ్రీకాంతుఁడవనికి ♦ నరుగుదెంచి
మనలనిద్దఱవేవేగ ♦ తనయెదుటకు
వచ్చికాన్పింపుఁడని యాజ్ఞ ♦ యిచ్చెఁగాన
నాతి! నాతోడవేప్రయా ♦ ణంబుగమ్ము, 20
క. అనిచెప్పి పిచ్చిపట్టిన
మనుజునిగతిఁ గర్వకలిత ♦ మానసమడరన్
వనజాక్షుధరకుఁదెచ్చితి
ననియఱచుచుఁగొట్టసాగె ♦ హస్తయుగంబున్. 21
క. కలమెక్కి వృద్ధదంపతు
లెలమిని శ్రీరాముతోడ ♦ నేగుచునుండన్
గలిగెఁబెలుచనద్వైతున
కలపూర్వపుసందియముల ♦ యలజడిమఱలన్. 22
క. నిమ్మిదైవత్వాదైవ
త్వములఁబరీక్షింతమనెడు ♦ తలఁపునవద్వీ
పమునంగాల్వెట్టిననిము
సముననెబలపడెనుమాన ♦ సమునసతనికిన్. 23

వ. అంత నతండు రామునితో నిట్లనియె. 24

చ. మనసునఁబుట్టినట్టియును ♦ మానముచేనొకమాటసెప్పెదన్
వినుమునుమున్న నీవుసని ♦ నేనరుదేరఁగ సమ్మతింపలే
దనినిమిత్తోడఁబల్కినబ ♦ యల్పడునెల్లనిజంబు ; దానిన
మ్మిన మనుజుండె ; లేనియెడ ♦ మిశ్రసుతుండలచక్రపాణియే. 25

క. ఈయుపకారముమాత్రము
సేయుమురామ ! యననతఁడు ♦ చిఱునవ్వొలయన్
శ్రీయుతుఁడు విష్ణుఁడేనిమి
యోయద్వైతాయటంచు ♦ నుత్తరమిచ్చెన్. 26

గీ. అంతనద్వైతుఁడో రామ ! ♦ యతనిపాద
మించుకేనియు మనమునఁ ♦ గొంచకుండ
నాశిరముపైనిబెట్టన ♦ న్వృద్ధుఁడైన
బాలుఁడీశ్వరుఁడనియెంచు ♦ వాఁడననియె. 27

గీ. రాముఁడింటికిఁబోకపూ ♦ ర్వంబునందె
వడిగనద్వైతురమ్మని ♦ వార్తతిరుగ
వచ్చె ; నదిడిందుపడెడు వి ♦ శ్వాసవహ్నిఁ
గ్రిమ్మిక్రిమ్మఁజగ్రమముగా ♦ రగులుకొల్పె. 28

క. ఆలుం దానును శ్రీవా
సాలయమునకేగుదెంచు ♦ నవసరమున నాం
దోళితహృది, సంభ్రమక
ల్లోలంబై కొట్టుకొనియె ♦ లోనొక్కమెయిన్. 29

వ. ఇట్లుచనిచని. 30

గీ. వడఁకుదేహంబుతోడ శ్రీ ♦ వాసునింటి
పంచపాళికివచ్చియా ♦ పైనినిమి వ



సించుగదిలోనికేగశం ♦ కించిభార్య
యూఁతగానిల్చితెప్పల ♦ నొయ్యవిప్పి. 31

సీ. శ్రీవాసుగదినిశ ♦ చీపుత్త్రినకుమాఱు
కాంచెనద్వైతుఁడు ♦ కాంతిఁజిమ్ము
తలుపులుగోడలుఁ ♦ దక్కుగృహోపక
రణములు సదుపచా ♦ రములుసేయు
కాంతికాయసుసేవ ♦ కప్రకరంబులుఁ
బదములొత్తెడుమహా ♦ భక్తచయము
భూరిశోభాయుక్త ♦ భూనభోమధ్యంబు
శ్రద్ధఁబూజించుని ♦ ర్జరగణంబు

గీ. వారినడుమనుగరఁగిన ♦ స్వర్ణమును, ద
టిల్లతాప్రకరంబును, ♦ బల్లవాస్త్రి
దశశతమనోజ్ఞత, సహస్ర ♦ శశివికాస
మును, హసించెడునొకముద్దు ♦ మోమువాని. 32

గీ. పండితునకతనిభార్యకుఁ ♦ బరమపురుషు
దివ్యరూపంబుఁగనినంత ♦ దృష్టులందుఁ
గ్రమ్మెమిఱుమిట్లు ; కరములు ♦ గదలవయ్యె
వశముగావయ్యె నాలుక ♦ ల్పలుకుటకును. 33

ఉ. ఆతతధీబలంబునఁ బ్ర ♦ యాసమునన్గురుసేవఁదొల్లియ
ద్వైతుఁడునేర్చినట్టి పర ♦ తత్వముశేవనుదాఁటివర్ణనా
తీతమహాద్భుతాకృతిసు ♦ దృఙ్మణికిన్గనిపించిసంశయ
వ్రాతముసంహరించెనిమి ♦ పంకజనాభుఁడటన్నవింతయే ? 34

ఉ. పండితుఁడెట్లుదైవమును ♦ భావనచేయుచుపాస్తిసల్పునా
నిండుచిదాత్మకెక్కుడయి ♦ నిల్చికనంబడినట్టివిప్రబా

లుండదియేమిచేసెనొకొ ♦ లోకనమాత్రపుటర్చదక్కయిం
డొనరింపఁజాలఁడతఁ ♦ డుత్తమభూసురుఁడయ్యునచ్యుతున్. 35
శా. ఆనందించెను జూచికొని యది వా ♦ క్యప్రౌఢిఁజెప్పంగలేఁ
డానమ్రుండయి పూజసేయుటకునూ ♦ హల్పుట్టెఁ బుట్టంగనే
సూనాదుల్గొని సేవసేయుసురల ♦ న్జూడంగఁబెన్నిగ్గునన్
దానాధన్యులప్రోలనెంతనెడుచిం ♦ తన్వాంకకుందీసెడున్. 36
ఉ. చేతులనిండవందనము ♦ సేయఁగలేకయు నోటినిండనా
నేతకుస్తోత్రముల్సలుప ♦ నేరకయున్మదిపాఱుఁడాత్మసం
భూతభయప్రచాలితవ ♦ పుఃపరిపీడితుఁడౌచునిల్చెఝుం
ఝూతతధూతభీతవివ ♦ శంపుటనంటిదళంబుకైవడిన్. 37
చ. పిలిచినవచ్చినాఁడుకద ♦ విప్రుఁడటంచుదయాబ్ధిదీనవ
త్సలుఁడవలోకనంబునకు ♦ శక్యముగాని నిజస్వరూపమున్
గొలఁదిగదర్శనీయముగఁ ♦ గుంచఁగనెంచిమనోజ్ఞలక్షణం
బులుగలముద్దుబాలుఁడయి ♦ పొల్చెనువృద్ధునికన్నుదోయికిన్. 38
క. కనఁబడి భక్తాగ్రేసరు
లను తాపసకుంజరులను ♦ లక్ష్మీదేవిన్
మనసుఁగరంచినస్మేరా
ననమున నద్వైతుఁబిలిచి ♦ నలినాక్షుఁడనెన్. 39
గీ. ప్రజలదుఃఖంబులరసియో ♦ ర్వంగలేక
వారిముక్తికినై తపః ♦ ప్రార్థనములు
సల్పినాఁడవు ఘోరంపు ♦ సరణినీవు
సల్పిలాగితిభక్తిభూ ♦ స్థలికినన్ను. 40
క. కావున నద్వైతాచా
ర్యా! వచ్చితి మెచ్చినీస ♦ దర్చాతపముల్



నీవు వెదచల్లుమిఁక భువిఁ
పావనభక్తియును ప్రేమ ♦ వలసినపగిదిన్. 41
వ. లోచనదుర్భరంబై భీకరంబగు దివ్యతేజస్స్వరూపంబుమార్చి విలోకనశక్యమనోహరమానవాకారంబుఁదాల్చి నిమియాడిన వాత్సల్యసూచకంబులగు మంజులవాక్యంబుల కించుక ధైర్యంబుఁదెచ్చికొని యద్వైతాచార్యుండు భక్తివినమితగాత్రుండై నిలఁబడి యల్లన నిట్లనియె. 42
సీ. దేవునాకర్షించి ♦ తెచ్చితినని చెప్ప
నవనిపైననునమ్ము ♦ నెవఁడుతండ్రి!
యధమాధముఁడనునే ♦ నర్హుఁడనే? తేరఁ
గుక్షిస్థలోకుని ♦ బక్షిగమను
నిర్హేతుకోద్భూత ♦ నిఖిలభూతదయాతి
రేకంబుననునీవె ♦ పృథ్వికేగు
దెంచిమమ్ములనుర ♦ క్షించితివయ్య! నీ
తనయులెల్లరు; వారి ♦ మనుచువారు
గీ. గలరెనీకంటెనితరులో ♦ జలదగాత్ర
యన్యసాధ్యంబుగానిలో ♦ కావనంబు
పొందెనీయవతారంబుఁ ♦ బూనిమాకు
నేత్రపర్వంబొనర్చితి ♦ నీరజాక్ష. 43
క. పేర్చిననాపాపముని
న్మర్చించిమహానుభావ! ♦ హరియించెదనం
చర్చింపఁగనద్వైతుఁడు
గూర్చుండెన్నిమిపదముల ♦ కుఱుఁగటనంతన్. 44
క. గంగోదకమునఁబాదము
లంగడిగిసుగంధిపుష్ప ♦ లలితాగడులు

ష్పాంగినమర్పించుచుఁ బూ
జం గౌరాంగునకుఁ జేసె ♦ శాస్త్రోక్తముగన్. 45

క. ఆరసినిశ్చలభక్తిని
గౌరాంగుం "ఓయి! భక్త ♦ కంఠీరవమా?
కోరుకొను మెద్దియేనియుఁ
జేరిమినిత్తునొకవరము ♦ వెంటనె" యనఁగన్. 46

ఉ. కోరఁగలేదు యౌవనముఁ ♦ గోరఁగలేదమరాధిపత్యమున్
గోరఁగలేదుసంతతిని ♦ గోరఁగలేదుధనంబుయోగ్యుఁడౌ
పాఱుఁడు, తత్సుఖప్రతతి ♦ ప్రత్యహదుఃఖకరంబటంచు; సం
సారమహార్ణవోత్తరణ ♦ సక్తమనస్కుఁడవెట్లుకోరెదున్? 47

గీ. ప్రభుతకునుమాఱుదాసత; ♦ స్వసుఖమునకు
మాఱుపరసుఖకరణంబు; ♦ మహితదైవ
భక్తియంతయునొకతానె ♦ పడయకుండ
నొరులకొసఁగుట; యీకోర్కు ♦ లుదయమయ్యె. 48

క. హరిసందర్శనమున నీ
పరమపవిత్రంబులైన ♦ వాంఛలువొడమన్
గరములుజోడించి ధరా
మరుఁడిట్లడిగెనువరంబు ♦ మాధవుభక్తిన్. 49

క. వక్తృత, యోగ్యత, ధిషణా
శక్తియు, స్థితి, మతము, గనక ♦ సర్వజనులకున్
రిక్తార్థమునకునేనిడు
భక్తిప్రేమములదీన ♦ వత్సల! దేవా! 50

గీ. అఱుతనున్నట్టిభక్తులం ♦ దఱును గేక
లిడిరి "జయము! శచీదేవి ♦ బుడుతనికిని



బాపదీనాజ్ఞసంత్రాస ♦ భంజనాప్త
నరశిఖామణియద్వైతు ♦ నకు" నటంచు. 51

వ. అందులకు గౌరాంగుఁ డిట్లనియె. 52

ఉ. మేలవనీసురప్రవర! ♦ మెచ్చితి నీకువరంబునిచ్చితిన్
బోలును నీకెయిట్లుపర ♦ మోదకరేచ్ఛనునన్నుఁగోరుటే
జాలఁగసంతసించితిని ♦ తూళితకిల్బిషచిత్తుఁడౌచుఁజం
డాలుఁడుఁగూడనీదుకృప ♦ నన్బడయందగుమోక్షకాముఁడై. 53

వ. అంత నద్వైతుండు తత్కాలంబునకు గత సందేహుండై శాంతిపురంబునకుం జనెనుగాని యుక్తిశాస్త్రవ్యాసంగంబు చిరకాలంబు చేసినవాఁడు గావునఁ దద్వాసనాపంకిలంబైన మనంబు పునస్సంశయాస్పదంబై కళవళపెట్ట నాతం డిట్లుచింతింపఁ దొడంగె. 54

సీ. మనుజులుగొందఱు ♦ మానుషప్రజ్ఞచేఁ
జూపఱమోసపు ♦ చ్చుటయుఁగలదు
నిమియట్టిఁడా? లేక ♦ నిజముగాదేవుఁడా?
యీశంకయెట్లు ని ♦ వృత్తమగును?
గౌరాంగుఁడకలంక ♦ కనకభాస్వత్తేజుఁ
డసితాంగుఁడుగదనం ♦ దార్భకుండు
ధరియింపలేఁడు శ్రీ ♦ హరికృష్ణరూపంబు
నింద్రజాలికుఁడు నే ♦ ర్పెంతయున్న

గీ. వెండి, వెంటనె, నేనొక్క ♦ పిట్టనైనఁ
దెలియకుండంగఁజని నవ ♦ ద్వీపమునకు
నాఁడు బృందావనమునందు ♦ నాడినట్టి
గొల్లఁడవుగమ్మయని నిమిఁ ♦ గోరువాఁడ 55

క. సందియముఁదీర్చునిదియం
చుందరలిధరామరుండు ♦ సొచ్చినిమిగృహం

బందున నాతనిఁగానక
తొందర శ్రీవాసునింటి ♦ త్రోవన్జనియెన్. 56

మ. చని శ్రీవాసుగృహంబునందుఁగనె శి ♦ ష్యవ్రాతమున్గూడి కృ
ష్ణునిచారిత్రము భక్తిమైనుడువుకొం ♦ చున్గాలమున్బుచ్చువా
నిని గౌరాంగుని ; గాంచి సాఁగిలఁబడె ♦ న్వృద్ధుండు ; గౌరాంగుఁడా
తనికి న్ప్రత్యభివందనంబులిడి సే ♦ దన్బాపెనత్యాదృతిన్. 57

గీ. అంతనందఱు నాసీను ♦ లైనపిదప
సస్మితాననుఁడై నిమి ♦ సఖులఁజూచి
"మృత్యుభయమిఁక మనకునే ♦ మియును లేదు
వచ్చెసీతాపతి యెదయ ♦ వచ్చి" యనియె. 58

క. ఉచితోత్తరమిచ్చెను బు
ద్ధిచమత్కారంబుసూపి ♦ దేశికుఁడంతన్
శచిసుతుఁడు "చెప్ప కేమీ
రు చనిరని విచారపడితి ♦ రోషించితిరో ?" 59

క. అనిపల్కనంతలో భో
జనమునకున్బిలిచె విప్ర ♦ సత్తము గౌరాం
గునిజనని నాఁగ 'మంచిది'
యనెఁ బండితుఁ డతికృతజ్ఞ ♦ తార్ద్రాత్ముండై 60

ఉ. వాసిగనందఱున్సరస ♦ వాక్కులముచ్చటలాడుచుండ శ్రీ
వాసునికర్ణమున్గదిసి ♦ పండితుఁడేదియొపల్కఁగాంచి వి
ద్యాసదనాంతరంగుఁడు మ ♦ హాత్ముఁడు నీచెవినూఁదుసూక్తి సా
వాసము పేరిమిన్దెలుప ♦ వా ! యనె మిశ్రసుతుండు నవ్వుచున్. 61

వ. అన శ్రీవాసుఁ డిట్లనియె. 62

శా. అత్యానందదకృష్ణరూపమును దే ♦ వా ! సత్కృపన్జూపితా



నిత్యానందున ; కట్టిభాగ్యమొనయ ♦ న్లేనైతినింకంచుఁ బాం
డిత్యస్ఫారుఁడు నైష్ఠికోత్తముఁడకుం ♦ ఠీభూతభక్త్యాత్ముఁడై
సత్యోదారుఁడు లోనఁగుందుచనఁగా ♦ జాలండు మీసన్నిధిన్. 63

క. చిఱునవ్వునవ్వుచ నెనిమి
"సరి ! నానిజరూపమిద్ది ♦ చక్షుష్పర్వం
బరుదుగ నద్వైతధరా
మరునకొనర్పంగలేదె ? ♦ మాన్యచరిత్రా !" 64

మ. అనువాక్యంబులకేమిపల్కుటకు నో ♦ రాడంగలేదయ్యె వృ
ద్ధున ; కారూపముచాలునన్న మదియం ♦ దున్గల్గు శ్రీకృష్ణమూ
ర్తి నిదర్శించెడు వాంఛదీరదిఁక శౌ ♦ రిన్జూతు నీరూపుచేఁ
దనియన్జాలనటన్న మిశ్రజునిచి ♦ త్తంబెంతొ నొచ్చున్గదా ! 65

ఆ. ఇట్లుకొట్టుకొనెడు ♦ హృదయంబుతోడ న
ద్వైతుఁడుంటగాంచి ♦ "పరమపురుష !
నీదు ముద్దురూపు ♦ నిరుపమానమె కాని
తరుణకృష్ణరూప ♦ ధారివౌచు. 66

క. కనిపించెదనని యద్వై
తునకున్మనుబాసచేసి ♦ తోఁచఁగలేవిం
కనని యతఁడుమ్మలించెడు"
నని శ్రీవాసుండువలికె ♦ నాప్తుండలరన్. 67

వ. ఈమాటలకు నివ్వెఱపడి గౌరాంగుండు లజ్జావిషాద వినమితాననుం
డై యిట్లనియె. 68

సీ. ఒక్కొక్కసమయమం ♦ దోమిత్రవరులార !
పరవశతారోగ ♦ బాధచేతఁ
బిచ్చివానిగతిని ♦ ప్రేలుదునవియివి
యవియన్నిపాటిసే ♦ యంగఁదగునె ?

యట్టియవసరంబు ♦ బందునా శ్రీకృష్ణు
నెడనపచారంబు ♦ లేవియేనిఁ
బలికినఁ జేసినఁ ♦ బ్రాణసఖులుమీర
లటు సేయకుండన ♦ న్నడ్డగింపుఁ
గీ. డయ్యా! యని యెన్నిసారులో ♦ యంటినిగద
యోయి! యద్వైత! విస్మృతి ♦ నుండివదరు
దైవదూషణవాక్యము ♦ ల్దలఁచియటులె
సేయుమనికోరుటదినీకుఁ ♦ జెల్లునయ్య? 69

వ. శ్రీవాసుం డిట్లనియె. 70

క. వెనుకన్నిత్యానందున
కునుజూపఁగ లేదె కృష్ణ ♦ కోమలరూపం
బనఘా? యది మేమందఱ
మునుగాంచఁగ లేదె? యేల ♦ మోసపుమాటల్. 71

వ. నిమి యిట్లనియె. 72

క. అటులా! శ్రీవాసా! నా
కటువంటిప్రభావమెట్టు ♦ లలవడుమీరం
తటివింత లెకాంచినచో
నెటు సెప్పదువానికవియె ♦ యేతెంచిచనెన్. 73

వ. శ్రీవాసుం డిట్లనియె. 74

శా. స్వామీ! నీకుస్వభావజాకృతియు న ♦ స్వాభావికోన్మత్తనే
త్రామోదప్రదరూపమొందఁగలవం ♦ చాడంగనెట్లొప్పు, నన్
బ్రాము ల్పెట్టకుఁ దెల్లమయ్యెనిఁక న ♦ స్వాభావికేత్యుక్తస
ద్రామాకారమె నీస్వరూప, మయథా ♦ ర్థంబుల్పరాకారముల్.

వ. నిమి యిట్లనియె. 76



క. అకలంకస్థిరభక్తి
ప్రకటితచిత్తంబుగలిగి ♦ భజియించునుపా
సకులోకయించుక శ్రీకృ
ష్ణకళాలేశంబుఁ గాంచఁ ♦ జాలుదు రెలమిన్. 77

క. ఆరూపంబద్వైతుం
డారయఁ గోరిననిమీలి ♦ తాక్షుండై ధ్యా
నారాధనముననుండినఁ
గారుణికాగ్రణియతండు ♦ గనఁబడవచ్చున్. 78

వ. అద్వైతుండు శ్రీకృష్ణావలోకనలాలసుండై తద్దర్శనప్రాప్తిం గూర్చి దృఢవిశ్వాసంబుగలిగి కన్నులుమూసికొని ధ్యానప్రవిష్టుండయ్యెఁ దక్కుభక్తులందఱుఁ జిత్తంబుల విషయవిముఖంబులుగను ధ్యానోన్ముఖంబులుగను జేసి దృష్టుల నద్వైతుపైఁ గీల్కొల్పియున్నంత.

శా. ఆసీనుండయిభూసురోత్తముఁడు ధ్యా ♦ నాయత్తుఁడై యుండ ని
శ్వాసోచ్ఛ్వాసములాఁగె; దేహముగడు ♦ న్స్థాణుత్వమున్దాల్చె; ధ్యా
నాసక్తిన్విడనాడి విప్రనికపా ♦ యుంబయ్యెఁగా! యంచుసం
త్రాసంబందుచుఁ జూచుచుండిరి నిమి ♦ ప్రతీక్షింపుమంచందఱున్.

మ. పులకల్గన్పడెఁ బ్రాణసూచకములై ♦ పుణ్యాత్ముమైనంతనె
చ్చెలులుజ్జింతలుదక్కి; 'రేమిది' యనన్ ♦ శ్రీవాసుఁ, డాకృష్ణుదై
వలసద్దర్శనమందెనే మొమనయ ♦ ద్వైతుండు; తద్బాహ్యచి
హ్నలుగాఁదోఁచెను నివ్వియంచనను గౌ ♦ రాంగుండు లేనవ్వులన్.

ఆ. ఆతనోమహాత్మ ♦ యద్వైతునకుఁ గృష్ణుఁ
జూపి మాకుఁగూడఁ ♦ జూపవైతి
వేమిపాపమయ్య! ♦ యిది! యని శ్రీవాసుఁ
డంతలోనె యిట్టు ♦ లనియెమరల. 82

క. మా కేమివిచారము లే
దో కంజదళాక్షి ! నీవ ♦ యున్నాఁడవు నీ
యాకృతియెచాలు ; స్మృతికిన్
రాకున్నాఁడితనిఁదేర్చి ♦ రక్షింపఁగదే. 83

వ. దానికి నిమి యిట్లనియె. 84

క. నీవంటివాఁడ నేసుమి
శ్రీవాసా ! యెట్లునేను ♦ శేయఁగలుగుదున్
శ్రీవరుఁడౌనస్సుకృత్యము
లేవాఁడున్వలదు ; స్మృతియ ♦ దేతావచ్చున్. 85

ఆ. కొంతసేపటుండి ♦ కూరుకుచాలించి
యదరిలేచిచూచు ♦ నతనిపగిదిఁ
దేటివిప్రవరుఁడు ♦ దెసలనుబరికించి
యుమ్మలించె నశ్రు ♦ లొలుకనిట్లు. 86

సీ. నీలమేఘద్యుతు ♦ ల్నెగడనద్దెసల నా
యెదుటఁగన్పడినవాఁ ♦ డేఁడియేఁడి ?
నెమిలిపింఛముదాల్చి ♦ నేత్రపర్వంబుగా
నిట్టట్టుమురిసెవాఁ ♦ డేఁడియేఁడి ?
మురళియూఁదుచునన్ను ♦ మోహపుచ్చినయింత
లేసికన్నులబాలుఁ ♦ డేఁడియేఁడి ?
వర్ణనాతీతమై ♦ వఱలునాస్యమున నా
యెదనుదొంగిలినవాఁ ♦ డేఁడియేఁడి ?

గీ. చిఱుతపదములఁ జిన్నారి ♦ చిట్టిగజ్జె
లెంతొరవళింపనాడెవాఁ ♦ డేఁడియేఁడి ?
నిండుపున్నమవెన్నెల ♦ ల్నీరసింప
నెలమిననుఁజూచినవ్వెవాఁ ♦ డేఁడియేఁడి ? 87



గీ. ఇట్లుకన్నులఁగట్టిన ♦ యట్లుకృష్ణు
వర్ణనముసేసివిలపించు ♦ వానిఁగాంచి
'యేమియద్వైత ! నీకన్ను ♦ లేమిగాంచెఁ
బలుకుమిటుసూచి' యంచు శ్రీ ♦ వాసుఁడడిగె. 88

వ. అందుల కద్వైతుం డెదుటనున్న గౌరాంగు వ్రేలుపెట్టిచూపి యిట్ల
నియె. 89

గీ. కట్ట ! యిదియంత యీమోస ♦ గానిమాయ
యేనుగనుమాయతోడనే ♦ యెదనుదూఱి
కృష్ణుఁడై యిన్నిచేసితా ♦ నిట్టపైకి
దూఁకి నిమియయుకూర్చుండె ♦ దుడుకుచూడు. 90

ఆ. నిద్రఁగలనుగాంచి ♦ నిందింతెనన్నని
పల్కనిమి, యతండు ♦ వలికెనిట్టు
లెదనుదూఱుచుంట ♦ యీకనుల్గాంచెఁగా !
మోసమేలయోయి ! ♦ ముద్దుఁగృష్ణ ! 91

వ. అంత. 92

క. నునుసిగ్గున నిమియానన
మునువంచెను ; నీదుపూర్వ ♦ పుణ్యముచేతన్
గనఁగలిగితివీశునిగృ
ష్ణునని రి నిమిమనమొకింత ♦ నొవ్వకయుండన్. 93

గీ. దేనిచేతను విప్రసం ♦ దియములంత
రించిపోకుండఁగ్రమ్మఱ ♦ నేగుదెంచి
సారెసారెకునతనిఁగ ♦ ష్టములఁబెట్టె
మహిమలెటుతన్పసంశయ ♦ మానసముల ? 94

క. గరువము విద్యయుబుద్ధియుఁ

బరువునహంభావమడరి • భక్తింజెఱచున్
గరఁగువడి యవ్విక్రమముగఁ
బురుషునిభక్తిసుఖపాత్ర • పూరుషుఁ జేయున్. 95



క. చదువులు సదివిననున్నత
పదభోగంబులునుదక్కు • భాగ్యములెంతో
యొదవిననేమిప్రయోజన
మెదనిన్భజియింపకుండు • నెడ శ్రీరామా ! 96



శ్రీరస్తు.

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః

# శ్రీ గౌరాంగచరిత్రము.



## త్రయోదశాశ్వాసము.



మ. సిరిదూరంబయిపోవనీ! సుఖముని • శ్శేషంబుగాజాఱనీ!
పరిహాసంబులు నీసడంబులు జను • ల్భాషింపనీ! రక్తముల్
దొరఁగన్బ్రబడిమోఁదనీ! యురువిప • త్తుల్గ్రమ్మిబాధింపనీ!
హరిదాసుల్భవదంఘ్రిపద్మములఁ బా • యన్లేరుగా! రాఘవా! 1



గీ. చిట్టిగాంగుననుండి వి • శేషవిత్త
వంతుఁడౌపుండరీకుఁడ • న్భక్తవరుఁడు
నరవతంసరామానంద • నామధేయుఁ
డును ముముక్షుత్వమునఁజని • రినిమికడకు. 2

క. ఆకాలపుభక్తవరుల
నేకులు గౌరాంగచరణ • హృతమానసులై
యీకరణినెమోక్షేచ్ఛను
మూఁకలుగామూఁగిరతని • పురవరమందున్. 3

క. నిమిశిష్యులలోనొక్క
క్కమహాత్ముఁడెచాలు జనుల • కల్మషములు దుః

ఖములుహరియించి భక్తి
క్రమమునుబోధించిముక్తిఁ ♦ గనఁజేయుటకున్. 4

క. ఈనుజనులఁజేదోడుగఁ
జేసికొనుచుదుష్టతముల ♦ శిష్టవరులుగాఁ
జేసెనలనందసుతుఁడు శ
చీసుతుఁడై కరుణనన్నఁ ♦ జిత్రమెజగతిన్ ? 5

గీ. పుండరీకరామానంద ♦ పురుషులాత్మ
వర్తనంబులఁదెల్పిరి ♦ భక్తులెనయ
వచ్చుమెలఁకువ నిహసుఖ ♦ భాక్కులౌచుఁ
బారమార్థికసుఖమునిం ♦ డారననుచు. 6

శా. వాలాయంబుగభక్తులెందఱోనిమి ♦ ప్రజ్ఞాభవాశ్చర్యకృ
ల్లీలల్గాంచిచెలంగుచుండిరిఁకఁ ద ♦ ల్లీలామహత్త్వంబుభ
క్తాళిస్తోత్రములన్నియున్దెలుపశ ♦ క్యంబే ? మహాగ్రంథము
ల్బాళిన్వ్రాసినకాళిదాసకవియు ♦ న్వాల్మీకియు న్వచ్చినన్. 7

సీ. జెస్సూరులోపలఁ ♦ జేరినబాంగాంగు
నందలిబూరిబురా ♦ ననెడుదాని
లోనున్నయొకముప ♦ ల్మానుండునిస్తుల
శ్రీకృష్ణభక్తిచేఁ ♦ జెలఁగువాఁడు
సకలభూతములందు ♦ సమదయగలవాఁడు
హరినామమునువిను ♦ నఖిలజంతు
వులుముక్తిఁజెందున ♦ న్పూర్ణవిశ్వాసంబు
గలవాఁడుబెనపోలు ♦ కాననంబు

గీ. ప్రాంతమందుననొకచిన్న ♦ యాకుటిల్లు
గట్టికొని యందునివసించి ♦ గట్టిగాను



బగలురాత్రియు విసుగకొ ♦ క్కగతిఁబాడు
చుందుహరినామమునునోటి ♦ నిండభక్తి. 8

గీ. అచలమైనఁజలింపఁగా ♦ నగునుగాని
యితనిభక్తికిఁజలనమిం ♦ తేనిలేదు ;
సతతహరిదివ్యనామసం ♦ స్మరణకలన
నెనసెనితఁడు ‘ హరిదాసుఁ ♦ డనెడుపేరు ’ 9

క. వీతాహంకారుండగు
సీతఁడుభక్తిక్రమంబు ♦ నెల్లయులోకా
తీతపరిజ్ఞాఢ్యుండ
ద్వైతునికడకేగిసేర్చి ♦ ధన్యుండయ్యెన్. 10

గీ. అడవిప్రాంతను నివసించు ♦ నపుడుమంచి
యౌవనంబందమునుగల్గు ♦ నతఁడెరైన
వార్ధకమునన యేగెన ♦ ద్వైతుపగిది
నిమినిగొలువంగ హరిదాసుఁ ♦ డమితభక్తి, 11

శా. తారుణ్యాంగమనోజ్ఞతోరుజవస ♦ త్వశ్లిష్టుఁడౌవీసికిన్
ధీరత్వంబెటులుండుఁజూతమను బు ♦ ద్ధిన్దత్పురేభ్యుండు బ
లాన్సుకన్యకల్గాముద్దుఁగుల్కునొకవా ♦ ల్గంటిన్వయోమధ్యనా
య్యారిన్బంపెనుభక్తిగంగఁగలుప ♦ న్భావప్రభావంబులన్ 12

శా. సింగారంబుల, లోచనాశుగముల, ♦ న్జేసన్నల, న్జిత్తహృ
త్సంగీతంబుల, మందహాసముల, న ♦ ర్ధస్రస్తచేలాల్పగు
ప్తాంగవ్రాతముల, న్విటారి, మటుమా ♦ యల్పన్నిఁగామాగ్నిలో
నంగాల్పన్హరిదాసుఁ, గానితనయ ♦ త్నంబుల్వృథామైచనెన్. 13

చ. ఇరుదెసగట్లుగోసి పరివ ♦ హించెడుసత్వరనిర్ఝరాంబువుల్
పొరఁబడియాఁదిప్రాణములు ♦ పోలఁగఁగొట్టుకపోవులేడిమా

దిరిజలజాయతాక్షి, యమి ♦ తీవ్రపుభక్తికి నడ్డువచ్చి, యు
క్కఱి, హరిదాసురాలగుట ♦ గల్గెనుదా నెనికృత్తదోషమై. 14

ఆ. కామమునకుమాఱు ♦ కమ్రభక్తినిగొల్పి
బొజుఁగుమాఱుకృష్ణ ♦ మూర్తినునిచి
లోలబాహ్యదృష్టి ♦ లోచూపుగాఁద్రిప్పి
యతఁడుగులటభక్తు ♦ రాలిఁజేసె. 15

క. పుటభేదంబున కేగిన
విటపాళింగూడిచెడును ♦ వెలఁదియటంచ
క్కటికన్హరిదాసుఁడు తన
యుటజంబునఁబెట్టితాను ♦ ఔక యెడకరిగెన్. 16

వ. ఆకాలంబున నుత్తరహిందుస్థానం బంతయు మహమ్మదీయుల యధీనంబై యున్నకతన నావంగదేశభాగం బొకముసలిమాన్ప్రభువుచేఁ బాలింపఁబడుచుండె. హరిదాసుఁడున్న గ్రామపు ఖాజీయతని వర్తనంబు సవిస్తరంబుగ తేనికివ్రాసిపంప నాహరిదాసుం బట్టి తనయొద్దకుఁ దత్క్షణంబ తగినభటులఁగావలియిడి పంపవలయునని ప్రభువ్వ ఖాజీ కుత్తరువొసంగె. ఖాజీయు నట్లుగావించె. 17

క. హరిదాసుని శాంతియు నన
వరతము శ్రీహరినిదలఁచి ♦ వాకొనుటయు భ
క్తిరసోద్భూతాశ్రుకణము
లరయఁగవిభుచిత్తముకగు ♦ నార్ద్రింబయ్యెన్. 18

గీ. కానియుద్యోగియొకఁడు కి ♦ గ్గాడిమొఱకు
'గోరి' నాముండుభూవరుఁ ♦ జేరియుండె
మేదినీపతిహృదయంబు ♦ మెత్తఁబడియె
నంచెఱిఁగివాఁడు విభుమ్రోల ♦ ననియెనిట్లు. 19



క. కట్టా! యిస్లామ్‌మతమునఁ
బుట్టియు హైందవమతంబుఁ ♦ బూనెనుద్రాల్లిం
గట్టితెగఁగొట్టివీనిం
గిట్టింపకయున్నమతము ♦ గిట్టదెభూపా! 20

శా. సర్వోత్కృష్టమహమ్మదీయమతము ♦ న్గాలించినిర్భీతిఁడ
త్పూర్వంపుంగుమతంబుఁదాల్చితలవం ♦ పుద్దెచ్చెనీచాత్ముఁడీ
యుర్విం గల్గుమహమ్మదీయులకున ♦ య్యో! వీనిశిక్షించి దు
ర్గర్వంబార్పకయున్ననింకమనవా ♦ రల్నిల్తురే భూమిపై? 21

ఉ. చూడుమహమ్మదుప్రభుని ♦ జూడుమతంబుల తారతమ్యముల్
చూడుము రాలఁగట్టులను ♦ జొన్పుచుగుళ్లను మ్రొక్కుచుంట; కా
పాడుము దేవుఁడొక్కఁడని ♦ ప్రార్థనసేయుమతంబు ; లేనిచోఁ
బాడగులోక, మన్యమత ♦ వర్తులునవ్వుదురయ్యభూవరా! 22

ఆ. మనము పీఁకుచున్న ♦ మహిపతివిధియించె
మరణశిక్ష ; 'గోరి' ♦ మాటఁబట్టి
ప్రభువుయోగ్యుఁడైనఁ ♦ బరిసరవర్తుల
లోటుచేతఁబ్రజకుఁ ♦ జేటువచ్చు. 23

క. హరిదాసుఁ జంపఁగాదా
నరనాథుఁడు మరణదండ ♦ నము వేయుట, దు
ర్మరణమునకు వెఱచియతఁడు
దురకమతములోనఁ దిరుగఁ ♦ దూఱునను, మదిన్. 24

సీ. పట్టణంబుననిరు ♦ వదిరెండుసంతతా
వులుగలవందులోఁ ♦ బొలుతనొక్క
స్థలమునకాహరి ♦ దాసునిదీసిక
చనియటనాతనిఁ ♦ జబుకుతోడ

ఘోరతరంబుగాఁ ♦ గొట్టంగవలయు ; న
ల్లేతక్కుఁదావుల ♦ నేఁచవలయు ;
నిరువదిరెండవ ♦ యెడమాత్రమేవాఁడు
గూలెడువఱకును ♦ గొట్టవలయు ;

ఆ. "బుద్ధివచ్చెనేను ♦ బొరపడితినినాదు
శుద్ధమతముమరలఁ ♦ జొచ్చువాఁడ"
ననిననిముసముననె ♦ యతనినివదలంగ
వలయు ; నంచుతేఁడు ♦ సెలవొసంగె. 25

క. మతవిగళితమృతివీక్షణ
కుతుకముఁ, గాతరతఁబ్రదుకఁ ♦ గోరునో యేమో
యతఁడనుశంకయు, నడరఁగ
యతికడకు 'న్గోరి' యేగి ♦ యనె నీపగిదిన్. 26

శా. పల్మాఱున్నరియించుఁబ్రేలెదవు నీ ♦ ప్రాణంబులన్నిల్పుకో,
తాల్మిన్నాల్చెదవెంతకాలము? కశో ♦ ద్దండప్రహారంబుల
న్బల్మిన్జంపకమాన, రీకుమతము ♦ న్వర్జించితోల్దొల్తనే
'కల్మా' చెప్పి మహమ్మదీయమతము ♦ న్నైకొమ్మశీఘ్రమ్ముగన్. 27

ఆ. ఒండురెండుమూఁడు ♦ దండనంబులు సైఁప
చ్చుఁగాని వెఱ్ఱి ♦ వాఁడ! రెండు
దులరెండుచోట్ల ♦ బాధలుభరియింపఁ
రమె? నీవువదరు ♦ హరికినైన. 28

ఆ. తిరుగమతములోనఁ ♦ జొరఁబడితేని, నీ
హరినివేగసాగ ♦ నంపితేని,
యొడయనికడగొప్ప ♦ యుద్యోగమిత్తురు
ధనమువచ్చుఁజాల ♦ దానివలన. 29



వ. అందులకు దందహ్యమానమానసుండై హరిదాసుండు 'గోరి' కిట్లనియె. 30

చ. ఖలుఁడనినన్నుశిక్షకులు ♦ కండలుకండలుగాఁగఁగోసి కా
కులకును గంకగృధ్రముల ♦ కున్గడుపారఁగవిందువెట్టనీ!
తలఁకనుదానికించుకయుఁ ♦ దప్పదుపూర్వకృతానుభూతి ; పు
ష్కలసుఖదాయి శ్రీహరి వ ♦ చఃకథనం, బదిమాననెన్నఁడున్. 31

గీ. 'గోరి' యీయుత్తరమునకుఁ ♦ గుపితుఁడౌచు
నోమతభ్రష్ట! యిదివఱ ♦ కున్ననేర
మునకుఁదోడుగ నధికారు ♦ లనుదిరస్క
రించి నీదోషమును ద్విగు ♦ ణించుకొంటి. 32

క. అని హరిదాసుని శిక్షా
వనికింగొనిపోయె ; నెట్లు ♦ భక్తుండీబా
ధనుసహియించునొ చూడం
జనుదెంచిరిపెక్కురు పురి ♦ జనులచ్చటికిన్. 33

క. హరిదాసుఁ డాత్మబాధల
వరకుఁగొనఁడుసాధుపీడ ♦ సల్పెడుపీరల్
పొరసెడు నరకార్తులనే
తెలిఁగునసమయింతునంచుఁ ♦ దీవరపడెడున్. 34

ఉ. చీమకునీఁగకేనెపుడు ♦ సెబ్బరసేయఁడు, పైనవ్రాలుచున్
దోమలుగుట్టిరక్తమును ♦ దోరవుదప్పినిబీల్చుచుండినన్
బ్రేముడివానినేమనఁడు, ♦ పెట్టెడిబాధభరించుఁగాని, యీ
కోమలచిత్తుఁడజ్ఞజన ♦ కోటివిపత్తులు సైఁచుటెట్లగున్? 35

క. వదలుముహిందుమతంబును
వదలనిచో నిదిగొదెబ్బ ♦ పైఁబడుననుచున్

బెదరించి చుఱుకుచుఱుకని
యదయతఁగొట్టంగసాగి ♦ రాహరిదాసున్. 36

వ. అతండు. 37

ఉ. ఇంతయుభీతిఁజెందఁడు, చ ♦ లింపఁడుదెబ్బల, కాస్యకాంతియా
వంతయుఁగోలుపోవఁడు, క ♦ శాంగములంటినయప్పుడెల్ల శ్రీ
కాంత! గజేంద్రరక్షక! జ ♦ గత్పతి! దీనజనావనా! యఘ
ధ్వాంతదినేశ! శ్రీహరి! కృ ♦ పామయ! యంచెలుఁగెత్తిపిల్చెడున్

గీ. చూడవచ్చినవారిలో ♦ సుదతులర్భ
కులును బురుషులు మసలిమా ♦ నులును హిందు
వులునుగలరందఱుంగూడఁ ♦ బొక్కి యేడ్చి
రాకశాఘాతములుదమ్ము ♦ నంటినట్లు. 39

సీ. కటకటా! వీరల ♦ కెటులాడుఁజేతులీ
సాధువుబాధించి ♦ చంపననిరి
దీనవత్సలుఁడగు ♦ దేవుఁడీక్రూరకృ
త్యములెట్లుసహియించు ♦ నరసియనిరి
కాలమేతెంచెనీ ♦ ఖలులకుఁగానిచోఁ
బుట్టునేయిట్టిదు ♦ ర్బుద్ధియనిరి
పళయకాలమువచ్చెఁ ♦ బాపంబుపండెనిం
కుండమన్నాళ్లోయీ ♦ యుర్విననిరి

గీ. కాంచుచుండఁగ నప్డెభూ ♦ కంపమొదవి
మనలనందఱదిగమ్రింగి ♦ మాపుననిరి
పాపకర్ములమయ్యయో! ♦ పరమశాంతు
ఘోరమరణంబుఁజూచుచు ♦ న్నారమనిరి. 40

వ. హరిదాసుండు భక్త్యానందశోభావిరాజమానంబగు మోము శిక్ష



కులవంకకుఁద్రిప్పి, కన్నీరొక్కబొట్టైనలేక, వారుసేయు పాపకృత్యం
బుకై చింతనొంది, పశ్చాత్తప్తచిత్తుఁడై ముందైన బాగుపడుదురే
మోయను భ్రాంతితో నల్లన నిట్లనియె. 41

ఉ. మానుఁడినన్నుఁగొట్టుటది ♦ మంచిదె? దాననులాభమేమి? మీ
కేనపకారమేమియొన ♦ రించితిసోదరులార! చెప్పుఁడీ!
ప్రాణులహింసపెట్టుటది ♦ పాపముగూడదటండ్రుగా! మున
ల్మానులు హిందువుల్కొదువ ♦ మానవు, లియ్యది మీఱెఱుంగరే!

గీ. నన్నుహింసించుచున్నారు ♦ నాదుబాధ
వాపుఁడీయనిమిము వేఁడు ♦ వాఁడఁగాను
బాపకృత్యంబులను జేయ ♦ బాధపడెద
రీరెయని యెంచిచెప్పితి ♦ నిట్లుమీకు. 43

గీ. అతనిపల్కులు న్యాయకా ♦ ర్యవహులందు
నందఱకునచ్చమిని ప్రభు ♦ నాజ్ఞఁదీర్ప
కున్న నాశిక్షయేవార ♦ లొందవలసి
వచ్చుననుభీతిఁగొట్టుట ♦ వదలరైరి. 44

గీ. అంతహరిదాసుఁ డింకేమి ♦ యనకవీరి
వారినింబట్టిప్రార్థింప ♦ వాయినొప్పి
ఫలములేదనియోజించి ♦ భక్తపాలు
విష్ణుబిగ్గర వేఁడె ని ♦ వ్విధముగాను. 45

శా. శ్రీలోలా! సుగుణాలవాల! యివిగో ♦ చేమోడ్పు; లజ్ఞానులై
యీలోకంబె సమస్తమన్మతిని న ♦ న్హింసించుచున్నారు, వీ
రేలాసేయుదురింతపాపము దయా ♦ బ్ధీ! యించుకీక్షించిరన్
జాలింబొందిక్షమింపు తత్కృతములౌ ♦ సర్వాపరాధంబులన్. 46

క. ననుబాధపెట్టుచున్నా

రనియలుగంబోకుమయ్య! ♦ యంబుజనేత్రా!
కనివీరిఁబ్రోచితే ము
క్తిని నాకీవాసఁగినట్లు ♦ కృష్ణ! యలరెదన్. 47

శా. ఈరీతిన్హరిఁజాలవేఁడికొని సం ♦ తృప్తాంతరంగంబుతోఁ
ధీరున్గోరికతప్పకుండనను బు ♦ ద్ధిన్వారిజాతాక్షుసం
సారాంభోనిధిసక్తతారణచణు ♦ న్స్థాపించికొంచాత్మ నా
ధీరుండంతటఁబారవశ్యమునుబొం ♦ దెన్ధ్యాననిర్మగ్నుఁడై. 48

గీ. కొందఱిదిసూచియాశ్చర్య ♦ మంది; రశ్రు
వులనురాల్చిరికొందఱు; ♦ పుణ్యపురుషు
బాఁదెదరదేల! వానికి ♦ బదులుమమ్ము
బాఁదుఁడీ! యనికొందఱు ♦ వలికిరపుడు. 49

ఉ. చచ్చెనుదాసుఁడంచు బల ♦ శాలులుశిక్షకులామహాత్మునిన్
జెచ్చెరజాహ్నవీతటము ♦ చెంగటనీటనుబాఱవైచిపో
వచ్చెనుమీఱలంచు జన ♦ పాళికిఁజెప్పిచనంగఁ బ్రాణము
ల్వచ్చెనుగాంగశీతలజ ♦ లంబులతాఁకున భక్తమాళికిన్. 50

క. హరిదాసుఁడు శ్రీహరి! శ్రీ
హరి! శ్రీహరి! యంచుఁబైకి ♦ నరుదెంచెను; జె
చ్చెరనీవార్తను ధరణీ
వరునకుఁగొనిపోయిరచటి ♦ వారలుసెప్పన్. 51

ఉ. వింతగువార్తయొక్కటి చె ♦ వింబడెవారసివత్తమంచు భూ
కాంతుఁడుఖాజియున్జని, జ ♦ గత్పతి! శ్రీహరి! కృష్ణ! యంచును
స్వాంతమువన్భజించు యమి ♦ సత్తముఁగాంచి నమస్కరించిరా
శాంతునికిన్నిబాపకృతి ♦ జన్యవిషాదపరీతచిత్తులై. 52

సీ. హరిదాసుఁడేభక్త ♦ వరుఁడైయెసఁగుచుండ



దనుఁదాఁటుభక్తుఁడ ♦ ద్వైతుఁడంచు
నెఱిఁగియాతనిఁదన ♦ గురునిగాసేవించి
కలసెనాతనిశిష్య ♦ గణములోన
నద్వైతుఁడుతనకు ♦ నధికుఁడెంతోయని
తెలిసిభక్తిని నిమిఁ ♦ గలసివెలసె
గురువులెందఱోయిట్లె ♦ కూడిరిగౌరాంగు
శిష్యులై, శిష్యప్ర ♦ శిష్యవితతి

గీ. యంటిరా, నిట్టులేగద! ♦ యవనినెల్ల
యుపనదులుపెద్దనదులలో ♦ నోలిఁగలయు
గట్లనొరయుచుఁబాఱెడు ♦ గంగవంటి
గొప్పనదులెల్లవారాశిఁ ♦ గూడిపొంగు. 53

---

క. వాలికలౌకనులను భ
ద్రాళికినెలవైవిశాల ♦ మాఫాలమునన్
గ్రాలెడునీమోముంగనఁ
జాలెడునాతనిదెధన్య ♦ జన్మమురామా! 54

శ్రీరస్తు.

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః

# శ్రీగౌరాంగచరిత్రము.

## చతుర్దశాశ్వాసము.

శా. రారాయీశ్వర! రారతండ్రి! యిటురా ♦ రా! భక్తమందార! యం
చారావంబులనిన్ను వేఁడుదుమనం ♦ తాఖండదివ్యప్రభా
కారోద్వృత్తినిదోఁచితే నరయశ ♦ క్యంబానెయీశన్నులన్.
శ్రీరామా! యుచితావతారముపయ ♦ జ్ఞేకొన్నఁగాకీవిలన్. 1

సీ. చెంత లేఁడీశుఁడ ♦ న్నిస్థితియు, దేవుఁడు తన
చెంతనున్నాఁడను ♦ స్థితియుఁ, దానె
దేవుఁడన్నిస్థితియును, ♦ దివ్యనైజస్థితి,
తానెయక్రూరాది ♦ దైవభక్తు
లనుస్థితి, యీవైది ♦ టనునేదియోయొండు
స్థితినుండునెపుడు శ ♦ చీసుతుండు
స్వాభావికస్థితి ♦ వఱలెడుసమయమం
దెంతొమనోజ్ఞుఁడై ♦ యెసఁగుచుండు
గీ. శాంతుఁడై నమ్రుఁడై దయా ♦ స్వాంతుఁడగుచుఁ
బహులభూషించితనుఁగ్రిందు ♦ పఱచుకొనుచు



సఖులతో నెకసక్కెము ♦ ల్సలుపుకొనుచు
నెగడఁజేయుమ నెలనవ్వు ♦ నిత్యతుష్టి. 2

సీ. తనపొంతఁగృష్ణుఁడు ♦ గనిపింపలేదను
నవసరంబున నిమి ♦ యాధిఁదూలి
గుండెలుబ్రద్దలై ♦ కోల్పోవుఁబ్రాణంబు
లనునట్టులవనిపై ♦ యట్టివాఱిలు,
హృదయచలనమాఁగుఁ ♦ గదలవుశ్వాసము
ల్తాళముల్పడిపోవు ♦ దౌడ, లిట్లు
కొంతసేపుండితా ♦ నంతఁగ్రిమ్మఱ లేచి
వెక్కియేడ్చుచునెయ్యు ♦ పక్కకేగి
గీ. "పోవుచున్నది ప్రాణమీ ♦ ప్రొద్దుదాని
నాఁపఁజాలుదె? శాంతింపుము నెద వెంత
చేసినను హృదిసేయదు ♦ చెప్పినట్టు
లేగనిమ్మోయి చెలికాఁడ! ♦ కృష్ణుకడకు. 3

క. పోనిమ్మా! యోఁపకసఖుఁ
డా! నన్నీవాఁపితేని ♦ యసువులనిలుప
న్లేననుకో" యని మోమున
దీనతయచ్చుపడఁబలుకు ♦ దిక్కులరయుచున్. 4

మ. జిలుఁగుంబుట్టముదాల్చియొక్కపుడు నా ♦ జీవేశుఁడౌ కృష్ణుఁడిం
దులకున్వచ్చునటంచుసంభ్రమము సం ♦ తోషంబు వెంపొందన
త్పులమోదాశ్రులుగ్రమ్మనాట్యములోన ♦ ర్చు, న్సుందరాంగంబుపైఁ
బులకల్గన్పడ 'వచ్చెనాథుఁ' డని తా ♦ మూర్ఛిల్లువెన్వెంటనే. 5

ఆ. ఇట్టులుండియుండి ♦ యితరులతో మాట
లాడుచుండినరుని ♦ పోఁడిమంత

తోఁచెఁగిదివ్యరూప ♦ ధరుఁడౌచు శ్రీవిష్ణు
వట్లైనిమియగపడు ♦ నందఱకును. 6

మత్త. ఒక్కనాఁడుమురారితో సర ♦ సోక్తులాడుచునుండఁగా
దిక్కులన్గనకాభఁజిమ్మెడు ♦ దివ్యదీప్తిశరీరుఁడై
యుక్కుమీఱిశచీసుతుండు మ ♦ హోగ్రసేతులఁజూచుచున్
వాక్కుఘోరఘనాఘనారవ ♦ భాతిఁబంపిలనిట్లనెన్. 7

గీ. ఒడలుపొగరెక్కికాశిలో ♦ నుండిజోగి
యెల్లిదుఁడుప్రకాశానందుఁ ♦ డెట్లుకాఱు
లఱచుచున్నాఁడొచూచితి ♦ రయ్యా! మీరు
బుద్ధిసెప్పెదువానికి ♦ ముందుముందు. 8

గీ. తానపరిపక్వచిత్తుఁడై ♦ తానుగఱపు
మూఢజనపాళిసామర్థ్య ♦ మునురవంతఁ
జూడకుండంగభక్తిని ♦ సురుఁగఁజేయు
నతని 'బ్రహ్మోహ' మెట్టిదో ♦ యరయువాఁడ. 9

గీ. ప్రప్రథమమందు దైవరూ ♦ పగ్రహణము
గష్టముగఁగానిపించినఁ ♦ గ్రమముగాను
సుకరముగనవ్యవధిగనే ♦ చూపుచుండె
భక్తజనులకు నిమిషాప ♦ భంజకుండు. 10

గీ. ఒక్కనాఁడట్లుజరుగునం ♦ చొరులెఱుంగ.
కుండ శ్రీవాసుగృహమునం ♦ దుండిస్నాతుఁ
డైనవెంటనె మిశ్రజుఁ ♦ డగపఱిచెను
విశ్వరూపంబుఁజూపఱు ♦ వెఱఁగుఁజెంద. 11

గీ. అందరిద్దానిజనులు "మ ♦ హాప్రకాశ"
మనుచుఁ; బూర్వపుమహిమంబు ♦ లనునతిక్ర



మించెనిదికాలదైర్ఘ్యమం ♦ దిరువదొక్క
గంటలవఱకుభక్తుల ♦ కనులఁదనిపి. 12

సీ. అచ్యుతోద్దీప్తమై ♦ యలరారుగద్దెపైఁ
గొంకించుకయు లేక ♦ కూరుచుండి
భక్తులఁగీర్తన ♦ ల్పాడుఁడనుచుఁజెప్పె
నిమి, యంతగది, కాంతి ♦ నిబిడమయ్యెఁ
గమ్మనివిరులతోఁ ♦ గైసేసెస్వామిని
దతభక్తియుతుఁడుగ ♦ దాధరుండు
ఛత్రింబుపట్టెను ♦ సాధునిత్యానందుఁ
డనువుగాఁజామరం ♦ బునుగ్రహించి

గీ. వైచెనరహరి, యీరీతి ♦ వఱలియతఁడు
దెసలదేదీప్యమానాంగ ♦ దివ్యకాంతి
యెసఁగఁద్రిజగద్వశీకర ♦ నైకదక్ష
మైనచిఱునవ్వుభక్తుల ♦ పైనిబఱపె. 13

గీ. కవులుచిత్రకారులు మును ♦ ల్దవిలియూహ
సేయులిఖియించుమది నుపా ♦ సించుతత్త్వ
మౌర! ధ్యానవద్వ్యపభ ♦ క్తాళియెదుట
నెసఁగితదధీనమయ్యెవా ♦ రెంతవారొ! 14

శా. ఆనందాబ్ధినిదోఁగిభక్తులు విశే ♦ షావేశుఁజాంపేయమున్
నానామూల్యపదార్థరాసులును వి ♦ న్యాణంపువస్త్రంబులున్
జ్ఞానానందమయస్వరూపునకుఁ గా ♦ న్కల్వెట్టిచిత్రంబులౌ
సూనంబుల్తులసీదళంబులును గొం ♦ చున్సల్పిరంఘ్ర్యర్చనల్. 15

క. ఆనీతప్రసవంబుల
లోను త్తమమంతరంగ ♦ లూనప్రేమా

నానామోదకమలము ;
దానిన్గొని నిమికి నర్పి ♦ తము సేసిరటన్. 16

క. తలుపుల్దెఱచిరిదయఁగా
వలసినవారటకువచ్చి ♦ పరమేశమహా
లలితాకృతిఁగనిమోదం
బెలయుదురని ; కాని తక్కు ♦ వేయైరిజనుల్. 17

ఆ. కొద్దిమందియైన ♦ గురుతరనిశ్చల
భక్తితోడఁ బుష్ప ♦ వర్షములను
మంత్రనాదములను ♦ మహితాత్మునేకకా
లమునఁబూజసేసి ♦ రమలమతులు. 18

గీ. ఎవనిమట్టునకతఁడు తా ♦ నీశ్వరుండు
దక్కనితరులు లేరను ♦ తలఁపుతోడ
నలుపుచుండెనుబూజని ♦ శ్చలమనమున
నెంతసందడియున్నన ♦ దేమివినక. 19

ఆ. ఒకఁడుపూలదండ ♦ నూనిస్వామి! తాల్పు
మనుచునిమినివేఁడ ♦ నతనిమెడను
వఱలుదండఁదీసి ♦ భక్తునిమెడవేసి
యొగ్గుఁదనదుకంఠ ♦ ముంచుమనుచు. 20

గీ. పట్టువేల్పుబట్టలునుస్వాదు ♦ ఫలవితతులుఁ
బిండివంటలుఁబాల్కుల ♦ కండదధియుఁ
గట్టియారగింపులువెట్టి ♦ గంధమలఁది
చెలఁగిభక్తులునిమినిబూ ♦ జించిరపుడు. 21

క. నరవేషంబునువిష్ణుఁడు
గరుణించిధరించితోఁచెఁ ♦ గావునవారల్



నరమోదకరపదార్థో
త్కరములనర్పించిరంతె ♦ కాకొండౌనే ? 22

గీ. ప్రథితపీతాంబరునకేల ♦ పట్టుబట్ట
లఖిలజగదన్నదునకేల ♦ యారగింపు
కలితసురభిళాంగునకేల ♦ గంధచర్చ
కూర్చుభక్తులసంతుష్టి ♦ కొఱకుఁగాక. 23

క. ఈతఱిఁదెచ్చినభక్ష్య
వ్రాతములమితంబులైన ♦ వానిసుళువుగాఁ
జైతన్యుఁడుదినెనఁట యీ
చేఁతలునరమాత్రుఁడెట్లు ♦ సేయంగలుగున్. 24

గీ. కొమ్ముకొమ్మంచుభక్తులు ♦ కొసరియొసఁగు
నన్నిముసిముసినగవుల ♦ నందుకొని యె
భక్తవత్సలుఁడతనికి ♦ భక్తినిచ్చు
నణువుఁగూడమహామేరు ♦ వౌనుగాదె ? 25

ఆ. నన్నెచూచుచుండె ♦ నారాయణుండంచు
నందఱెంచుకొనెడు ♦ నట్లుసేసె
సతతముత్తరంగ ♦ సందోహకలితకృ
పారసాబ్ధిదీన ♦ బాంధవుండు. 26

ఉ. శ్రీవరదివ్యమూర్తియల ♦ రించెనుభక్తులనేత్రపాళి, మో
హావహదేహసౌరభము ♦ హాయినిగొల్పెనునాసికాళికిన్,
ధీవరుపోల్కిభక్తజన ♦ నిర్మలమానసమత్స్యరాజివి
తూవిగళత్కృపామహిత ♦ జాలమునన్నిమిలాగెనేర్పునన్ 27

క. బంభరసదృశతమిస్రల్
కుంభినిపైవ్రాలుతఱిన ♦ కుంఠితతేజం

డంభోజాతుండనెవా
గ్గాంభీర్యముదోఁప భక్త ♦ కాండముతోడన్. 28

వ. త్రికాలవేదినగు నాకు మీమీచారిత్రంబులెల్లఁ గరతలామలకంబులుసుఁడీ యని శ్రీవాసాద్వైతాది భక్తపురుషుల యాజన్మకృతకృత్యంబులన్నియుఁ బూసగ్రుచ్చినట్లునుడివి తనసర్వజ్ఞత్వంబుఁ బ్రకటింప నందఱాశ్చర్యనిమగ్నులై చేతులుజోడించికొని నిలువంబడిరి.

గీ. పగటిపూటనెదినకర ♦ ప్రభనుమించి
వెలుఁగు గౌరాంగుదేహము ♦ జ్వాలతరంబు
గాఁబిసాళించెనలనిశా ♦ కాలమందుఁ
జీఁకటులననివేఱుగాఁ ♦ జెప్పవలెనె? 30

గీ. అంతశ్రీవాసుఁడఖిలలో ♦ కాధిపతికి
నవ్యకర్పూరసీరాజ ♦ నంబునిచ్చు
సమయమయ్యెను శచియదొ ♦ సంగవలయు
నంచునద్వైతుతోడయో ♦ జించిచెప్పె. 31

ఉ. నాసుతుమీరరయో! చెఱపి ♦ నారని మమ్ములదూఱుఁదల్లి; తా
నీసమయంబుప్రాకమును ♦ నిచ్చటికిన్గనుదేరఁదెల్లవా
నాసుభగాంగునిన్గెఱపు ♦ నాగడకాంద్రమమేమొ? యాతఁడే
యీసరణిన్బొనర్చినను ♦ నెల్లరను న్గెడఁదీయుచుండెనో? 32

క. అనిశ్రీవాసుఁడు చిఱున
వ్వునవ్వివల్కంగనన్లె ♦ పొనరించుటలె
స్సనియద్వైతుఁడుచెచ్చెరఁ
బనిచెనుశచికోస; మామె ♦ వచ్చెనువెంటన్. 33

ఆ. వచ్చిగదినిజొచ్చి ♦ వర్ణనాతీతమౌ
దివ్యతేజసాకృ ♦ తినివెలుంగు



వానిఁగాంచివెరఁగు ♦ పడిశచితొల్దొల్త,
నిట్టులుమ్మలించె ♦ నెంతొపిదప. 34

సీ. నాముద్దుబాలుఁడు ♦ నానిమినాతండ్రి
నామోహనాంగుఁడు ♦ నాదుప్రాణ
మయ్యయ్యొ! దైవమే ♦ మైనాఁడునేఁడెట్లు
సుతవియోగముసైఁచి ♦ బ్రతుకఁగలను?
పెద్దకొడుకుపోయెఁ ♦ బెనిమిటిమరణించె
నొక్కఁడునిట్లయ్యె ♦ దిక్కెవండు?
నాబిడ్డలోకంబు ♦ నకుఁదండ్రియయ్యెఁగా
యందఱుసొమ్మునా ♦ యర్థమౌనె?

గీ. కొట్టితినిదిట్టితినినాదు ♦ కొడుకనుకొని
వానినన్నింటినెంచియా ♦ పరమపురుషుఁ
డెంతశిక్షించునోయది ♦ యెట్టులోర్తు
నంచుగడగడవడఁకుచు ♦ నాపెనిలిచె. 35

క. తక్కినవారలఁజూడఁడు
తక్కువగా; వచ్చినామె ♦ తల్లికదాయం
చెక్కువసేయం, డందఱు
నొక్కపగిదిఁజూచెనిమిమ ♦ హోదారుండై. 36

క. కనిశ్రీవాసుండదియో
జననీ! మ్రొక్కవదియేల ♦ సర్వాంతర్యా
మినిజూచుటలేదొకొయనఁ
బొనరిచెనతిభక్తినతులఁ ♦ బొలఁతుకయంతన్. 37

ఆ. తల్లిపలితశిరము ♦ దాఁకెనునిమిపదం
బంతనతఁడుతనదు ♦ నడుగునామె

శిరముపైనిబెట్టె; ♦ శ్రీహరి కెవ్వతె
తల్లి? లోకపితకుఁ ♦ దండ్రి యెవఁడు? 38

ఉ. ఆడఁగఁ జొచ్చెఁ బాలుతము ♦ దావృతమానసయై స్వభావజ
వ్రీడయుమానమున్దొఱఁగి; ♦ విహ్వలవృద్ధకృశాంగగంతుల
న్జూడఁగనవ్వువచ్చెనటఁ ♦ జూపఱ కెంతయుఁ, గూడదమ్మరో!
కూడదునీకిపరంచుశచిఁ ♦ గొందఱుబల్మినినాఁపిరంతటన్. 39

చ. చదువిసుమంతలేదయిన ♦ స్వచ్ఛముగాశచిపాడెఁ దొల్లిభ
ద్రదుఁడగు కృష్ణుఁడీశుఁడవ ♦ తారముఁదాలిచిమాత దేవకీ
సుదతికిస్వస్వరూపమును ♦ జూపినవేళనమస్కరించి పె
న్ముదమున నామెసెప్పిన మ ♦ నోజ్ఞపుభాగవతస్థపద్యముల్. 40

గీ. మాలినీశచీప్రభృతులు ♦ మహితగుణలు
వయసుగడచినస్త్రీలు స ♦ ద్భక్తిమీఱఁ
గప్పురపుటాకులనిచ్చి ♦ గారవించి
రీశునంతటశచితన ♦ యింటికేగె. 41

వ. ఇఁక గౌరాంగదేవుండు కొంతసేపట్లుండి. 42

క. అరఁటాకులుదూఁటయునా
పురినమ్ముకబ్రతుకునట్టి ♦ పుణ్యాధరిత్రీ
సురునిశ్రీధరునింగొని
యరుదెంచనిభక్తసమితి ♦ కాజ్ఞయొసంగెన్. 43

క. ఏకడవెదకినఁగనఁబడు
నీకమనీయగుణుఁడంచు ♦ నీశ్వరునడుగన్
శ్రీకృష్ణస్మరణంబతఁ
డేకాలముసేయుచుండు ♦ నేగుండటకున్. 44



క. అనిగౌరాంగుఁడుసెప్పిన
వినిభక్తులుపోయియంత ♦ వినిచిరతనికీ
శునిపనుపువిన్నమాత్రం
బునశ్రీధరుఁడువ్రాలె ♦ భూస్థలిమూర్ఛన్. 45

క. శ్రీదయితప్రేషితవా
ర్తాదృతిధరఁజొక్కిపడిన ♦ యానిఱుపేదన్
సాదరమతులై బుజముల
మీఁదన్బెట్టికొనిచనిరి ♦ మిశ్రజుకడకున్. 46

ఆ. కాయగూరలమ్మి ♦ కాలంబుగడపెడు
ముసలిబీదపాఱు ♦ మోసికొనుచుఁ
జనెనుభక్తవరులఁ ♦ గనిపురబాలకుల్
సనిరిచప్పటలను ♦ జఱచివెంట. 47

క. చిన్నతనంబునశ్రీధరు
నెన్నోతిప్పలనుబెట్టి ♦ యేడ్పించినయా
పన్నగశయనునియెదుట
న్దిన్నఁగఁదీసికొనిపోయి ♦ దింపిరివానిన్. 48

క. స్మృతిశ్రీధరునకువచ్చె
న్స్మితిమీఱినకాంతితోడ ♦ నిమిమాఱుజగ
త్పతికృష్ణుఁడెకనఁబడఁగా
నతఁడూరకయుండెమాట ♦ లాడఁగలేమిన్. 49

వ. అంత మాయామానుషవిగ్రహుండగు గౌరాంగదేవుండెలనవ్వు వె
న్నెలలుపెదవులపైనట్టువలాడ నిట్లనియె. 50

సీ. శ్రీధరా! దుడుకులు ♦ సేసిమున్నీవస్తు
తతిఁదీసికొన్నయా ♦ తండెవండొ

చూచితివేయిప్పః ♦ డేచియీరీతినిఁ
గావింతుమద్భక్త ♦ కాండమునకు
నాసొత్తువారిది ♦ నాదివారలసొత్త
టంచుబోధింపనే ♦ నట్లొనర్తు
నీవినావానిగా ♦ నేఁగంటినిదివఱ
కిఁకనాదినీదని ♦ యెఱుఁగఁజేయు

గీ. సమయమేతెంచెనిపుడన ♦ స్వామి! నాకు
నెన్నిసారులొసాక్షాత్క ♦ రించినావు
'గంగజనకుఁడ' ననిపలు ♦ కంగలేదె
యజ్ఞుఁడనుగానఁదెలియలే ♦ నైతినపుడు. 51

గీ. అంచుశ్రీధరుఁడాడగా ♦ గౌరాంగుఁడనియె
భక్తరత్నమ! నీవస్తు ♦ పాళిఁగొంటి
నరఁటియాకులుమొదలైన ♦ నాఋణంబు
నిండుగాఁదీర్తుఁగోరుమా ♦ యొండువరము. 52

వ. అనుమాటలకనంగీకారసూచకంబుగ సస్మితుండై మార్వల్కక శ్రీధరుండు బద్ధాంజలియైనిలఁబడి మిన్నకుండ గౌరాంగుం డిట్లనియె.

ఉ. ఆజ్యములేనినీరసపు ♦ టన్నమునన్ క్షుధవాపుకొంచునో
పూజ్యుఁడ! దుర్దరిద్రతను ♦ బుచ్చితివెట్టులొయింతకాలమున్
బ్రాజ్యవిస్రమభక్తినను ♦ బాయవుకష్టములెన్నివచ్చినన్
రాజ్యమునీయనుంటిని, ది ♦ రమ్ముగనీకువరమ్ముగోరుమా. 54

వ. అందులకు శ్రీధరుం డిట్లనియె. 55

చ. తగునెననున్నరాధముఁబ్ర ♦ తారితుఁజేయఁగనీకుఁ, బొట్టనిం
పఁగఁబడుచుంటిరేఁబవలు ♦ బొట్లవిచాలవెయింకరాజ్యమా
మిగిలినదైహికంపుమిడి ♦ మేలపురాచఱికంబునొల్లనో



జగదవనైకశీల! యొక ♦ సక్కెములాడెదవేలదీనుతోన్. 56

వ. గౌరాంగుం డిట్లనియె. 57

ఉ. ఊరకపోవునానుడువు ♦ లుర్విని శ్రీధర! రాజ్యలక్ష్మినిన్
గోరననిష్టమేన్ వలయు ♦ కోరికఁదెల్పుముదానిఁదీర్చెదన్
భూరిబలంబొయౌవనమొ ♦ పుష్కలవాక్చతురత్వమోమరు
న్నారులధిక్కరించునర ♦ నారులకౌఁగిళులోమఱివ్వియో. 58

వ. అంత శ్రీధరుండు శిరఃకంపంబుసేసి భక్తిబాష్పప్లుతలోచనుండై యిట్లనియె. 59

ఉ. కోరుటతప్పదంటివిదె ♦ కోరెదనల్లపుడేమనోజ్ఞపుం
బాలుఁడుబాలుఁడంగడికి ♦ వచ్చిహరించెననంటియాకులున్
గూరలు, మన్మనోధనముఁ ♦ గూడనుజెచ్చెరఁజూఱకొంచునా
వారిజనేత్రుఁడీహృదయ ♦ పద్మమునందెపుడుండఁగావలెన్. 60

క. అనుటయు గౌరాంగుండెలుఁ
గనినిన్మద్భక్తులందుఁ ♦ గటికిదరిద్రుం
డునురాజ్యమంతదానిన్
దృణముగఁజూచునని తెల్ప ♦ నిట్లొనరిచితిన్. 61

శా. సీతారామపదారవిందభజన ♦ స్థేయున్మురారిన్ గుణ
స్ఫీతుండగ్గఱిఁజేరిమిశ్రజుఁడు న ♦ న్వీక్షింపుమా! యన్నసం
ప్రీతిన్గన్నులనెత్తియాతఁడుగనె ♦ శ్రీరాముభూపుత్రికో
పేతున్సింగపుగద్దెఁగట్టెదుటను ♦ ద్వేలప్రభాకారునిన్. 62

గీ. చూచినిశ్చేష్టితుండయి ♦ చొక్కిపడియె
నంతగౌరాంగుఁడోయిము ♦ రారి! వదలు
వదలుమిఁకశుష్కవేదాంత ♦ పఠనగూఢ
యోగసాధనకరణముల్ ♦ వేగనీవు. 63

క. అనిపల్కనతఁడు తెలివిం
గనిస్వామీ! మంచివెవ్వి ♦ కావ్వొ! భవమో
చనసాధనములుగావ్వొ
ప్రణతుల్గొనిచెప్పమేల ♦ వదలుటవానిన్. 64

వ. అనియడిగిన గౌరాంగదేవుం డిట్లనియె. 65

ఉ. మంచివో చెడ్డవో తగవు ♦ మాటలలాభము లేదు బుద్ధులన్
మించినతత్వబోధములు ♦ నిశ్వసనోచ్ఛ్వసనావరోధముల్
గాంచెము మేలు లేని మొఱ ♦ కల్పచరించెడు తంత్రముల్ననున్
గాంచఁగఁ జేయ వెన్నటిక ♦ ఖండవినిర్మలభక్తికై వడిన్. 66

గీ. స్వామి! యీముండ్లపుంతలె ♦ వ్వాఁడు నాకుఁ
గఱపుననవ్వియద్వైత ♦ గురుఁడు లేఁడె
యంచువచియించె శాస్త్రదృ ♦ ష్టాంతరంగ
గర్వపరిహారి లోకోప ♦ కారి శౌరి. 67

క. తనుఁజావఁగొట్టుదుష్టుల
కును మోక్షమొసంగుమంచుఁ ♦ గోరినహరిదా
సునిజీరివరముగోరుమ
యననాతఁడు నిమికినిట్లు ♦ లనియెన్భక్తిన్, 68

సీ. అంతరంగస్థర ♦ హాస్యంబులీవెఱుఁ
గని వెవ్వియును లేవు ♦ వనజనాభ!
యక్షిగోచరుఁడవీ ♦ వయినకాలందినా
హైన్యంబు విస్పష్ట ♦ మగుచునున్న
దీవుపవిత్రుండ ♦ వేవసామాంసరు
ధిరకృతహేయాంగ ♦ ధనుఁడనధిప!
ముమ్మరమౌసిగ్గు ♦ మోహనాంగా! దయ



తోడనాతో మాట ♦ లాడు నెడను

గీ. లలితగుణజాల! నాదున ♦ ల్పత్వమెపుడు
మఱవకుండెడునట్లు, త్వ ♦ న్మహితభక్త
దాసదాసానుదాసతఁ ♦ దనరునట్లు
వరమునిమ్మని నిమిమ్రోల ♦ వ్రాలెనతఁడు. 69

వ. అంత గౌరాంగుం డిట్లనియె, 70

సీ. మద్భక్తులందునీ ♦ మాడ్కి వర్తించువాఁ
డెవ్వండు లేఁడునీ ♦ వింక లెమ్ము
గొప్పవాఁడైతన ♦ గొప్పతనంబించు
కయు నెఱుంగకయుండు ♦ కలితచిత్తుఁ
డే! నాకుఁబ్రియతముం ♦ డిలనప్రమతను నిన్నుఁ
గాంచిభక్తావళి ♦ గఱవవలయుఁ
బాపులు నినుఁగొట్ట ♦ వారిపాపము వాపు
మని నన్నుఁ బ్రార్థించి ♦ తంతె కాని

ఆ. నిన్నుఁ బ్రోవమంచు ♦ నన్ను వేఁడఁగ లేదు
వారిఁ జంపుటలఁతి ♦ పనియెయ్యైన
నవనియందు నీకు ♦ ఖ్యాతి నిదెప్పింప
నట్లు సేయనైతి ♦ సకలుషాత్మ! 71

గీ. కొట్టినప్పుడు నన్నుఁ గై ♦ కొంచు నాదు
హృదయపద్మంబులోనిడి ♦ పదిలపఱిచి
తిన్నశాఘాతములు నీమ ♦ దికిలతాంత
విసరమృదుపాతనిభములై ♦ పొసఁగునట్లు. 72

క. ఈవాక్యంబులు నిజములు
గావా! హరిదాసయనినఁ ♦ గగుణామయ! న

న్నీవే కాచితివప్పుడు
కావింపదొకింతబాధ ♦ కళయనిపలికెన్. 73

క. ఈరీతిగ గౌరాంగుఁడు
కోరుఁడువరమంచునుడివెఁ ♦ గొదువజనులతో
వారుందోఁచినపగిదిని
గోరిరి ; స్వార్థపరుఁడౌచుఁ ♦ గోరఁడొకండున్. 74

క. కితవుండౌసుతునికియో
గ్యతయలవడఁ జేయుమంచు ♦ నర్థించునొకం
డతినాస్తికుఁడౌజనకుని
గతిమార్పుమటంచునొకఁడు ♦ కాంక్షించునిమ్మన్. 75

శా. సందేహాస్పదచిత్తులెక్కడయిన ♦ న్సంధిల్లిరేవచ్చిమీ
సందేహంబులువాపుకొండభవునిన్ ♦ సర్వజ్ఞుఁజూడుండటం
చుందోడ్తెండిటకీరువారిననియ ♦ స్తోకానురాగంబుతో
సందేశంబుశచీజుఁడంపెజనర ♦ తౌబుద్ధిభక్తాళిచేన్. 76

సీ. శైశవంబాదిగాఁ ♦ జక్కనిపాటలఁ
బాడుచు నాబాల్య ♦ భక్తి నెసఁగి
సన్యాసిరీతి నే ♦ సంచరించుచు, నిమి
పరమేశ్వరత్వంబు ♦ బయలువడక
మున్నె వైరాగ్యసం ♦ పన్నుఁడై యలరారి
గౌరాంగుప్రేమ నిం ♦ డారఁగాంచి
తచ్ఛాయపోల్కి న ♦ తనివెంటఁ బోవుచుఁ
గూర్మిమెలంగుము ♦ కుందభక్తుఁ

ఆ. డధిపుఁడింటిలోన ♦ నాడెడుపల్కులుఁ
జేయుచిత్రములను ♦ జెవులవినుచుఁ



గనుచుఁ దన్నుఁబిలువఁ ♦ గాలేదని వసార
పైనినిలిచి దుఃఖ ♦ పడుచునుండె. 77

గీ. భక్తులందఱు నిదిగాంచి ♦ పరమపురుషు
చెంతకంపిరి శ్రీవాసు; ♦ నంత నతఁడు
“స్వామి ! నాసాహసంబును ♦ సైఁచితేని
మనవియొక్కటి నేఁ జేసి ♦ కొనెద” ననియె. 78

వ. గౌరాంగుండది యెద్దియో చెప్పుమన నతండు. 79

క. అందఱ ననుగ్రహించితి
వందారుప్రకరపాప ♦ పరిహారి ! హరీ !
యిందఱనలరిచి నీదుము
కుందున్గుణసింధు నేలొ ♦ కో మఱచితనే. 80

క. నావుడు గౌరాంగుండో
శ్రీవాసా ! నీకెవండు ♦ సెప్పఁదెగించెన్
నావాఁడు ముకుందుండని;
నావాఁడెల్లను వాఁడు ♦ నా, నతఁడంతన్. 81

క. నీవాఁడు కాక యూతం
డేవానియతండు? లోక ♦ మెఱుఁగదె ! యతఁడే
నీవాఁడుగానిచో నిం
కేవాఁడౌ నీయతండు ♦ కృష్ణా ! చెపుమా ? 82

ఆ. నీదుదివ్యకీర్తి ♦ నిరతి నాభక్తుండు
కంఠమెత్తిపాడు ♦ కాలమందు
నశ్రువులనురాల్ప ♦ నట్టివాఁడుండఁడే
యామకుందుపైని ♦ నలుకయేల? 83

వ. అనవుడు గౌరాంగుం డిట్లనియె. 84

చ. అవునవుమీకడ న్మెలఁగు ♦ నప్పుడు భాగవతోత్తముండు సా
ధువు, నీక భక్తిబాధకవుఁ ♦ ద్రోవలఁద్రొక్కెడు దృప్తపండిత
ప్రవదులసంగతి న్మెలఁగు ♦ పట్టునఁ బూర్ణుఁడు బ్రహ్మవేత్తయున్
తవళిఁజరించునీతనికి ♦ నాకును బొత్తెటుగల్గు భూసురా? 85

క. ఆఁకరమున నిమియాడిన
వాకులువిని జాలిపడిరి ♦ భక్తులు మిగులన్
దేఁకువముకుందుఁడిట్లనె
నాకై శ్రీవాస! శ్రమమొ ♦ నర్పకు హరికిన్. 86

క. నేఁజేసిననేరము సుర
పూజితుకోపంపువచన ♦ ముల్ న్యాయముగా
యోజించిచూడ లఘుతర
మాఁజూ నాకయినశిక్ష ♦ యనఘచరిత్రా! 87

క. పీడింపకు నాకొఱకై
పోఁడన్నీశ్రీకృష్ణుఁ, గాని ♦ పోయియడుగు మే
నాఁడగపడునో! సత్కృప
తోడ, న్నాకాతఁడెపుడుఁ ♦ దోఁచఁడొయింకన్. 88

వ. అదివిని బిగ్గర గౌరాంగుం డిట్లనియె. 89

క. ఏటికిముకుంద! యాసలు
నేఁటికి నాఁటికినిగాదు ♦ నీవ్రాపికతోఁ
గోటిభవంబులుగని యవి
దాఁటినపిమ్మటను నన్నుఁ ♦ దర్శింతువులే! 90

వ. అంత. 91

గీ. తల్లిదండ్రులశిక్షలు ♦ తనయుబాగు
సేయు; నీతండ్రిచేసెడి ♦ శిక్షయట్లె;



యెన్నిజన్మంబులకునైన ♦ నేమి యెపుడొ
కానిపించునుగదరమా ♦ జానినాకు. 92

గీ. అంబుదశ్యాము నబ్జాయ ♦ తాక్షు నఖిల
జగదవనదక్షు వేదపం ♦ జరశుకంబుఁ
గాంచి తరియించులే తట ♦ స్థించెనేని
నాకుఁగష్టమె కోటిజ ♦ న్మంబులెత్త? 93

ఉ. ఓరిముకుంద! యింకభయ ♦ మొందకు కోటిభవంబులవ్వలన్
వారిజనాభుదర్శన మ ♦ పారముదంబునఁగాంచి ఘోరసం
సారదురంతకష్టములు ♦ చక్కఁగదాఁటెదు యోగిచిత్తసం
చారిమురారిశౌరియె యొ ♦ సంగెను నీకు వరంబుధన్యుఁడా. 94

క. అనుకొని యిట్లు ముకుందుం
డనుపమ సంతోషవిహ్వ ♦ లాత్మకుఁడౌచున్
దనువు గగుర్పొడువఁగ న
ర్తనములు గావింపఁదొడఁగెఁ ♦ దద్దయుభక్తిన్. 95

క. లోపలికిరా! ముకుందా!
వాపోవకయంచు బాష్ప ♦ పటలప్లుతమా
చూపులతో సెలవిచ్చెను
గోపాలుం డార్తరక్ష ♦ కుండంతదయన్. 96

క. మితిలేనిమోదమునను
ధృతహస్తయుగంబుతోడఁ ♦ దీవ్రపుభక్తిన్
స్మృతిఁదొఱఁగి నాట్యమాడెడు
నతనికి వినరావు స్వామి ♦ యాడినమాటల్. 97

క. కనఁబడునఁట కృష్ణుఁడు నా
కని యూరకయాడు భక్త ♦ హార్యక్షుని ద

క్కనభక్తులు బల్మిన్గొని
యునిచిరి గౌరాంగుమ్రోల ♦ నుల్లములలరన్. 98

వ. అంత గౌరాంగుం డిట్లనియె. 99

సీ. సృష్టియంతయును నా ♦ చేతిలోనిదిగాని
వశ్యుండమద్భక్త ♦ వరులకెపుడు
నీధృతిమహిమంబు ♦ నిష్ఠయు జగతికిఁ
దెలియంగ నేనిట్లు ♦ సలిపినాఁడ
సామాన్యజనకోటి ♦ జన్మదశాయుత
ములఁ జేయు పుణ్యమో ♦ పూర్ణభక్త!
యొక్కనిమిషమందె ♦ యొనరింపఁగల్గితి
వెనయెవ్వఁడయ్య! నీ ♦ కనఘచరిత!

గీ. సలిపినట్టి వేళాకోళ ♦ ములకుఁ గినిసి
యెరియకుముకుంద! తలయెత్తి ♦ యరసినన్నుఁ
బొంగి కృతకృత్యుఁడవుగమ్మ! ♦ పొసఁగదింక
నాప్తజనులకు జగడమ ♦ హార్యధైర్య. 100

క. తనఁగల్గుదునన్నని చె
ప్పినయంతనె యొడలుమఱచి ♦ పెద్దనటనముల్
పొనరిచిన మహాత్ముండివు
డెనసిన యానందమెంతొ ♦ యెవ్వఁడెఱుంగున్. 101

ఉ. చూడనశక్యమైన శత ♦ సూర్యమహాద్యుతి దివ్యరూపమున్
వీక్షిధరాతలస్థజన ♦ వీక్షణపాత్రి మనుష్యవేషపుం
బోఁడిమిఁదాల్చి యిప్పుడొక ♦ పోల్కిమఱొక్కపుడొక్కపక్కియున్
వేడుకలీనమిశ్రిజుఁడు ♦ వీక్షితుఁడయ్యెను భక్తపాళికిన్. 102

సీ. ముసిముసినగవుల ♦ మోముసూచియొకండుఁ
గనులపై బొమవిండ్లు ♦ గనియొకండు
నెఱ్ఱనిజిగిమోవి ♦ వీక్షించియొక్కండుఁ
జొక్కంపుఁబల్తిగు ♦ సూచియొకఁడు
నలినశోభాకర్ణ ♦ నయనముల్గని యొకం
డనుపమ మృదుగాత్రి ♦ మంటియొకఁడుఁ
బద్మాలయాయత ♦ వక్షంబుఁగనియొకం
డమగుఁదమ్ములబెడం ♦ గరసియొకఁడు

గీ. తనువుకమ్మని వలపుమూ ♦ ర్కొనియొకండుఁ
గరణజాలంబు ధన్యతఁ ♦ గాంచెనిప్పు
డంచుఁ జొక్కెడునట్లు గా ♦ ఏంచిమించె
సురగణేభ్యుండు సర్వాంగ ♦ సుందరుండు. 103

గీ. వేఱువేఱుగ భక్తులఁ ♦ బిలిచి సామి
వారినాలింగనముసేసె ♦ బాళి; సత్య
మయ్యెనపుడు "సోహంబ్రహ్మ" యనెడు వేద
వాక్కుస్వానుభూతిని, మాట ♦ వలనఁగాక. 104

సీ. సనకసనందన ♦ సంయములారసిన
భక్తిమహానంద ♦ పటిమయెంతొ
ప్రహ్లాదుఁడసురారిఁ ♦ బాడుచుఁగ్రోలిన
యానందమధురిమం ♦ బద్దియెంతొ
చిన్నికృష్ణునిచెంతఁ ♦ జేరి రాధాగోపి
కలు చూఱకొన్నసౌ ♦ ఖ్యంబదెంతొ
శంకరప్రి[illegible] వి ♦ జ్ఞానిపుంగవు లొంది
[illegible] బ్రహ్మానంద ♦ మద్దియెంతొ

గీ. యెఱుఁగఁగోధినజనులాగ! ♦ మోగియడుగుఁ

డల్లగౌరాంగుకౌఁగిళు ♦ లందుఁజిక్కి
సుతసతీలోకికానంద ♦ వితతిమఱచి
హాయిఁదల్లీనులైన ధ ♦ న్యాత్మకులను. 105

వ. ఇట్లు దీర్ఘకాలంబు గడచె, నంత నద్వైతాచార్యుండు శ్రీవాసు చెవి చెంతకేగి “మిత్రమా! యీదివ్యరూపం బిఁకఁ జాలింపరాదే! నాకన్నులకది దుర్భరంబుగనున్నది” యని గుసగుసలాడ శ్రీవాసుండు ‘నాకు నిది విలోకనాశక్యంబై యున్న’ దనియె; నంత భక్తులందఱొక్కచో రహస్యంబుగఁగూడి యాలోచించుకొని స్వామిసమ్ముఖమ్మునకుంజని ముకుళితహస్తులై వినమితాంగంబులతో నిట్లనిరి. 106

మ. ఒకభానున్గనలేని నీరసులకీ ♦ యుద్దండతేజశ్ఛటో
జ్ఝకసూర్యాయుతరూపమో యమరపూ♦జ్యా! చూడశక్యంబె? నీ
వికఁ దివ్యాకృతిమాని యెప్పటియటు ♦ ల్హేమాంగదృక్ఛక్యబా
లకరూపంబునఁ దోఁచుమయ్య! ప్రణతు♦ల్గావింతుమేమచ్యుతా!

క. అన నిమినవ్వుచు మంచిది
చనెదస్నేననుచుఁ బల్కి ♦ చయ్యననొకకే
కనుబెట్టి నేలపైఁగూ
లెను మూర్ఛ; ‘మహాప్రకాశ ♦ లీల’ యుముగిసెన్. 108

సీ. పద్మముల్ముకుళించు ♦ పగిది మూఁతలువడెఁ
గనుఱెప్ప; లూపిరి ♦ గదలదయ్యెఁ
దనుచాలనంబెటఁ ♦ గనఁబడదొక్కింత
నాడియుగుండెయు ♦ నాడకుండె
శ్వాసపరీక్షింప ♦ నాసాబిలంబుల
పొంతఁబెట్టిననూలు ♦ పోఁగుఁగూడ



నిశ్చలంబైయుండె; ♦ నిమి యవయవతతి
యెటుత్రిప్పఁ దిరముగా ♦ నటులెయుండెఁ

గీ. దనువుబిఱ్ఱబిగియకుంట ♦ తనువుకాంతి
దఱుఁగకుంటయు; మైవెచ్చ ♦ తగ్గకుంట;
ప్రాణచిహ్నంబులీమూఁడె ♦ కానవయ్యెఁ
గొదువవన్నియు భీతిని ♦ గొల్పుచుండె. 109

క. తొమ్మిదిగంటలకాలం
బిమ్మాడ్కినె స్మృతినిదక్కి ♦ యెంతటియుపచా
రమ్ములుచేసిన లేవమి
ముమ్మరముగ భక్తపాళి ♦ పొక్కఁగసాగెన్. 110

క. మృతుఁడయ్యెం గౌరాంగుఁడు
క్షితినిర్గౌరాంగమైన ♦ జీవింతుమె? మే
మతఁడరిగినయెడకుంజను
వితముంజింతింప మొదలు ♦ వెట్టెదమిపుడే. 111

ఆ. ఆత్మహత్య పెద్ద ♦ యఘమని ధర్మశా
స్త్రములువల్కునరియె, ♦ నిమిగతింప
బ్రదుకఁజూచు, టన్న ♦ వారివాయువులుండ
నట్టిచోటనిలుచు ♦ టట్టుగాదె? 112

వ. అని యూరక విలపించువారలంగాంచి యొక్కమహాభక్తుం డన్నలారా! మీకేదో పిచ్చిపట్టినట్లున్నది! భగవంతుండెక్కడ మరణంబెక్కడ? యెవ్వరైనవిన్నచో నవ్వుదు రిఁక మీయేడ్పులుచాలించి మనపూర్వపుణ్యఫలంబగు శ్రీగౌరాంగుం దేర్చుటకు నాకుఁదోఁచిన యొక్కయుపాయంబు సెప్పెదవినుండు. 113

గీ. రాధికాకాంత పొదరింట ♦ రాత్రిఁగృష్ణుఁ

గూడి తెల్లవాఱుటకూడ ♦ గుఱుతెఱుంగ
కుండఁదన్మయతనువాని ♦ యురముమీఁదఁ
గూర్కుచుండఁగఁ గాంచిపై ♦ కూర్మిచెలులు. 114

క. చెలియా! యుదయంబయ్యెను
వలపులుసాలించి వెడలి ♦ వత్తువ! రావా!
తెలిసిననాఁడిపుత్తురు
పలుగాకులు నిన్ను మమ్ముఁ ♦ బర్వేందుముఖీ! 115

క. అని సుస్వరములఁబాడిన
యనుపమమహా 'కుంజభంగ' ♦ మనుగీతాళిం
గొని చక్కఁగ గానంబుం
బొనరుత, మదివిని యతండు ♦ మూర్ఛన్దొఱఁగున్. 116

చ. ఇదిమనయంత్యగానమని ♦ యెంచియొనర్తుము మిత్రులార! య
య్యదిపనిసేయకున్న మన ♦ మందఱ మిప్డె నిరాశఁ బ్రాణముల్
వదలుదమన్న, నమ్మికను ♦ భక్తులు ధైర్యముఁ బూని మూర్ఛమా
పుమని 'కుంజభంగము' ను♦ బొంగుచుఁ బాడిరియొక్కగొంతుకన్.

వ. అంత. 118

మ. పులకల్పుట్టెను మేనిపైని వెనుక, ♦ న్ఫుల్లాబ్జతుల్యంబులై
వెలసెన్గన్నులువిచ్చి, జృంభణముఁగా ♦ వించెన్శచీజుండు, భ
క్తులుగొండంతప్రమోదమంది హరి! శ్రీ♦గోపాలకా! యంచుఁ గే
కలనుంబెట్టిరి యాకసంబు భువియే ♦ కంబైనయట్లత్తఱిన్. 119

గీ. ఏమియిదియనియడుగ న ♦ తేమిలేదు
దీర్ఘకాలము మూర్ఛనొం ♦ దితిరటంచు
పలుకువల్కిరి నిమికంత ♦ « మాన్యులార!
యెంతశ్రమపెట్టితినొకదా! ♦ యేనుమిమ్ము 120



క. అరనిముసమేనియు వృథా
చలుపక హరిసేవసేయు ♦ భక్తులకాలం
బరయక వ్యర్థముసేసితిఁ
గరుణించి క్షమింపుఁ" డంచు ♦ గౌరాంగుఁడనెన్. 121

వ. అంత నితిసాహసించి యిట్లనియె. 122

గీ. ఈక్షమాప్రార్థనంబుల ♦ కేమి! నీకు
నాకు వీరికి నేఁడుని ♦ న్నయును నిద్ర
భోజనమునున్న గౌరాంగ! ♦ పోయిస్నాన
మాడి భుజియించి నిద్రింత ♦ మయ్య! వేగ. 123

వ. అన నందఱుంగదలిచని యట్లు గావించిరి. 124



క. ఏరూపంబుననిలలో
వారకనిన్బూజసేయు ♦ భక్తుఁడచలుఁడై
యారూపంబుననతనికిఁ
గారుణ్యపయోధి! రామ! ♦ కాన్పింతువుగా! 125



శ్రీరస్తు.

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః.

# శ్రీగౌరాంగచరిత్రము.

## పంచదశాశ్వాసము.

శా. నానావర్ణవిచిత్రపుష్పముల వి ♦ న్యాణంపుఁ బత్రింబులన్
ఘ్రాణామోదకమంజుగంధముల నా ♦ కర్షించి భృంగాళికిన్
దేనెల్వెట్టెడుచెట్టురీతిని భవ ♦ ద్దివ్యాంగసమ్యగ్గుణౌ
ఘానీతప్రీణితాళికిచ్చెదవురా ♦ మా! ముక్తిపీయూషముల్. 1

సీ. కాలమంతయువృథా ♦ యేలచేయఁగవలె
సోదరులార! యం ♦ చు నిమిసెప్పఁ
బగలురాత్రియుఁగూడఁ ♦ బచరింపసాగిరి
యేవైపుననొయొక్క ♦ యింటియొద్దఁ
గృష్ణకీర్తనములు ♦ కెరలిభక్తశ్రేష్ఠు ;
లివిగాక శ్రీకృష్ణ ♦ వృత్తవిషయ
సత్ప్రసంగంబులు ♦ సల్పుచుండిరి ; కూడుఁ
గూరుకువారికి ♦ శౌరినుడివె ;
గీ. యప్పుడప్పుడు గౌరాంగుఁ ♦ డచ్యుతుఁడయి
యుచితబోధములనుజేయు ♦ చుండెవారి



కీసమాచార మాపురి ♦ నెల్లయెడలఁ
బ్రాఁకి నిమి యీశ్వరత్వము ♦ బయలుపఱిచె. 2
క. ఎందఱో నమ్మికను శచీ
నందను భక్తులయిరింక ♦ నమ్మికలేమిన్
గొందఱు విషయాసక్తులు
నెందఁగలేరైరొకింత ♦ శ్రీవరుకరుణన్. 3
క. గౌరాంగునిభక్తులలోఁ
బాఱులు పెక్కండ్రుగలరు ♦ పాఱులసంఖ్యన్
మీఱిరతనిశిష్యులలోఁ
జేరిన పెఱజాతివిమల ♦ చిత్తులు భక్తుల్. 4
ఆ. విష్ణుభక్తిరహిత ♦ పృథ్వీసురేంద్రుని
కంటె విష్ణుభక్తి ♦ కలితచిత్తుఁ
డైన యధమజాతి ♦ యతఁ డెన్నిమడుఁగులో
యెక్కుడంచు నిమి వ ♦ చించునెపుడు. 5
శా. క్షుద్రానందములన్ద్యజించి భవసం ♦ క్షోభవ్యపేతాత్ములై
నిద్రాహారములన్దొఱంగి పవలు ♦ న్రేలు న్హరిధ్యానని
ర్నిద్రాంతఃకరణంబులన్వెలసి త ♦ న్నీరేజదృఙ్నామముం
భద్రప్రోర్జిత వాక్సుధల్గురియుచు ♦ న్భక్తాళివర్తించెడున్. 6
క. వారేమనుకొనెదరో యిఁక
వీరేమనెదరో యటంచు ♦ భీతిల్లక సం
చారముఁ బురిఁజేయుదు ర
వ్వారి సురాపాయిచయము ♦ పగిదిన్వారల్. 7
ఆ. కంటినిండనిద్ర ♦ కడుపారఁదిండియు
లేని దివ్యసుఖము ♦ లీలఁగనుఁడి

ధారిణీశునేనిఁ ♦ జేరికఁగొననట్టి
వారివినయములును ♦ భక్తిఁగనుఁడి. 8

శా. ముల్లోకంబులవారియందమొకచోఁ ♦ బోఁగైవిరాజిల్లున
ట్లుల్లాసంబునుగొల్పు మోమున వివే ♦ కోదారతాహ్రీకృపా
వాల్లభ్యాన్యజనోపకారగుణ స ♦ ద్భక్తిక్షమాదుల్మనో
హృల్లీలాకృతిఁదాల్చె నానిమిధరి ♦ శ్రీదేవుఁ డొప్పెన్భువిన్. 9

క. భూతలమున లేఁడింతటి
పాతకియనువాఁడుఁ గృష్ణ ♦ భక్తింగొని సం
పూతాత్ముఁడయి తరించుట
కీతండ్రిని గంటఁజూచు ♦ టే తడవుగదా! 10

క. చిరసంచితపాపంబులు
విరిసెడు నిమిషొక్కసారి ♦ వీక్షించినచో
నిరులేండ్లకొలఁదిఁగూడినఁ
గరదీపికఁ జూపఁగానె ♦ కలఁగితొలఁగుఁగా! 11

క. ఘోరతపంబులుసేసియు
దొరింపఁగరానియట్టి ♦ దురితములడఁగెన్
గౌరాంగుఁజూచుమాత్రన
గౌరాంగునికాలమట్టి ♦ కాలముగలదే? 12

సీ. శ్రీవాసునగతాళి ♦ సేసిన శాస్త్రిగ
ర్వితుఁడు విఖ్యాతపం ♦ డితుఁడునైన
'చపలగోపాలు' న ♦ కపచారఫలముగా
మూఁడునాళ్లకె మైని ♦ బుట్టెహేయ
కుష్ఠదూరుజ; నాటఁ ♦ గోలె నాతండైదు
వత్సరంబులుబాధ ♦ పడెనుదాన;



నంతఁ బశ్చాత్తాప ♦ మంది దీనతవాఁడు
గౌరాంగుకడకేగి ♦ కాళ్లమీఁదఁ
ఆ. బడి "క్షమించి వ్యాధిఁ ♦ బాపుమా! పుణ్యాత్మ!"
యంచునేడ్చి యడుగ ♦ 'నట్లుసేసి
ప్రోవఁబావనుండు ♦ శ్రీవాసుఁడగుఁగాని
నేనుజాల' నంచు ♦ నిమివచించె. 13

క. అంతటఁ జపలుఁడు శ్రీవా
సాంతికమునకేగి యెఱిఁగి ♦ యరుదెంచిన వృ
త్తాంతంబంతయుఁ జెప్పినఁ
జింతిల్లెను వానిఁగూర్చి ♦ శ్రీవాసుండున్. 14

క. నీపైఁ గోపము లేదో
గోపాలా! నీదువ్యాధి ♦ కుదురఁగఁజేయున్
శ్రీపతియనునిముసమున నె
రూపఱె రోగంబు; మై సు ♦ రూపంబందెన్. 15

క. వెనువెంటనె గోపాలుం
డెనయుచు నెనలేనిమోద ♦ మేద్రెఱ గౌరాం
గుని శిష్యుఁడయ్యెఁ దనశి
ష్యనికాయముతోడ భక్తి ♦ సాంద్రాత్ముండై. 16

క. ఒకతురకబట్టలను గు
ట్టుకబ్రిదికెడువాఁడు నిమిప ♦ టుత్వంబందం
బొకనాఁడుసూచి మోహా
త్మకుఁడై 'యల్లా' నుగంటిఁ ♦ దండ్రినటంచున్. 17

క. ననురక్షింపుము పాపా
త్ముని దేవా! యంచుఁజేరి ♦ పూతుండై భ

క్తినిదాలిచి మున్నెన్నం
డెనయని యానందమెనసి ♦ యెసఁగెన్బురిలోన్. 18

ఆ. విశ్వమాతయైన ♦ విష్ణుప్రియాదేవి
బందుగుండు దేవు ♦ పట్లనాస్తి
కాధముండునైన ♦ మాధవాచార్యుండు
గ్రామ్యసుఖదకార్య ♦ కరణములను. 19

గీ. చాలకాలమువుచ్చి తాఁ ♦ జనుటగలిగె
నొక్కదినమున శ్రీవాసుఁ ♦ డుండునింటి
కచటఁజూచుటగల్గె గౌ ♦ రాంగునదియె
తరణసాధనమయ్యె నా ♦ తనికిబళిర ! 20

చ. తొలఁగెను నాస్తికత్వమును ♦ దుష్టతమైహిక చిత్తవృత్తులున్
గలిగెమహాద్భుతంబుగ న ♦ ఖండపుభక్తి నిమింగనంగనే
యిలపయి గొప్పభక్తుఁడయి ♦ యాతఁడువ్రాసెను వెన్కఁగృష్ణమం
గళమనుగ్రంథరాజమది ♦ కల్మషహారి పఠించువారికిన్. 21

ఉ. 'పొందుముభక్తి' యన్ననిమి, ♦ పొందెడుఁదత్క్షణమెంతపాపియున్
గందొవలల్లవిప్పికని ♦ కమ్ముమహాత్ముఁడవన్న వెంటనే
చిందులుద్రొక్కుబాలుఁడును ♦ శ్రీహరి ! శ్రీహరి ! యంచునిట్లు గో
విందకృపాసుధారసము ♦ విందిడె మిశ్రిజుఁ డెల్లవారికిన్. 22

ఉ. నాకృతివ్రాయెనంచు రఘు ♦ నాథుఁడు గంటను నీరువెట్టఁగా
వ్యాకులచిత్తుఁడై తనమ ♦ హాకృతి గంగనుద్రోసినట్టి య
ప్రాకృతదివ్యవిగ్రహుఁ డ ♦ పారకృపామతి యుమ్మలించుఁ దా
లోకులకష్టముల్గనిన ♦ లోననియక్కఱ లేదు సెప్పఁగన్. 23

మ. తనకంటెన్దనభక్తులెక్కుడని చి ♦ త్తంబందు నీధాత్రిను
న్ననరస్తోమము చింతసేయవలెన ♦ న్భావంబుతోఁ దానుజే



సినసత్కార్యములెల్ల నాసదయులే ♦ చేకూర్చినారంచుఁ జా
టును గౌరాంగుఁడు, చిన్నికృష్ణునకుఁ దా ♦ టోటుల్స్వభావంబులే.

చ. తృణనిభుఁడై వినమ్రితను, ♦ వృక్షసదృక్షమక్షమాదులన్
గని, పరసంస్తుతుల్వినుచు ♦ గర్వముసెందక, దూషణంబులన్
వినికుపితుండుగాక, కడుఁ ♦ బెద్దగఁజేయుచు దూఱువారి, ధా
త్రినివసియించువాఁడె తగు ♦ దేవుని నిక్కపుభక్తుఁడంటకున్. 25

క. మనుజుం డింద్రియసముదయ
మనుజంపఁగనేల ? వలదు ♦ పూర్ణంబుగదా
నిని వశపఱచుకయుండిన
వినోదమదిగొల్పువాని ♦ వీక్షణములకున్. 26

క. గరళకరాళవ్యాళము
ధరనుపకృతిసేయుఁ గొంత ♦ తానెద్రో, దానిం
బరిమార్పక కోఱలనుం
బెఱికివిడిచెనేని లేదు ♦ వెఱపెవ్వనికిన్. 27

గీ. పాములనుబట్టి బ్రతుకునే ♦ ర్పరులయెదుటఁ
బడగలెత్తుచు హాయిగాఁ ♦ బాటవినుచుఁ
జెప్పినట్లులు తిరుగుచుఁ ♦ జెలఁగియాడుఁ
బండ్లుపీఁకిన క్రూరస ♦ ర్పములు జగతి. 28

క. అని శిష్యాళికి నిమి బో
ధనమెప్పుడుఁజేయు ; నొక్క ♦ తఱిని యశోదా
తనయుఁడగునొక్కతఱి నా
తనికై విలపించురాధ ♦ తానైపొక్కున్. 29

సీ. రమ్మునిత్యానంద ! ♦ రా ! నన్నుఁబట్టుకో
యింతంతగాదు నే ♦ నెనయుబాధ

జనులకు హరినామ ♦ మను విందు వెట్టఁగాఁ
దలఁచెదఁగాని యా ♦ బలవదాఖ్య
హృదయంబులో సెల ♦ యేటిపోలికఁ బాఱి
యేమిచేయుదునయ్య! ♦ యేదియుంచు
జనులకు ఋణపడి ♦ తినినేను; దద్విము
క్తుఁడఁగాను వారిము ♦ క్తులుగఁ జేయ
గీ. నంత కాలము, దేహము ♦ నందుఁ జిక్కి
యుంట కిదినుమి కారణ ♦ మోసఖుండ!
యెవఁడు నాబాధలార్చువాఁ ♦ డీవుదక్కఁ
గష్టములు సెప్పకొన నాకుఁ ♦ గలఁడెవండు? 30
క. అయ్యో! పాపార్తుల నె
ట్లయ్యా! రక్షించుటింక ♦ హరినామ మెవం
డయ్యా! వారలకిడువాఁ
డియ్యలనని నిమివచించి ♦ యేడ్చున్మిగులన్, 31
క. వీరలనేఁచెసుపాపము
లారయ నాగుండెలవియు ♦ నన్నా! యంచున్
గౌరాంగుఁడు నితిమెడఁబే
రారటమునఁ గౌఁగిలించి ♦ యడలఁగఁ జొచ్చెన్. 32
క. పాపులఁ జూచిన నితనికిఁ
గోపము నేవయును లేవు ♦ కోమలహృత్సం
తాపోద్గత బాష్పాపగ
లేపారి స్రవించుఁగనుల ♦ నెడతెగకుండన్. 33
ఉ. దారులుగొట్టునొక్కపటు ♦ తస్కరుఁడుండు వనస్థదుర్గమా
గారముసొచ్చినిల్చె నిమి ♦ కాంచనకాయుఁ డొకప్డు, డంత నా



చోరుఁ డిదేమిపాపి యిలు ♦ సొచ్చుటగగ్గలైనుస్వామి! మీకరన్
ధీరుఁడవు న్మహాత్ముఁడవు ♦ నీవనె మిశ్రసుతుండు వానితోన్. 34
క. చెడుపనులు సేసిబ్రతికెడు
కడుపాపాత్ముఁడను నేను ♦ గట్టు! నను మహా
త్ముఁడవని స్తుతింతు రేలని
సుడివాల్ధారతోడనుడివెఁ ♦ జోరుండంతన్. 35
వ. దానికి నిమియిట్లనియె. 36
చ. ఎఱుఁగుదునిన్మహాత్మునిగ ♦ నెందుల కీడకువత్తుఁగానిచో
ముఱికిపటంబులోపల న ♦ మూల్యపురత్నముఁ గట్టవచ్చుఁ జూ
పఱుగను నీశరీరమది ♦ పాపములెన్నియొ చేయుచున్నఁ బాఁ
తఱవడి భక్తిరత్నము స ♦ దా వెలుగొందెడు దానిలోపలన్. 37
క. అది పైకిలాగిచూపినఁ
గద! నీయౌన్నత్యమెంతో ♦ కననగునసఁగా
నృదితాత్రశుల వాఁడడిదము
వదలి నిమిందవిలిపోయె ♦ భక్తిన్వెంటన్. 38
క. ఒకదుష్టులలో దుష్టుని
వికచాంబుజలోచనుండు ♦ వీక్షించిరొక
ప్డిఁక వీనింబ్రోచుటయె
ట్లోకొయని కన్నీళ్లురాల్చె ♦ నుర్విఁ బొటపొటన్. 39
ఉ. అంతటవాఁడువచ్చి చర ♦ ణాబ్జములంటి నమస్కరించి పా
పాంతక! యూఱడిల్లు నర ♦ కార్తులనైనసహింతుఁగాని నీ
వంతను జూడఁజాల నభ ♦ వా! భవదంఘ్రిపవిత్రరేణు వ
త్యంతపు భక్తిశీర్షమునఁ ♦ దాల్చిభజించి తరింతునేననెన్. 40

ఆ. కోరపూతిగంధి ♦ కుంఠితాస్పృశ్యకా
యంబు వారిఁజూచి ♦ సాశ్రుఁడౌచు
నేగి మిశ్రిసూతి ♦ కౌఁగిలింపఁగఁ బటా
పంచలౌను వారి ♦ బాధ లెల్ల. 41

ఉ. తాఁకులఁజూపుల న్స్వచరి ♦ తంబులమాటల దుష్టపాళి న
స్తోకకృపాళువైన నిమి ♦ శుద్ధమనఃకృతకృత్యపాళిగా
నీకరణింబొనర్చె నతఁ ♦ డీశ్వరుఁడౌటఁ, గుబుద్ధిమానవుల్
వాకొను నల్పబోధనవుఁ ♦ బల్కులు మార్చునె దుస్స్వభావులన్. 42

గీ. భక్తివైరాగ్యగుణపరి ♦ పక్వచిత్త
కలితులును గృష్ణనామసం ♦ కథనపటువు
లైన నితిహరిదాసుల ♦ నర్మిలి నిమి
పిలిచి యొకనాఁడు వారితోఁ ♦ బలికె నిట్లు. 43

గీ. అర్థమత వైదుషీయోగ్య ♦ తాస్తికత్వ
తనుమనోబలబంధుత్వ ♦ తారతమ్య
ములనుజూడక కేవల ♦ మోక్షదాత
లౌచు నింటింటికరిగి యి ♦ ట్లనుఁడిమీరు. 44

ఉ. సోదరవర్య! నాదెసను ♦ జూడుము; దేహమశాశ్వతంబు; దే
హాదిసుఖేప్సముఖ్యపురు ♦ షార్థము నేమఱియుంటివయ్యయో!
యాదవవంశమండనుఁడు ♦ దారుఁడు కృష్ణుఁడు సర్వపాపవి
చ్ఛేదకుఁ డాతనింగొలిచి ♦ చింతనసేయుము వానినామమున్. 45

క. అనిసెలవిచ్చినఁ ‘జిత్తం’
బని భక్తద్వయము ప్రతిగృ ♦ హద్వారము పొం
తనునిలిచి ‘కృష్ణ! శ్రీహరి!’
యనిపల్కఁగనింటి వార ♦ లర్థిభ్రాంతిన్. 46



ఆ. తలుపుదెఱచివచ్చి ♦ తండులంబులుముష్టి
వెట్టఁబోవ వారు ♦ వెఱఁగుఁ జెంది
బిచ్చమెత్తమేము ♦ విడివడిరాలేదు
కృష్ణభక్తిఁగొనుఁడి ♦ యిత్తుమనఁగ. 47

క. కొందఱు ధన్యులు పరమా
నందంబున భక్తులైరి; ♦ నమోత్తరముల్
కొందఱువల్కిరి; తస్కర
బృందంబిదియనిరి కొంద ♦ ఱెంతయుభీతిన్. 48

గీ. వీటనుండువయోవృద్ధ ♦ విప్రవరులు
యశమునొందిన పండితు ♦ ల్స్వాతిశయపుఁ
జూపులను భక్తయుగమును ♦ జూచి యాత్మ
పాండితీగర్వ మేపారఁ ♦ బలికిరిట్లు. 49

శా. సాంగామ్నాయ సదాగమాంతచయ భా ♦ ష్యగ్రంథ విజ్ఞాన ము
త్తుంగప్రౌఢిమఁ జూఱకొంటిమి, లస ♦ ద్యోగక్రియల్ నేర్చి మా
యంగవ్రాతము ముద్దసేసితిమి బ్ర ♦ హ్మలోకనాసక్తి; మా
కుం గాన్పింపఁడతండు మూఢులిఁక జో ♦ గుల్మీరు సూపింతు రే? 50

క. చదువెఱుఁగని మూర్ఖులు న
మ్ముదురేమో! మీరువల్కు ♦ మోసపుమాటల్
చదివిన పెద్దలకడ నిటు
వదరక మీరింకఁజనుఁడి ♦ వచ్చినత్రోవన్. 51

క. ఏకఫణితిఁ జెవిగోసిన
మేఁకలవలె నఱచుచిట్లు ♦ మిట్టిపడెదరీ
వీఁకవదలి వడినేగుఁడు
పోకార్తుము మీదుపొగరు ♦ పోవకయున్నన్. 52

ఆ. ఇటులు తూలనాడు ♦ చటులస్వభావులఁ
జూచి ' యదయుఁడౌచుఁ ♦ జొనిపె మనల
స్వామియిట్టిపనుల ; ♦ భక్తిని వెంటనే
యందునట్లు సేయఁ ♦ డయ్యొజనుల ' 53

క. అని నితి హరిదాసునితో
డను విసుగునఁ బల్కఁ గటక ♦ టా ! యనకిట్టుల్
ఘనకార్యము లీధరలో
నొనగూడునె శ్రమముపడక ? ♦ యొడయఁ డెఱుఁగఁడే ? 54

క. ఈ యాలస్యము సేయుట
యేయద్భుతములకుఁ గతమొ ♦ యెవ్వఁడెఱుఁగు నీ
సాయల్పపుటూహల నహి
శాయి రహస్యంబుఁ దెలియఁ ♦ జాలుదుమయ్యా ? 55

క. హరిదాసుఁ డిట్లువల్కఁగఁ
" బురిలో సోదరులు విప్ర ♦ ముష్కరులౌ యి
ర్వురుగలరు జగన్నాథుఁడు
మఱి మాధవుఁడనెడువాఁడు ♦ మాన్యచరిత్రా ! 56

ఆ. మొదట వారికడకుఁ ♦ బోయి శ్రీహరిభక్తి
నియతిఁ గఱపుదమ " ని ♦ నితియనంగ
నట్టివారికడకె ♦ యాదిని బోవుద
మా ! యని హరిదాసుఁ ♦ డడిగెనితిని. 57

వ. నితి యిట్లనియె. 58

సీ. ఈపట్టణంబున ♦ కేలికయౌ ముస
ల్మాన్ఛాందుఖాజియ ♦ స్మహితుక్రింద
వీరు కొత్వాలులు ; ♦ విప్రులై పుట్టియుఁ



జండాలకృత్యము ♦ ల్సలుపువారు
బలశాలులందఱు ♦ వశులుగాఁ జేసిక
కావింతురి పల్లుండ ♦ గములు పురిని
శక్త్యుపాసనమిష ♦ నలుపుదురామిష
భక్షణంబును సురా ♦ పానమెపుడు

గీ. పేరు సెప్పిన నూరంత ♦ బెగడునట్లు
బుఱ్ఱలంగొట్టి విత్తంబుఁ ♦ బోగుసేసి
మత్తు లైఖాజిభయమను ♦ మాటలేక
స్త్రీలఁ జెఱగొని చెఱపుచుఁ ♦ జెలఁగుచుంద్రు. 59

క. దురితముల పుట్టలింతటి
మొఱకులు భువిలేరు వీరి ♦ ముందఱఁ బురిఁగాఁ
పురమెట్లు పొసఁగుఁ జదువుల
మరగి జనులు వీరిబాధ ♦ మఱవకయున్నన్. 60

ఆ. ఇట్టి నరపశువులఁ ♦ గృష్ణభక్తులఁ జేయ
వలనుపడియెనేని ♦ బట్టణంబు
వారలందఱొక్క ♦ సారి గౌరాంగుని
వారలౌదురతని ♦ పదములంటి. 61

మ. అనిచెప్ప న్హరిదాసుఁ డిద్ది కడు శ్లా♦ఘ్యంబె ! సరే ! కానివా
రినివర్శించి హరిన్వచింపఁగ, రుషో ♦ ద్రేకంబునన్మోఁదవ
చ్చినఁ గావించెడికార్యమేది ? యన నా ♦ శ్రీకాంతుఁ డేదిక్కు దం
డనముల్నీకలవాఱె ; లెమ్మనియె నా ♦ నందుండు లేనవ్వులన్. 62

గీ. పోయి యంతనా బ్రాహ్మణ ♦ బ్రువులయెదుట
నితియు, వెన్కను దాసుండు, ♦ నిలువఁబడిరి
' తండ్రి, కృష్ణుఁడుమిమ్మోము ♦ త !' మనెనొక్కఁ

'డన్నలారా! హరినిగొల్వుఁ' ♦ డనియె నొకఁడు. 63

గీ. పాదతాడిత రౌద్ర స ♦ ర్పములపగిది
లేచి విప్రాధములు "పొండి! ♦ లెంపకాయ
లన్దినక లేచిపొండి వై ♦ ళంబ" యనుచుఁ
దూలనాడిరి కృష్ణభ ♦ క్తులనుగనలి. 64

ఉ. తిట్టుల లక్ష్యపెట్టక ని ♦ తి న్హరిదాసుఁడు నిల్వఁజూచి వీ
రట్టిటు సేయఁబోవరని ♦ యాధరణీసుర యుగ్మమంతలోఁ
బుట్టినకోప మిన్మడిని ♦ బొందఁగ నొడలు పంటనొక్కి చీ
కొట్టి మహాత్ములన్వడలఁ ♦ గొట్టెను దెబ్బలుగొట్టి గెంటుచున్. 65

వ. ఇట్లవమానితులై చనిన పిమ్మట నిద్యానందుం డయ్యో! వీరిపాపం బులెట్టుకడ ముట్టునని చింతాక్రాంతుండై కంటఁ దడిపెట్టుకొని హరిదాసుతో నిట్లనియె. 66

శా. అన్నా! యొక్కమహోపకారమును జే ♦ యంగావలె న్నీవు; నీ
వన్నన్ప్రాణము మిత్రసూతి కతనిం ♦ బ్రార్థించి యీమూఢుల
న్దిన్నంజేయుము భక్తమౌళి! మఱవ ♦ న్నేనెన్నఁ డీమేలు నా
ప్రన్నత్రాణున కెంతకార్యమిది ప్రో ♦ వ న్బుద్ధి పుట్టించితేన్. 67

ఉ. ఇచ్చజనించెనే జగము ♦ నెల్లను బ్రోవఁగలాఁడవయ్య కా
ర్చిచ్చుగుఁ దన్మలాటవిహ ♦ రింపఁగ నీయుపకారవాంఛ; వా
రచ్చపుభక్తి శ్రీహరిక ♦ టాక్షమునం గొనునట్టి కాలమున్
వచ్చెను రమ్ము పోదమని ♦ పల్కెను దాసుఁడు మిత్రవర్యతోన్.

గీ. ఉభయులరిగిరి గౌరాంగు ♦ నొద్ద కతనిఁ
గనినతోడనె వారికిఁ ♦ గల సమస్త
శాంతిశక్తులుసూపి య ♦ నంతరంబె
యడుగుదము స్వామి ననునూహ ♦ వొడమెమదిని. 69



వ. హరిదాసుఁ డిట్లనియె. 70

చ. ప్రజకిటు కృష్ణభక్తి బల ♦ వంతముగాఁ గొని యిచ్చుచున్నఁడు
న్నిజముగ నేనెఱుంగనితి! ♦ నేర్పఁగవచ్చును శాంతచిత్తతో
సుజనుల కెంతయైన నిఁకఁ ♦ జూచినఁ బైఁబడు త్రాగుఁబోతులా
ద్విజకులహీనవర్తనులు ♦ వీరలయొద్దకె యేలపోవలెన్ 71

వ. నితి యట్లనియె. 72

మ. మనగౌరాంగుని చిత్రచిత్రకృతి మ ♦ ర్మంబుల్గనన్నేర్తుమే?
చనుమంచు న్బరికొల్పు నెమ్మదిని వి ♦ శ్వాత్రితయా నాతఁడే
మనిచెప్పందగుఁగాని విప్రియుగ చ ♦ ర్యాజన్యపాపంబులన్
గనినన్గన్నులనీరువచ్చు ఖలుల ♦ న్గావంగఁదప్పేసఖా! 73

వ. అంత. 74

మ. హరిసంకీర్తనసల్పు వీథిని ప్రజా ♦ త్యంతాపదాపాద్యనై
కరుపాక్రాంత మనస్కు లిర్వురును జూ ♦ క్కంపుంబటాగారముల్
నెరయన్నిల్పి వసింపఁగోల్పులుల గా ♦ లింబీల్చు వెంటన్నృగో
త్కరముల్వాతెడు మాడ్కిఁ బాఱిరి విభీ♦తస్వాంతులైయందఱున్. 

గీ. పాఱిపోకుండ నిల్చిన ♦ వారలైనఁ
బగటనే తోడుచూచుక ♦ పైకివత్తు
రిరులుప్రాలిసపిమ్మట ♦ నిండ్లుదాటి
వెడలిరారు మఱలఁ బ్రొద్దు ♦ వొడుచువఱకు. 76

వ. ఇంక సోత్కంఠుండై నిత్యానందుండు. 77

శా. ఈవేళన్నిసిఁ గృష్ణకీర్తనము నెం ♦ తేభక్తిఁ జేయంగ దు
ర్భావప్రాపేతులకర్ణముల్గదిసి యా ♦ భవ్యంపు గానంబు స
ద్భావంబుల్నెలకొల్పి దాష్ట్యమునడం ♦ పంజాలు గౌరాంగుఁడే
కావించున్మదభీష్టసిద్ధియని వ ♦ క్కాణించు మిత్రాళితోన్. 78

చ. ప్రతిదినమం దీనర్పుగతి ♦ భక్తులు మిశ్రసుతుండుఁగూడి య
చ్యుతభజనంబుసల్ప నది ♦ శ్రోత్రములంబడె రాత్రినంతఁ దో
షితమతి విప్రసోదరులు ♦ చెచ్చెర లేచి కరంబులన్సరా
యుత కలశంబులన్గొని మ ♦ హోద్ధతివచ్చిరి గానలోలురై. 79

చ. తలుపులు వేసి గట్టిగను ♦ దారిబిగించుటచేత వారు లో
పలికరుగంగఁ జాలక య ♦ పారముగాఁగర తాళకంఠమ
ర్దళమృదుభక్తిని స్వనమ ♦ రంబమువీనుల, నోటఁ జేతులన్
గలసురఁగ్రోలుచుండిరి య ♦ గారబహిస్థలి రాత్రియంతయున్. 80

క. గోవింద గానములువిని
కావించుచు నర్తనములు ♦ కాదంబరినిన్
ద్రావుచుఁ బెనుభూతంబుల
కైవడిఁ గునుకక యారేయిఁ ♦ గడపిరి విప్రుల్. 81

మ. వెలువాతన్హరిభక్తపుంగవులు శ్రా ♦ వ్యంబైన గానంబునా
పి, రుడావేశముచేతఁ దుచ్ఛులధిపు ♦ న్బీడింతురన్భీతినం
దలు గౌరాంగునిచుట్టునిల్చి గుమిగా ♦ ద్వారంబునుం దాఁటి స
త్వరులై వీధినిబట్టిపోవునెడ మో ♦ దంబంది యాయిర్వురున్. 82

క. గౌరాంగునిగని యోయ
య్యా! రాతిరిఁబాడినట్టి ♦ యనుపమ మృదుశృం
గారపు నాటకకీర్తన
లేరివి? యెక్కడివటంచుఁ ♦ బృచ్ఛింపంగన్. 83

క. దానికి మార్వల్కకు దా
సీనత నిమిడాల్చి చనియెఁ ♦ జెచ్చెరనయ్యో!
హీనులు దరింపలేరై
రీనాఁడునటంచు నితి ద ♦ పించెన్మిగులన్. 84



వ. అంత. 85

మ. హరిదాసున్నితిగూడి క్రమ్మఱ హరి ♦ ధ్యానావబోధేచ్ఛ భూ
సురగేహంబులకేగి "కృష్ణుపదము ♦ ల్బుద్ధాత్ములైకొల్చి సో
దరులారా! తరియింపుఁ" డన్నసతిరా ♦ ద్రింబైనరూపంబులన్
దలుమంజొచ్చిరి వారు దిట్టుచు మదాం ♦ ధత్వంబునన్భక్తులన్. 86

గీ. ముందుభక్తులు వెన్కను ♦ భూసురులును
బరువులెత్తిరి చూపఱు ♦ వెఱఁగుసెంద
నింక దొరకరు వీరని ♦ కొంతకొంత
వడికిఁ దిరిగిరి వెన్కకు ♦ బడలివారు. 87

శా. గౌరాంగుడును భక్తులుండునెడ దు ♦ ర్గర్వప్రచండాత్మకుల్
డేరావేసినదాదిగాఁ బ్రజల గుం ♦ డెల్గొట్టుకొఁదొడ్డై నా
క్రూరుల్సేసెడి వన్నిసైఁచినను ని ♦ ర్దోష ప్రశాంతాత్ములన్
వారిభంగినగౌరవించుటది సైఁ ♦ పన్లేకభక్తర్షభుల్. 88

వ. గౌరాంగునొద్ద కామధ్యాహ్నంబుననే యొక్కమ్మడి సేగి చేతులు జోడించుకొని యెఱ్ఱవాఱినమొగంబుతో నామాధవజగన్నాథులు వెట్టుబాములన్నియు విన్నవింప నిశ్చయించుకొని నిలువంబడ నాతండు దరహాసచంద్రికాశోభితం బగువదనంబువారి వంకకుఁద్రిప్పి 'యిప్పుడేలవచ్చితి' రని యడుగ. 89

సీ. స్వామి! వీరలు వెట్టు ♦ బాధ యింతంతని
మనవి సేయఁగజాల ♦ మనియె నొకఁడు
ప్రభువరా! సుందరీ ♦ రత్నంబులకు మాకు
వాటిల్లెఁ జేటని ♦ పలికె నొకఁడు
నితికి దాసునకిట్టి ♦ గతివచ్చె మేమింక
నెట్లునిల్చుట యని ♦ యేడ్చె నొకఁడు

భక్తిఫలంబు దె ♦ బ్బలుఁ దిట్లుఁ దలవంపు
లయ్యెఁగా! యయ్యయ్యొ! ♦ యనియె నొకఁడు

గీ. మమ్ము రక్షించు టటులుంచి ♦ మహితతేజ!
తొలుత వీరలపాపము ♦ ల్దొలఁగఁ జేసి
ప్రోచినఁగాని పురియెల్లఁ ♦ బొలియుననిరి
భక్తులందఱుఁ బతితపా ♦ వనుని యెదుట. 90

వ. నితి గౌరాంగున కభిముఖుండై యిట్లనియె. 91

మ. జమలిన్దండము నీకుఁ గృష్ణునికిఁ గీ ♦ చండాలుల న్భక్తర
త్నములం జేసెదుదాఁక వీటికి జన ♦ న్దథ్యంబుబోధింప; లా
భము లేదయ్య భవత్ప్రభావమును జూ ♦ పన్మాకు నట్టింట; నో
నిమి! నీపాపపవిత్రకృచ్ఛ్రపథము ♦ న్నిగ్గించుకొ మ్మియ్యెడన్. 92

వ. గౌరాంగుం డిట్లనియె. 93

ఉ. ఇంతటిపాపకర్ములె మ ♦ హీసురవంశజు? లట్టులైనఁ దా
మెంతటిబాధఁ జెందెదరొ ♦ యింతయు వారలెఱుంగ రక్కటా!
శాంతినిఁ గొల్పి పాపములఁ ♦ జయ్యనఁ జెండి సుఖంబుఁ గూర్పఁ గం
సాంతకు నామమొండె యగు ♦ నన్యము దోఁచదు నాదుబుద్ధికిన్. 94

ఉ. ఇందఱు భక్తశేఖరులు ♦ నిందఱు లోకహితైకతత్పరుల్
డెందములందు వీరలక ♦ డింది యఘంబులు డిందఁ గోరుచోఁ
జెందక పోరు భక్తి; యిఁకఁ ♦ జెచ్చెరఁ బిల్వుఁడి భక్తవారమున్
ముందఱ కేగి నేర్పుదము ♦ మోక్షసుఖప్రద కృష్ణనామమున్. 95

క. అనునంత విప్రకులపాం
సనులిఁకఁ దరియించిరంచు ♦ సంబరపడుచున్
వినుతించిరి భక్తులు హరి
వనమాలీ! కృష్ణ! భక్త ♦ వత్సల! యనుచున్. 96



వ. ఇట్లు హరినామోచ్చారణంబు సేసి వారు సల్గడలకుం బరువులెత్తి చుట్టుపట్లనున్న తోడిభక్తులందఱ సమావేశంబు సేసి నగరసంకీర్తనంబునకు సర్వంబు సిద్ధపఱిచిరి. ఈభక్తులలో ననేకులు సకలవిద్యాపారంగతులు వృద్ధులు నైనను హరిభజనం బొనర్చుచు వీధులందిరుగుట కించుకయుఁ గొంకరైరి. ముఖంబుల నూర్ధ్వపుండ్రంబులును మెడలఁ దులసీతావళంబులును జేతులఁ దాళంబులును గాళ్లఁ జిఱుగజ్జెలును ధరియించి యందఱు వెడలిరాఁగ నవద్వీపంబు సారూప్యముక్త్యాకీర్ణం బగు మహావైకుంఠంబు కైవడిఁ గాన్పించె. మృదంగనాదంబులు భక్తుల కంఠరవంబులతో సమ్మేళనంబుగాంచి శ్రవఃకుహరంబుల న్ప్రవేశించి మనంబుల నిష్కల్మషంబులుగఁ జేసి శ్రీహరిభజన సముచితస్థితికిం దెచ్చె. అంత సకలదురిత భంజకుండును బరమదయాళుండు నగు శ్రీహరి యనంతకల్యాణనామంబులు లలితపదాలంకార భూయిష్ఠంబు లగుగీతికలం బొందుపఱిచి గానంబు సేయఁ జేయువారును వినువారునుంగూడ భక్తిపారవశ్యంబు నొంది నాట్యంబు లొనర్ప మొదలువెట్టిరి. క్రమక్రమముగ భక్తానీకం బనేకనదీసంగమోత్తుంగతరంగ శోభితంబగు మహార్ణవంబుపగిది జనబహుళంబై యమందనేత్రానందం బొసంగె. 97

చ. తొలుత హసించుచు న్గనిన ♦ దుష్టులుఁ గూడను గృష్ణనామసం
కలిత సునాదగీతములు ♦ గర్ణములం బడు వెంటఁ గన్నులన్
జలజల రాల్చి బాష్పములు ♦ చక్రినుతించుచుఁ బోవువారిలోఁ
పలఁ జొరఁబాఱి యాడుచును ♦ బాడుచు నేగిరి భక్తమాళులై. 98

ఉ. ఘోరతపంబులన్దను వి ♦ కుంఠకకర్మముల ప్రసాంచితా
హారనిరోధకవ్రత చ ♦ యంబుల నేఁచక యీమనోహరా
కారుఁడు మానవాళికిడెఁ ♦ గా! యపవర్గ మహాసుఖంబు సం

సార దురంతదుఃఖముల ♦ మాపుచుఁ బాటల నర్తనంబులన్. 99

గీ. నితియు దాసుఁడు ముందఱ ♦ నిలిచియుండ
వెనుకఁ బార్శ్వంబులందు న ♦ విరళముగను
భక్తులంటిరానొప్పె వి ♦ శ్వంభరుండు
రిక్కలనడిమి కల్వల ♦ ఱేనివగిది. 100

ఆ. పూర్ణభక్తిదీప్తిఁ ♦ బొల్పారుమోములఁ
గెరలి మిన్నుముట్టు ♦ కీర్తనముల
నొడలుమఱచి చేయు ♦ నురునర్తనంబులఁ
జూచి యెవ్వఁడిలను ♦ జొక్కకుండు? 101

గీ. భక్తసంఘంబుసనె నిట్లు ♦ బ్రాహ్మణాధ
ములు వసించెడు పటగృహం ♦ బులయెదుటకు;
నంతనాగానములు సుప్తి ♦ నడఁగియున్న
చెనఁటిపాఁఱుల పాపపుఁ ♦ జెవులఁబడియె. 102

సీ. సాధువులంబట్టి ♦ చాఁగొట్టినట్లు దా
రులుగొట్టి ధనహృతి ♦ సలిపినట్లు
కులసతీమణులను ♦ బలిమిఁ బట్టినయట్లు
లిండ్లకు ననలమం ♦ టించినట్లు
దారిఁబోయెడువారిఁ ♦ జీరిదూఱినయట్లు
శిష్టవిప్రుల గేలి ♦ సేసినట్లు
నంజుడుముద్దలు ♦ నంజుకతిన్నట్లు
తృప్తిగాఁ గలుద్రాగి ♦ త్రేన్చినట్లు

గీ. పాపకృతులెన్ని జాగ్రద ♦ వస్థయందుఁ
జేయుటలవాటొ యవియెల్లఁ ♦ జేసినట్లు
స్వప్నములుగాంచి నిద్రించు ♦ వార లిపుడు



కన్నులఱవిచ్చి చూచి మే ♦ ల్కాంచిరంత. 103

గీ. రాత్రి నిర్నిద్రతను జెఱఁ ♦ ద్రాగి నిదుర
నిపుడు మునిమాపుదాపున ♦ నెనసియున్న
వార లెంతయుఁ గినిసి సే ♦ వకులతోడ
ఘోషనాఁపుడియని వెండి ♦ కునికిరంత. 104

గీ. దండడినిబ్బోయి భటులు సం ♦ త్రాసపెట్టి
యాఁగుఁడాఁగుఁడియని చాల ♦ నఱచి రంతె
కాని భక్తులు మునుపటి ♦ కంటె నెక్కు
డైనభక్తిని జేసిరి ♦ హరిభజనము. 105

శా. అంత న్వారలువ్రాయి భక్తతతి మా ♦ ర్ఘ్యంబెల్లఁ జెప్పంగనేఁ
డంతంబందెడు వీరి మర్కటపుఁగృ ♦ త్యంబుల్సరే! యంచు దు
స్స్వాంతు ల్చివ్వున లేచి ఘోరదహన ♦ జ్వాలాస్ఫులింగంబు ల
త్యంతర్భాగము లేచి క్రిక్కఁజని ర ♦ త్యంతాగ్ర హాయత్తులై.

గీ. పండ్లు పటపటఁగొఱుకుచుఁ ♦ బైని గుడ్డ
లైనఁ దిన్నగఁగప్పరో ♦ కాఁకరమున
భక్తులను జంపవచ్చిరి ♦ పైకిఁగాని
మఱచిపోయిరి కత్తుల ♦ మాటయేమొ. 107

క. జనముఖమున నితియుంటం
గనినంతనె మండిపడిరి ♦ గంతుల నిడుచున్
మును పేరెచ్చినయెద్దులు
గని యెఱ్ఱపటంబు రేఁగు ♦ కరణిన్వారల్. 108

ఉ. కన్నుల నీరువెట్టుకొని ♦ గద్గదికన్నితివల్కెఁ "గృష్ణమూ
ర్తిన్నలినాయతాక్షు విను ♦ తింపుఁడీ సోదరులార! కొల్వుఁడీ
పన్నగశాయి సాటిచెలి. ♦ బంధుగు, దైవము గానరాఁడు మే

మెన్నఁడు సేగిసేయములు ♦ కెందులకింకను మీకు మాపయిన్?"
వ. ఈశాంతవచనంబులకు మఱింత క్రోధావేశపరవశులై వారలిట్లనిరి
శా. మేమెట్లుండిననేమి నిన్ను గురుతా ♦ మిత్రత్వముల్దాల్చి మా
క్షేమం బారయుచుండుమంటిమె? నిను ♦ న్జీయంచు నోనాడలే
దేము? నీకభిమాన మింతయును లే ♦ దే? యింకసిగ్గేది ము
న్నామంపుం బెనుముచ్చులన్గొని మము ♦ న్సాధింపఁగా వచ్చితే?
గీ. అంత నాయుభయులలోన ♦ నధికబలుఁడుఁ
క్రూరతరుఁడైన మాధవుఁ ♦ డోరినీచ!
యనుచు నొక పెద్దకుండపెం ♦ కును గ్రహించి
వైచె నితిమీఁదఁ దనచేతి ♦ బలముకొలఁది. 112
సీ. పెంకునిత్యానందు ♦ విపుల ఫాలముపైని
దగుల ధారలుగ ర ♦ క్తంబుగాఱె
నంత రక్తంబాఁప ♦ హస్తయుగంబును
గాయంబుపై నితి ♦ గప్పికొనియె
"నిది నిమిగనినచో ♦ నిం కూరకుండఁడు
చక్కఁజేయును వీరిఁ ♦ జటులకృతులఁ
జక్కంబడఁగ వీరు ♦ జనులు నిష్పాపులై
బాగుపడుదురు నా ♦ బాధ కేమి"
గీ. యనుచు నతిమోదమున నాట్య ♦ మాడునట్టి
నితినిగని మాధవుండు "కుం ♦ ఠితముఖుండు
దెబ్బదిని కూడనాడుఁగా ♦ తెయ్యియనుచుఁ
జక్కఁజేయుట యెటు వీనిఁ ♦ జంపకుండ" 113
గీ. అని చుఱుకుఁజూపులం జూచి ♦ యాడుగఱచి
కొనుచు మఱియొక పెంకును ♦ గొని విసరుట



కెంచుచుండ జగన్నాథుఁ ♦ డెదురువచ్చి
యతనికైవట్టి వారించి ♦ యనియెనిట్లు. 114
శా. ఓయీ! మాధవ! వీనిసాధుమతి న ♦ త్యుగ్రుండవై చంపిన
న్గాయక్లేశము దుర్యశంబు నిది కా ♦ నన్బెబ్బులి న్దోర్చుటో
యాయిత్తంబయి శత్రుసైన్యమును శౌ ♦ ర్యస్ఫూర్తి నుగ్గాడుటో
న్యాయంబే యిటు లూరఁబిచ్చుకపయి ♦ న్బ్రహ్మాస్త్రము న్వేయుటల్.
ఆ. ఎంతయడ్డగించి ♦ యెన్నిబోధించిన
మాధవునిచలంబు ♦ మానదయ్యె
నింతలోననెల్ల ♦ వృత్తాంతమును భక్త
లరిగి నిమికిఁజెప్ప ♦ నాతఁడంత. 116
చ. హరిభజనంబునాఁపి నితి ♦ నార్తినిబెట్టిన దుష్టుఁడెవ్వఁడం
చరిగి తదంతికంబునకు ♦ నాతనిమోమును జేతఁదాఁక నె
త్తురు సలుపెల్లఁబోయెఁ ద్వరి♦తుండయి యంతఁగృతాంతతుల్యభూ
సుర యుగముండుతావునకు♦సూటిగనేగెను భక్తయుక్తుఁడై. 117
సీ. ముల్లోకములనేలు ♦ ప్రోడ యీతఁడె యని
నొసటి త్రిపుండ్రంబు ♦ నుడువుచుండ
శ్రీదేవి యీతని ♦ చెలువయేసుఁడియని
లాలితవక్షస్థ ♦ లంబువలుక
మింటికి మంటికీ ♦ మేటియొక్కఁడెయని
యున్నతాజాను బా ♦ హువులు దెల్ప
రవివీనిమైదీప్తి ♦ లవముచూడుండని
తప్తకాంచనకాంతి ♦ తనువుచాట
గీ. నడచి నిమి మాధవుఁడు జగ ♦ న్నాథుఁడుండు
నెడకుఁజని సృష్టిసవరించు ♦ నీక్షణముల

వారిఁదిలకించి దౌష్ట్యంబుఁ ♦ బట్టిపిండి
నయవగంభీరవాక్కులఁ ♦ బలికెనిట్లు. 118

ఉ. సిగ్గులు లేవె మానితిని ♦ జేసితిరిట్టులు, మీకు నాతఁడే
మెగ్గులుసేసె? శాంతుఁడు య ♦ తీశ్వరుఁడు న్గరుణాంతరంగుఁడై
లగ్గొనరింపవచ్చిన ల ♦ లాటము భగ్నముసేసినారు, మీ
పగ్గియు శౌర్యమున్నపురుల ♦ పాంసనులార! నుతింపశక్యమే? 119

క. ఊరికిఁ గ్రొత్త; కరంబున
మారకసాధనము లేదు ♦ మాధవుభక్తిన్
నేరుపవచ్చెను వీనిం
దోరింపఁగఁ బూనుటంత ♦ దురితముగలదే? 120

వ. అంత. 121

ఆ. ఇండ్లుదోఁచికొనుట ♦ యిల్లాండ్రఁ జెఱుచుట
హత్యలేచిచేయు ♦ టాటపాట
లైన క్రూరవ్రతములు ♦ ద్రమానుపాటున విని
రిన్నిమందలింపు ♦ లేమియనక. 122

వ. గౌరాంగుండు వెండియు నిట్లనియె. 123

చ. పుడమిని విప్రవంశమునఁ ♦ బుట్టియు వాకొనరాని వెన్ని యో
చెడుగులొనర్చినారు; తగు ♦ శిక్షను జేయుదుమీకు; నెవ్వఁడున్
గుడువక తప్ప దాత్మకృత ♦ కుత్సితకర్మఫలంబు; మీమదం
బడఁచి సుశీలురన్మనుచు ♦ నాతఁడు లేఁడని యెంచినారొకో. 124

సీ. అని పల్కునెడను జ ♦ ల్లనిచూపుఁ గన్దోయి
పరుషతామ్రచ్ఛవు ♦ ల్గురియఁదొడఁగె
నిద్దంపుటద్దంపు ♦ నెమ్మోముఁ జెక్కిళ్లుఁ
జిగురాకువీఁకను ♦ జేగుఱించె



నురుఫాలఫలకంబు ♦ గరగరికలువీడి
చూడఁ దీక్ష్ణంబౌచు ♦ సుళ్లువాఱెఁ
గన్బొమసింగాణి ♦ కవవంపుసొంపేది
కదిసి గ్రంథిలతఁజెఁ ♦ గట్టుజిమ్మె

గీ. నురముపైఁ బచ్చవల్లెవా ♦ టూర్పువడిని
పైకిఁ గ్రిందికి లేచుచుఁ ♦ బడుచునుండె
నభయహస్తంబు దుర్నిరీ ♦ క్ష్యంపుటుగ్ర
దహనకీలల చక్రంబుఁ ♦ దాల్చియుండె. 125

వ. అంత. 126

శా. శ్యేనంబున్గనుపావురంబుల క్రియ ♦ న్సింగంబుగాన్పింప స్వ
స్థానోత్తంభితమైన లేళ్లగతి సం♦త్రస్తాత్ములై యెంతయు
న్మేనుల్గంపమునొంది చెమ్మటలచే ♦ నిండంగఁ జేమోడ్పుల
న్మానంబుల్దిగనాడి నిల్చిరి జగ♦న్నాథుండుఁ దద్భ్రాతయున్. 127

శా. దోషుల్దండనకర్తసమ్ముఖమున ♦ న్దోర్బంధముంబొంది సం
భాషింపన్ధృతిలేక నిల్చినటులీ ♦ పాఱుల్రుపాగర్వ దు
ర్వేషంబుల్విడి చింతనొందిరి తము ♦ న్విశ్వంభరుండోమునో
రోషంబంది సుదర్శనంబనిపి ని ♦ ర్మూలించునో యంచటన్. 128

క. నక్రంబున్దుర్వాసుని
జక్రిని దూఱినటువంటి ♦ చైద్యున్నుద్ద
ర్వక్త్రుంబై యేఁచినయీ
చక్రిముఁ గనఁజాలమనిరి ♦ చకితభ్రాతల్. 129

గీ. అనిలకంపితపత్రాయి ♦ తాంగులౌచుఁ
దలఁకుచుండెడు విప్రుల ♦ దైన్యమరసి
రూక్షమార్తాండకరసన్ని ♦ భేక్షణముల

వారిఁ గనుచుండు ప్రభువుకో ♦ పంబునరసి. 130

గీ. నిమికడకునేగి నితి “కృపా ♦ నియతివీరి
నజ్ఞులనుగాచి రక్షింపు ♦ మయ్య! స్వామి!
నీకరంబులు దాఁకంగ ♦ నేమహాత్మ!
క్షతిని గల్గినబాధలు ♦ సమసిపోయె.” 131

క. అని చుబుకమంటి బ్రతిమా
లిన నిమి యాగ్రహపుదృష్టి ♦ లేశముఁబోకుం
టను గాంచి నితి భయంపడి
కనుఁగవ బాష్పములుగాఱఁ ♦ గా నిట్లనియెన్. 132

సీ. పూర్ణశిక్షార్హులె ♦ హో! వీరు గౌరాంగ;
మైనఁజెల్లునె క్షమ ♦ యంబుమఱవ?
నీయవతారమం ♦ దెన్నఁడు లోకర
క్షణముకై భీకర ♦ శస్త్రమెద్ది
ధరియింపనంటివి; ♦ కరుణతో మోహనాం
గంబుతో మనసులఁ ♦ గరఁతునంటి
సత్కృపాగళదశ్రు ♦ సందోహమునఁబాపి
కల్మషంబులనెల్లఁ ♦ గడిగివైతు

గీ. నంటి; చేసినబాసలే ♦ మయ్యెనయ్య!
యిచటఁ జక్రంబుతోఁ బని ♦ యేమి, స్వామి?
యయ్యొ! వీరు సుదర్శన ♦ హతులెయైన
నెవ్వరున్నారు రక్షింప ♦ నింకనీకు? 133

వ. అని యెంతచెప్పిన నింతయుఁ జలింపక చూచుచున్న గౌరాంగుంగని ‘యయ్యయ్యో! యిదేమివింత! పరులబాధలంగని కన్నీరు మున్నీరుగా విలపించు నీకరుణామయున కింత క్రౌర్యంబింత చలం బెచ్చటనుండివచ్చెఁ? గానీ! యింకొకయుపాయంబు వన్నెదనని యోజించి నితి యిట్లనియె. 134



గీ. మనుచుటయుఁ జంపుటయు నీదు ♦ మనసుగాని
వినుము నాపల్కు నుభయులఁ ♦ గానివధించు
టనుచితముసుమ్మి నాకు నీ ♦ యసువులిచ్చి
నది జగన్నాథుఁ డఖిలలో ♦ కాధినాథ, 135

వ. ఈమాటలకుఁ జివ్వన నితివంకకుందిరిగి ‘యేమంటి’ వని యడుగ నతండు యావద్వృత్తాంతంబు వివరించిన విని దరహాసవికసిత వదనారవిందుండై ‘జగన్నాథుండు నీకుఁ బ్రాణదానంబు సేసినాఁడా?’ యని యతనిందిలకించి టక్కులమారి గౌరాంగుం డిట్లనియె. 136

శా. అన్నా! మానితిప్రాణరక్షణము నీ ♦ వా! సేసి యుద్వేలమా
పున్నెంబుంగనినాఁడ వీఋణమెటు ♦ ల్పూర్ణంబుగాఁ దీర్పనోఁ
గన్నారన్నినుఁగాంచి యాత్రపడు నా ♦ గాటంపుఁ గౌఁగిళ్ళలోఁ
గొన్నంగాని మనంబు దృప్తిఁగనదీ ♦ కోర్కి న్ప్రసాదింపవే? 137

గీ. అని జగన్నాథుమోక్ష క ♦ ల్పాగశాఖ
లైన చేతులఁబట్టి య ♦ త్యంతకృపను
నిమి కృతాలింగనునిఁ జేయ ♦ నేలవ్రాలె
భక్తిసంభవ చిన్మోద ♦ పరవశుఁడయి. 138

క. ఇనుము లసద్భర్మంబుగ
నొనరించెను స్పర్శవేధి ♦ యోజన్మాత్రా
త్ముని భక్తపుంగవుని జే
సెను నిమి స్పృశియించి యిట్టి ♦ చిత్రముగలదే? 139

సీ. జీవితాశనువీడి ♦ జీవచ్ఛవంబయి
నిలఁబడి భీతిచేఁ ♦ బలుకలేక

యున్నమాధవునకుఁ ♦ నుదయించెఁ దరణాశ
సోదరుభాగ్యంబుఁ ♦ జూచు వెంటఁ
"ప్రజలలో నావంటి ♦ పాతకుండుండునే?
పారంబులేదు నా ♦ పాపకృతుల"
కంచుమ్మలించెడు ♦ నతఁడిప్పు డీతండ్రి
తలఁచెనే రక్షింపఁ ♦ గలఁడు నన్ను
ఆ. రూఢిగా నటంచు ♦ గాఢవిశ్వాసంబుఁ
బూని దయనుజూపు ♦ పుణ్యపురుష!
శరణుశరణు కృష్ణ ♦ జలజలోచన! యని
వ్రాలె నిమిపదముల ♦ పైఁ దెగించి. 140
వ. గౌరాంగుం డదిగాంచి నీపాపనివారణంబు నీవనుకొనునంత సులభ
సాధ్యంబుగాదని నుడువ నతం డిట్లనియె. 141
క. జనులందఱు నీపిల్లలు
చనునే నన్ద్రోసివేయ ♦ స్వామీ! హరి! నీ
తనయులలోపల నొక్కం
డనుగానే కోపమేల ♦ నాపైఁ దండ్రీ. 142
వ. అందులకు నిమి యిట్లనియె. 143
సీ. దైవపుత్రుఁడవె మా ♦ ధవ! నీవు తలఁచితే
యిదివఱకారీతి ♦ నెన్నఁడేని
నట్టులైన సోదరు ♦ లైన యీపురివారి
నేలబాధించితి? ♦ వీవె ప్రభుఁడ
వందఱకెందఱో ♦ హస్తముల్జోడించి
కొనినిల్తురి నీమ్రోల ♦ గొప్పచేసి
యట్టివారలుసూడ ♦ నర్థివై ప్రార్థింతె?



ప్రజలు నీపీడచే ♦ వనరునట్లు
ఆ. పొక్కచందమైన ♦ పొంజరీచేలంబు
మాయునట్లుపొర్లి ♦ మట్టిలోన
దిక్కులేనివాని ♦ తెఱఁగున దేవురిం
చెదవు జనులు నవ్వ ♦ సిగ్గులేదె? 144
మ. బలమున్నైశ్వర్యము నీకొసంగెదయ గో ♦ పాలుండు లోకోపకా
రులకుందోడయి వానిఁజూపుదని వై ♦ రుధ్యప్రధానుండవై
బలభాగ్యంబులులేని పౌరులఁ గడు ♦ న్బాధించి శ్రీకృష్ణుబి
డ్డలలో నొక్కఁడనంచుఁ బల్కుటకుఁ గ ♦ ట్టా! నాల్కయెట్లాడెనో!
వ. మాధవుండు కంపితకంఠస్వరుండై యల్లన నిట్లనియె. 146
క. మావాఁడు జగన్నాథుఁడు
గావంబడె నన్నుఁగూడఁ ♦ గరుణాత్ముఁడవై
ప్రోవంగదె! పాతకమా
నోవరదా యిర్వురందు ♦ నొక్కనిఁ బ్రోవన్. 147
వ. అందులకు నిమి యిట్లనియె. 148
గీ. మున్ను భక్తులు హరినామ ♦ మునువచించి
యొనఁగవచ్చిన యప్పుడే ♦ నసిగమెలఁగి
యుంటి రేఁ బాపములువ్రాయి ♦ యుండు; నట్లు
వలనుపడమినిఁ దిరుగరా ♦ వలసివచ్చె. 149
గీ. అప్పుడేని జగన్నాథు ♦ నట్లయూర
కుంటివే వానివలెనె ధ ♦ న్యుండవౌదు
వీవు దుర్భాగ్యుఁడవుగాన ♦ నినుమడించి
కొంటిపాపంబుఁ బెంకుతోఁ ♦ గొట్టినితిని. 150
క. భక్తుఁడు సాధువు సుకృతా

సక్తుఁడునితి ; మేలుఁగోరు ♦ సకలజనులకుఁ
యుక్తమెఱుంగక యాతని
రక్తమెచూపితివి నిన్ను ♦ రక్షింతునురా ? 151

వ. అంత విఫలమనోరథుండై మాధవుం డిట్లనియె. 152

గీ. ఇంక క్షమియింపుమంచు ని ♦ న్నేఁచఁదలను
దఱుగుశిక్షకు నేనియుఁ ♦ దలఁకఁగాని
నీపదాంబుజసేవయు ♦ నీకటాక్ష
మెప్పుడెట్లగు నాకది ♦ సెప్పుచనెద. 153

క. ఈమాటలు వినినంతనె
మోమునఁ దీక్ష్ణత్వమెల్లఁ ♦ బోయి యెదదయా
ధామంబుగాఁగ నిమి వా
క్యామృతములు చిల్కె నిట్టు ♦ లాతనిచెవులన్. 154

మ. అటులైన న్వినుమిత్రమా ! యిపుడు నీ ♦ యార్తుల్వెసన్బాపనా
పటిమల్వాలవు నిన్దయన్నితిక్షమిం ♦ పన్గల్గె నేనప్డు నీ
చటు లాఘుప్రకరంబుఁగూల్చుటకు నే ♦ సాయంబుగావచ్చు ; న
క్కటికంపుంజలరాశిగాఁడె నితి వే ♦ గంబేగు మచ్చోటికిన్. 155

గీ. పోయెఁ బాఱుఁడుచాప ని ♦ ర్ముక్తబాణ
మువలె నను వెంట నానందు ♦ (మోల ; కేగి
కావుకావుము నను గృపా ♦ కరయటంచు
నతని పదములపైఁబడె ♦ నశ్రులొలుక. 156

క. పరమానందంబున నితి
కరుణాన్గనఁబఱుపఁ బోవఁ ♦ గానే వడిఁద
త్కరము ల్పట్టుకొనుచు శ్రీ
వరుఁడిట్లనె నితినిజూచి ♦ వాత్సల్యమునన్. 157



సీ. ఇంతవేగమె క్షమి ♦ యించితే, మాధవుం
డాత్మదోషంబుల ♦ నల్పములుగ
నెంచి క్రిమ్మఱఁబాప ♦ కృత్యములజ్జేయు
నెట్టులో వీనిక్ష ♦ మింపవలయు
క్షమియించి కృష్ణభ ♦ క్తప్రకాండంబుల
కొరులకుఁ గలభేద ♦ ముర్విఁజాట
వలయు ; మాధవులెన్నఁ ♦ దిలకింపనీ ! “తన
పాపము ల్గడుమెండు ♦ వానిఁబాప

గీ. నేనుఁగూడను జాలక ♦ యితనినతనిఁ
దోడుగాఁగొని తారణో ♦ ద్యోగమందుఁ
జొచ్చితి” నటంచు ; నట్టుగాఁ ♦ జూడకున్నఁ
బూర్వగతికేగు మఱల శ్వ ♦ పుచ్ఛమట్లు. 158

వ. నితి యిట్లనియె. 159

మ. ధరణీనాటకసూత్రధారుఁడవు త ♦ థ్యంబీవు గౌరాంగ ! స
త్కరుణన్మాధవు నీవుబ్రోచి యతి నా ♦ కార్యంబుగాఁజూపఁ డ
క్కర్శివై పన్నద వింతతంత్రిము సరే ♦ కానిమ్ము ; మన్నించి య
క్కఱయేనిత్తు మదీయపుణ్యఫలమిం ♦ కన్వీని కబ్జోదరా ! 160

ఆ. హరి ! హరి ! హరి ! యంచు ♦ నచ్చటిభక్తులు
గొరలి నితినిబొగడి ♦ కేకలిడిరి
జయము ! జయమటంచు ♦ జనులందఱుంగూడ
హస్తములనుగొట్టి ♦ యాడిరంత. 161

గీ. రమ్ముమాధవ ! సఖుఁడ ! రా ♦ రమ్ము వేగ
యాప్తవరులకు మనకుఁ బో ♦ రాటమేల ?
ప్రజలు మనసఖ్యమును గన ♦ వలయునంచుఁ

గరములనుజాఁచి నిమివానిఁ ♦ గాఁగిలించె. 162

క. కరఁగువడిన కల్మషములు
నురుగులుగాఁగాఱె నోటి ♦ నుండి; తనసహో
దరుగతి బ్రహ్మానందముఁ
బొరసియొఱగె మాధవుండు ♦ భూస్థలినంతన్. 163

క. కోమలహృదయా! నీవీ
భూమి నమితపాపపాళిఁ ♦ బ్రోచితివి; సరే!
నామాట యేమిచెప్పెద
రామా! చిత్తార్తిచయ వి ♦ రామోద్దామా! 164

శ్రీరస్తు.

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః.

# శ్రీ గౌరాంగచరిత్రము.

## షోడశాశ్వాసము.

చ. పడవల నీఁతసేరువని ♦ పారలముంచెడు గొప్పయాపగల్
పుడమి ఫలింపఁజేసి సుఖ ♦ పుష్టినొసర్చెడుమాడ్కి మానవుల్
పడునురుదుఃఖమున్దొరగు ♦ బాష్పజలంబుఁ బురస్సుఖంబుఁ గూ
ర్చెడు నుపకారకారులఁగుఁ; ♦ జిత్రకృతుల్గద నీవిరాఘవా! 1

చ. సలిపినకీర్తనంబు పెలు ♦ చన్శ్రమపెట్టెను భక్తపాళిఁబి
చ్చిలెఁ జెమటల్శరీరములఁ ♦ జిత్తములుగ్గల గుండుసెందె ను
జ్జ్వలతర ఘర్మభానుఁడుగ ♦ భస్తిబలంబటె యస్తమించె భ
క్తులు శ్రమవారణంబుకయి ♦ కోరిరి గంగను స్నానమాడఁగన్. 2

గీ. అందఱుపవిష్టులౌచు గృ ♦ హాంతరమున
గంగకేఁగఁగఁ జూచుచుం ♦ డంగఁ దలుపు
దగ్గఱను 'స్వామి' యనెడునా ♦ ర్తస్వనంబు
వినఁబడియె నంత నెవరువా ♦ రని యడిగిరి. 3

గీ. స్వామి మేమర్థులమటన్న ♦ సరగ నేగఁ
దలుపుఁదెఱవ మురారిస ♦ త్త్వజవశాలి

మరలివచ్చి జగన్నాథ ♦ మాధవులని
విన్నవించెను నిమితోడ ♦ వినయమునను. 4

గీ. అధిపుఁడాజ్ఞయొసంగ ము ♦ రారివారి
నిర్వురను గషములయందు ♦ నిముడిచికొని
తనుబలంబునఁ దనకంటెఁ ♦ దక్కువయని
తెల్పనోయన నిమిర్మోలఁ ♦ దెచ్చియునిచె. 5

క. గౌరాంగుఁ జూచినంతనె
వారలు రక్షింపుమమ్ముఁ ♦ బాపాత్మకులఁ
గారుణి కాగ్రణియని క
న్నీరొలుక నోసెలిపడిరి ♦ నేలన్వ్రాలిఁ. 6

వ. అంత గౌరాంగుఁడు నితివంకఁజూచి యిట్లనియె. 7

శా. శ్రీపాదా! పరితప్తచిత్తులయి న ♦ న్జేరంగనేతెంచి రీ
పాపుల్; వీరల నీకొసంగెదను నీ ♦ వారాటచే; వీరలఁ
గాపాడన్వలెవేగ; పూతజలగం ♦ గన్ముంచి కర్ణంబులం
బాపోద్ఘాటక దివ్యభవ్య హరినా ♦ మంబూఁదుమోమిత్రమా! 8

వ. అపారప్రేమార్ద్రహృదయుం డగుశ్రీపాదనిత్యానందుండు డీమాధవజగన్నాథులం గొనిపోవుతఱి వారితోఁబల్కిన యనుకంపామేదుర వాక్యంబులు శ్రీ గౌరాంగదేవు చరిత్రంబులయందు గీతరూపంబుగా నిట్లు గానంబడియెడు. 9

ద్వి. రండుసోదరులార! ♦ రండు జాహ్నవికిఁ
గొండు శ్రీహరినామ ♦ కుసుమాసవంబు
గుండెపెంకున నన్నుఁ ♦ గొట్టితినంచు
గుండె చిల్లులువాఱఁ ♦ గుందకుమయ్య!
సంతోషనృత్యము ♦ ల్సల్పుచుఁ బుణ్య



వంతమౌనదికిరా! ♦ వడిగ మాధవుఁడ!
యంతమాత్రముననే ♦ హరిభక్తినేర్పి
సంతసంబిడుటకే ♦ సందేహపడను
భాండఖండముతోడ ♦ ఫాలంబుఁగొట్టి
దుండగంబున నాకుఁ ♦ దొందరసేయు
చండుని పై పగ ♦ ల్సాధించుటఁగన
ఖండభక్తియుఁ బ్రేమ ♦ గలుపుచేసుమ్మి. 10

గీ. మృతకళేబరముల యట్లు ♦ మేదినిపయిఁ
బడిన యిర్వురఁజేతుల ♦ పైనిబెట్టి
కొని మహాభక్తులు నిమితోఁ ♦ జనిరి గంగ
కార్భటిని నృత్తగీతవా ♦ ద్యములతోడ. 11

గీ. బొబ్బలిడి విష్ణుగానంబుఁ ♦ బొనరుచుటకు
నాడుటకు లజ్జపడరు గౌ ♦ రాంగుచెంత
నతనిభక్తులు; డెబ్బది ♦ యేఁడుదాటి
నట్టి యద్వైతుఁడుంగూడ ♦ నట్లెసేయు. 12

క. గంగకడకుఁజని యందు ము
నుంగం భక్తాళిసారఁగ ♦ నూల్కొని మొదలు
ప్పొంగ న్విప్రవసహోదరు
లుం గూడంజొచ్చిరి నది ♦ లోనంగ్రుంకఁ. 13

సీ. మిత్రుల బుజముల ♦ మీఁదను నిలుచుండి
కుప్పించి నీటిలోఁ ♦ గూలువారు
జలములమున్గి యు ♦ చ్ఛ్వాసించి బుడబుడ
మను ధ్వనుల్గావించి ♦ యలరువారు
కాళ్లువట్టుకలాగి ♦ నీళ్లలోఁ బడఁద్రోసి

యయ్యకు 'దాసోహ' ♦ మనెడువారు
మోములపైనీళ్లు ♦ మోఁది దోసిళ్లను
క్కిరిబిక్కిరినిగొల్పి ♦ కేరలువారు
గీ. హరిహరీయనిపడి యీఁత ♦ లాడువారు
భక్తు లిట్లమితానంద ♦ యుక్తి, స్నాన
మాడుచుండిరి చంద్రోద ♦ యసమయమున
బాలు రట్టులు గంగ గ ♦ గ్గోలువెట్టె. 14
ఉ. కేకలఁజల్లులాటలను ♦ గోణియొనర్చెడు మాటలన్నుతా
నేక ముకుందసంస్తుతుల ♦ నెంతయు భక్తులు చాలకాలమా
దాఁకఁ జెలంగి స్నానపరి ♦ తాంతులుగాఁగ శచీజుఁడంతనే
దోకయి సన్నసేసెఁ; గని ♦ యూరకనిల్చిరి భక్తులందఱున్. 15
ఆ. చాలమందిజనులు ♦ జరుగుచిత్రంబులు
గాంచు కౌతుకమున ♦ గంగయొడ్డు
పైనినిలిచియుండి ♦ పరికించుచుండిరం
త నిమి నితినిబిలిచి ♦ యనియెనిట్లు. 16
మ. పరితాపంబునఁ గుందువీరలను నీ ♦ పాల్సేయుదున్సోదరా!
హరినామంబిడి వీరిఁ బ్రాతులుగఁజే ♦ యంబూను శ్రీపాద! దు
ర్భరపాపౌఘము లెన్నియున్న ననుకం ♦ పాపూర్ణ కృష్ణాఖ్యతా
హరియింపంగలదంచుఁ జాటవలెన ♦ య్యా! లోకమందంతటన్
గీ. నడుమ గౌరాంగుఁడాతని ♦ యెడమపక్క-
నితియుఁజుట్టును భక్తులు ♦ నిమియెదుటను
మొగుడుకై దామరల విప్ర ♦ యుగమునిట్లు
లోలసి మొలబంటి నీటిలో ♦ నిలిచియుండ. 18
వ. గౌరాంగుండు గంభీరభాషణంబుల నా మాధవజగన్నాథులతో ని



ట్లనియె. 19
మ. కులశీలంబులు బుగ్గిలోఁగలపి సం ♦ కోచింప కాజన్మముల్
ఖలకార్యంబులొనర్చి, చేసితి రసం ♦ ఖ్యాకంబులౌ పాపముల్
గలఁడే వీని భరించిపోఁజుటకు నో ♦ క్కండేని నాదోషముల్
దొలఁగంబాఱినఁగాక కావుగదపూ ♦ తుల్మీరు సేయుండిటుల్. 20
క. చెలులారా! గంగోదక
తులసీతామ్రములమీఁదు ♦ తోరపుఁ బాపం
బులనన్నిటి నాయీకర
తలమున నీపుణ్యానదిని ♦ ధారవిడువుఁడీ. 21
వ. ఈభీకర గభీరవాక్యంబుల కందఱు నివ్వెఱపడి పిడుగువడినట్లు నిశ్చే
ష్టితులై మిన్నకుండ మాధవజగన్నాథులు ధైర్యంబువీడక బద్ధాం
జలులై యిట్లనిరి. 22
గీ. అధిప! నెఱవేర్పలేనట్టి ♦ యీయాజ్ఞ యిడకు
కుస్వార్థదుర్ఘోర ♦ పాతకులమె
ని యింతటిపని కోడి ♦ కట్టునట్టి
స్వార్థపరనీచ చిత్తుల ♦ మయ్య! మేము. 23
క. అనుమంత నెంబళి! శ్రీహరి!
యని భక్తులు కేకలిడిరి ♦ వైనన్నిమి, చె
ప్పినయట్లు చేయవలె వల
దనుమానమటంచు వెండి ♦ యాజ్ఞయొసంగెన్. 24
వ. అందులకు విప్రసోదరు లేమియుంజేయలేకిట్లనిరి. 25
మ. క్షమియింపన్వలె దేవదేవ! సకల ♦ క్ష్మాలోకమామోదవ
త్కమనీయప్రసవోరు మాలికలతోఁ ♦ గైసేసి పూజించు నీ
రమణీయాంగము వానికేమెటులు ని ♦ ర్దాక్షిణ్యత న్సిగ్గులే

ఈ మహాపాప దురంతదుఃఖములు కా ♦ న్కల్వెట్టనా నయ్యయో!

క. దరిలేని నరకబాధల
భరియింతుముగాని తప్త ♦ భర్మాంగ! మహా
దురితాత్ముల యఘములలో
నొరసేనియుఁదాఁకనీము ♦ నిన్ను మహాత్మా! 27

ఉ. అందులకు న్శచీజుఁ డిసు ♦ మంతయు నీకొనకుంటసూచి యా
నందుఁడు మందహాసవద ♦ నంబునఁ బాలురయొద్దకేగి యీ
సందియమేలపొందెదరు ♦ సల్పుఁడి చెప్పినయట్లుకూడ వీ
కొందలపాటు లేమియును ♦ గోపకుమారుని సమ్ముఖమ్మునన్. 28

సీ. పాపంబులు హరించి ♦ పతితపావనబిరు
దంబొందఁజేయు సా ♦ ర్థకతనిపుడు
మీమూలమున నిది ♦ మేదిని బ్రకటితం
బౌను సోదరులార! ♦ యాలసింప
కింతయుఁ గొంకక ♦ యేలిక సెప్పిన
చొప్పునఁజేయుఁడు ♦ చెప్పి నాతఁ
డెవ్వఁడో యదిమాత్రి ♦ మెంచిచూడుఁడు దాన
నెదలోనిసందియం ♦ బెగసిపోవు

గీ. మీకలుషములెకా వెల్ల ♦ లోకకల్మ
షములు గూల్చెదుశక్తి యీ ♦ నిమికిఁగలదు
మలినతనుజెందఁ డతఁడు; స ♦ మస్తవస్తు
శోధకాగ్నిని మురికిదా ♦ సోఁకఁగలదె? 29

వ. అని పల్కిన. 30

సీ. మాధవుండును జగ ♦ న్నాథుండు నితిబోధ
నములకు నీకొని ♦ నిమియెదుటను



నిలఁబడి తోయము ♦ ల్తులసీదళంబులు
దక్షిణయుంగొని ♦ తండ్రిఁ దాత
గోత్రంబుఁ గులమును ♦ సూత్రంబు వేదంబు
నుడివి యథావిధి ♦ విడిచి రాత్మ
కృత మహాఘోరాఘ ♦ వితతులు పతితపా
వనుఁడు సాఁచినకరం ♦ బునను భక్తి;

గీ. దాతలిటుసల్ప నాగ్రహీ ♦ తయును శాస్త్ర
విదితమార్గంబులను లేని ♦ పితనుదాతఁ
జదివి కైకొంటి మీపాప ♦ సమితినంచు
ఘనఘనారవ సదృశవా ♦ క్యములఁబలికె. 31

మ. నిమి బంగారపుదేహమంత నల్లుపై ♦ నిల్చెన్నిమేషంబు కే
తుమహాగ్రహ నిరస్తతేజ కరఖ ♦ ద్యోతప్రతీకాశమై;
యమలాభోజ్జ్వలమయ్యె వెంటనది; ని ♦ త్యానందుఁడున్వారి శ్రో
త్రముల న్శ్రీహరినామమున్నొడివె; నం ♦ తన్బోయె విప్రాఘముల్.

గీ. అంత గౌరాంగునింటికి ♦ నరిగిరంద
ఱచట హరికీర్తనముసేయ ♦ నవనిసురులు
పూతులైరని నితియాత్మఁ ♦ బొంగిపొంగి
నాట్యమాడంగఁదొడఁగెను ♦ న్మత్తుపగిది. 33

వ. జరిగిన హరికీర్తనంబున భక్తిపరవశులై సంతోషంబు పట్టఁజాలక నందఱాడందొడంగిరి. వారితో మాధవజగన్నాథులుంగూడఁగలిసి నర్తనంబులు గావించిరి. తన్నర్తనంబులుసూచి ప్రజలుసెందిన యాశ్చర్యం బిప్పటికి నుత్తరదేశంబునఁ బాడఁకొను నీగీతంబునఁ గానంబడియెడు. 34

ద్వి. తనువులుమఱచి మా ♦ ధవజగన్నాథు

లనుపమభక్తి నృ ♦ త్యములుగావింత్రు
నర్తింపఁగా జగ ♦ న్నాథుఁడౌనేమొ
ధూర్తుఁడీమాధవ ♦ దుష్టరాక్షసుఁడు
పరమభాగవతులై ♦ పడి నెట్లు కూడి
హరిభక్తిమగ్నుఁడై ♦ యాడుచున్నాఁడు
ధారణినిట్టి చి ♦ త్రములు చూచితిరె?
గౌరాంగుచేఁతల ♦ క్కజములుగావె? 35

క. ఆఁగెను గీర్తన; మందఱు
నేగిరి తమయిండ్లకైన ♦ నేగక శ్రీవా
సాగారంబుననుండె వి
రాగుండయి మాధవుండు ♦ రాత్రియుఁ బవలున్. 36

ఉ. కూరుకుతోరెమున్దొఱఁగి ♦ కుంఠితచిత్తత మాధవుండు ల
క్ష్మీరమణుండు చూపిన య ♦ మేయకృపన్గొనఁదాన నర్హుఁడన్
భీరుత నేకధారగను ♦ వీక్షణరోధక బాష్పసంతతుల్
గాఱఁగనేడ్చుచుండె నది ♦ గాంచి తపించిరి మిత్రులందఱున్. 37

వ. నితి శ్రీవాసప్రముఖులు దగ్గఱకుఁజని దుఃఖోపశాంతికరణోద్యుక్తులై యిట్లనిరి. 38

శా. అయ్యా! మాధవ! యేలయేడ్చెదవు గౌ ♦ రాంగుండునీపాపముల్
ద్రయ్యంజేయఁగనైతి పూతుఁడవు ని ♦ ద్రాభుక్తులన్మాని య
య్యయ్యో! పూచికపుల్లవయ్యెదవు స ♦ ర్వాఘంబులు న్స్వామిపా
లయ్యెన్గౌనె నాతఁడవ్వి యిఁక శాం ♦ తాత్ముండవై యుండుమా!

వ. దానికి నితితో మాధవుం డిట్లనియె. 40

క. హృదయాశుగమై గురువర!
యిదియే నన్నేఁచుచున్న ♦ దీలోకేశుం



డదయుత నన్నీక్షించినఁ
గదురదు నాకెన్నఁడిట్టి ♦ కష్టంబకటా! 41

క. నాకోస మీమహామహుఁ
డీకనకోజ్జ్వల శుభాంగుఁ ♦ డీకరుణాళుం
డాఁకపడి నాయకంబులఁ
గైకొని యయ్యయ్యొ! యేల ♦ గాసిలవలయున్. 42

క. ఏపాపంబులకైనను
రూపఱుమార్గంబుగలదు ♦ రుచిరాంగకృపా
వాపికి నిమికేఁజేసిన
పాపంబునకో మహాత్మ! ♦ పారముగలదే? 43

క. ఈరీతిఁ బొగులుచుండుట
యూరసి నితి నిమికిఁజెప్పె ♦ నంతటఁ గరుణా
వారాశి సాశ్రులోచనుఁ
డైరయమున నాతఁడుండు ♦ నచటికినేగెన్. 44

ఉ. పెట్టినభోజ్యవస్తువులు ♦ పెట్టినయట్టులెయుండ మ్రోలఁదాఁ
దొట్టెడుబాష్పపూరముల ♦ తోఁ దపియించెడు మాధవున్గనిన్
దట్టి శచీజుఁడిట్లనియె ♦ "దారుణకృత్యము సేయఁజెల్లునే?
గిట్టెడెయన్నమున్దినక? ♦ కీర్తినిజెందదె యాత్మహత్యచేన్. 45

క. నీపాపంబులనన్నిటిఁ
బాపంగాలేదె మాధ ♦ వా? నుడువుమె వే
లోపములున్నం; బూర్తిగఁ
దాపాపనయంబొనర్తుఁ ♦ దక్షణముసఖా! 46

మ. సతతానంద నిమగ్నచిత్తుఁడగు నీ ♦ సద్భక్తుఁ డానందుఁడా
తత దుఃఖాబ్ధిమునుంగు నీవెడఁగుచేఁ ♦ తలూఁచి, నీఘోరదు

ర్గతులన్బాపిన పుణ్యపూరుషుని దుః ♦ ఖంబైనయోజించి యూ
ర్జితచేతఃకలితుండవై వదలు ని ♦ శ్శేతువ్యథల్ మాధవా! 47

వ. అందులకు మాధవుం డిట్లనియె. 48

సీ. చెప్పెదవినునాదు ♦ చింతకుఁగారణం
బర్థంబులందుత్త ♦ మార్థమంది
నాఁడ; నెఱుంగుదు ♦ నాపాపమంతయుఁ
బోయినదని కాని ♦ పొంగిపొంగి
గంగాతరంగ సం ♦ ఘంబుమాడ్కినివచ్చి
గుండెనుగొట్టు ప్ర ♦ చండశోక
బాష్పంబులడఁప నా ♦ వల్లఁగాకున్నది
నాదుఃఖహేతువు ♦ నీదుకృపయె

ఆ. పారరహిత పాప ♦ పంకిలుండనునేను
నీవు నిర్మలత్వ ♦ నిధివి; నన్నుఁ
బ్రియతనూజువలెను ♦ వీక్షింతువీదుష్టుఁ
డంత ప్రేమమునకు ♦ నర్హుఁడయ్యె? 49

ఆ. ఘోరపాపములకుఁ ♦ గ్రూరశిక్షను జేసి
యుంటివేని నింత ♦ యుమ్మలింప
నిట్లునాకు నీవు ♦ కృపసూపినకొలంది
వెల్లివిరియులోని ♦ వెతమహాత్మ! 50

క. కనుఁగొంటినిపుడు పాపులఁ
బనిగొని శిక్షించుకంటె ♦ పరమసుఖదమో
యొనసితినిగాని నీకృప
ఘనమయ్యెను శిక్షకంటెఁ ♦ గరుణయె దేవా! 51

క. ఎదుట గౌరాంగుఁడుండిన



మెదుకుల్దిను శోకము దిగ ♦ మ్రింగి; యతండిం
కెదుటన్లేకున్న వచిం
పఁ దరముగానట్టి వంత ♦ మాధవుఁడు వడుక్. 52

క. ధారాళముగా నాతఁడు
గౌరాంగునితోడఁ బల్కఁ ♦ గాఁజంకిన న
వ్వారి నితితోడ నిట్లులు
గూరిమిమెయిఁ బల్కుహృదయ ♦ కుహరస్థార్తుల్. 53

క. కామాదివికారములకు
ధామంబై పుణ్యవృత్తి ♦ తతిరహితంబై
నామనసు చచ్చియుండఁగ
స్వామి సజీవంబుఁజేసెఁ ♦ జచ్చినదానిన్ 54

క. నను నాపాపవ్రాతముఁ
గొని నిమి యటుసేసెఁగాని ♦ గురువర! ప్రాణం
బెనసిన నామనమిప్పుడు
కనఁబడిచెడు నవ్వియేవో ♦ కట్టా! యెఱుఁగుదే? 55

సీ. మత్పూర్వకృతకార్య ♦ మండలంబందొక్క
టేనియు సంతసం ♦ బిచ్చి ధైర్య
ము నొసంగునది లేదు ♦ మొదటినుండియు స్వార్థ
పరుఁడనై మహితపా ♦ పనివహంబు
నార్జించుకొంటి; మ ♦ ద్యవిగతస్మృతి చేత
నెన్నిదుష్కార్యంబు ♦ లేను జేసి
నాఁడనో యెందఱిఁ ♦ బాడుచేసితినో పూ
ర్ణంబుగాఁ దెలివికి ♦ రాకయున్న,

గీ. నందుఁ గొన్నికనఁబడుఁ బ్ర ♦ త్యక్షముగను

బ్రతి దురితకార్య మాకృతిఁ ♦ బడసివచ్చి
బల్లెములు శూలములుగొని ♦ బలిమి మర్మ
భాగములయందుఁ బొడిచెడు ♦ పగిదిఁదోఁచు. 56

చ. చెఱపినస్త్రీలుఁ దండ్రిలున ♦ శించినబిడ్డలు నాసికాదులన్
దఱిగినదీనులు న్దహన ♦ దగ్ధగృహార్థపదార్థరాసులున్
ఖరతరదృష్టి నాకనుల ♦ కట్టెదుట న్గనిపింపనక్కటా!
గురువర! స్వస్థతన్గనునె ♦ గుండెలు? కంటికి నిద్రవచ్చునే? 57

ఆ. నేను బాధవెట్టి ♦ కానిపనులుసేసి
నట్టిమనుజకోటి ♦ యయ్యొ! యిప్పు
డెట్లు కాలదూత ♦ లట్లు భీకరవీక్ష
ణములనిలుచు నాదు ♦ సముఖమందు? 58

ఆ. సమయఁజేయఁజూచు ♦ జాగ్రదవస్థ; యా
బారినిద్రవోయి ♦ పాపుకొందు
నంచుఁ గునుకస్వప్న ♦ మందునఁ గనఁబడుఁ
బూర్వదురిత భయద ♦ మూర్తులకట! 59

శా. గౌరాంగుండిట నాకుఁజేసిన మహా ♦ ఖ్యాతోపకారంబిఁక
వ్వారిన్నేల్పవలొక్కరీతిఁ గనుల ♦ న్బాష్పంబులన్రాల్చి దుః
ఖోరు శ్వాసములూర్చు శక్తినిడుటే! ♦ యొక్కింత గన్నీళ్లదు
ర్వారంబౌ వెతతగ్గ; లేనియెడఁ బా ♦ పజ్వాల నన్నేర్చదే! 60

క. అంత స్తాపానలమున్
శాంతింపఁగఁ జేయనోసఁగెఁ ♦ జల్లనిదృక్షి
ప్యక్రాంతాంబుపూరములు; నిమి
యంతటి పుణ్యాత్ముఁడవని ♦ యందుంగలఁడే? 61

వ. అని వెక్కివెక్కి యేడ్వంజొచ్చె. 62

సీ. విషపదార్థముదిన ♦ వెలికివచ్చును దొల్త
వాంతితో; నదెయల ♦ వాటుపడిన
నేదియే నౌషధ ♦ మిచ్చి విషంబంతఁ
గ్రక్కింపవలెఁ; జిర ♦ కాల కృతవి
శేషపాపాకీర్ణ ♦ చిత్తమాలిన్యంబు
వెలుపలికింగొట్ట ♦ విశ్వవిభుఁడు
మాధవునకుభక్తి ♦ మందిడె; నద్దాన
లోనికల్మషరాశి ♦ లోచనాంబు

ఆ రూపమునను బైకి ♦ రోదనమైవచ్చె;
దానివలనబాధ ♦ తగ్గుచుండెఁ;
బాపకార్యజన్య ♦ పరితాపమిల్లై లో
కమునకెంతయొ యుప ♦ కారియగును. 63

వ. మాధవుండు వెండియు నిట్లనియె. 64

మ. అపచారంబులొనర్చి నేను బహుబా ♦ ధాయత్తులన్జేసిన
ట్టి పవిత్రాత్ముల యార్తిరావములుఁ గుం ♦ ఠీభూతదీనాస్యముల్
గృపయింతేనియు లేక పట్టుదలతోఁ ♦ గీడ్పాటునొందించి న
న్నపుడు న్రాపిడివెట్టు; నేబ్రదుకుటె ♦ ట్లింకిభువిన్దేశికా. 65

వ. అని పొర్లిపొర్లివచ్చు దుఃఖంబాఁపికొని మఱల నిట్లనియె. 66

శా. ఈబాధల్భరియింపఁజాల నితి! యిం ♦ కేరీతి హృచ్ఛాంతియౌ?
నేబాధించినవారినంటఁ గడు ♦ న్దీనుండనై ఫాలభా
గాబద్ధోభయపాణుల న్క్షమకునై ♦ ప్రార్థించి ప్రాపించి చే
తోబాధాతతి యంతటన్జనునొ! హో ♦ దో! యప్పు, డేఁజూచెదన్.

ఆ. ఎవ్వరట్టివార ♦ లెందఱెచ్చటనున్న
వారలయ్యొ! యనుచు ♦ వనరివనరి

మాధవుండు గుండె ◆ మహితప్రయత్నము
సలిపి దిటవుచేసి ◆ పలికెనిట్లు. 68

ఆ. స్నానఘట్టములకుఁ ◆ జని యటకేతెంచు
బాలవృద్ధపురుష ◆ వనితలచర
ణములకెఱఁగి నన్ను ◆ క్షమియింపుఁడనియేడ్వ
గురువరేణ్య! మనము ◆ గుదురుపడదె? 69

ఆ. అట్లుసేసితేని ◆ నడఁగునీచింతలు
మాధవా! యటంచు ◆ మాన్యుఁడైన
నిటువచింప నతఁడు ◆ నెట్టనశ్రీవాసు
గృహము వెడలివచ్చెఁ ◆ గృశతదోఁప. 70

చ. ఘనతరదుఃఖమాస్యమునఁ ◆ గన్నులబాష్పము లుప్పతిల్లఁ బ
త్తనమునఁ బాదచారియయి ◆ దైన్యమునన్జను మాధవున్బురీ
జనతతిగాంచి పెద్దపులి ◆ సచ్చిననొద్దకుఁ బోవలేని స
త్వనిచయమట్లు మూఁకలుగ ◆ వచ్చినిలంబడె డవ్వుదవ్వులన్. 71

చ. శిరమునువంచి యాత్మ నిమి ◆ సేవను జేయుచునేగు విప్రుద
గ్గఱకరుగంగలే, కవని ◆ కంటకుఁ డెప్పుడు చచ్చునెప్పు డం
దఱకును బందువౌనని జ ◆ నంబులుదూఱిరి కాని యొక్కఁడే
నెఱుఁగఁడు దొంటిమాధవుని ◆ కిప్పటియాతనికుండు భేదమున్. 72

గీ. వెంటఁబోయెడు పురజన ◆ వితతిలోన
నొకఁడు గోపంబుఁబట్టఁజా ◆ లక యొకశిలఁ
గొని విసరివైచె, నది మాధ ◆ వునికిఁదగిలి
త్రిప్పి చిత్తంబుఁ దెలివికిఁ ◆ దెచ్చెనతని. 73

వ. మునుపటియాతఁడేనితను ◆ ముట్టినవానిఁ గృతాంతమందిరం
బున కతిథింబొనర్చు; నటు ◆ పుచ్చక మాధవుఁడాత్మపాపవ



ర్తనములకు న్విధింపనగు ◆ దారుణశిక్షను స్వల్పమాత్రదం
డనమిదియంచునెంచి యెల ◆ నవ్వొలయించెను శాంతిమూర్తియై.

గీ. రాయి చేఁగొనివిసరిన ◆ రాలుగాయ
మహితపరితాపనిస్తేజ ◆ మాధవాస్య
మించుకేక్షించెనే నట్టు ◆ లెట్లుసేయు?
వెనుకకరుగదె కొట్టఁబో ◆ యినకరంబు? 75

శా. గంగాతీరముమీఁదనుండి యటమూఁ ◆ కల్గట్టినిల్చున్నవా
రింగన్నిళ్లనుగాంచి మాధవుఁడు పే ◆ ర్మిన్జేతులన్మోడ్చి ప
ల్కెం గంపావిలకంఠనాదమున నీ ◆ లీల "న్గటా! వీటియం
దుం గొత్వాలుగనుండి గర్వితుఁడనై ◆ దుష్క్రియల్సేసితిన్. 76

క. పూతులఁ బెద్దలమత్పద
ఘాతంబులపాలుసేసి ◆ బాధించితి నీ
పాతకు మీచరణంబుల
చేతన్స్పృశియించి పూతుఁ ◆ జేయరె మీరల్" 77

వ. ఇట్లు కేవల క్రూరరాక్షసుండును మహామదాంధుండు నను ప్రతీతిఁ
గాంచిన మాధవుండాడు పలుకులకు నివ్వెఱఁగుపడి యాతనిపై కో
పంబువోయి యుందఱు సదయస్వాంతులై యున్నంత మఱియొకం
డచ్చటికి స్నానార్థంబరుదేరఁగాంచి మాధవుం డాతనిచరణంబుల
పైఁబడి యిట్లనియె. 78

మ. కరుణాసాగర! నీకునేనపకృతు ◆ ల్గావించినానేమొ నే
నెఱుఁగ న్హీనుఁడఁ బాపకర్ముఁడను స ◆ ర్వేశుండు రక్షించున
న్నరితి న్నీరుక్షమించినామనిన న ◆ య్యా! నన్నుమన్నించి నీ
చరణంబీతలపైనిబెట్టి మదఘ ◆ జ్వాలాళిఁ జల్లార్పవే? 79

క. ఆతఁడు నిశ్చేష్టితుఁడయి

యీతనికిఁ బిచ్చివట్టె ♦ నేమో! లేకీ
రీతి న్గేలియొనర్చెడి
నో! తెలియదటంచు నెంచి ♦ యూరకయుండెన్. 80

వ. ఆకళవళంబుఁ గాంచి మాధవుండు వెండియు నిట్లనియె. 81

గీ. అఖిలపాపహరణచణ ♦ మైనతనదు
సత్కృపాబలమునుజూప ♦ శచితనయుఁడు
పాపకర్ములలో మహా ♦ పాపియైన
యీమురాత్ముని నన్నుఁదా ♦ నెంచికొనియె. 82

గీ. స్వామినిరవధికానుకం ♦ పాసమేతుఁ
డతనికరుణకు లోఁగని ♦ యఘము లేదు
వానిచేఁ బూతుగాఁజేయఁ ♦ బడఁగలేని
ప్రాణిలేదంటకేని తా ♦ ర్కాణఁజుమ్మి. 83

చ. కనులకు దర్శనీయమగు ♦ కాయము నాసకు హాయిఁగొల్పు స
త్తనుగతసౌరభంబు నమృ ♦ తప్రతిమానవచోవిలాసముల్
జనతతి దుఃఖమార్పఁగల ♦ శక్తియు సత్త్వమయాంతరంగముల్
గని విలసిల్లుచుండ్రు ధరఁ ♦ గంజదళాక్షుని భక్తరత్నముల్. 84

క. ఇలలోపల నివసించెడు
ఖలులం దతినీచదుష్ట ♦ కర్ముఁడితఁడు భ
క్తులలో నురుభక్తుండయి
వెలసెనటులె చిత్రమింక ♦ వేఱుగఁగలదే? 85

క. తనచేతులతోఁ బాఱను
గొని స్నానాగతజనాళి ♦ కొఱకొకఘట్టం
బునుగట్టె మాధవుండది
పెను పదునిప్పటికి నతని ♦ పేరన్బరిలోన్. 86



క. మాధవుసంతతివారుర
మాధవుఁడై నట్టినిమిని ♦ మదిఁగొల్చుచుఁ బు
ణ్యాధికులయి జనవందిత
సాధువులయి జీవయాత్ర ♦ సలిపిరిధాత్రిన్. 87



క. ఇహపాపకర్మసంచయ
తుహినస్తోమంబుఁబట్టి ♦ త్రుంపఁగజగతీ
మహితోపకారకరభవ
దహీనదయ సూర్యరశ్మి ♦ యాఁగా! రామా! 88



శ్రీరస్తు.

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః.

# శ్రీగౌరాంగచరిత్రము.

## సప్తదశాశ్వాసము.

ఉ. నీకృపచేత ముక్తిఁగన • నిర్మలమానస సత్యశీలముల్
ప్రాకటభక్తిగావలయు • వర్ణము శోభనిలేదు శ్రౌతక
ర్మైకపరాయణోత్తమ మ • హీసురమండల మల్లభక్తిపె
న్నాఁక, కబీరుతోడ సరి • వచ్చునె యెన్నటికేని రాఘవా! 1

శా. శ్రీగౌరాంగునిపాదపద్మములు సం • సేవింపుచు న్భక్తపు
న్నాగఖ్యాతి మహానురక్తిని జగ • న్నాథుండుఁ దద్భ్రాతయున్
రాగిల్లంగని మోక్షకాంక్షఁ బురమా • రక్షుల్విశేషంబుగా
మూఁగన్వచ్చిరి శిష్యులౌట కతఁడం • భోజాక్షుఁడన్బుద్ధితోన్. 2

సీ. కుష్ఠాదిరోగులు • గ్రుడ్డివారును గుంటి
వారు బారులుదీర్చి • బాటప్రక్క
స్వామి యింటికివచ్చు • సమయమారసి కూరు
చుండి యాతనిజూచి • నిండుభక్తి
శ్రీహరీ!' యని మ్రొక్కఁ • జెచ్చెర నీరోగ
దేహులైపోదురు • గేహములకు



నీశక్తి భక్తుల • కిచ్చె శచీజుఁడు
వారు నీరీతిని • స్పర్శమాత్ర
ఆ. జనులదుఃఖములను • సమయించి లోకోప
కారకరణములను • గ్రాలుచుండి
రిద్ధిపూర్వభక్త • కృతమైన యీక్రింది
దివ్యగీతమునను • దెలియవచ్చు. 3

ద్వి. అలనవద్వీపంబు • నందకలంక
జలజారియుదయింపఁ • జటులతమంబు
గలఁగఁబాఱుచువిచ్చెఁ • గడుఁజిత్రముగను
దళితశోకాత్ములై • ధరలోనిపురుషు
లానందమున నోల • లాడుచున్నారు
కానని పొండ్రిను • గలుషచిత్తులును
గుంటివారును మహా • కుష్ఠార్తులధిపు
వెంటవత్తురుగదా! • పిండులుగట్టి. 4

ఆ. భక్తసంచయంబు • బహుళమౌకొలఁదిని
మిశ్రసూతికీర్తి • మించఁగొలఁది
నగరిలోని బ్రాహ్మ • ణప్రకరంబుల
యీర్ష్యద్వేషబుద్ధి • హెచ్చుచుండె. 5

మ. హరినామామృత మెల్లవారలన నా • యాసంబుగాఁ గ్రోలఁజే
సి రమాకాంతునిభక్తి శాశ్వతముగాఁ • జేకూర్చి సంసారని
స్తరణానందమునిచ్చు మిశ్రజునిచేఁ • దల్లూచి స్వోత్కర్షసం
హరణోద్వేల భయార్త భూమిసురులీ • ర్ష్యాగ్రస్తులై రెంతయున్.
గీ. స్వామి స్వాచరణమె ముఖ్య • సాధనముగఁ
జేసికొని హరిభక్తులఁ • జేసెజనుల

నెవ్వఁడే ముక్తి నెనయుట ♦ యెట్టులనిన
నిత్య హరినామసంస్మృతి ♦ నియతిననును. 7

ఉ. గోపకుమారకీర్తనల ♦ కుంఠితభంగినెసంగె నానవ
ద్వీపగృహంబులందు; నిమి ♦ దివ్యతమప్రభఁ గాంచి యాతసిన్
రేపునుమాపు నెందఱోపు ♦ రింగల ముక్తిపరుల్ చిరార్తసం
తాపకరాఘసంఘహాన ♦ నంబునకై దరిసింతురర్థులై. 8

సీ. కృష్ణుఁడై తనవారి ♦ కింగల భక్తిసం
దేహంబులను బాపు ♦ దివ్యలీలఁ
దనుఁజేరువారల ♦ దార్ఢ్యంబుఁబట్టియు
నధికార తారత ♦ మ్యంబుఁబట్టి
సత్కర్మపరిపాక ♦ సరణిఁబట్టియుఁ దత్త
దనుకూలతరణ సా ♦ ధనములొకని
కొకరీతి మఱియొక ♦ నికి మఱియొకరీతి
గౌరాంగుఁ డతికృపఁ ♦ గఱపుచుండు

ఆ. నిట్లు దేహతత్వ ♦ మెఱిఁగి వైద్యుఁడు రోగ
ములను రూపుమాపి ♦ పూర్ణదేహ
సౌఖ్యమొసఁగునట్లు ♦ శచిబిడ్డ వివిధమా
ర్గములనెల్లరకిడె ♦ నమృతభిక్ష. 9

గీ. ఒకనికాహారమైన దిం ♦ కొకనికి విష,
మిపుడు ఘోరవిషంబైన ♦ దింకొకప్పు
డమృతసన్నిభ, మాను ము ♦ క్త్యర్థభక్తి
విహితగురులసదుపదేశ ♦ విషయమందు. 10

గీ. లోఁతుగాఁ ద్రవ్వకొలఁదిని ♦ శీతరుచ్య
బహుళతరజలమగునట్టి ♦ బావిపగిది



కెంతలోఁతున కేగిన ♦ నంతసుఖము
నొసఁగు హరిభక్తిభక్తుల ♦ కుర్విలోన. 11

మ. నిమియేద్వైత మతండెసద్గురువు తం ♦ డ్రిన్వాఁడె పౌరాళి, కు
త్తమవిద్యాకరమైన పట్టణము భ ♦ క్తస్తోమ సంకీర్ణమై
విమలానందరసప్రవాహమయి కా ♦ న్పించె న్మహావిష్ణులో
కము భూలోకమునందు నున్నపగిది ♦ న్గౌరాంగుఁ డందుంటచేఁ.

క. ఇదియంతయు స్వార్థపరుల
యెదలీర్ష్యల నెనయఁ జేసె ♦ నెంతయుఁ బురిలో
నొదవిన యీయాపదయెటు
వదలిచనునటన్న చింతఁ ♦ బడిరవ్వారల్. 13

క. క్రోధి జగన్నాథుండును
మాధవుఁ డిపుడుండిరేని ♦ మనవెపున నీ
బాధసను తెప్పపాటున
నాథుండెవఁ డింకఁ బట్ట ♦ ణస్థులకకటా! 14

క. వారిని దనపక్షంబును
జేరంగాఁ జేసికొనియె ♦ జిత్తులకిరవౌ
గౌరాంగుఁడు; దిక్కిఁక ఖా
జీ, రండిపుడేగి మనవి ♦ సేయుదమ చటన్. 15

వ. ఇట్లూహించుకొని యీర్ష్యాళురందఱు గుంపుగూడి తరలిచని. 16

సీ. వంగదేశప్రభు ♦ వరుమనుమఁడు ఛాందు
ఖాజి నవద్వీప ♦ ఘనవిభుండు
భయదశౌర్యస్ఫార ♦ బలవత్ప్రతాన్భట
మండలరక్షిత ♦ మహితతేజుఁ
డురుగుణశాలియు ♦ ద్యోగంబునందు ని

ష్పక్షపాతుండయి ♦ వఱలువాఁడు
యౌవనమధ్యస్థుఁ ♦ డందఱికిష్టుఁడై
పరిపాలనము సేయు ♦ ప్రజ్ఞగల్గు
గీ. మాన్యుఁడే కాని కొన్నిస ♦ మయములందుఁ
జాలఁజలమరి చండశా ♦ సనుఁడు; నట్టి
కఠినతమ నిరాఘాటాధి ♦ కారుఁడైన
తురకదొరమ్రోలఁ బల్కఁగాఁ ♦ దొడఁగిరిట్లు. 17

క. రాజు మహావిష్ణువుగద !
రాజప్రతినిధియు నట్లె ♦ రాజ్యమునందున్
దేజటి బాధన్గుందుఁబు
రీజనమతమయ్యో ! యుద్ధ ♦ రింపుమ ! ఖాజీ. 18

ఉ. దెందములోన నిద్దురఁగ ♦ డిందిసుఖంబున నొందు దేవునిన్
సందడిలేక పూజలను ♦ జల్పి యుపాసన సేయఁగావలెన్
హిందుమతప్రకార, మది ♦ యేమియుఁజూడక పెద్దకేకలన్
గందరగోళపెట్టు నిమి ♦ ఖాజి ! మతావనమున్ బ్రసర్పవే ! 19

క. ఈపాపపుఁగృత్యంబులఁ
బాపినఁగాకాగడములు ♦ భగవంతుఁడు దా
సైఁపం డెపుడో మననవ
ద్వీపము నాశనము సేయుఁ ♦ బెన్రోసమునన్. 20

శా. రాజద్వైదికమార్గవర్తులగు వి ♦ ప్రశ్రేష్ఠులీ బాలుఁడీ
మోజన్హిందుమతంబునుం జెఱుపన ♦ య్యో ! యెట్లు సైరింతురో
ఖాజీసాహెబు ! మమ్ము మామతమును ♦ న్గాపాడు వేవేగ; నీ
తేజంబించుకచూపకున్న నిమిభీ ♦ తిన్నిల్వలేమిప్పరిన్. 21

క. మీబాధలఁ బాపుమనని



యీబడుగుల కభయహస్త ♦ మిచ్చినసరె యిం
కేబాసటలేకున్న న
వాబుకడకు నేగి పెట్టి ♦ వత్తుము మొఱ్ఱల్. 22

క. హిందువులచేతఁ బూజలు
వందనములుఁ బడయునట్టి ♦ పరదైవతముల్
నిందాపాత్రపిశాచపు
బృందంబనినమ్ము తురక ♦ విని యిట్లనియెన్. 23

ఉ. మంచిది యిండ్లకేగుఁడిఁక ♦ మానివిచారము ; మిశ్రసూతిగా
వించెడు కృష్ణకీర్తనలు ♦ వీటనుజల్పఁగ రాదటంచుఁ జా
టించెద ; దానిమీఁద నవి ♦ డిందిన మేలటుగాక యున్నఁ బం
పించి భటాళిభక్తతతి ♦ పీఁచమడంచెద దండనంబులన్. 24

క. అని వారిఁబంపి ఖాజీ
యొనరించెను జెప్పినట్లు ♦ లూరంబడి కీ
ర్తనములు భంగము సేయుట
కును దొడఁగిరి పాపులైన ♦ క్రూరపఠాణుల్. 25

క. ఒక్కెడఁగొట్టిన మఱియొక
చక్కిని హరిభజనములను ♦ సాగించిరి ; యీ
మొక్కలపు భక్తవారపు
ఫక్కినివేదించి రేగి ♦ ప్రభునకు వారల్. 26

సీ. అతఁడంతనుగ్రుఁడై ♦ యరుగుదెంచెఁ బఠాణ
చయముతో నొకనాఁటి ♦ సాయమునను
వచ్చి కీర్తనసేయు ♦ వారియిండ్లనుజొచ్చి
దోఁచిసర్వస్వంబుఁ ♦ ద్రోవకడ్డ
మైనవారలఁగొట్టి ♦ కానిపనులఁజేసి

పాడెడిభక్తులఁ ♦ గీడుపఱచి
తాళమర్దళ ముఖ్య ♦ దైవార్చనాసాధ
నములఁ బగులఁగొట్టి ♦ యమితబాధ
ఆ. పెట్టి యింక నూర ♦ నిట్టిసంకీర్తనల్
సలిపిరేని తలలు ♦ నిలువవనుచు
బెడిదములువచించి ♦ బెదరించి సేనతో
ఖాజియంతఁదన న ♦ గరున కేగె. 27

గీ. ఖాజి తనసేనతోఁ జొచ్చి ♦ కఱకరియయి
భజనమర్దళనికరంబుఁ ♦ బగులఁగొట్టి
నట్టిపురవీథి 'ఖోల్భంగ' ♦ మందురిప్ప
టికిని ; స్మృతిలేదు దుశ్చేష్ట ♦ లకుధరిత్రి. 28

ఉ. అంతట భక్తులందఱు ని ♦ జాత్తవిపత్తుల విన్నవింప నా
శాంతుఁడు మిశ్రిసూనుఁడు "వి ♦ చారముదక్కి యిహార్థసంకుల
స్వాంతులుగాక కృష్ణుపయి ♦ శ్రద్ధను బూర్తిగఁబెట్టికొల్వుఁడా
దంతివరాసురక్షకుఁడె ♦ తప్పకప్రోచును మిమ్ముఁబాం" డనె౯. 29

వ. ఈగౌరాంగుని ప్రోత్సాహవాక్యంబులు నీరసించుచున్న భక్తులధైర్యవిశ్వాసంబుల బలపఱిచె వారునని యొప్పటియట్ల విజృంభించి హరిభజనలు గావించుచుండి రీసమాచారంబువిని ఖాజి యాత్మాజ్ఞోల్లంఘనోద్భూత మహాక్రోధవిఘూర్ణమానభీకరలోచనుండై యమకింకరులంబోలు నిజసైన్యంబుతోఁ గదలిచని. 30

సీ. పచ్చితురకలను ♦ వంటయిండ్లకుఁబంపి
మంచిపదార్థము ♦ ల్మైలపఱచి
భక్తిపరవశులై ♦ పాడువారలనోళ్లు
మూయించికీర్తన ♦ ల్వాపియఁజేసి



కరతాళములువేయు ♦ హరిసేవకుల లెంప
కాయలుగొట్టించి ♦ కలఁతపెట్టి
భక్తివందనములు ♦ పచరించువారి జు
ట్లనుబట్టి వంచున ♦ ట్లనువుపఱిచి
గీ. పంగనామపుమొగములఁ ♦ బ్రామఁజేసి
మద్దెలల్బ్రద్దలగునట్లు ♦ గ్రుద్దఁజేసి
పెట్టఁగలపాట్ల నన్నియుఁ ♦ బెట్టెఁగాని
ప్రాణహింసకుమాత్రము ♦ పూనఁడయ్యె. 31

గీ. వీధులను భజనలుసేయ ♦ వీలుపడదు
చేరియిండ్లనెకీర్తన ♦ ల్సేయుదమని
యట్టుగావించు భక్తుల ♦ కిట్టిపాట్లు
వచ్చెనిఁకనెట్లు వారలు ♦ బ్రదుకఁగలరు? 32

ఉ. ఈకఱతల్మహాత్ములు స ♦ హింపఁగనేరక ఖాజిసేనపై
న్ధాకకునిల్వలేక శచి ♦ నందను మ్రోలకునేగి చెప్పినం
గాక భయంబుదక్కదని ♦ కట్టలుగట్టుక యేగి మోముల
న్శోకవిషాదచిహ్నములు ♦ సూపఁగఁబల్కిరి యిట్లుస్వామితో౯. 33

సీ. తండ్రి! మీచెప్పువి ♦ ధంబున నోరిమి
పట్టి యున్నాళ్లనీ ♦ పట్టణమున
నెట్టులోనివసించి ♦ కృష్ణసంకీర్తన
ల్సలుపఁగల్గితిమింకఁ ♦ జాలమట్లు
సేయ ; నేమని మీకుఁ ♦ జెప్పుదుమయ్య! దె
బ్బలుఁదిట్లుఁ దన్నులు ♦ భటచయముల
జడిపింపు లపవిత్ర ♦ చటులకృత్యంబులు
సర్వంబుమాకిప్డు ♦ సంభవించె

గీ. మాధవార్చనలైనను ♦ మానవలయు
నన్యపురమునకైన మే ♦ మరుగవలయు
స్వామి! యిక్కడమీపాద ♦ పద్మసేవ
సేయుచుఁ జక హరికీర్తన ♦ ల్సేయలేము. 34

క. జలజాక్షు భక్తిమానుట
గలుగదు మాకెన్నఁడింక ♦ ఖలవిఘ్నభయం
బులువీడి కృష్ణభజనలు
సలుపుట కనువైనయెడకుఁ ♦ జనియెదమనఘా! 35

క. అని భక్తులనినమాటల
వినుతోడనె పూర్ణచంద్ర ♦ బింబనిభంబౌ
నునుమోము జేవురింపఁగఁ
గనుల శ్రువులొల్కనిట్లు ♦ గౌరాంగుఁడనెన్. 36

సీ. దైవకీర్తనలాపఁ ♦ దలఁచెనే! ఖాజి,న
న్నాఁపరమ్ముఁడైన ♦ నాదియందుఁ
బౌరులారా! యీవి ♦ భావరియందె కీ
ర్తనము నీపురినెల్ల ♦ తావులందుఁ
జలుపంగఁదలఁచితి ♦ ఖలుఁడెట్లు లడ్డగిం
చునొ చూతమీరలు ♦ సనితలకొక
దివ్వెఁగైకొనిరండు ♦ ధీరులైనాతోడఁ
జరమాద్రికినుఁడు దాఁ ♦ జనకమున్న

గీ. ఖాజియానకుఁ బ్రత్యాజ్ఞ ♦ గాఁగదీని
వీటి సందులగొందులఁ ♦ జాటుఁడయ్య!
వీడుప్రేమరసంబున ♦ నేఁడు వెల్లి
గొల్పి శత్రునిరోధము ♦ ల్గొట్టివైతు. 37



క. నిత్యానందా! నీవీ
సత్యంబును బ్రకటపఱుపు ♦ సర్వజనులకున్
గృత్యాకృత్యవివేక
వ్యత్యస్తుఁడు ఖాజినేఁడె ♦ హతగర్వుండౌ. 38

క. సౌదామినీలతా శో
భోదంచితజలదగర్జి ♦ తోపమరుట్కో
లోదగ్రవీక్షణోద్గత
నాదంబులువినిరి భయవి ♦ నమ్రుల్భక్తుల్. 39

వ. విని మహాప్రసాదంబని తమకష్టంబు లేఁకగట్టైక్కొనను దృఢవిశ్వా
సంబుతోఁ గృష్ణసంకీర్తనాలోకన కౌతుకంబుతో భక్తులందఱు న
ద్దైసలకుఁజని గౌరాంగునాజ్ఞఁ దెలియపఱిచిరంత. 40

గీ. శత్రుపక్షంబువారలు ♦ శచితనూజుఁ
డిట్టిసంకీర్తనముసేయ ♦ నెట్లుతివురు
వట్టిటక్కులెయివి; ఖాజి ♦ పైకిలేవ
గుండెలుండునె యీముద్దుఁ ♦ గుఱ్ఱనిమికి? 41

మ. అని వైరుల్పనరైరి ఖాజికడ కా ♦ వంతేని శ్రీకృష్ణకీ
ర్తనభీతింగనకుంటఁ; బౌరులిఁక యు ♦ క్తంబైనవేషంబులన్
ననదండల్హారిచందనంబు గొనబౌ ♦ నామంబులున్దాల్చి కే
లనుదివ్వెల్గొని నాల్గుగంటలగువే ♦ ళన్వచ్చి రాసక్తితోన్. 42

ఆ. వచ్చి నిమిగృహంబు ♦ వాకిట, లోపల
నెదుటవీధిలోన, ♦ నెన్నరాని
సంఖ్యగల్గువారు ♦ క్షమయీసినట్లుగా
మూఁగియుండి రధిక ♦ మోదమునను. 43

క. ధనవంతులు ధనహీనులు

దనుజారిభజనము సేయఁ ♦ దద్దయుభక్తిఁ
జను దెంచిరి సుస్నాతులు
ననులిప్తాంగులయి దీపి ♦ కాంచితకరులై. 44

సీ. గృహబహిస్థల మలి ♦ కించి సమ్మార్జించి
వింతవింతల మ్రుగ్గు ♦ వెట్టువారు
గుమ్మంబులకుఁ దోర ♦ ణమ్ములుగట్టించి
వెలుపలఁ బందిళ్లు ♦ వేయువారు
పసుపులుఁ గుంకుమ ♦ ల్ప్రామిద్వారంబుల
కెనలేనిశోభల ♦ నిచ్చువారు
వెలిగోడలకుమంచి ♦ వెల్లలుగొట్టించి
బైట ననంటులు ♦ పాఁతువారు

గీ. నైరి రాఁబోవుప్రకటిత ♦ హరిభజనము
సూచుకౌతూహలంబున ♦ సుందరాంగుఁ
డైనగౌరాంగు నందులో ♦ నరయుకోర్కిఁ
గరితలును బూరుషులు నాఁడు ♦ పురమునందు. 45

క. తలలంటుకొని ప్రశస్తపు
వలువలుధరియించి పూలుఁ ♦ బసలొప్పఁగడు భూ
షలుదాల్చి పుష్పలాజా
దులు గుప్పఁగనుండి రిండ్లఁ ♦ దోయజనేత్రల్. 46

క. ధారణిఁ బ్రోవఁగవచ్చిన
గౌరాంగుని కమితసదను ♦ కంపాత్మునికిన్
నీరాజనమీయఁగఁ గ
ర్పూరపుబిళ్లలును బల్లె ♦ ములఁగొని రబలల్ 47

ఆ. మత్తుమందువడిన ♦ మనుజులమాడ్కిఁ



చీఁకుశత్రుపాళి ♦ సేయుచున్న
యత్నములనుగాంచి ♦ యడ్డంబుసనుటకు
మాఱుకూడెనెదుటి ♦ వారితోడ. 48

ఆ. తండ్రిశత్రుఁడేని ♦ తనయుఁడుభక్తుఁడో
మగఁడు శత్రువైన ♦ మగువభక్త
యిట్టులుంటఁ జేసి ♦ యిండ్లన్నియు నలంకృ
తంబులయ్యెఁ బట్ట ♦ ణంబునందు. 49

వ. భక్తులు మిత్రులుదాసీనులు శత్రులందఱు నొక్కదుర్జ్ఞేయంబగు
శక్తిచే నాకర్షింపంబడి నిమి గృహంబుచెంత గుంపులుగూడి నిలు
వంబడి రోదసీకుహరపూరక 'హరిహరీ' శబ్దంబులుగావించుచుండి
రంతమందిజనులు నవద్వీపంబున నెట్లు పట్టిరనుసందేహంబెల్ల వార
లకుం బొడమె నిట్లుండ. 50

గీ. నరహరి గదాధరుండును ♦ మఱియుఁ గొంద
ఱాప్తులింటను గౌరాంగు ♦ నధికరక్తిఁ
గూడి చెలికత్తెలొకపెండ్లి ♦ కూఁతునట్లు
హొయలుమీఱంగఁ గైసేయు ♦ చుండిరెలమిఁ. 51

సీ. చిఱునవ్వు మొగముపై ♦ శ్రీతిలకముదిద్ది
దువ్వెనతో నెఱు ♦ ల్దువ్వి ముడిచి
సిగచుట్టు రంగుపూ ♦ చిఱుదండలనుజుట్టి
మేల్తావిగందంబు ♦ మేననలఁది
పొడుగుపొగడమాల ♦ మెడ వ్రేలఁగావేసి
దానితోఁ గొన్నిపూ ♦ దండలుంచి
కడుబెడంగగుచేలఁ ♦ గట్టించి సవరించి
పచ్చవస్త్రమువలె ♦ వాటువేసి

గీ. వసుధలో సర్వసుందర ♦ వస్తువులను
దవిలిచేసిన బంగారు ♦ తండ్రినెట్లు
దిద్దితీర్చినబాగొ యా ♦ తీరుగాను
దిద్దితీసికవచ్చిరి ♦ తెరలిపైకి. 52

క. సచ్చిదానందమూర్తి లో ♦ చనపథంబు
నందుఁబడినంత వినఁబడె ♦ హరిహరిహరి
యనెడుకేకలు ; కొంతసే ♦ పట్లు సనిన
పిదప నానందబాష్పము ♦ ల్పృథ్విఁగురిసె. 53

ఆ. చాలనోటనుండి ♦ లాలారసంబూరు
నధికరుచ్యవస్తు ♦ వానువెంట;
నల్లైకనులనుండి ♦ యానందబాష్ప
ల్గాఱుదివ్యపురుషుఁ ♦ గనినతోడ. 54

సీ. స్నానముల్సేసి వ ♦ స్త్రంబులుధరియించి
చందనచర్చలు ♦ సల్పుకొని ప్ర
సూనమాల్దాలిచి ♦ సురుచిరకింకిణీ
నికరంబు పాదంబు ♦ లకునమర్చి
చిన్నితాళంబులు ♦ జెండాలునూఁదుఁగొ
మ్ములు మర్దళంబులుఁ ♦ బూనిచేతు
లను గాగడాలను ♦ దనయానఁదలఁబూని
తాల్చివచ్చినభక్త ♦ తతుల, నిసుక

గీ. చల్లినను రాలనట్టుగా ♦ గొల్లుమనుచు
నిలిచియున్నట్టివారల ♦ నిమిస్మితాన
నంబుననుగాంచి చాలనా ♦ నందమంది
పుడమియద్రువంగ హుంకార ♦ మునుబొనర్చె 55



క. శంకనుభీతిదుర్బలత ♦ స్వాంతములందున నుండనీక న
ల్వంకలఁబొఱఁదోలి చటు ♦ లంబగుభక్తియు ధైర్యమిచ్చు నా
హుంకృతి మాటిమాటికి మ ♦ హోగ్రముగా నిమిసేయ విన్నవా
రింకను గృష్ణకీర్తన క ♦ దేటికిరారని యుండిరచ్చటన్. 56

వ. అంత. 57

సీ. భక్తవారము నాల్గు ♦ భాగముల్గావించి
యద్వైతునొకదాని ♦ కధిపుఁజేసి
యొకదానిశ్రీవాసు ♦ నకునిచ్చి మూఁడవ
దానికేలిక హరి ♦ దాసుఁజేసి
నాల్గవదానికి ♦ నాథుఁడు నిమియయ్యె,
నితిగదాధరులిందె ♦ నిమికిఁదోడు
గానుండి ; రిట్లు మొ ♦ గ్గరమునుదీరిచి
వరుసగా మొదట ము ♦ వ్వురనుబంపి

ఆ. వెనుకఁ దానుగదలి ♦ చనె ; నిట్లు మూర్ఖతా
మాంసబలబలంబు ♦ మదముడంపఁ
బ్రేమ భక్తి శాంతి ♦ వీరులతోడఁ జై
తన్యుఁ డరులపైకి ♦ దాడివెడలె. 58

గీ. దివియలన్నియు వెలిగింపఁ ♦ బవలుగానె
తోఁచెనారాత్రి ; భక్తిసం ♦ తోషగీత
రామకృష్ణ హరీత్యాది ♦ నామసమితి
వీనులం దధికామృత ♦ వృష్టిఁగురిసె. 59

క. అందఱలోపలఁ బొడువుగ్
సౌందర్యము దివ్యకాంతి ♦ జాలముగల యా
నందమూర్తినిమి, కాం

చందెల్పకయ నరతతికి ♦ స్పష్టముపడియెఁ. 60

శా. నీపాదంబులు నాదుచిత్తమును సం ♦ ధింపంగ రా దేహరీ!
గోపీమానసచోర! కృష్ణ! యని భ ♦ క్తుల్పాడ, మిశ్రాత్మజుం
డాఁపంజాలనిభక్తి నుద్ధృతకరుం ♦ డై యాడ, నాపాదచూ
డాపర్యంతముగప్పె నాతని నఖం ♦ డద్యోతమానచ్ఛవుల్. 61

క. మనఖాజీ యీహరికీ
ర్తనసంగతి నెఱిఁగెనేని ♦ దండనములు సే
యునువీరి; నేఁటితో శచి
తనయునిపని సరియె యని ర ♦ తనిపరిపంథుల్. 62

క. వీరికిఁగూడను గంగా
తీరంబునఁ బోవునిట్టి ♦ దివ్యాకారుఁ
గౌరాంగు సరయుతోడనె
దూరంబుగఁ జనియె లోని ♦ దుష్టపుటూహల్. 63

సీ. మనశచిబిడ్డఁడీ ♦ మహితాత్ముఁడాయని
కళవళంబుననిమిఁ ♦ గాంచికాంచి
మనవీధులన్ను బెంకె ♦ తనములు సేసిన
దీశాంతుఁడాయని ♦ యెంచియెంచి
ప్రతివాదిభీకర ♦ పండితుండీతఁడా
యనినాసవ్రేలిలుంచి ♦ యరసియరసి
పెద్దలవెన్నాడి ♦ వెక్కిరించినదుష్ట
తముఁడితండాయని ♦ తలఁచితలఁచి

గీ. యతని యాకారమధురిమ ♦ కతనిదివ్య
తేజమునకును భక్తిక ♦ ధీనులగుచుఁ
జొక్కి యువశతగుంపులోఁ ♦ జొచ్చిపడిరి



పరమశత్రులు నాతని ♦ పదములపయి. 64

సీ. ఇరువది మూఁడేండ్ల ♦ మురిపెంపుముద్దుల
మూటఁజూడవె పూవుఁ ♦ బోఁడియనుచు
నవమోహనాంగు నం ♦ దనుజేసికొనె నెట్టి
భాగ్యరాశియొ శచీ ♦ వనితయనుచు
మననవద్వీపంబు ♦ మహితపుణ్యంబేమొ
యిట్టిరూపరియందుఁ ♦ బుట్టెనంచు
మనుజుఁడీతఁడను ♦ మాటవట్టిది చిన్ని
కృష్ణుఁడీరూపుధ ♦ రించెనంచు

గీ. నల్లవైకుంఠపురవాసు ♦ లందఱిట్లు
వచ్చిరే కాని యీజన ♦ పరికర మెన్నఁ
డేని యీపురిఁజూచితి ♦ మే? యటంచుఁ
దెఱవలనుగొనసాగి ర ♦ చ్చెరువుఁజెంది. 65

క. ఫుల్లాబ్జవదన! భక్తిం
బెల్లుగ వెదచల్లుమవని ♦ ప్రేమమునను జో
బిల్లఁగ; నీతల్లికడుపు
చల్లఁగ వర్ధిల్లుమనిరి ♦ చందనగంధుల్. 66

క. అరవిందనయన! కన్నుల
కఱవఱె నినుఁజూడనోయి ♦ గౌరాంగా! భా
స్కరచంద్రతారలుండెడు
వఱకున్జీవింపుమయ్య! ♦ భాగ్యోన్నతితోఁ. 67

గీ. ఇట్టులాశీర్వదించి ప ♦ ర్వేందుముఖులు
సేసలలరులు లాజలు ♦ చేతఁగొనుచుఁ
జల్లి చల్లనికాంతులఁ ♦ జల్లు కప్పి

రంపుటారతులిడిరొయ్యా ♦ రంపునిమికి. 58

ఆ. మేడలందునున్న ♦ మించుఁబోండ్లాతని
భక్తిఁజూచి మనసుఁ ♦ బట్టలేక
కనులనుండినీళ్లు ♦ కాల్వలుగాఁజఁగా
సాఁగిలఁబడిరచట ♦ శచిసుతునకు. 69

చ. అమలుఁడు మిశ్రసూనుఁడు ద ♦ యన్వారినామఁ సత్సుధారసం
బమితముగా నొసంగె మన ♦ కంతము నొందెను బాపమృత్యువుల్
యమునిభయంబిఁ కేల? వడి ♦ నాతనిఁబట్టుక కట్టికొట్టుఁడీ!
క్షమకయి వేఁడినన్సరియె ♦ చంపుఁ డతండటు సేయకుండినన్. 70

క. అని కొందఱు సంఘములో
మనుజునొకనిఁజూచి తద్య ♦ మద్భ్రాంతిని యా
తనలిఁకఁబెట్టవుగద! యొ
వ్వనినని మోఁదుదురు భక్తి ♦ పరవశులౌచున్. 71

ఉ. మంచియుఁ జెడ్డఁజూఁడక పి ♦ మత్తుఁడు ఖాజిముకుందకీర్తనల్
కొంచక యడ్డపెట్టునఁట ♦ కొట్టుఁడు మూర్ఖునటంచుఁ దోవఁగా
న్పించిన చిన్నమొక్కలను ♦ బీఁకి కరంబులఁబట్టి బిట్టుకో
ధించియిఁకందుఁగొందఱతి ♦ తీవ్రత మొత్తుదు రుత్సనేలపై. 72

ఆ. కొంద ఱొకనిఁబట్టి ♦ క్రూరుఁడు ఖాజియా
తండెయంచు బద్ధ ♦ తనుని జేసి
మోచికొంచువచ్చి ♦ మొజ్జో! యనుచునుండ
వైతురు శచిబిడ్డ ♦ పదములపయి. 73

ఉ. ఎక్కడ కేగుచుంటివి ర ♦ మేశుఁడు మిశ్రిజుఁడుండు చోటికా?
యక్కడ కేగిచూచుటకు ♦ నక్కఱ లే దిటువచ్చిచూడు! నే
నిక్కడనున్నవాఁడ హరిఁ ♦ గృష్ణుఁడ నేలికనంచు నందులో



నొక్కఁడువల్కె భక్తి మెయి ♦ నూరక చిందులుద్రొక్కమత్తతన్.

క. రంగులు వింతలుగా గౌ
రాంగుని మెయిచుట్టుఁదోఁచె ♦ నతఁడాడుతఱిన్
భృంగంబులు పద్మముచు
ట్టుం గవిసెడియట్లు ప్రజవ ♦ దున్నచిసుతుపై. 75

క. గీర్వాణ ముఖ్యభాషలు
నేర్వకపోయినఁ దకీయ ♦ నిర్మలభజనా
ఖర్వశ్లోకంబులు శ్రుతి
పర్వాబుగఁ బాడిరచట ♦ భక్తులు గడిమిన్. 76

ఉ. నందసుతుండుదా మురళి ♦ నాదము సేయుచు వన్యపుష్పముల్
గందొవవిందు సేయఁగ న ♦ ఖండవిలాసముతోడవచ్చె గో
విందముకుంద కృష్ణహరి ♦ విశ్వపితృప్రముఖాఖ్యలిండ్లలో
నందులకించిమ్రోఁగునని ♦ నాట్యమొనర్తురు గొందఱందునన్. 77

వ. గంగయొడ్డుననే కొంతసేపిట్లు గౌరాంగానుయాయి భక్తానీకంబు పూర్ణిమేందూత్తుంగభంగోద్ధతం బగువార్ధిభంగిఁ జనఁజన విశ్వం భరుండు చటాలున ఖాజీయుండు పట్టణబాహ్యస్థ హర్మ్యంబునకుం గొనిపోవు మార్గంబునకుం దిరుగ 'ఖాజిఁగొట్టుఁడు!' 'ఖాజిఁగొ ట్టుఁ' డనుభీకరారావంబులతో భక్తతండంబు నట్లుతిరిగె. 78

గీ. తిరిగినప్పుడు గౌరాంగు ♦ దివ్యకాంతి
మంతమగు నెమ్మొగంబొక ♦ యింతచూచె
నేని యెవఁడేని ధనధాన్య ♦ గృహాకళత్ర
సుతులవిడనాడి యతనిదా ♦ సుండుగాఁడె? 79

ఉ. ఆతనిశత్రులాసి త ♦ దంచిత తేజము, జాలిఁజెంది ని
ర్భీతిని ఖాజివీధి నడ ♦ పించెదు నీతఁడు భక్తబృందమున్

ఘాతుకులాపఠాణులిఁగఁ ♦ గత్తులతోఁ బయిఁబడ్డ నెత్తురుల్
సూతుమొయేమొయం చడలఁ ♦ జొచ్చిరటం బరితప్తచిత్తులై. 80

సీ. రండనిమింటితా ♦ రలగుంపులట్లుగాఁ
బెద్దసంఘుంబు ర ♦ ప్పింపఁగలఁడె
తీక్ష్ణప్రతాపసం ♦ దీప్త ఖాజిభయంబు
గప్పకుండఁగదానిఁ ♦ ద్రిప్పఁగలఁడె
పూఁటయేగడుపుగఁ ♦ బురమెల్లఁగన్నుల
వైకుంఠముగఁ జేసి ♦ వఱలఁగలఁడె
దివ్వటీల్దెప్పించి ♦ దీధితులెలయించి
పెన్రేయిపవలుగా ♦ వింపఁగలఁడె

గీ. కోమలుల చిత్తములయందుఁ ♦ బ్రేమఁగూర్చి
చిత్రచిత్రసపర్యలఁ ♦ జెందఁగలఁడె
మిశ్రసుతుఁ డల్లలోకైక ♦ మిత్రుఁ డఖిల
కలుషహరణుండు గృష్ణుఁడే ♦ కాకయున్న. 81

ఉ. మొత్తనిపూలుఁదాళములు ♦ మేల్చిఱుగజ్జెలు మర్దళంబులా
యిత్తము సేసికొంచు నసు ♦ హృత్తనుకంపక భీకరంబులా
కత్తులు బల్లెముల్గొని య ♦ కాలపుమృత్యువులట్లు వచ్చుకై
యెత్తుపఠాణులంజెనక ♦ నేగశచీజుఁ, డతండు మర్త్యుఁడే? 82

ఆ. బొంగుగొంతువారుఁ ♦ బొలుపారు కంఠనా
దంబుతోడఁ గృష్ణ ♦ దైవభక్తి
కలితగీతములను ♦ గానంబొనర్తురు;
కలవె యిట్టిచిత్ర ♦ ములు ధరిత్రి. 83

ఉ. రాతిరితొమ్మిదౌనరిక ♦ రాతియగారముసూచె నాశచీ
సూతిబలంబు; ఖాజిచెవి ♦ సోఁకెనుసందడి; భక్తదీపికా



వ్రాతముఁ గన్నులంబడె; వి ♦ వాహముగాఁదలపోసి సంబరం
బేతనిదో కనుంగొనఁగ ♦ నేగుఁడటంచతఁడంపె బంటులన్. 84

గీ. ఉత్సవముడగ్గఱఁగ ఖాజి ♦ యూహసేసె
వచ్చునది కృష్ణభజనకా ♦ వచ్చునంచు
నంతఁదప్రాసరక్తాస్యుఁ ♦ డౌచు నాతఁ
డెదుటిబంటులఁ దిలకించి ♦ యిట్టులనియె. 85

మ. భటులారా! కనిపించునద్ది యలబాఁ ♦ పండౌ శచీజుండు పో
త్కటగర్వంబునఁ జేయుకీర్తనముగా ♦ దా! చూడుఁడాభక్తులన్
బటుబాహాబలయుక్తిఁగొట్టి, కరము ♦ ల్బంధించి గౌరాంగు ని
చ్చటికిం దెండు! చనుండు వేగమునఁ బై ♦ శాచోత్సవం బాఁపఁగన్.

క. ఎదిరించిన నొక్కింతయు
బెదరక కైదువులుసూపి ♦ భీకరలీలన్
జదుముచు నపరాధుల దు
ర్మదములడ్డిసికొని మీరు ♦ రండిటకువడిన్. 87

సీ. ఈయాజ్ఞఁగొని భటు ♦ లేగుచో భక్తులఁ
జూచినంత నెశక్తి ♦ సురిఁగిపోయె
నడిదముల్కరముల ♦ యందుండెఁ గదలక
ప్రతిమలకైనుండు ♦ బాఁకులట్ల
కొందఱు బాష్పప్ర ♦ కోపంబుచే మాట
లాడనేరక చొచ్చి ♦ రాటలందుఁ
దురకలమనుమాట ♦ మఱచి కొందఱు హరీ!
కృష్ణ! మాధవ! యని ♦ కేకలిడిరి

గీ. మఱచి యధిపతి, నాజ్ఞల ♦ మఱచి, యొడలు
మఱచి, ఖాజీసిపాయీలు ♦ మహితభక్తి

గణములోఁ బడిపోయిరి ♦ కజ్జలల్ల
బాణవేగంపునిర్ఝర ♦ వారినల్లు. 88

ఆ. తానుబంపినట్టి ♦ దండనభటులింక
రాకయుంటసూచి ♦ మూఁకరొదయు
దీపచయము తేజ ♦ తిశయించుటనుజూచి
భక్తులకును జిక్కె ♦ భటతతియని. 89

క. చండప్రతాపవంతుల
భండనవీరులను మూర్ఖ ♦ భక్తనికరమున్
జెండి మఱిరండటంచొక
దండునుబంపించె ఖాజి ♦ తలఁకి యరుల్పై. 90

క. వారుంగూడను బూర్వపు
వారిగతి న్మజిలరామి ♦ పరికించి మహా
భీరువయి ఖాజిచెమ్మట
లూరఁగ వడఁకుచును మిన్న ♦ కుండెన్మేడన్. 91

క. అంతట భక్తజనుల్గ్రే
హాంతికమున కరుగుదెంచి ♦ రల్లరిహెచ్చెన్
ఘంతవ్యుఁడు గాఁడీతఁడు
హంతవ్యుఁడు ఖాజిఁగొట్టుఁ ♦ డనిరందఱొగిన్. 92

క. ఈకేకలువిని ఖాజీ
యేకాంతస్థలికి వీర ♦ లేగుదురని హృ
ద్వ్యాకులతఁబోయిలోనికి
మూఁకల్రాకుండఁ దలుపు ♦ మూసె[illegible]. 93

క. రెండవపరిఁ బట్టణపా
లుండంపినసేన జలధి ♦ లోఁగలసినవాఁ



కాండముగతి నేమై యెట
నుండెనొ తెలియంగరాక ♦ యుండెనెవరికిన్. 94

క. ఇదిమాత్రము నిజ,మెవ్వరు
నదయన్వారలనుదాఁకి ♦ హానియొనర్పం
గఁదివురలే, దట్టులెనిమి
సదయుఁడు వారికి మఃదలనో ♦ సఁగెనో యేమో. 95

సీ. గౌరాంగునకు ముందు ♦ గా ఖాజియిలుసొచ్చి
భక్తులుపాత్రిలఁ ♦ బగులఁగొట్టి
ఖాజినిబట్టుఁడు ♦ కట్టుఁడు కొట్టుఁడు
కృష్ణకీర్తనలకు ♦ నెప్పుడడ్డ
పడకుండనని కేక ♦ లిడుచుఁ గవాటంబు
లవియఁగ్రుద్దుచు మోత్రల ♦ నగపడునవి
యన్నిధ్వంసముచేయు ♦ చలరుఁదోఁటనుజొచ్చి
పూల్దుంచి జుట్లఁజె ♦ వులనుబెట్టు

గీ. కొనుచుఁ జెలరేఁగుచుండవై ♦ కుంఠనాథుఁ
డబ్జనేత్రుండు గౌరాంగుఁ ♦ డరుగుదెంచి
కూడదనిచెప్పి వారిఁజీకొట్టె; నంత
సద్మమంతయునుండె ని ♦ శ్శబ్దముగను. 96

గీ. ఎచటనున్నాఁడు ఖాజిసా ♦ హేబటంచు
నడిగి గౌరాంగుఁ డతఁడల్ల ♦ యంతిపురిని
దూఱియున్నాఁడనివిని యా ♦ తురకఱేని
ప్రియతములఁ గొందఱను జేరఁ ♦ బిలిచిపలికె. 97

ఆ. వేగ మీఱలేగి ♦ వెంటనేఖాజినా
యెదుటఁబెట్టుఁడతని ♦ కేమిభయము

వలదటంచు నాదు ♦ పలుకులుగాఁ జెప్పఁ
దనుగుఁడాలసింప ♦ కతనికడకు. 98

ఆ. నెయ్యురేగిచెప్ప ♦ నిస్త్రాసుఁడై లేచి
బయిటకేగుదెంచి ♦ బద్ధపాణి
యూచు శిరమువాంచి ♦ యఖిలేశుబ్రమోలను
నిలిచియుండె నల్పు ♦ నివలె ఖాజి. 99

ఆ. వానిఁజూచి నిలువఁ ♦ బసి యను రేగియూ
ప్రభున కెట్టిగార ♦ వంబుసూప
వలెనో యట్లుసూపి ♦ పద్మాక్షుఁడాతని
గూరుచుండఁబెట్టి ♦ కూరుచుండె. 100

గీ. నిమికిఁదాతయు శచికిఁ దం ♦ డ్రియును జాల
ఖ్యాతపురుషుఁడునైన నీ ♦ లాంబరునికి
ఖాజికిని స్నేహమెక్కుడు ♦ కాన ఖాజి
వానిఁ బిలుచుచుండెడువాఁడు ♦ బాబువావి. 101

క. ఆకతమున గౌరాంగుఁడు
రాకేందునిభాస్యుఁ డమృత ♦ రసమొల్కఁగ లస
ద్వ్యాకుల ఖాజికినిట్లనె
వ్యాకులతా దమనమంద ♦ హాసచ్ఛవులన్ 102

శా. మామా! యేమిది! నీగృహంబునకు స ♦ మ్మానంబులంబొంద భా
వ్యామోదంబున నాప్తవర్గమును సా ♦ హాయ్యంబుగాఁగొంచురాఁ
గా మాచప్పుడువిన్నమాత్రమున స ♦ త్కారంబులట్లుండ మే
మేమో శాత్రవులట్లుడాఁగితిదిచ ♦ న్నేబాదు గౌవానికిన్ ? 103

వ. అందులకు ఖాజీ యిట్లనియె. 104

శా. జామాతా! యపచారముల్సలిపితి ♦ న్జాలంగనీకందుచే
నీమూఁకల్ననుశిక్షసేయుటకునై ♦ యేతెంచెనంచెంచి మ
ద్ధామాంతఃపురవాసినీ నిచయసం ♦ త్రాణార్థమున్బ్రాణ ర
క్షామార్గంబది యొండెయంచుఁ జనితి ♦ న్సంత్రస్తచిత్తుండనై. 105

క. ఆపదఁ గడవఁగనప్పుడు
చూపట్టకపోయె యొండు ♦ సులభోపాయం
బాపద్రక్షణ సౌమ్య
వ్యాపృతిగఁ జూపు లిప్పు ♦ డభయంబొసఁగన్. 106

క. ననుక్షమియించితివని నీ
కనికరపుం దీరుచెప్ప ♦ కయ చెప్పుశచీ
తనయా! వలయుసపర్యలఁ
గొనుమా నీకిప్పుడాత్మఁ ♦ గొంకకొనర్తున్. 107

వ. గౌరాంగుం డిట్లనియె. 108

ఉ. ఈయొకప్రశ్నమేసడుగ ♦ నెంచితిఁ జెప్పుము దుఃఖమోక్షసం
ధాయిపథంబులందొకటి ♦ నందతనూజుని కీర్తనం, బనా
పాయకరం, బదూష్యమటు ♦ వంటిది యూఁపఁగనేల? ముక్తిమా
ర్గాయుతమందు వేని కెది ♦ యూనది సేయఁడెవాఁడు మాతులా.

క. శ్రీకృష్ణదివ్యకీర్తన
నిక్షిష్టముగాదుసరె! య ♦ నీతిరహితమే
కాక సుఖప్రదమట్టిది
లోకము సేయంగనీకు ♦ లోటేమయ్యా! 110

గీ. తనకుఁగలయట్టిసేన యె ♦ వ్వనికిలేద
టంచు లోపలగర్వించు ♦ నట్టిఖాజి
గర్వమడఁపంగ నెవ్వరు ♦ గణనసేయ
లేనిసంఘంబుఁగూర్చె. శ్రీ ♦ జానియూర! 111

గీ. గర్వపరిహార కరణమా ♦ ర్గంబులందు
మోటుబలమొక మార్గమా ♦ పుంతఁద్రొక్క-
ఖాజిపట్టునశౌరి, రో ♦ గంబు నెఱిఁగి
మంచిమందిచ్చు నలభిష ♦ గ్మణిపగిదిని. 112

గీ. అట్టి పద్మాయతాక్షు గౌ ♦ రాంగునెదుటఁ
గాంచుతోడనె త ♦ ద్బలగరిమ మెంతొ
స్వానుభవమున నెఱిఁగిన ♦ యతఁడె కాన
ఖాజిభయభక్తి వినయసం ♦ కలితుఁడయ్యె 113

గీ. నిమిని మోమెత్తిచూచిన ♦ నిమిషముననె
యెద్దియో శక్తియొక్కటి ♦ యెదను దూఱి
ప్రాణములుతోఁడి తన్నది ♦ వశునిఁజేసి
కొనుచు నున్నట్లు ఖాజికిఁ ♦ గనఁగనయ్యె. 114

గీ. అట్టిస్థితినుండి ఖాజియు ♦ ట్లనియె నిమికి
సరియె నీచెప్పనదియెల్ల; ♦ సర్వమింక
విన్న వింతుఁదొలుత నెట్టి ♦ పేరనిన్నుఁ
బిలువవలెనో యెఱుంగఁ బ్రో ♦ స్ఫీతతేజ ! 115

క. అల్లుఁడ! యనుటకు నాలుక
యల్లాడకయున్నదయ్య! ♦ యాకృతిఁగనినన్
ఫుల్లాబ్జవదన! నిర్జర
తల్లజుఁడవు నీవటన్న ♦ తలఁపుగలిగెడున్ 116

క. నరుఁడవుగా, వయ్యదినే
నెఱుఁగుదుఁ బౌరతతి నిన్ను ♦ నెట్లుపిలుచునో
యెఱుఁగుదు ననునట్లని
న్నరితిస్గౌరహరియంచు ♦ వననిమ్మనఘా ! 117



సీ. పావనకీర్తన ♦ భంగహేతువు కేవ
లంబేనకాదు ని ♦ జంబునమ్ము
మీవారిలో ముఖ్యు ♦ లౌవారు పురినున్న
హిందువులే నీవు ♦ హిందుమతము
నకు విరుద్ధములైన ♦ నవ్యకుమార్గము
ల్ప్రజలకుబోధించి ♦ పాడుచేయు
చుంటివి మతమని ♦ యూరక నేరము
ల్నిమీఁద నెన్నొ క ♦ ల్పించిచెప్ప

గీ. మొదలువెట్టిరి నాతోడఁ; బురజనులను
జెఱుపుచుంటనుజూచియుఁ ♦ జేయవలయు
[illegible]తులను మీకు వేగనేఁ ♦ జేయకున్న
నారు సెప్పెదమనిరి న ♦ వాబుతోడ. 118

క. ఇంక నుపేక్షను జేయఁగఁ
బంకేజదళాక్ష! నాకు ♦ భయమయ్యె; న్నే
సంకోచపడుచునే మీ
కంకిలియై కృష్ణభజన ♦ లాఁపఁదివిరితిన్. 119

క. అమితముగాఁ బ్రజ నీవిష
యము సెప్పెడుమాటలన్ని ♦ యాలించితి ని
న్నమలుంజూచిన హరినా
మము వెంటనెవచ్చు నన్న ♦ మాటయువింటిన్. 120

క. హరిభజన మడ్డఁబోయిన
ఖరతమ మత్సేవకులును ♦ గరుణార్ద్రాంతః
కరణులయి కనులనశ్రూ
త్కరములు రాల్చిరఁట, యదియుఁ ♦ గర్ణములఁబడెన్. 121

క. అని చెప్పినంతలోపల
ఘనమౌ నొకవింతమైన ♦ కలఁతయు బోధా
జనకమగు నొక్కయలజడి
యును బెనుపడ ఖాజి వెండి ♦ యుం బలికెనిటుల్. 122

గీ. దేవుఁడొక్కఁడె ; హిందుజా ♦ తినిజనించి
నట్టివారలు వాని నా ♦ రాయణుఁడని
పిలుతు ; రాతఁడెనీవఁట ; ♦ తెలుపుమయ్య
మోసపుచ్చక సత్యమం ♦ భోజనయన ! 123

వ. అంత జగన్మోహనాంగుం డగుగౌరాంగుండు చల్లనిపసలు నట్టెసలం జిమ్ము నొకచిఱునవ్వునవ్వి ఖాజిప్రశ్నంబున కుత్తరంబుసెప్పక యాపాదమస్తకానిర్వాచ్య మహానందవ్యాపక స్పర్శకంపనకరం బగునిజకరంబున నాతనిచేతి వ్రేలొక్కటిపట్టుకొని యిట్లనియె. 124

మ. హరి! నారాయణ! కృష్ణ! యంచిపుడుమా ♦ మా! యంటివేవింటి; దు
స్తరసంసారమహాబ్ధిమగ్న జనులదో ♦ షక్లిష్ట దుస్స్వాంతవ
త్పురుషోత్తారకమంచొకండె ; యిఁకనీ ♦ పున్నెంబునెన్నంగ నా
తరమా! త్వత్కృతపాపసంచయము ద ♦ గ్ధంబయ్యెఁబూర్ణంబుగన్.

సీ. అనినతోడనె ఖాజి ♦ యంగంబు గంపనం
బంది నిల్వున సూఁగు ♦ లాడఁదొడఁగె
శ్మశ్రుపటలియెల్ల ♦ సంసిక్తమౌనట్లు
కన్నీళ్లుకాల్వలై ♦ కాఱఁదొడఁగె
నీతెఱంగున లేచి ♦ "యీశ్వరుఁడవునీవె
నిజమిదినిజమయ్య ! ♦ నిజము ! నిజము !
నాతప్పుతమియించి ♦ నన్నుఁగైకొనిప్రోవు
మఖిలాఘసంహతి ♦ కాటపట్టు



గీ. నయ్య ! సుభగాంగ ! నేజగ ♦ దవనచంగ !
యోఁదరించుటకిఁక నీదు ♦ కృపయెదిక్కు"
టంచు మనసునుగరఁగించు ♦ నాస్యమునను
బడెను గౌరాంగుపదముల ♦ పైనిఖాజి. 126

గీ. వలదువలదిదియని యడ్డు ♦ పడుచుఖాజి
కనియెనిట్టులు గౌరాంగుఁ ♦ "డాప్తవర్య !
పావనంబగు శ్రీహరి ♦ భవ్యనామ
ములుసుమీ ప్రోచినవినిన్నుఁ ♦ బుణ్యుఁజేసి ! 127

గీ. నాదియొకప్రార్థనము పురీ ♦ నాథ ! యింకఁ
గృష్ణకీర్తనమునకు నీ ♦ వెన్నఁ డడ్డ
పడనని ప్రమాణములుసేయ ♦ వలయు" నన్న
ఖాజియిట్లనె వినతము ♦ ఖంబుతోడ. 128

చ. హరికథలాఁపకుండుట మ ♦ హాకృతియే? నలినాక్ష! వానిని
ద్ధప్రబలంగఁజేసి నత ♦ త్రపమదంబునుగాంచి నాయనం
తర మటుసేయఁగావలయు ♦ ద్రవ్యమొసంగుదు ; నిట్లు నాపరం
పర దరియింపనౌ హరికృ ♦ పామహిమంబున భూసురోత్తమా !

క. నేనిచ్చెదు నీధనమెవఁ
డేసియు హరియింపఁదలఁచె ♦ నేని, వినిహత
ప్రాణాత్మజ దారార్థం
బౌనట్లు శపింతునేఁ, ద ♦ దవనార్థంబై. 130

ఆ. ఇట్లు ఖాజివల్కఁ ♦ గృష్ణసంకీర్తన
సలుపమిశ్రసూతి ♦ సన్నఁజేసె ;
ఖాజివెంటఁబడఁగ ♦ గౌరాంగుఁడాతని
మానువలదటంచు ♦ మానిపించె. 131

క. తిరిగిచనుచుఁ దోవను శ్రీ
ధరునింటికిఁబోయి యచట ♦ దగఁదీర్చుకొనెన్
హరి ; దానికి శ్రీధరుఁడెదఁ
బరమానందంబుఁబొంది ♦ పరవశుఁడయ్యెన్. 132

క. మఱునాఁటి యుదయమందునఁ
బురవీథులు భక్తపాద ♦ ములఘట్టనచే
నొఱపై లాజాతండుల
సురుచిరపుష్పమయమాచుఁ ♦ జూడ్కులఁదన్పెన్. 133

ఆ. విగతగర్వులౌచు ♦ విద్వేషులందఱు
నాప్తమహితభక్తు ♦ లైరినిమికి
నంటఁగందిపోవు ♦ నలరుదండలుసని
యాజియందు ఖడ్గ ♦ రాజిగెల్చె. 134

గీ. విద్దెలకుఁ డెంకియౌ నవ ♦ ద్వీపమందు
నిప్పటికి ఖాజిగోరీ ర ♦ హించుఁజాల
యాత్రికేగిన దైవభ ♦ క్తాగ్రగణ్యు
లెంతయోశ్రద్ధ దానిద ♦ ర్శించివత్తు. 135

క. అమిత ధనధాన్యరాసులు
సమధిక విద్యాచయంబు ♦ సమకూడుట క
ష్టముగాదుకాని త్వత్పద
కమలార్చా భాగ్యమబ్బఁ ♦ గష్టము రామా ! 136

శ్రీరస్తు.

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః.

# శ్రీ గౌరాంగచరిత్రము.

## అష్టాదశాశ్వాసము.

ఉ. పుట్టుటయన్న దుఃఖములఁ ♦ బుట్టుట ; యీనిజ మీధరిత్రిలోఁ
బుట్టినయెల్లవారికి సు ♦ బోధమె, యారయ స్వానుభూతిచేఁ
బుట్టుటఁగిట్టుట న్గడచి ♦ పోవఁగ నిన్భజియించుభక్తి వి
భ్రాట్టులుమాత్ర మోయిరఘు ♦ రామ ! భరింపఁగనేర్తురాపదల్.

సీ. గౌరాంగుఁడిల నవ ♦ తారమొందుట వంగ
దేశంబునకుఁ జాలఁ ♦ దెచ్చెమేలు
స్త్రీవిద్యహెచ్చెను ♦ స్త్రీలెందఱో కృష్ణ
భక్తులైప్రజలకు ♦ భక్తినిడిరి
వంగభాషయుఁగూడ ♦ వర్ధిల్లె భక్తికా
వ్యములందులోఁ బ్రాయఁ ♦ బడుటచేత
నాధారరహిత దు ♦ రాచారములువోయె
జాతివిద్వేషము ♦ ల్సమసిపోయెఁ
ఆ. గాలవృష్టిచేత ♦ నేలలు పుష్కలం
బుగనుబండె శాంతి ♦ పొదలియుండె

నిండుసౌఖ్యమునను ♦ నిరుపప్లవంబయి
యుండె మిశ్రసూతి ♦ యుండుచోటు 2

గీ. వంగదేశంబు తురకల ♦ పాలఁబడక
మున్ను దానికి ప్రభువౌ సు ♦ బుద్ధిరాయఁ
డంటుపడియెను మ్లేచ్ఛుల ♦ హస్తములను
దాఁకినజలంబునవశుఁడై ♦ త్రావుకతన. 3

క. దానికిఁ బ్రాయశ్చిత్తం
బానతియిండనుచు ఛాంద ♦ సాళినడుగఁగాఁ
బానముసేయుము సజ్వా
లానల తప్తోష్ణమైన ♦ యాజ్యంబనియెన్. 4

క. ఈరీతిని మరణించుట
కారాజు దెగింపలేక ♦ యడలుచునుండన్
గౌరాంగుకడకుఁ జనుమను
మారణమగుననియె నొక్క ♦ మాన్యుఁడతనితోన్. 5

ఆ. అంత నతఁడువ్రాయి ♦ యయ్యా! ప్రాయశ్చిత్త
మేమియనుచు నడుగఁ ♦ గృష్ణనామ
ములను నోరునొవ్వఁ ♦ బలుకుటయెయని
చెప్పిపుచ్చెనతని ♦ చిత్తమలర. 6

వ. రాజు నామాఙ్కింగావించి శ్రీకృష్ణనామస్మరణ జన్యమహానందమ
గ్నుండయ్యె. 7

సీ. నిమిదొల్తఁ దనహరి ♦ త్వముసూపినది కృష్ణ
భక్తుఁడైనట్టి శ్రీ ♦ వాసునింటఁ
ప్రథమసంకీర్తన ♦ పచరించినది కృష్ణ
భక్తుఁడైనట్టి శ్రీ ♦ వాసునింటఁ



దఱచుగా హరికథ ♦ ల్నెఱపినర్తించుట
భక్తుఁడైనట్టి శ్రీ ♦ వాసునింటఁ
దన యింటలేనప్డు ♦ చని నిమియుండుట
భక్తుఁడైనట్టి శ్రీ ♦ వాసునింట

గీ. మహితభక్తుఁడు శ్రీవాసు ♦ మనుమఁడైన
ధన్యపూత బృందావన ♦ దాసుఁడధిక
పావనంబగుచైతన్య ♦ భాగవతము
వ్రాసి ప్రకటించినదియు శ్రీ ♦ వాసునింట. 8

గీ. ఇట్లె యొకరేయి శ్రీవాసు ♦ నింటిముంగి
టనుజరగు కీర్తనకు భక్త ♦ జనులు వేగ
వచ్చి రాలస్యమైనఁ గ ♦ వాటబంధ
నంబుసేయుదురేమొ య ♦ న్భయముచేత. 9

క. తఱచుగఁ గీర్తనలారయ
నిరుగుపొరుగు కాంతలటకు ♦ నేతెంచుటయున్
జరగిన నారాతిరి యె
వ్వరురారై రొకనికింట ♦ వ్యాధిదవులుటన్. 10

గీ. ఆయొకండును శ్రీవాసు ♦ నాత్మజుండు
తల్లిదండ్రుల కొక్కఁడే ♦ తనయుఁడింక
నతనినంటినది విషూచి ♦ యనివచించి
రచటి వైద్యులవగుణము ♦ లన్నియరసి. 11

క. స్త్రీలకు సేవకులకు నా
బాలునిదా నప్పగించి ♦ భగవద్భజనా
శీలుర నెయ్యురఁగూడెన్
బాళిన్శ్రీవాసుఁడాత్త ♦ భక్త్యుచ్ఛ్రయుఁడై. 12

గీ. అంత భక్తాళి యెప్పటి ♦ యట్లతలుపు
మూసి, యచట గంగాదాసు ♦ మొనపి కాపు
కొఱకుఁ, దొడఁగిరి కీర్తన ♦ జరుప; నొక్క
రుండెఱుంగఁడు బాలకు ♦ రుజ తెఱంగు. 13

ఉ. భాసురగాత్రుఁడవ్యయుఁ డ ♦ పారకృపామయుఁడింటనుండె; జా
యాసుతవిత్తముల్గలల ♦ యందలియర్థము; లాత్మయత్నమా
యాసము; కృష్ణుఁడంతకు ని ♦ యామకుఁడౌనని యెంచి యిట్లు శ్రీ
వాసుఁడు సేసె; నేకసుత ♦ వత్సితయింకొరుఁడట్లొనర్చునే? 14

గీ. భక్తులందఱు నానంద ♦ వార్ధిమగ్ను
లౌచు నర్తించుచుండ గృ ♦ హంబుదాసి
వచ్చి పైనుండియుండి శ్రీ ♦ వాసుఁ జూచి
సన్న చేసె; నతండంతఁ ♦ జనియె వెంట. 15

క. చని లోపలఁ గుట్టుసురులఁ
బొనుపడియున్నట్టి సుతునిఁ ♦ బోద్గతదుఃఖం
బును బట్టలేక పొగిలెడు
తనవనితను దక్కు బంధు ♦ తతినింజూచెన్. 16

గీ. మృతికి సిద్ధుఁడుగానున్న ♦ సుతుని జూచి
యవల నానందమున నాడు ♦ హరిని జూచి
కొంతయలజడిఁ బొంది తా ♦ నంతనిశ్చ
యించుకొని యేడ్చువారితో ♦ నిట్టులనియె. 17

క. పుట్టునవియెల్ల నయ్యో!
గిట్టుట తప్పదిఁక మనము ♦ గిట్టుదుమెప్పుడో
యిట్టిదితను; వీచిదుగుల
కట్టెకునై యిట్టులడలఁ ♦ గా ఫలమేమో? 18



ఉ. ప్రాణము దేహమువ్వదలి ♦ పర్విడుకాలమునందు నింటిలో
మానులకందనట్టి వన ♦ మాలి, సమస్త దురంతపాప ని
ర్వాణకృతి క్షమాఖ్యుఁడు, కృ♦పానిధి నృత్యముసేయుచుండె; నా
సూనునివంటి ధన్యపురు ♦ షుండుగలండె ధరిత్రిలోపలన్. 19

గీ. చిరతపశ్శాలు లీతని ♦ సరసి యీసుఁ
జెందఁగానగు మీరింత ♦ కుందనేల?
సంతసింపంగవలసిన ♦ సమయమందు
నెందులకు నేడ్తురు; వివేక ♦ హీనులార! 20

వ. అనియంత, లోపలనుండి దుఃఖరూపం బగు నొకముద్దగొంతున కెగఁ
దట్ట మాటాడనేరక కొంతసేపూరకుండి తరువాతఁ గ్రమ్మఱ నిట్లనియె.

ఉ. ఔను స్వభావమెవ్వరికి ♦ నడ్డఁగ శక్యముగాదు; దుర్బలుల్
మానవు; లందుఁ గొందఱు బ ♦ లల్గదమీరలు; మోహిలనున్నయీ
కూన యతిప్రియుండగుటఁ ♦ గొంచెము దుఃఖము రాకమాన ద
ల్లైనను గొంతకాలమది ♦ యాఁపుఁడి మీరలు ధీరచిత్తులై. 22

ఆ. ఇట్టులేడ్చుచున్న ♦ నిదియెట్టులోఁ బైకి
వచ్చి కీర్తనంబుఁ ♦ బాడుసేయు;
నద్దిపాప; మదియు ♦ నయిపోవుఁ ద్వరగనే
యపుడు మీర లేచి ♦ యడలవచ్చు. 23

క. ఈలోపల మీరేడిచి
శ్రీలోలుని నర్తనములు ♦ చెఱిపితిరేనిన్
జాలించెద గంగంబడి
బాలకుతో నింకనాడు ♦ బ్రదుకంగూడన్. 24

గీ. అంతటను బాలు ప్రాణంబు ♦ లంతరించె
నేప్పదిగ్రమింగి కూర్చుండి ♦ రింటివారు

శవముచుట్టును ; శ్రీవాసుఁ ♦ డవలికేగి
కూడి హరిభక్తవారంబు ♦ నాడఁజొచ్చె. 25

గీ. భక్తుఁడొకని కీసంగతి ♦ బయలువడఁగ
నతఁడు శ్రీవాసు నాస్యము ♦ నరసెఁగాని
వంత యావంతయుం గనఁ ♦ బఱుప కాడు
చుండె నుద్బాహుఁడై భక్తి ♦ యుక్తినతఁడు. 26

గీ. ఒకరినుండి మఱొకరికి ♦ నొయ్యఁబ్రాఁకె
నీసమాచార ; మంతఁజూ ♦ ణించెభజన ;
బాలమరణజ్ఞులైనట్టి ♦ భక్తవరులు
వెఱఁగుపడిరి శ్రీవాసుని ♦ స్పృహతగాంచి. 27

సీ. ఒకఁడనె "శ్రీవాసుఁ ♦ డకలంకభక్తవ
ర్యుఁడుగదా ! నిమి, యింట ♦ నుండికూడ
నింతయాపద వాని ♦ కేలకల్గించె" నం
చదివిని మఱియొకం ♦ "డమితఘోర
కష్టంబెవచ్చెను ♦ గాని శ్రీవాసుఁడు
దాని నాత్మనొకింతఁ ♦ దాఁకనీయఁ
డట్టిచో సుతమృతి ♦ యాపదయనియెట్లు
చింతించియరసినఁ ♦ జెప్పఁగలము ?

ఆ. చూడు మాతఁడెట్టు ♦ లాడుచునున్నాఁడొ
యందఱనుగలంచు ♦ నార్తిమహిత
మేరుధీరుఁడైన ♦ మిశ్రిజుసద్భక్తి
నించుకేనిఁగలఁచ ♦ " దంచుఁబలికె. 28

వ. అంత భక్తినుండి తెరలి విన్నఁబోయిన వదనంబులతోనున్న భక్తు
లంగని గౌరాంగుండు. 29



క. ఆనందము నాకింతయుఁ
గానఁగరాకున్న దార్తి ♦ కలుషంబయ్యెన్
మానస మింతకుఁగతమే
మో ? నుడువుఁడటంచు భక్త ♦ పురుషులనడిగెన్. 30

వ. వారలు మిన్నకుంటసూచి గౌరాంగుండు 31

క. నాయెడఁద పీఁకుచున్నది
యేయాపదయేనిఁ గల్గె ♦ నే ? శ్రీవాసా !
నాయాన ; చెప్పుమయ్యా !
నాయన ! యనియడిగెఁ గ్లిన్న ♦ నయనుండగుచున్. 32

వ. శ్రీవాసుం డిట్లనియె. 33

క. ఓమజ్జీవితజీవమ !
స్వామీ ! నన్నెట్లు దుఃఖ ♦ సంచయమంటున్ ?
నీమానితపదములు నా
ధామము మెట్టుచును నన్ను ♦ ధన్యుని జేయన్. 34

ఆ. స్పర్శవేధితాఁకు ♦ సర్వము స్వర్ణమౌ
నట్లు నీపవిత్ర ♦ మైనయడుగు
లంటనాసమస్త ♦ మయ్యెఁబూతము దుఃఖ
లేశమేనినాకు ♦ లేదుతండ్రి ! 35

వ. అద్వైతుండంత దుఃఖంబుపట్టఁజాలక సాహసించి నిమికడకేగి. 36

క. నిజమే ! కష్టమువచ్చెను
ద్రిజగన్నుత ! యితనిసుతుఁడు ♦ మృతుఁడయ్యెనన్
గజిబిజిపడి నిమియడిగెను
ద్విజసుతుఁ డెప్పుడకటా ! గ ♦ తించెనటంచున్. 37

వ. అయ్యా ! రాత్రి తొమ్మిదిగంటల కనఁగా నిప్పటి కేడెన్మిదిగంటల

కుఁ బూర్వము శ్రీవాసునొక్కకుమారుండును మరణించెనని య
ద్వైతుండు గద్గదకంఠంబుతోఁ జెప్ప గౌరాంగుండు శ్రీవాసు నొక
కొంతసేపు జెప్పలుమూయక తేఱిచూచి సాశ్రులోచనుండై యి
ట్లనియె. 38

గీ. నేఁడు శ్రీవాస! శ్రీకృష్ణు ♦ నిజ్జయించి
వశపఱుచుకొంటి; విట్టిది ♦ భక్తియనఁగఁ;
ద్వాదృశోదార భక్తాను ♦ బంధములను
ద్రెంపుకొనిపోవుటయ్యో! దా ♦ రించుగుండె. 39

వ. అందులకు వలవలయేడ్చుచు శ్రీవాసుం డిట్లనియె. 40

చ. కొమరునిచావువంటి విఁకఁ ♦ గోటులు నర్బుదముల్భరింతునో
నిమి! భయమింతలేదు ధర ♦ నీస్థలిఁ గష్టములన్నఁ; గాని బా
ష్పములను నీవురాల్చినఁ బ్ర ♦ పంచము చీఁకటియౌను నేనుబ్రా
ణమునిలుపంగలేను గరు ♦ ణామయ! యట్లొనరింపకెన్నఁడున్. 41

క. నీచిత్తము నొచ్చునని యె
దాఁచితి నాసుతునిమృతిని ♦ దానికినై యా
లోచింపకు నాతండ్రీ!
యాచింత యొకింతయేని ♦ నంటదునన్నున్. 42

ఆ. నీవు గృహమునందు ♦ నృత్యముల్సేయుచు
నుండ నాకుమారుఁ ♦ డుసులుద్రోఁగె
నింతకంటె భాగ్య ♦ మేది? నామృతసుతు
నకును దండ్రినైన ♦ నాకుఁగృష్ణ! 43

వ. గౌరాంగుఁ డిట్లనియె. 44

సీ. నీచెప్పునదియెల్ల ♦ నిజము శ్రీవాసుఁడ!
శ్రీకృష్ణదాసుఁడు ♦ చింతఁదవులఁ;



డాపత్కదంబక ♦ వ్యాళంబునకుహారి
భక్తిగారుడమణి ♦ భక్తసింహ!
యాలింపు మొకరహ ♦ స్యంబు సెప్పెదనీకు
నీవు నేనును సౌఖ్య ♦ నివహములను
గూర్చుండి కుడుచుట ♦ కుంగాదు వచ్చితి;
మయ్యయ్యో! దుఃఖమ ♦ యంబుధరణి;

గీ. మనముబ్రదుకుట యీపృథ్వి ♦ జనుల వెతల
సాధ్యమైనంతవఱకును ♦ సమయఁజేయు
కొఱకుఁ; గావున మనబాధ ♦ లరయఁదీఱి
కయుఁగలదె మనకిచ్చటఁ ♦ గలుషదూర! 45

ఉ. ఒక్కఁడెనీకుఁబుత్రుఁ; డతఁ ♦ డొక్కఁడునున్మరణించె; నింతకే
మెక్కుడుకష్టముల్గలుగు ♦ నెవ్వనికేనిల? నవ్వియేమియున్
లెక్కగొనంగరావు; కద ♦ లింపవుచిత్తము; నిన్నుఁబోలువాఁ
రెక్కడనుందురయ్య! పరి ♦ కింపఁగ నీధరణీతలంబునన్. 46

ఆ. కొట్లుతిన్నకొలఁదిఁ ♦ గోమరుండు తల్లివ
తుంబుఁదూఱుపగిదిఁ ♦ గష్టమెంత
యెక్కుడైన నంత ♦ యెక్కుడుభక్తితోఁ
గృష్ణుఁగొల్తువీవు ♦ కీర్తనీయ. 47

గీ. చిమ్మచీఁకటినేగు జ ♦ నమ్మునకతి
తేజమిచ్చెడు దివ్వటీ ♦ తీరుగాను
మార్గసూచకుఁడవు నీవు ♦ మహితభక్త!
పుడమి దుఃఖార్తులైన ము ♦ ముక్షువులకు. 48

క. మునుపటికంటె విరాగత
పెనుపడె నీమనమునందు; ♦ వెన్నునికడకున్

జనుదెంచితి దగ్గఱగాఁ
దనయునిమృతికిదియె ఫలము ♦ తత్వజ్ఞమణీ? 49
గీ. అయిన మాయమ్మ మాలిని ♦ యడలుచుండుఁ
జలుపవలెఁగొంత దుఃఖోప ♦ శమనచర్య;
వడిగ నీబిడ్డమృతకళే ♦ బరము నిటకుఁ
దీసికొనిరండటంచుఁ బ్రా ♦ ర్థింపుమయ్య! 50
వ. అంత. 51
గీ. శవముతోడుత నందఱు ♦ శచితనూజు
కడకువచ్చిరి; వారిము ♦ ఖంబులరయు
నరుఁడెవండేని నిఁకఁ బ్రమా ♦ ణంబడుగఁడు
వసుధ దుఃఖమయంబను ♦ వాక్యమునకు. 52
క. కాంచఁగవలెనే బాలుని
దించెదరే యిచటనంచుఁ ♦ దెచ్చినవారిన్
గాంచి నిమియడుగనలె కా
వించిరి వారెవనుమిగుల ♦ విస్మయపడుచున్. 53
గీ. చూచిశవము శచీజుఁడు ♦ సుందరాంగ!
చచ్చిపోయితివే? యొక ♦ సారి మాట
లాడు! నీకోస మమ్మయు ♦ నాప్తవరులు
నేడ్చుచున్నార" టంచు శా ♦ సించెదాని. 54
గీ. చనినప్రాణంబు తిరుగనా ♦ తనువుసారఁగ
బిడ్డఁడిటుపల్కెఁ జూపఱు ♦ వెఱఁగుఁజెంద
"నీశరీరంబువిడిచి నే ♦ నేగువాఁడ
నుత్తమంబగు జన్మంబు ♦ నెత్తువాఁడ. 55
చ. హరి! కమలాక్ష! శేషశయ ♦ నా! నరకాంతక! కృష్ణ! కేశవా!



మరణమునొంది దీనికిని ♦ మంచిభవంబును గాంచువాఁడనీ
కరుణను; దేవదేవ! నను ♦ గావుము; నామనమెప్పుడు న్భవ
త్పరమపవిత్ర దివ్యపద ♦ పద్మములంటి భజించుఁగావుతన్! 56
క. అని గౌరాంగుని కోకవం
దనమున్గావించి మఱలఁ ♦ దరలిచనియె బా
లునియాత్మము; శవమయ్యెం
దనువెప్పటియట్ల; చేష్ట ♦ దక్కిరిద్రష్టల్. 57
వ. బాలునిజనకులు చింతవదలి యన్యవిధబాష్పప్లుతలోచనులై నిలఁ
బడిరి. అక్కడనున్నవారందఱు మరణంబన, నన్యజన్మప్రవేశద్వా
రంబుగదాయని మృత్యుభీతిందక్కి యాశ్చర్యమగ్నులై యుండిరం
త గౌరాంగుండు మాలినీశ్రీవాసులంగని యిట్లనియె. 58
క. మానితదంపతులారా!
సూనుఁడుపోయెనని మీరు ♦ స్రుక్కఁబడకుఁడీ!
నేను న్నిత్యానందుఁడు
సూనులమాదుమిఁగ మీదు ♦ సుతునకుఁ బ్రతిగా. 59
గీ. అంత శ్రీవాసుఁడనుజ భా ♦ ర్యాదిగేహ
వాసులందఱతో నిమి ♦ పజ్జకేగి
యార్తిసుఖములయందెప్పు ♦ డభవ! నీదు
వారమేకద మేమని ♦ పలికిమ్రొక్కె. 60
క. కొనిపోయిరి శ్రీవాసుని
తనయున్దహనంబుకొఱకుఁ ♦ దక్కినవారల్
సనిరంతట నిమిమహిమం
బున నేకవిధంబులుగను ♦ బొగడుచుభక్తిన్. 61
ఆ. భక్తులార! మిమ్ము ♦ వదలిపోవుట మది

కేగుదెంచినప్పు ♦ డెల్ల గుండె
లవియుచున్నవంచు ♦ నసె నిమిమనల నా
తండువిడిచిపోవఁ ♦ దలఁచెనేమొ. 62

క. అక్కటికవిడిచి మిశ్రజుఁ
డక్కరణిం జేసెనేని ♦ యయ్యో! మనకుఁ
దిక్కెవ్వఁడు? గంగంబడి
యొక్కమ్మకిఁ జత్తమింక ♦ నుండక యుర్విన్. 63

వ. అని భక్తులందఱు భావిభయవ్యాకులచిత్తులై యుండిరి. వారు భయంపడినట్లే కొన్ని నెలలపిమ్మట శ్రీకృష్ణచైతన్యనామంబున గౌరాంగుండు సన్యసించె. 64

ఆ. ఇపుడు బాలకృష్ణుఁ ♦ డపుడల్ల రాధయు
నౌచునిమి, జనాళి ♦ నలరఁ జేసె
భక్తిజీవమైన ♦ ప్రభుఁడెబోధించిన
నేల ప్రబలదిలను ♦ కృష్ణభక్తి? 65

క. చిగురాకు మోవినాడెడు
నగవులఁ ద్రైలోక్యమోహ ♦ నకరములగును
న్జిగిచూపులఁ జిమ్ముచు నో
మఁగదే! కారుణికరత్న ♦ మా! నస్రామా! 66

శ్రీరస్తు.

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః.

# శ్రీగౌరాంగచరిత్రము

ఏకోనవింశత్యాశ్వాసము

ఉ. జ్ఞానము, భక్తి, మోక్షజన ♦ కంబులెకాని, ద్వితీయమందులో
మానసరంజకంబు సుకు ♦ మారతరంబగుమార్గ; మెవ్వఁడేఁ
దేనియ గ్రోల దానిరుచి ♦ తేటపడంగల; దట్లుగాక యా
తేనియ నేనెయాదుననఁ ♦ దీపిభుజించుటయెట్లొ? రాఘవా! 1

క. శ్రీకృష్ణలీలనొండుఁ
గైకొని యొకనాటకంబుఁ ♦ గట్టిరిభక్తుల్;
వీఁకనటఁగొనిరి నిమి రా
ధాకృతియును గృష్ణురూప ♦ మద్వైతుండున్. 2

గీ. అందుజరగిన వృత్తాంత ♦ మంత దీని
ముందువచ్చెడు నాశ్వాస ♦ మందుఁ గనఁగ
వచ్చు; శ్రీకృష్ణుఁడైనస్మృతి ♦ వదలియాడి
పాడి డెబ్బదాజేండ్ల య ♦ ద్వైతుఁడటను. 3

క. ఈసంగతి యదిచూచుట
కోసము వచ్చినటువంటి ♦ కొందఱువెలుఁగుం

జేసియొ యేకతమునవో
వేసిరి యావృద్ధుచెవిని ? ♦ వెంటనతండున్. 4

క. తుద కెట్లయ్యెనునాగతి ?
బ్రదికితి డెబ్బదియునాఱు ♦ వత్సరములు నా
చదువెల్లఁ బడటఁగలసెను
ముదిమిని మదిచంచలించి ♦ పోయెఁ గటకటా ! 5

క. తలనరసె ; ఖర్జూరపు
ఫలములపై ముడుతలట్లు ♦ వళులంగముపైఁ
దిలకింపనయ్యె ; దంతం
బులుజాఱిన తొఱటయయ్యె ♦ ముదివక్త్రంబున్. 6

క. నాకేటికి బాలురతోఁ
గేకలు నాటలును వెట్టి ♦ కీర్తనములున్
గాకుల మూఁకంగూడిన
కోకిల క్రియనాదుపరువుఁ ♦ గోల్పోయితిఁగా 7

క. నావేదము నాశాస్త్రము
పావనవిద్యాప్రసంగ ♦ వర్తనములు జ్ఞా
నావనబోధములుంగల
లోవార్తలెయయ్యెనిమికి ♦ లొంగితినయ్యో ! 8

క. ఈనిమి మాంత్రికుఁ డీతని
చే నిటునల్గురును నవ్వఁ ♦ జెడిపోయితి నిం
కేనుండ నిచట నిమివల
లోనం బడనెప్పు ; డెట్టు ♦ లో ? యిట్టయితిన్. 9

క. కాటికిఁ గాల్సాఁచుకొనియు
నేఁటికిఁ బసిబిడ్డనౌచు ♦ నిమి బాలునితో



నాటకమాడితి నాకీ
వీటన్దలయెత్తితిరుగ ♦ వీలేయింకన్ ? 10

క. చాలింతు మూఢభక్తి ; సు
శీలత వేదోక్తవిధులఁ ♦ జేయుదుఁ బరమా
త్మా లోకనలాలసులకు
నేలా ! యీమద్యపాయి ♦ కృత్యంబులిలన్ ? 11

క. జ్ఞానము సర్వోత్కృష్టము ;
జ్ఞానమె మోక్షార్థసాధ ♦ నంబని నుడువన్
గా ! నిత్యపఠితబుధ స
మ్మానిత గీతాదిసత్త ♦ మ గ్రంథంబుల్ 12

క. దానినె యిఁకబోధింపఁగఁ
బూనెదఁజని మాదుశాంతి ♦ పురమునకు ; శచీ
సూనుని మాయలలోఁబడి
పోనిదె ! శపథంబువ్రాని ♦ పోయెదనటకున్. 13

వ. అని లజ్జాక్రోధ విషాదసంకులం బగుమనంబున నెవ్వరితోఁజెప్పక యద్వైతాచార్యుండు శాంతిపురంబునకుంజని తనకుంగల శిష్యకదంబకంబునకు జ్ఞానోత్కృష్టతయు భక్తినికృష్టతయు నుదయాద్యాసాయము లేని యోపికఁదెచ్చికొని బోధించుచుండె. వారిలో హరిదాసుఁ డొక్కరుండుమాత్రము శ్రీగౌరాంగదేవుపై భక్తినీసమం తేనివీడక యయ్యో! యీముదుసలిపండితుం డింతసంశయపంకిలుం డింతచలచిత్తుండయ్యెఁగా ! యని దుఃఖించుచుండె. సర్వజ్ఞుం డగు గౌరాంగుం డిదియెఱింగి యొకనాఁడు ప్రాతఃకాలంబున నిత్యానందునితో శాంతిపురంబునకేగి యద్వైతాచార్యుం దర్శించివత్తమని చెప్పి శచీజనని యాజ్ఞంబడసి కదలి నవద్వీపంబుక్రిందఁ బడిమైళ్ల

దూరంబున భాగీరథీతీరస్థంబైయున్న యాగ్రామంబున కభిము
ఖుండై నితితోఁ జనియెనంత. 14

గీ. అర్ధదూరంబునం దప్పు ♦ డచటనుండి
యవల నేటనుగలిసిన ♦ యట్టి లలిత
పురమనెడునూర, నాపగ ♦ దరిని, విసరి
వేసినట్లున్న గుడిసె గా ♦ న్పించెనొకటి. 15

గీ. అంత గౌరాంగుఁ డిందెవ్వ ♦ రయ్య! యున్న
వారటంచును బృచ్ఛింప ♦ వాస్తవంబు
నెఱిఁగియుంటను నితివల్కె ♦ నిచట దార
యుతుఁడగుచు నొక్క సన్న్యాసి ♦ యుండునంచు. 16

వ. గౌరాంగుం డిట్లనియె. 17

క. ఇదియేమయ్యా! యతికిన్
ముదితల పొత్తెట్లుపొసఁగుఁ ♦ బొలఁతుకఁ బైఁడిన్
వదలినవాఁడెకదా! యతి
పదమునకర్హుఁడగుఁ; జూచి ♦ వత్తము రమ్మా! 18

వ. ఇర్వురుఁ గుటీరంబుసేరంజన సన్న్యాసియగునితిని మొదటఁజూచి, తన్నివాసియగుసన్న్యాసి, స్వాశ్రమాభిమానంబునఁ బ్రత్యుద్గమించి వాని గౌరవించి. 19

గీ. కొంతసే పన్నలార! వి ♦ శ్రాంతిఁగొనుఁడు
నిచటనుండుఁడు భగవంతుఁ ♦ డిచ్చినంత
కొలఁది నాతిథ్యమొసఁగెదఁ ♦ గొనుఁడటన్న
వల్లెయనెనితి; నిమియేమి ♦ పల్కకుండె. 20

ఆ. వెనుకనున్నయట్టి ♦ విశ్వంభరుండంత
నెదుటికరుగుదెంచి ♦ యెంతొభక్తిఁ



గేలుఁగవనుమోడ్చి ♦ నేలపైఁజాగిల్లి
జోగిపాదములకు ♦ జోతసేసె. 21

వ. అంత నాభిక్షుకుండు. 22

క. చాలఁగ విద్యయు, సిరియున్,
శీలము వినయంబుఁగల్గు ♦ చెలియు, విధేయుల్
బాలకులు, నీకుఁగల్గెడు
బాలుఁడ! యని దీవనలను ♦ బచరించెదయన్. 23

వ. దానికి శుద్ధస్వాంతసూచక వినిర్మలాకాశ సంకాశవదనంబున నతి వినయంబున నిమి యిట్లనియె. 24

శా. యోగీశా! త్వదనుగ్రహార్థమిటు ల ♦ త్యుత్కంఠతోఁ మ్రొక్కి, స
ద్భాగప్రాప్తికి మాఱుప్రత్యహ దురం ♦ తస్వాంత చింతాకర
ప్రాగల్భ్యక్షణభంగురాత్మజ కళ ♦ త్ర శ్రీముఖార్థంబులన్
దోఁగం జేసెడి దీవనల్వీని మన ♦ స్తుష్టిన్గన న్లేశమున్. 25

క. నశ్వరముల నొసఁగితివహా
నీశ్వర! నీయట్టితపసి ♦ యిచ్చెడువరముల్
శాశ్వతసౌఖ్యప్రదము, ల
నశ్వరములు నొచునుంట ♦ న్యాయమునుమ్మా! 26

వ. అన మహోగ్రాకారుండై సన్న్యాసి యిట్లనియె. 27

శా. యాత్రల్సేసితి సేతుశీతనగమ ♦ ధ్యప్రాక్తనాంచన్మహా
క్షేత్రప్రాజ్యపురప్రకాండములకు; ♦ న్సేవించితిన్గల్పిపా
ర్త్రత్రానైక సురాలయంబులఁ; దపో ♦ ధన్యాత్మధామోల్లస
ద్గోత్రంబుల్గని పెక్కుపుణ్యనదుల ♦ న్దోఁగించితి న్దేహమున్. 28

క. దేవి దేవగణంబుల
సేవించితి నధికనిష్ఠఁ ♦ జిరకాలము నా

నావిధ యోగక్రియలం
గావించితి నొరులుమెచ్చ ♦ కరణిన్నిగురుల్. 29

క. ఇటువంటి నన్ను గర్వో
ద్భటతార్భటిఁ బెద్దపిన్న ♦ వాసిఁగనకీ
విటుసేయు మట్లుసేయకు
మఱచుఁబల్కుటకు బాల ♦ కా! జంకవుగా! 30

వ. అనునంతలో నిత్యానందుం డడ్డపడి పోనీ! సోదరా! తెలయకీ
కుఱ్ఱాఁ డిట్లువచించె. ముక్కుఁబచ్చలాఱని యీపసికూన నీమహ
త్త్వం బెట్లెఱుంగంగలఁడని నుడివి శాంతింపంజేయ నాజటిలుండు
స్ఫురద్రూపుండగుబాలుని మోసపుచ్చి తోడిసన్న్యాసియగునితని
యొందులకో కొనిపోవుచున్నాఁడని తలంచి యాతనిపై మఱి కోపిం
పక లోనికింజని స్వాదుఫలంబులం గొన్ని తెచ్చి వారియెదుటంబెట్టి
నితితో నిట్లనియె. 31

క. విందిడుటకు మాయాశ్రమ
మందింతకుఁదక్క నేమి ♦ యాహారంబుల్
సందర్భపడవు; చని "యా
నందం" బొక్కింత తెత్తు ♦ నా! యనునంతన్. 32

క. లోపలనుండి కళత్రమె
దోపనికై యతనిఁబిల్చెఁ; ♦ దొందరపడుచున్
లోపలికిఁబోయె నాతం;
డాపదమునకర్థమేమి ♦ యని నిమియడిగెన్ 33

గీ. ఇతఁడు తాంత్రికసన్న్యాసి ♦ యిట్టివారి
కంగనాసంగమంబు మ ♦ ద్యరసపాన
మును విహితములెకాని కహా ♦ డనివిగావు



పెక్కు రిటువంటిజోగులీ ♦ పృథివిఁగలరు. 34

క. సురనే 'యానందం' బను
పరిభాషను బిల్తురడియె ♦ పట్టుకవచ్చున్
మఱి మనకుఁగూడ నతఁడని
చిఱునవ్వునఁ జెప్పెనితి శ ♦ చీసుతుతోడన్. 35

వ. అంత హరి! హరీ! యని గౌరాంగుం డర్ధభుక్తఫలంబు లట్టులెవిడి
చిపెట్టి, వెంటరమ్మని నితికిఁ జేసన్నచేసి యిదివఱకువచ్చిన రాజమా
ర్గంబుం బట్టిచనక కరధృత సురాద్రవంబుతో సన్న్యాసి వెంటఁబ
డునేమోయని హర్యక్షుదర్శియగు హరిణంబుకరణి నొక్కపర్వన
గంగకుంజని యందులోనుఱికె, నితియు నట్లుగావించె. 36

మ. జవసత్త్వాఢ్యులు, ధైర్యశాలు, లుభయు ♦ ల్శారీరకష్టంబు లెం
తవియేని న్భరియింపనేర్తురిఁక నీఁ ♦ తన్నిస్తులప్రజ్ఞగ
ల్గువయస్వంతులు, గాన నేటఁబడియే ♦ క్రోశద్వయాధ్వంబు, ను
ద్దవిడినొవ్వఁగ నీశ్ఛుయించుకొని యీఁ ♦ దన్దొట్టిరా యిర్వురున్. 37

చ. మకరవితాన భీకరత ♦ మంబగునిమ్నగ నీఁదుచున్నవా
రికి నొకజంతువేని యొన ♦ రింపగుహాని; భయంబుఁజేసి చెం
తకుఁజనకుండఁ బాఱెనఁట ♦ నక్రములన్నియు; వారలిట్లు కొం
కకచని యేటివాలునను ♦ గాంచిరి శాంతిపురంబుఁ జెచ్చెరన్. 38

మ. చనుచుండ న్నిమిమానవత్వమఱి శ్రీ ♦ జానిత్వమున్దాల్చి మిం
చెను; గంగాజలమంగసంగతిని బా ♦ ల్చెన్దివ్యతేజశ్ఛటల్;
"మనయద్వైతుఁడు భక్తిఁవీడి ప్రజకున్ ♦ జ్ఞానంబు తానేర్పుచుం
డెనుగా! నేఁడెకుదుర్తురోగ" మనియా ♦ డెన్మిశ్రజుండుగ్రుఁడై. 39

మ. నితి యద్వైతునికెంతశిక్షయగునో ♦ నిర్మాయచిత్తుండుగా!
యతఁడంచు న్వెతసెందుచుండె; నిమి ది ♦ వ్యాకారమంతంతకున్

ద్యుతివృద్ధిఁ గనుచుండె; నిట్లుసని యా ♦ యూరిఁ బ్రవేశించి రు
ద్గతులై విప్రునిస్నానఘట్టముకడ ♦ న్గౌరాంగుఁ డానందుఁడున్. 40

క. పీరెక్కిన గట్టునకుం
జేరువ యద్వైతుగృహము ; ♦ శిష్యావృతుఁడై
పాఱుండుండెనగారము
గౌరాంగుఁడు సొచ్చునట్టి ♦ కాలమునందున్. 41

క. ఇటులున్న వృద్ధదేశికుఁ
దటుకున నిమియెమరుకొనఁగఁ ♦ దత్తఱపడి యె
ప్పటియట్టులతఁడు మన్నిం
చుటకై హరిదాసుతోడఁ ♦ జొక్కినిలఁబడెన్. 42

చ. సకలజగత్ప్రభుండతఁడు ♦ సల్పునపర్యలనందుకోక, రు
ట్ప్రకటకలోచనంబులను ♦ బాఱునిజూచుచుఁజెప్పు! ముక్తిదా
యకములరెంటనిష్టతర ♦ మైనదినీకేది? జ్ఞానమా? యఘాం
తకహరిభక్తియా? నుడువు ♦ నాయెదుటన్విశదంబుగాననెన్. 43

క. కృతనిశ్చయుఁడై యుండిన
కతమున నద్వైతుఁడంత ♦ గౌరాంగునితో
మతిదృఢపఱచుక, జ్ఞానమె
గతినా, కదిభక్తికంటెఁ ♦ గడుశ్రేష్ఠమనెన్. 44

వ. అంత గౌరాంగుండు. 45

క. అవు నెఱుఁగుదు దుశ్చింతలు
దవిలెను నీమనసునంచు ♦ దానికిఁదగు శి
క్షవిధించిచేసి నిన్ని దె
నవరించెదనంచుఁ గొట్ట ♦ సాగెన్విప్రున్. 46



చ. ఇరువదిమూఁడువర్షముల ♦ యేపునఁ బీవరకాయసంపదన్
బరఁగు శచీజుఁడర్ధశత ♦ వర్షములవ్వల నిర్వదాఱువ్రా
వ, రదవిహీనవక్త్రమున ♦ వాడినమోమునఁ బొట్టిమేనదు
ర్భరజరఁజిక్కి గాసిలెదు ♦ పండితుపైఁబడి మోఁదుచుండెఁదాన్.

ఉ. ఎందఱుశిష్యులున్న నది ♦ యేమొ! యొకండును జెంతకేగి యాఁ
పందిపురందుమిశ్రజుని, ♦ వారిల్చక తెప్పలఁజూచుఁగాని; యీ
చందముఁగాంచి వృద్ధసతి, ♦ చచ్చెను మీగురువయ్యొ! చూచుచి
ట్లుందు రదేమిపాపమని ♦ యాఱడకేడ్చెను బద్ధపాణియై. 48

ఉ. నేలనుగూలవైచి ధర ♦ ణీసురశేఖరుఁ, బైనవ్రాలి యు
ద్వేలకరప్రఘాతములఁ ♦ బీడనొనర్చుచు వ్యాఘ్రపోతమా
భీలచపేటపాతముల ♦ వృద్ధవృషంబునుదాఁకి క్రూరదు
ష్షీలనుజొచ్చునట్లు నిమి ♦ చిత్రముసేసెను సీతబెగ్గిలన్. 49

క. నానాథుఁడు జనులారా!
ప్రాణముఁ గోల్పోవనున్న ♦ వాఁ డయ్యయ్యో!
యీనిమి కడ్డముసని నా
ప్రాణేశునిగాచు పుణ్య ♦ వంతులు లేరే? 50

క. నాపసుపుంగుంకుమయును
బాపఁడు నేఁడపహరింప ♦ వచ్చెఁ గటకటా!
మీపదములపైఁబడియెద
నాపన్నారక్షసేయ ♦ రయ్య! మహాత్ముల్. 51

వ. అని సీత యశ్రుసంసిక్తవదనయై యెంతయుఱచిన నొక్కండురాక, పలుకక, కదలకమెదలక నిర్జీవప్రతిమావలోకన ప్రతిమానలోచనంబుల రావడిచూచుచు మిన్నకుండెనంత నామె పూర్వదృష్టవిశ్వరూపస్మృతి యంతయుపీడి పతిశిక్షావీక్షణంబున కోపకలుపితయై

నిమివంకకుం దిరిగి యిట్లనియె. 52

ఉ. ఏమిర ! దుష్టబాల ! యిటు ♦ హింసను బెట్టెదు జీవితేశు, నీ
భూమిసురాగ్రగణ్యుఁడు రు ♦ బోధకుఁ డాగమశాస్త్రవేత్త ప్ర
జ్ఞామహితుండు వృద్ధుఁడు స ♦ నాతనమార్గచరుండు దుష్కృతం
బేమియొనర్చె నీకతని ♦ నీగతి మోఁదెదు హ్రీవిహీనుఁడా ! 53

క. ఆఁగుము కొట్టకుమిఁక నీ
వాఁగక యిటు బాఁదితేని ♦ యసువులు రాల్చున్
భాగవతోత్తముఁ; డంతట
భోగింతువు బ్రహ్మహనన ♦ భోగము లెల్లన్. 54

వ. అని యెన్నిమాటలాడిన నిమివిడువక కొట్టుచుండ నిఁక నద్వైతుండు.

ఉ. ఏడువఁ డుండుముండుమని ♦ యింతయు వేఁడఁడు క్రూరహస్తసం
తాడనపీడ మోమునఁ గ ♦ నంబడనీయఁడు మోదవార్ధిలో
నాడి మునుంగువాని క్రియ ♦ నాస్యదృగోష్ఠరుచుల్వెలార్చు నీ
పోఁడిమిఁ గాంచి యచ్చెరువుఁ ♦ బొందిరి దగ్గఱనున్న యందఱున్. 56

వ. మఱియు నిమి గ్రుద్దుచుండ నద్వైతుం డిట్లనియె. 57

క. ఓయీ ! గౌరాంగా ! యీ
హాయికి నెనయైన సుఖము ♦ నెయ్యెడఁ గన న
బ్జాయతలోచన ! మానక
చేయుము సతతంబు నిట్టి ♦ శిక్షను నాకున్. 58

క. నీకృపయే కృప ! దానిని
వాకొనశక్తుండు గాఁడు ♦ వసుధ నెవండున్
నీకోప మింత సుఖకర
మే కరణి నినుండుఁ బూర్ణ ♦ కృపగల్గినచోన్. 59

వ. నిమి కొట్టికొట్టి విడిచిపెట్టె రోఁజుచు లేచి వెడలి వసారా పైఁ గూర్చుం



డి యందఱకు వినఁబడునట్లు తనలోఁ దానిట్లు గొణఁగుకొనియె. 60

గీ. జ్ఞానమే ముక్తిసౌఖ్య సం ♦ ధాయి యేని
శాస్త్రవేదాంతపఠనంబె ♦ చాలు నేని
యుమ్మలించుచు నన్ను రా ♦ రమ్మటంచుఁ
బిలిచి యవతారమెత్తించి ♦ వేఁపనేల ? 61

వ. అద్వైతాచార్యుండును లేచి యుద్ధృతబాహుండై మహానందద్యో
తకంబు లగు నర్తనంబులు సేయుచు నిట్లనియె. 62

శా. భాస్వద్దేహుఁడు, లోకపావనుఁడు, శ ♦ శ్వత్సౌఖ్యసంధాత, ! పే
మస్వాంతుండు, యశోదబిడ్డ, ప్రజలం ♦ బాలింపఁగా నిస్తు
జస్వాంతుండయి పూజ్యయౌ శచికిం దా ♦ జన్మించియున్నాఁ డిటన్
భూస్వర్లోకనివాసులార ! కనుఁడీ ♦ పుణ్యంబు పార్జింపుఁడీ ! 63

క. నేవిడిచిన హీనమతిన్,
దా విడువక నాదుమూర్ఖ ♦ తన్గనకుండన్
గావించి పెద్దపయనము
నా వేశ్మము సొచ్చి చూచి ♦ నన్గరుణించెన్. 64

క. వెడమార్గంబునఁ బోయెడు
బడుగు న్గరుణాబ్ధియైన ♦ వారిజనాభుం
డడుగక యె వచ్చి గ్రుద్దుల
వడి దిద్దె నొసంగెఁ గృష్ణ ♦ భక్తిన్మఱలన్. 65

మ. నిమి తన్ను న్నెపపెట్టినట్టి నొడుల ♦ న్విన్విన్న యద్వైతుఁ డం
తమహాకాంతిని బొల్చు బాలకుని చెం ♦ తన్జేరి తత్పాదయు
గ్మముఁ జేదోయినిబట్టి గట్టిగ మహా ♦ త్మా ! నన్ను మన్నింపు ; నే
రము నాదే ! యని యంఘ్రిపద్మముల మూ ♦ ర్ధంబుంచి చుంబించెఁ దాన్

ఆ. అంత మానుషత్వ ♦ మాదెను నిమి ; గురు

నతులఁగాంచి చాల ♦ నానసెంది
లోకవంద్య ! నన్ను ♦ శోకపెట్టకుమింత
లేసిపనులు నాకుఁ ♦ జేసియనియె. 67

క. కలఁగని మేల్కాంచి నతని
వలెనిమి గళవళముసెంది ♦ పాపపుఁబనులన్
జలిపెనో యేమో తానను
నలుకున నద్వైతుతోడ ♦ ననె నీపగిదిన్. 68

శా. ఆచార్యా ! యపచారకృత్యముల నే ♦ నజ్ఞుండనై చేసినన్
వాచావేత్రకరప్రఘాతముల మ ♦ త్పాపప్రచారంబులున్
నీచాప్రాజ్ఞ కృతుల్మఱల్చి మదిలో ♦ నీతిన్నలిన్గొల్పి ధీ
రోచిష్ణున్నయశీలుఁజేయఁగదె కా ♦ రుణ్యంబునన్నన్వెసన్. 69

క. సుతునవినీతుని బ్రోచెడు
పితగతిఁ జ్యుతనీతినైన ♦ నీనిని, మీయ
చ్యుతునింజూచెదవీఁక
న్నతతంబరయంగరాదె ♦ సద్గుణజలధీ. 70

వ. అను నీవింతవాక్యంబులాకర్ణించి యద్వైతాచార్యుండు నిత్యానందుండును నవ్వులదరుమొగంబులతో నన్యోన్యావలోకనంబు గావించుకొనిరి. ముకుళితకరసరసిజుండై నిలువంబడిన గౌరాంగుంజూచి యద్వైతుండు పెద్దఱికంబుదాల్చినరియే కాని యార్ద్రవస్త్రంబులతోఁ బంకిలిప్తాంగంబుతో నున్నవాఁడవు, స్నానంబాడవలదా! మనమందఱము గంగకుంబోవు సమయంబయ్యెనని నుడివిలేచె నంతఁ జెంతనున్న నీతంజూచి నిమియిట్లనియె. 71

శా. అమ్మా ! యాఁకలిగొంటినమ్మ ! కడునా ♦ యాసంబుమైఁగ్రమ్మె ; శీ
ఘ్రమ్మాహారమువండి కృష్ణునకు న ♦ ర్చల్సేసి వేగన్నివే
ద్యమ్ముల్వెట్టి ప్రసాదము న్వడిగ మా ♦ యాచార్యుఁడున్నేము స్నా
నమ్ముల్గంగను జేసివచ్చుతఱికి ♦ న్వడ్డించి యుంచన్వలెన్. 72



క. అని తల్లిఁగని చనవునఁ
దనయుఁడువల్కుగతి మిశ్ర ♦ తనయుఁడువల్కన్
వనితగనుల్నెమ్మగిలన్
వెనుకటి కోపమునుమఱచి ♦ ప్రేమన్గదిరెన్. 73

క. ఈలలితాకారునిగని
ప్రేలితి నేమేమొ కార్లు ♦ విష్ణుఁడెనిజమీ
బాలకుఁడని కాంతామణి
వేశములోనికిని బోయె ♦ వ్రీడావిలయై. 74

క. చని షడ్రససంయుతభో
జనసంభారములఁగూర్చి ♦ చక్కఁగఁ బచనం
బును జేసిపెట్టె నీతా
వనితామణి యాత్మ ♦ నంతనశింపన్. 75

గీ. గంగకేగినవారల ♦ భంగలీల
నంతరంగస్థమోదంబు ♦ నాఁపలేక
పెల్లుగానీఁది విహరించి ♦ చల్లులాడి
స్నానమాడుచునుండిరి ♦ చాలసేపు. 76

గీ. కొంతవడి కీవలకువచ్చి ♦ పొంతనున్న
యట్టిరాధికాకృష్ణ దే ♦ వాలయంబు
సొచ్చి దేవుని దేవిని ♦ జూచి పూజ
సేసి సాష్టాంగనతులను ♦ జేసిరంత. 77

ఆ. నిమియు నితియు భక్త ♦ సమితిదర్శించుటఁ
జేసి దివ్యభవ్య ♦ సేవ్యపరమ

పావనాలయముగ ♦ భావించు నీదేవ
ళంబు నిప్పటికి జ ♦ నంబుభక్తి. 78

క. ఒఱగెను ముందఱనిమి ; త
చ్చరణంబుల శీర్షమొరయఁ ♦ జాఁగిలె సీతా
వరవర్ణినిపెన్మిటి ; యా
గురుపిఱుఁదన్దాసుఁడొఱగె ♦ గురుతరభక్తిన్. 79

గీ. ఇద్దిపరికించి నితివల్కె ♦ నిలనుగల్గు
వారు దుస్తరసంసార ♦ వార్ధిదాఁటి
యల్లబృందావనంబున ♦ కరిగి సౌఖ్య
పడుట కిదియొక్క పెన్వింత ♦ వంతెనయని. 80

గీ. నరులఁగొని చనునద్వైతు ♦ దరికి దాసుఁ,
డతఁడు గొనిచనువారి గౌ ♦ రాంగుకడకు,
నిమియొ వారిరాధాకృష్ణ ♦ నిలయమైన
విమల బృందావనంబున ♦ విడిచివచ్చు. 81

వ. ఈకి్రంది గీతికాద్వయంబు గౌరాంగుమహత్త్వంబుఁ దెల్లంబుగా
వించు నందు రెండవది నిత్యానందకృత ప్రజాసంబోధన కలితగా
నంబై యొప్పు. 82

ద్వి. మదనసుందరుఁడవౌ ♦ మాలిమికాఁడ
సదయుండవైమమ్ము ♦ సంసారజలధి
దాఁటించి యవ్వలి ♦ దరిఁజేర్పుమయ్య !
నేఁటికిఁగాన్పించె ♦ నీరేవు మాకుఁ
దరణేచ్ఛమేమిటు ♦ తత్తఱపడుచు
నరుదెంచినాము గౌ ♦ రాంగ ! నీకడకుఁ
గరుణాపయోధివ ♦ న్ఖ్యాతినాలించి



నిఱుపేదలముమేము ♦ నీరేవు వెదకి
కొంచువచ్చితిమయ్య ! ♦ గోవింద ! నీకు
నించుకే నాతర ♦ మీయంగలేము. 83

ద్వి. అవలిగట్టునకేగి ♦ యానందమందు
నెవరేనిఁగోరిన ♦ నేతెందువేగ
కరుణఘ్నవైన మా ♦ గౌరాంగుఁడవని
నరుదుగాధర్మార్థ ♦ మందఱకొఱకు
నొక రేవువెట్టెఁ గే ♦ వొకకాసునడుగఁ
డిఁకజాగుసేయుట ♦ కేమికారణము ?
జారులుఁజోరులుఁ ♦ జటులవర్తనులు
ఘోరపాపులు మహా ♦ కుటిలాత్మకులును
జండాలకృత్యము ♦ ల్సల్పెడువారు
రండు ! తరింపమి ♦ శ్రీజుఁడుండుకడకు ! 84

గీ. శాంతిపురినుండి యద్వైతు ♦ శచిసుతుండు
శంకలడఁగించి భక్తిని ♦ శ్చేలునిఁజేసి
తీసికొనిపోయెఁ దన నవ ♦ ద్వీపమునకు ;
నంతకును మున్నకావించె ♦ వింతయొకటి. 85

సీ. శాస్త్రివేత్తయు శిష్ట ♦ సత్తముండును భక్తుఁ
డైన గౌరీదాసుఁ ♦ డనెడువాఁడు
సంసారమునురోసి ♦ సన్మోక్షసంధాన
చణములైనట్టి వ్యా ♦ సంగములను
దవిలి నిర్జానుష ♦ స్థలమున నేకాంత
ముగ నుండనెంచి ని ♦ మ్నగకు నవలి
యొడ్డునఁగాల్నావు ♦ రోపాంతమందున

జ్ఞానభక్తిధ్యాన ♦ కలననుండి

ఆ. కృష్ణుఁ డేగుదెంచె ♦ నిలకనివి నేఁగాని
యరయలే; డిటుండ ♦ నతనిమ్రోల
నొక్కనాఁడు తెడ్డు ♦ నొకదానిబుజముపైఁ
బెట్టికొని శచీజుఁ ♦ డిట్టితోఁచె. 86

క. పండితగౌరీదాసుఁ డ
ఖండద్యుతిభాసమాన ♦ కాయముతో ని
ల్చుండిన బాలుంగని మా
ర్తండునిగనినట్లు బాధి ♦ తాక్షుండయ్యెన్. 87

క. మిఱుమిట్లుగొనెడు కనులన్
గరమున్న శ్లేష్మమైన ♦ కాయంబునఁ ద
న్నరయుచున్న విపశ్చి
ద్వరుతో నిమి యిటు గభీర ♦ వాక్కులఁ బల్కెన్. 88

ఆ. శాంతిపురమునుండి ♦ చనుదెంచుచున్నాఁడ
వరులనవలియొడ్డు ♦ నకుఁగొనంగఁ
దెడ్డునొక్కదానిఁ ♦ దీసికవచ్చితి
నీకొఱకునటంచు ♦ నిమివచించె. 89

వ. గౌరీదాసుండు. 90

ఆ. ఇంతభారమును వ ♦ హింపఁగా శక్తుండ
నైనఁగాక యెట్టు ♦ లందుకొందు
స్వామి! యిట్టితరణ ♦ సాధనంబనిపల్కి
కరముఁగొంకె దానిఁ ♦ గైకొనంగ. 91

వ. అంత గౌరాంగుం డదియొంతకార్యం బీవు ముఖ్యంబుగా నట్టిశక్తిఁ బడసెదవన గౌరీదాసుం డాశ్చర్యభయసంభ్రమసంకలితచిత్తుండై



యాతఁ డెవ్వండింతధైర్యంబుగఁ బల్కుచున్నవాఁడని యించుకచిం
తించి 'యయ్యా! నీ వెవ్వండ విట్లు సాహసించి నాకాజ్ఞయొసంగు
చుంటి' వన. 92

గీ. నే నవద్వీపమందలి ♦ నిమినటంచు
నుత్తరంబీయ నాభక్తుఁ ♦ డుత్తమాంగ
మును ధరణివఱకును వంచి ♦ పుచ్చుకొనియె
నాయరిత్రంబు భక్తిబా ♦ ష్పంబులొలుక. 93

క. గౌరీదాసుఁడునిల్పిన
గౌరాంగానందరూప ♦ కలితప్రతిమల్
చారుతరార్చలనందుచ
వారిగ, నాయూరవెలయుఁ ♦ బ్రస్తుతమందున్. 94

ఆ. ఇతఁడుగట్టినట్టి ♦ యీదేవళంబున
నల్ల నిమియొసంగి ♦ నట్టికేని
పాతకంబు నేఁటి ♦ వఱకును యాత్రార్థ
మరుగు జనులుప్రోయి ♦ యరసివత్తురి. 95

శా. గౌరీదాసుఁ డుదారభక్తుఁడను వి ♦ ఖ్యాతిన్సమార్జించి కం
సారిధ్యానమహాప్రభావము విశే ♦ షాసక్తిబోధించి వి
స్ఫారంబౌనల యోఢ్రదేశపుఁ బ్రజ ♦ న్భక్తాళిగాఁ జేసె; వి
స్తారంబౌనిమిభక్తి యిప్పటికిఁ గాం ♦ చంగల్గు నోఢ్రింబునన్. 96

ఆ. పరుసవేదియినుము ♦ బంగారుగాఁ జేయుఁ
గాని స్పర్శవేధి ♦ గానొనర్పఁ
జాల; దింకనిమియొ ♦ జనులభక్తులుగ భ
క్తకరులుగనుగూడఁ ♦ గరుణఁ జేసె. 97

గీ. ప్రజలనాస్తికతాబుద్ధి, ♦ పాపవృత్తి,

నిర్ఘృణత్వాది దుర్గుణ ♦ నిచయ, మెట్లు
కంటఁగని నిమివాపెనో ♦ కనఁగవచ్చు
ధన్య "చైతన్యచరితామృ ♦ తంబు" నందు. 98

క. జనకులు తమబిడ్డల లా
లనతాడనసాధనముల ♦ లలితాత్ములుగా
నొనరుచునట్లక్కటిక
స్మనుతువుగా! నీదుభక్త ♦ మండలి, రామా! 99

శ్రీరస్తు.

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః

# శ్రీగౌరాంగచరిత్రము.

## వింశాశ్వాసము.

ఉ. ఆటలు మాకుబాల్యమున, ♦ యౌవనమం దెలనాగతోడ స
య్యాటలు, వానివెన్కను ని ♦ రంతరసంసరణప్రయాసముల్,
గాటపుఁజింతలామయ వి ♦ కారములంతమునందున, న్జగ
న్నాటకసూత్రధార! రఘు ♦ నందన! నీకిది చిద్విలాసమా! 1

క. వెనుకటియాశ్వాసము నా
దిని సూచింపంగఁబడిన ♦ దివ్యమనోము
జ్జనక శ్రీహరిలీలా
ప్రణీతనాటకము వేయఁ ♦ బడె నీపగిదిన్. 2

వ. ఒక్కనాఁడు గౌరాంగుండు భక్తులతోఁ "జెలులారా! శ్రీకృష్ణలీల యొండు నాటకంబాడుదము. దానంజేసి చిత్తశుద్ధియును దివ్యాత్మానందంబును జేకుఱు" నన వారలాశ్చర్యపడి "స్వామీ! నాటకంబు కట్టందివురునది, యేలీల? అంకవిభాగంబుతోఁ దొల్దొల్త నొకనాటకంబు మనోహరంబుగ రచియింపవలయుఁ; బిమ్మటఁ బాత్రలఁ బాత్రులగువారికిఁ బంచిపెట్టవలయు; వారు వారివారిభా

గంబులు గట్టిగ వల్లింపవలయు ; నట్లు సేసిరో లేదో, యభినయంబు సమంజసంబుగ నున్నదో లేదో కొన్ని రహస్యప్రదర్శనంబులం జేయించి కనవలయు ; నింత కావించినపిదపఁగదా యీనాటకంబు ద్రష్టల సమక్షంబున బహిరంగముగాఁ జూపుట” యనఁ జిఱునవ్వుతో గౌరాంగుండిట్లనియె. 3

ఉ. అక్కఱ లేదు మీనుడువు ♦ నట్టిప్రయత్నము లేమి ; వ్రాయఁగా
నక్కఱ లేదు నాటకము ; ♦ నాడుతఱి న్బ్రతివేషధారి స
మ్యక్స్మృతవాక్ప్రసంగముల ♦ నందఱను స్మదమొందఁ జేయు ; నం
దొక్కఁడుఁ బూర్వపాఠకల ♦ నోదిత కష్టమువొందఁడింతయున్. 4

క. కావలసిన కార్యంబులు
గావించునోరుండువచ్చు ♦ కాలంబున ; భ
క్తావళి యొకపటుమాంత్రికు
కైవసమైనట్టి బొమ్మ ♦ కైవడిఁ దిరుగున్. 5

క. మామామ చంద్రశేఖరు
ధామంబున నాటకముఁ బ్ర ♦ దర్శింతము, త
త్సామగ్రి సదాశివుఁడున్
క్షేమహితుఁడు బుద్ధిమంత ♦ ఖానుఁడుఁ గూర్చున్. 6

వ. అందులకు భక్తులు సరియే! కాని యెవ్వరెవ్వరే వేషంబులు దాల్పవలయునో యదియైన ముందు నిర్ణయింపరా! యనియడుగ గౌరాంగుం డిట్లనియె. 7

సీ. పవలురేల్శ్రీకృష్ణు ♦ పై మోహమున వేఁగు
నలరాధికాకాంత ♦ నౌదు నేను
లలితా ’ యువతి, రాధ ♦ చెలికత్తె వేషంబుఁ
దాల్చి కాన్పించుచు గ ♦ దాధరుండు



వయసు దాఁటిన రెండ ♦ వసఖియౌ ‘వర’ యౌను
నితి, పూజ్యుఁ, డెనలేని ♦ నేర్పుసూపి
గోలోకమునసుండు ♦ కొత్వాలుగాఁ దోఁచు
హరిదాసుఁ డమలభ ♦ క్తాగ్రగణ్యుఁ,

ఆ. డనవరతము నచ్యు ♦ తాఖ్యల నుడువుచుఁ
బాడుచాడునట్టి ♦ పరమయోగి
మండనుండు, నార ♦ దుండౌను శ్రీవాసుఁ
డిదియె నాటకమున ♦ కేరుపాటు. 8

వ. అంత నద్వైతాచార్యుండు ముకుళితకరుండై యెదుటనిలువంబడి, యేతన్నాటకంబున నేఁ జేయఁదగిన దేమైనం గలదా! యనియడుగ స్మేరాననంబుతో నిమి యిట్లనియె. 9

శా. నీవా! సర్వము నీవె చేయవలయు ♦ న్నీకంటె నన్యుండెటు
ల్గావింపంగలఁ డింత కార్య? మఖిల ♦ క్ష్మాకర్తయు న్భర్తయున్
భావాతీతుఁడు, వల్లవీహృదయ శుం ♦ భద్భాగ్యచోరుండు, శ్రీ
దేవీవల్లభుఁడైన కృష్ణునిలన ♦ ద్దివ్యాకృతిన్దాల్పవా! 10

వ. నీవు నాప్రాణనాథుండవగుదువు; బహుజాగరూకుండవై యుండి సంగాని నీకు మోసంబు వాటిల్లు నేలన. 11

క. కనివిని యెఱుఁగనియొఱపుల
తనువున్గొనివత్తు నేను ♦ దప్పక యటకున్ ;
గనలేఁడు వెఱ్ఱిఁదవులక
వినిర్జితేంద్రియుఁడుగాని ♦ వీరుండెవఁడున్ 12

గీ. అంచువచియింప నద్వైతుఁ ♦ డమ్మ! మోహ
నాంగ! నీమాయలకు నెవ్వఁ ♦ డాఁటువాఁడు?
నేను విజితేంద్రియుఁడనని ♦ పల్కునెవఁడు?

నాటకముఁ జూచుటకుఁగూడ ♦ నాకుజంకు. 13

వ. వెంట శ్రీవాసుండు ముందునకేతెంచి యిట్లనియె. 14

గీ. నాకు నద్వైతునకు నట్లు ♦ నాటకంబుఁ
జూడకుండఁగఁ జనుటకు ♦ సుందరాంగ!
సెలవొసంగుము క్షమియించి; ♦ చిత్తనిహిత
కామమోహాదిశత్రుల ♦ న్గడపలేను. 15

వ. అందులకుం బకపకనగి శచీసుతుండిట్లనియె. 16

క. వేళాకోళపుమాటల
కేలా భీతిలుదురిట్లు? ♦ హృద్యమదీయో
ద్వేలాంగ రామణీయక
జాలానాసక్తచిత్త ♦ సత్వమునిత్తున్. 17

వ. అంత. 18

సీ. చంద్రశేఖరునింటఁ ♦ జక్కఁగా రంగస్థ
లం బేర్పఱుపఁబడె; ♦ లలితమైన
పూఁదీఁగెలును జిన్న ♦ మొక్కలుఁ గుంజముల్
కుదురుగానందులోఁ ♦ గూర్పఁబడియె;
మీఁదమేల్రంగుల ♦ మేలుకట్టులుగట్టఁ
బడియెఁ; దివాసులు ♦ పఱుపఁబడియె;
నాఁడువారలకొక్క ♦ యనువైనభాగంబు
పురుషులకవల నే ♦ ర్పఱుపఁబడియె;
గీ. వేషధారుల కొకగది ♦ విడువఁబడియెఁ;
గల్లమీసాలుఁ దలకట్లు ♦ గడ్డములును
గణెము మద్దెలతాళము ♦ ల్గజ్జెలెల్ల
పరికరంబులు నంసిద్ధ ♦ పఱుపఁబడియె. 19



గీ. భక్తులందఱుఁ దమకుటుం ♦ బములతోడఁ
జూడవచ్చిరి; శచియు, వి ♦ ష్ణుప్రియయును
మాలినియుఁ దోడికోడండ్రు ♦ మఱిమురారి
భార్యయుంగూడ వారితో ♦ వచ్చిరటకు. 20

వ. పుండరీక విద్యానిధియుఁ, జంద్రశేఖరాచార్యుండును, సానుజుండైన శ్రీవాసుండును, నాటకంబునందు గానంబుసేయ నియమింపఁబడిరి. వాసుదేవాచార్యునిచే నలంకృతులగుటకు సన్నిపాత్రలవారును లోనికింజనిరి. ద్రష్టలు రంగపురోభాగంబునఁ గిక్కిఱిసి కూర్చుండిరి. నాటకప్రదర్శనంబునకు సర్వ మాయితంబయ్యెనంత, లోపల శ్రుతిసమ్మేళనంబొనర్చికొని గాయకబృందం బీక్రిందిప్రార్థనంబు తొల్దొల్తఁగావించె. 21

శా. శ్రీధామంబగు నీపదద్వయము సం ♦ సేవింపుచీరాతిరిక్త
బాధాసంకుల సంసృతిభ్రమణ దు ♦ ర్వ్యాపారముల్మాని, స
ర్వాధివ్యాధిహర త్వదీయశుభలీ ♦ లాసక్తిఁగ్రీడింతు, మో
రాధాకృష్ణ! యఖర్వభక్తి నపవ ♦ ర్గంబు న్బ్రసాదింపవే. 22

క. ఈపాడినపద్యంబును
జూపఱువిని, ధౌతపాప ♦ సురుచిరభక్తి
వ్యాపృతమనస్కులై ముద
మేపారఁగఁ గేకలిడిరి ♦ కృష్ణా! యనుచున్. 23

వ. అంత.

సీ. మిసమిసలాడు ద్రే ♦ ల్మీసముల్ధరియించి
యొడ్డుపొడుగుగల్గు ♦ నొడలువెంచి
యంసతలంబున ♦ నతిభీకరంబును
ద్రాఘిష్ఠమౌగదా ♦ దండమూని
హరిదాసుఁ డేతెంచి ♦ యందఱయెదుటను

గై మోఁచ్చిలిచి రం ♦ గస్థలంబుఁ
బూలతోఁబూజించి ♦ నీలాంబుదశ్యామ!
రాధావిలాసినీ ♦ రమణ! కృష్ణ!

గీ. రంగమంతయు భక్తిత ♦ రంగములను
దడిపి దానిని నీదు బృం ♦ దావనముగ
మార్పుమా! యన శ్రోతల ♦ మనము లెట్టు
లుండెనో స్పష్టపఱుచుట ♦ కోపునెవఁడు? 25

వ. హరిదాసుండు సభ్యులదిక్కు మొగంబై నేను గోలోకరక్షకభటాధినాథుండనని చెప్పి యిట్లనియె. 26

సీ. మాధవసంసేవ ♦ మఱచి ప్రమత్తతా, మతిమాంద్యనిద్రాని ♦ మగ్నలౌచు
నున్నా రుమూఢులీ ♦ యుర్వివారిని లేపఁ, బనిగొని యిటు నే ♦ వచ్చినాఁడ
చెలులార! నావిధి ♦ చేసికొనిచనెద, లెండు సుప్తినివీడి ♦ లెండు! లెండు
మేనులనిత్యము ♦ లమృత్యుదేవత యెప్పు, డో! వచ్చికొనిపోవు ♦ నుసురులయ్యో!

ఆ. దార, ధనము, సుతులు, ♦ తమ్ములు, నన్నలు
బంధుజనము, మిత్ర ♦ వర్గ, మిండ్లు,
విపులరాజ్యభోగ ♦ వితతియుఁ గీర్తియు
వెంటరావు! రావు! ♦ వెఱ్ఱులార! 27

క. కనకఖని యొకనకాంగియొ
కనఁబడ మైమఱచి జనని ♦ కాయమునను బ
ర్వునఁ; గాని గొప్పభక్తుఁడు
జనియించిన వానికడుపుఁ ♦ జనఁ డొక్కండున్. 28

ఆ. ఐహికార్థములెటు ♦ లలవడఁజేయునో
యాప్తులార! నిక్క ♦ మైనసుఖము?
దానిఁ గృష్ణభక్తి ♦ తత్పరుఁ డొక్కఁడే
యనుభవించి తాఁ గృ ♦ తార్థుఁడౌను. 29

క. శ్రీకృష్ణుని ధ్యానింపుఁడు
శ్రీకృష్ణ పదాబ్జసేవ ♦ సేయుఁ డనిశమున్



శ్రీకృష్ణునె నుడువుండిఁక
శ్రీకృష్ణునిలో వసించి ♦ చెలఁగుచుమనుఁడీ. 30

వ. అంత వెన్వెంట శ్రీహరీ! శ్రీకృష్ణా! యదువంశోద్ధారకా! రుక్మిణీమనోహరా! యనునుద్రావంబులు సభనుండి వెడలి మిన్నుముట్టెఁ. హరిదాసుండును గొత్వాలువేషంబు చాలించి సూత్రధారుండై మఱలవచ్చి. 31

“నేను నేఁడు బ్రహ్మలోకంబునకేగి బ్రహ్మకుం బ్రణమిల్లి లేచినతోడనే పూజ్యుఁడైన నారదుండగపడి, యోయీ! శ్రీకృష్ణలీల యొండు నాటకరూపంబునఁ జూడవలయుననుకోరిక నాకుఁ జిరకాలంబునుండి కలదు. నీవది తీర్పఁగలవాయని నన్నడిగెను. ఆమహామహునియభిలాష లెస్సగా నెట్లు నెఱవేఱుపఁగల్గుదునని యాలోచించుచున్నాఁడను.” అని పారిపార్శ్వకవేషంబునవచ్చి నిలుచుండిన ముకుందునిం దలయెత్తి చూచి “పారిపార్శ్వకా! నారదాదేశంబు నీవిప్పుడు వింటివికదా! అందులకుఁ గావలయునన్నియు సిద్ధపఱుపుము.

పా— ఓహో! నీపలుకు లత్యాశ్చర్యకరములుగనున్నవే! 32

సీ. కనులకుఁ గనఁబడ ♦ కయె యన్నిగనువాని, నఖిలాత్మలకు నాత్మ ♦ యైనవాని
వస్తుబాహ్యాంతర ♦ వ్యాప్తుఁడై సర్వప్ర, పంచమందునఁ బ్రకా ♦ శించువాని
సత్తపస్స్వాధ్యాయ ♦ సంపన్నులకు శిష్ట, వరులకు నేనిలోఁ ♦ బడనివాని
నంటియునంటక ♦ యఖిలసృష్టివిచిత్ర, ములనెఱజాణయై ♦ నలుపువాని

ఆ. నిట్టిఁడట్టిఁడంచు ♦ నెవ్వరూహింపంగఁ
బలుకవశముగాని ♦ వానినజ్ఞుఁ
డరయలేక యొక్క ♦ యవతారపురుషున
ర్చించునన్న విశ్వ ♦ సింతుఁగాని. 33

క. నారదుఁడు యోగశాస్త్ర వి
శారదుఁ డాత్మానుభవజ ♦ సద్బ్రహ్మానం
దారూఢుఁడు నరులీలల
నారయఁగోరెనన నెవ్వఁ ♦ డయ్యా! నమ్మున్. 34

సూ— అయ్యో! శ్రీమద్భాగవతముం జదివియు నిట్లందువేమి?

సీ. మనసునకందని ♦ మహితాత్మయంచు, న ♦ వాగ్గోచరపుఁ బర ♦ బ్రహ్మమంచు,

సరులలోనూత్రంబు ♦ కరణివ్యాపించెడు, సత్స్వాత్మచైతన్య ♦ శక్తియంచు;
యోగసాధనముల ♦ యుక్తుల వేదాంత, పఠనంబులను గన్న ♦ వారుఁగూడ
నంది బ్రహ్మానంద ♦ మంతటితోఁ దృప్తి, నొందక శ్రీకృష్ణుఁ ♦ దుర్వ్విఁజేసి

గీ. నట్టిలీలలఁ జెవులార ♦ నాలకించి
కనుల కఱవాఱఁగని కాని ♦ తనియలేరు;
కనుక నరసి బ్రహ్మానంద ♦ మునకు నెక్కు
డనఁగవలయుఁ బ్రేమానంద ♦ మును సఖుండ!

నాపుత్త్రికలు లీలాలోలలై బృందావనమునకేగిరి. వారిది లేఁబ్రాయము. ప్రపంచజ్ఞాన మేమియు లేదు. బృందావనమున నపాయములు మెండు. వారి క్షేమముం గూర్చి నాగుండెలు తటతట కొట్టుకొనుచున్నవి. 35

పా—అట్లనెదవేమి? వారు 'వరా' రక్షితులైయున్నారే? 36

సూ—మూఁడుకాళ్లముసలిది వర యేమిసాహాయ్యము చేయఁగలదు? 37

(మహతిధరించి నారదుఁడు ప్రవేశించును.)

శచి—ఆహా! యీపుణ్యాత్ముఁడు గ్రంథస్థుఁడైనయథార్థపు నారదుఁడు గాని వేషధారియైన శ్రీవాసుఁడు గాఁడు. మాలినీ! యీతఁడు నీమగఁడే నా? 38

మాలిని—కాఁబోలు. ఆయన నారదవేషము వేయుదురని యిదివఱకుఁ జెప్పిరి కావున నట్లనుకొనవలయుఁగాని యీదివ్యతేజశ్శాలి నాపెనిమిటియని చెప్పుటకు మఱి యొకయాధారము గనఁబడదు. 39

గీ. నాటకమునాడుతలఁచి, బృం ♦ దావనమున
లీలలెవ్వరునడపిరో ♦ యోలివారె
వత్తురిటకని నీబిడ్డ ♦ వల్కెఁగాన
నామగఁడు నారదుండయి ♦ నాఁడొ యేమొ?

నా—(అనుచరుండగు శుక్లాంబరుంజూచి) నాటకీకృతమైన శ్రీకృష్ణలీలం జూడవచ్చితిని. ఇచట నాటయు లేదు పాటయు లేదుకదా! (అంతలోఁ బ్రవేశించిన కొందఱుగోపికలంజూచి) సుందరులారా! మీరెవరు? 40

గో—మేము వ్రజవాసినులము. సదాశివునిఁ బూజింపఁజనుచున్నారము. అయ్యా! మేమిట్లు సంభాషింప నోఁచికొన్న పుణ్యపురుషులెవరో యడుగవచ్చునా?

నా—బిడ్డలారా! నేను శ్రీకృష్ణభగవానుని యొక యల్పభక్తుఁడను. నన్ను నారదుఁడందురు. 42



(సంభ్రమముతో గోపిక లాతనికిఁ బ్రణమిల్లుదురు.)

గోపిక—(బాష్పలోచనయై) ఆర్యా! మీరు నారదమహర్షులేయైన నిపుడు నవద్వీపమందు శచీగర్భపావనుఁడై పుట్టిపెరుగుచున్న శ్రీకృష్ణుని దివ్యపాదారవిందములసేవ మా కించుకప్రాప్తించునట్లనుగ్రహింపఁ బ్రార్థించుచున్నారము. 43

నా—కల్యాణీ! నీమనోరథము సంపూర్ణముగ సిద్ధించుఁగాక! కాని.

గీ. పరమసుందర పూర్ణేందు ♦ వదనలార!
నాకుఁ బ్రియదైవతంబగు ♦ నందసుతుని
కాటపట్టైన వ్రజములో ♦ బోటులేని
వేఁడెదనుమిమ్ము నొకనాట్య ♦ మాడరమ్మ! 44

వ. అంత. 45

సీ. చక్కనిగోపికా ♦ శ్యామయైన గదాధ
రుండు శ్రీకృష్ణుపై ♦ నొండుగీత
మును మనోహరముగా ♦ నొనరించి తాళమ
ర్దళనిస్వనములతోఁ ♦ దనదుకంఠ
నాదంబుఁ గలిపికి ♦ న్నరనారులనుమీఱి
మాధుర్యమార్దవ ♦ మహిమ మెప్పఁ
బాడి భక్తిసుఖాను ♦ భవజన్యపారవ
శ్యం బవయవముల ♦ నలముకొనఁగ

ఆ. "నన్నువిడిచిపోవ ♦ న్యాయమా శ్రీకృష్ణ!
రార! వేగ రార! ♦ రార!" యనుచు
హావభావసూచ ♦ కాభినయంబుల
నవ్యహృద్యలీల ♦ నాట్యమాడె. 46

హరి—

మానినీవృత్తము. సోదరులార! ప్ర ♦ బుద్ధమనస్కులి ♦ సుందరకృష్ణు య ♦ శోదసుతున్
మేదురభక్తి స ♦ మేతమృదూక్తుల ♦ మించెడుపాటల ♦ మేన గగు
ర్పాదటఁబుట్టఁగ ♦ హాయిగఁబాడుఁడి ♦ యాడుఁడి వేఁడుఁడి ♦ యర్థకళ
త్రాదులు చంచల ♦ మానవివానికి ♦ నైపవవెత్తకుఁ ♦ డయ్య! తమిన్. 47

క. చాలఁడు మృత్యాగమనపు
వేళంగన నెవ్వఁడేని ♦ వేళమకృష్ణున్
బాళినిగొల్వఁడు! కొల్వఁడు!
కాలమునసుఁజాపముక్త ♦ కాండముపగిదిన్ 48

క. హరిదాసుఁడిట్లు తా నొడ
లెఱుఁగక రంగస్థలంబు ♦ నెక్కి పురజనో
త్కరములకుఁ బెద్దగొంతున
సురుచిర నాట్యములఁగఱపఁ ♦ జొచ్చెన్భక్తిన్. 51

ఒకగోపిక—ఓసీ! చెలీ! మనకాలస్యమవుచున్నది. బృందకుఁ బోవలెననియెఱుఁగవా?

( గోపిక నాట్యమాడుచు నేగును. )

శు—(నారదునితో) అయ్యా! మనముఁగూడ బృందావనమునకువెళ్లి కృష్ణలీల చూత
ము. రండు. 51

నా—ఏమీ! ఇదికాదా బృందావనము? 52

శు—స్వామీ! మీకు నిజముగా వెఱ్ఱియెత్తినది. ఇది బృందావనమెటులౌను? 53

నా—నిజమే, నాముద్దుఁగృష్ణుఁడు తనవారి నానందోన్మత్తులఁజేయును. రా! బృంద
కుఁబోదము! నాచేయిపట్టుకొని నడపింపుము. ఆనందబాష్పాంధుఁడనై త్రోవఁ
జూడలేకున్నాను. 54

శు—(కోపముతో) ఇట్లైన బృందావనమున కెన్నఁడును బోలేము. 55

నా—ఏమెందుచేత? 56

శు—ఇట్లు చిందులుద్రొక్కుచు మీరు గంటకొకయడుగు వేసెదు నడ నాపవిత్రస్థాన
ము చేరుటకొక యుగముపట్టును. 57

నా—అయ్యయ్యో!

మ. శతవర్షంబులు యోగముల్సలిపియు ♦ జ్ఞానులందు మౌనీంద్రుఁ డం
చితకృష్ణాంఘ్రుల నించుకేనిఁగన, నా ♦ శ్రీకృష్ణునేపొందిరా
తతభక్తిన్వ్రజకామినీమణులు బృం ♦ దన్బ్రేమఁజూపించి; భ
వ్యతమంబౌ నటకేగువారలకు స్వా ♦ త్యంబు ల్విచిత్రించులే? 58

ఓరీ! శ్రీకృష్ణభగవానుల క్రీడాస్థలం బగుబృందావనంబునకుంజని మనమెప్పు
డో క్రోలంగల్గు నానందరసంబుచే నిప్పుడే నాకు మైకంబుపుట్టుచున్నదిసుమా!



( అంత జగన్మోహావేశకరం బగుశ్రీకృష్ణవేణునాదంబు
దూరంబున వినఁబడును. )

నా—ఉ. అల్లదె వేణునాద, మదె ♦ యచ్యుతదేహజసౌరభంబు, నా
యుల్లమువొంగుచున్నది మ ♦ హోదధియట్లు ప్రమోదమంది, శ్రీ
వల్లభులీలలెట్లు కన ♦ వచ్చు నెదుర్పడెనేనియాతఁడీ
వల్లవులందు డాఁగుదము ♦ వచ్చెను విస్మృతి నాకునిప్పుడే. 59

(అని నిష్క్రమించునంతలో గోపబాలురతో శ్రీకృష్ణుఁడు
ప్రవేశించును.)

సీ. సప్తతిపై యేఁడు ♦ సంవత్సరంబులు
దాఁటినముసలి య ♦ ద్వైతసూరి
ద్రష్టృచక్షుఃపర్వ ♦ ద, మనోజ్ఞయువకాయ
మునుదాల్చి వారల ♦ మ్రోలనిల్చెఁ
జూపుమెఱుంగుల ♦ సుస్మితకాంతుల
నలరారెముద్దుల ♦ యాననంబు
మధురమంజులగాన ♦ సుధలొల్కు వేణువు
హస్తతలంబున ♦ నమరియుండె

ఆ. నంగశోభచూచి ♦ యవయవసౌష్ఠవం
బరసి నడలబెడఁగు ♦ నరసి భక్తి
మోహపరవశులయి ♦ పూరుషుల్గాంతలు
కృష్ణ! హరి! యటంచుఁ ♦ గేకలిడిరి. 60

కృ—(ఒకగోపబాలునితో) శ్రీదామా! సృష్టిప్రదేశములలో నాకీబృందావనమంత ప్రి
యమైనదిలేదుసుమా! ఇది శాంతిప్రేమములకుఁ బుట్టినిల్లు. ఏమీసామరస్యశో
భ! ఒక్కయెడనేని వైరస్యకాలుష్యము కనఁబడదే? అన్నియు నానందదా
యకములేకదా! చూడుు.

చ. వలపులుగుప్పి నాసికను; ♦ వర్ణములన్గనుదోయిఁ, బువ్వముల్
సొలయఁగఁజేయు; గానములఁ ♦ జొక్కఁగఁజేయును వీనులంబత

త్రులు; వలికమ్మతెమ్మెరలు ♦ దోఁగఁగఁజేయును మోదవార్ధిమై,
నలసటఁదీర్చి; బృందకడ ♦ హాయి మఱొక్కెడఁ గల్గునేసఖా? 61

శ్రీదా—అవును. బృందావన మతిమనోహరమే! కాని నాకు నీవును నీక్రీడలును మనోహరతరములు. 62

కృ—సరిలే! మన 'మధుమంగళుఁ' డు గనిపించుటలే దతఁడెచటనున్నాఁడో? 63

(విదూషకుఁడైన మధుమంగళుఁడు ప్రవేశించును.)

మధు—(వగర్చుచు) చెలికాఁడా! నేను జాల నదృష్టవంతుఁడనని యనుము. అనవేమి? ఈపాటికీయుత్తమబ్రాహ్మణునకు శివసాయుజ్యము సిద్ధింపవలసినదే? కాని నీపుణ్యమా! యని యాపిపత్తుతప్పినది. విను చెప్పెదను. అచ్చరకన్నెలను ధిక్కరించుసొగసుగల పెక్కురు గొల్లచేడియలను వెంటఁబెట్టుకొని బృందావనమునకు వచ్చుచున్న యొక నూఱేండ్లముసలిదానిని జూచితిని. నేను సత్యవ్రతుఁడను. దానికి నూఱేండ్లు దాఁటినదాఁటవచ్చును. శరీరము వంగివరుగువలె నెండి శుష్కించిపోయినది. వెక్కిరించుటకైన నొకపల్లులేదు. వియోగము సహింపలేక దౌడలు దగ్గఱఁజేరినవి. కొన్నియవయవము లంతరించినట్లే కనఁబడినవి. తలవెండ్రుకలు లేడినమలివిడిచిన దర్భదుబ్బులాగున నున్నవి. ఎండుదర్భసుమా! దయ్యములు పెట్టువానివలె నిటునటు చూచుచుండఁగా శివునికిచ్చుటకు నరబలికై నన్ను వెదకుచున్న దేమోయని భయపడితిని. భయపడి యేమిచేసితినో యెఱుఁగుదువా? ఆపత్సమయమున ధైర్యశాలు లేమిచేసెదరో యదిచేసితిని. ఆయపాయస్థలమునుండి గిఱుక్కునమళ్లి యొక్కపరుగున నిక్కడఁబడితిని, 64

కృ—(సుబలునితో) ఈమూర్ఖుఁ డెవ్వరినిజూచి యిట్లనుకొనెనో? 65

సు—సఖీపరివృతయై రాధ యిటువచ్చుచున్న దేమో! 66

మధు—(పెద్దనవ్వునవ్వుచు) ఆలాగుననోయి. శ్రీమద్రాధాదేవి యిక్కడకువచ్చుచున్న యెడల మనచెలికాఁడైన కృష్ణునివలలోఁ బడకమానదు. 67

(చెలికత్తెలతో శ్రీరాధాదేవి ప్రవేశించును.)

సీ. బృందావనస్థుఁడౌ ♦ శ్రీకృష్ణుఁడొక్కఁడే
వెలసెఁ బ్రేమానంద ♦ విగ్రహుఁడుగ
నావల మధురాపు ♦ రీవాసి కృష్ణుఁడ



త్యుపకారి ప్రజలకు ♦ నృపతిమౌళి
యవ్వల ద్వారక ♦ యందున్న కృష్ణుండు
సంసారికర్మ సం ♦ చయఫలదుఁడు
పదునాఱువేల స ♦ ద్భార్యలు, సజ్జన
తతికృతానంత స ♦ త్కర్మవితతి

ఆ. నిత్యమంజుసూక్ష్మ ♦ నిర్మలతత్వంబు
ధరణి ప్రజల తార ♦ తమ్యమెఱిఁగి
యందఱకునుగూడ ♦ నానందమిడుటకై
దయఁ గ్రమముగ స్థూల ♦ తత్వమయ్యె. 68

వ. ఈభార్యాసంఘంబులో శ్రీరుక్మిణీదేవి ప్రియతమ. వాసుదేవాచార్యుండు నిమికి రాధావేషంబువేసి సింగారించుచుండఁ దాను రుక్మిణియనిభావించి తాదాత్మ్యమునుబొంది గౌరాంగుఁడుకొనగోళ్లతో నేలపై భాగవతప్రసిద్ధంబైన సందేశం బీక్రిందిపద్యంబులుగ వ్రాసి కన్నీళ్లచే నవి చెఱుపంబడ మఱలమఱల వ్రాయుచుండె. 69

ఉ. ఈగతివ్రాయుచున్నదిది ♦ హ్రీరహితాత్మికయంచునెంచ; కేఁ
గాఁగుచునున్న దానఁ దమ ♦ కంబున నిన్బడయంగఁగోరుచున్
రాగమునొందదెవ్వతె థ ♦ రాతలమందున నిన్నుఁ జూచి? వే
వేగనినుస్మృతీ! యనుచుఁ ♦ బిల్చుట కాజ్ఞను నాకొసంగవే! 70

క. నీపదములపైనిడి, యో
పాపాంతక! నాదుశిరముఁ, ♦ బడయఁదలఁచితిన్
దాపసులుం బొరయంగా
నోపని జీవితఫలంబు ♦ నొసఁగుముకృష్ణా! 71

వ. ఈపగిది వ్రాసివ్రాసి స్వమనఃకల్పితుం డగునొకవిప్రునింబిలిచి నమస్కరించి యిట్లనియె. 72

మ. చని ధాత్రీసుర! నాయవస్థ హరికి ♦ స్పష్టంబుగాఁ దెల్పుమా!
కనినాకంతయునీవు: వెండియది వ ♦ క్కాణింపఁగానేల? నా

మనమందున్న సమస్తమేను లిఖియిం ◆ పంజాల నీజాబునన్
జనదఖ్యాయ్యో! మనంబునుండి వనితా ◆ స్వాభావికవ్రీడయున్. 73

క. ప్రాణములు నిలువవనుమి; పు
రాణంబులువల్కు నార్త ◆ రకుఁడవటం;
చానుడువు నిల్పుకొనుమను;
తానన్నీడిసికొనిపోక ◆ తప్పదనుసుమీ! 74

వ. అంత నద్వైతాచార్యుండు శ్రీకృష్ణవేషంబుతోఁ జేసినవేణుగానం
బు వినఁబడఁ దత్క్షణంబ నిమి రుక్మిణీభావంబువదలి కేవల రాధా
తన్వంగియయి చెలికత్తెలతో నిట్లనియె. 75

చ. వినుఁడి! వినుండి! మాధవుని ◆ వేణునినాదములవ్వె! నన్నుర
మ్మని నెఱజాణసేసెడు నొ ◆ యారపుసైగలు, నేనుబోవలెన్
దనువును నిల్పలేనతని ◆ దగ్గవముంబొనరించికాని, వెం
టనెచనుడెందు కృష్ణుచర ◆ ణంబులు గొల్వఁగఁగోరు నెచ్చెలుల్. 76

చ. పతిసుతముఖ్యసంసరణ ◆ బంధములన్దెగఁగోసి, యైహికో
ద్ధతి నపవాదభీతిని మ ◆ దంబునుమానముఁ జంపుకొన్న యా
గత కలుషాంతరంగలకుఁ ◆ గాకలభించునె చేడెలార! య
చ్యుతపదచింతనామృతము ◆ జుక్తిసుభాగ్యము, మోక్షసౌఖ్యముల్? 77

ఆ. కూడవత్తురేని ◆ గొబ్బున రండిఁక
నేను నిలువఁజాల ◆ నేగకుండ
నెట్లుదొరకు మనకుఁ ◆ గృష్ణునికౌఁగిలుల్
కొంతబాధకోర్చు ◆ కొన్నఁగాక? 78

వ. అని. 79

సీ. కుడిప్రక్క 'వర' యును ◆ నెడమప్రక్కను ఁలలి
తాం గనారత్నంబు ◆ నంటిరాఁగ
నలరులు వెదచల్లి ◆ నట్లుపిలుుందఁ జ
క్కనిగోపిక ల్మోన ◆ కట్టిరాఁగ
స్త్రీవేషధారియై ◆ శ్రీమానుఁడొకదివ్వె
దాల్చి ముందఱఁజని ◆ దారిచూప



నవమనోహరరూప ◆ యువతీత్వగరిమముల్
దాల్చి, సన్నాయి నా ◆ దంబుఁబోలు

గీ. పల్కులను జిల్కుచును నిమి, ◆ పసిఁడిమేని
రాధయయి యభిసారికా ◆ రాగమొలయ
దివ్యలావణ్యమోహినీ ◆ దేవతవలె
రాజిలుచువచ్చె నాటక ◆ రంగమునకు. 80

గీ. మునలియద్వైతుఁడు, హరియై ◆ ప్రమోలనిలువ
నోడలెఱుంగక కేకల ◆ నిడినవార
లిపుడు నిమివచ్చి రాధయై ◆ యెదుటనిలువ
నెట్టులలరిరో వర్ణింప ◆ నెవరితరము? 81

క. చూపఱు కేకలఁబెట్టుట
కోపక నిశ్చేష్టితులయి ◆ యుద్బాష్పాశ్రుల్
చూపులఁ గ్రమ్మఁగనరయుచు
నేపారు సుఖంబునెనసి ◆ యొసఁగిరి లోలోన్.  82

మధు—మిత్రమా! యీసుందరాంగు లేమిచేయుదురో చాటుననుండి చూతము. మ
నమందఱ మీపూఁబొదలమఱుఁగున దాఁగుదమురండు. (అట్లుకావింతురు.)

రా—చెలీ! లలితా! సదాశివార్చనకై యన్నియుఁ దెచ్చితిమికాని, తీసికొనివచ్చిన
వాడిపోవునని పూవులుమాత్రము తేలేదే! 84

ల—అయిననేమి? బృందావనములోఁ బువ్వములకుఁ గొదవటమ్మా? 85

రా—కొఱఁతలేదుకాని, వానిఁగోయుట కాలస్యమవును. ఇక్కడఁదిరుగు నడవిగాడిద
లన్న నాకెంతోభయము. 86

మధు—(కృష్ణునితో) మిత్రుఁడా! చూచితివా యీమగువల పొగరుఁబోతుఁదనము!

కృ—నీమాటలు నాకు దురవగాహములుగ నున్నవి. 88

మధు—గ్రహింపలేవా? గ్రహింపకుండుట యొకవింతకాదు. ఈసృష్టిలోపల నీయం
త శుంఠలేఁడు. అట్లుకానిచో నఖిలప్రపంచ పరిపాలకునకాలమందలను గాచు
కొనిబ్రతుకు ప్రారబ్ధమేలపట్టును? ఈధూర్తలగుగొల్లపిల్లలు పూజ్యులగు నీస్నే

హితులను "వనగర్దభము" లనియనలేదా? ఆమాటలు నాకేమియు బాగులేవు. ఈ "యడవిగాడిదలు" నీసహచరులమగు మేముగాక మఱియెవరు? ఆయప్రశస్తనామముతోఁ బిలువఁబడుటకు మేమొల్లము. 89

రా—(లలితతో) మనము పోయి యీలవంగలతాంతములను గోయుదమురమ్మా. 90

వ—(రాధతో) బిడ్డా! అట్లుచేయకు! చేసితేని శ్రీకృష్ణునిచేతిలోఁ జిక్కెదవు. ఆ చపలచిత్తున కీపుష్పములన్నఁ బ్రాణమని యెఱుఁగవా? 91

ల—(వరతో) రాధ, కృష్ణునిచేతిలోఁ బడినయెడల నిన్నామెనుమాఱు, పూఁటపెట్టి యామెను విముక్తురాలిని జేసెదము. 92

(ఇట్లువారు నవ్వులాటలాడుకొనుచుండ నొకతుమ్మెదవచ్చి ఝుమ్మనుచు రాధాముఖపద్మముచుట్టుఁ దిరుగును. ఆమె కుడిచేతితో దానిఁబాఱఁబోల యత్నించుచుండును.)

రా—లలితా! లలితా! ఈపాడుభృంగము నన్ను బాధించుచున్నది. నాకుఁ గొంచెము సాహాయ్యముచేయవా? 93

ల—నీకు సాహాయ్యముగావలసిన నన్నుఁ గోరెదవేమి? శ్రీకృష్ణునిబిలువుము. అతఁడు కదా! యార్తత్రాణైకదక్షుఁడు. 94

(రాధ సిగ్గుపడి మొగమువంచుకొనును.)

మధు—(కృష్ణునితో) చెలికాఁడా! నీవు వారియెదుటకుఁబోయి కనిపించుటకిది మంచిసమయము. అట్లుచేయుము. అన్యాపదేశముగాఁ బిలువఁబడితివి. ప్రత్యక్షముగా నిన్నుఁబిలుచుట కెవరు సాహసింపఁగలరు? 95

కృ—ఛీ! ఛీ! నీయాలోచన వట్టితెలివితక్కువయాలోచన! ఈరహస్యస్థలముననుండి రాధాసౌందర్యామృతమును నాకన్నులతోఁ దృప్తిగాఁ బానముచేయుచుండుట నీవు చూచుటలేదా? వారి నిప్పుడు కళవళపెట్టి యాయానందమును గోల్పోవుటకు నామనసొప్పకున్నది. 96

గీ. బొమ్మముడులను బుత్తడి ♦ బొమ్మవడెడు
వీభ్రమరబాధమైఁగ్రమ్మ ♦ యినుమడించు
నామె యసమానసౌందర్య ♦ మౌర! యిట్టి
సొగసుగలనారి యీధరా ♦ స్థలినిలేదు.

(ఆలోచించి) పోనీ! మిత్రమా! నీవుచెప్పినట్లే చేసెదను. 97

గీ. ఏఁజటాలునఁజని వారి ♦ యెదుటనిలువఁ



గలుగు కళవళమును భీతి ♦ కాంతమోము
నకును వీక్షణములకొక ♦ నవ్యమైన
సొగసుఁదెచ్చినఁదెచ్చు నా ♦ చూడ్కులలర. 98

(పైకివచ్చి లలితతో) మీరెవరు? స్త్రీలని మీరుచెప్పకయె మాకుఁదెలియును. మీకు లలనాసహజములైన లజ్జాభీతులులేవు. పురుషులకుఁగూడ లేనిసాహసము గలదు. ఇది చాలవింతయే!

గీ. మోములనుజూడఁ గేవల ♦ ముగ్ధకన్య
లట్లుకాన్పింత్రు; కాని చ ♦ ర్యలనుజూడ
నాకుఁ గోపమువొడమెడు; ♦ నంగనాచు
లిట్టిపనులనుజేసెద ♦ రేలయిచట? 99

ఇక్కడఁ బూలుగోయుటకు మీకేమిస్వాతంత్ర్యము? అట్లుచేయుటకు సెలవెవరిచ్చిరి? ఈతోఁటయంతయు మీసొత్తైనట్లే యథేచ్ఛముగఁ బూలుగోసి మొక్కలుపడఁద్రొక్కి పాడుచేయుచున్నారే? నిలువుఁడు! మీదౌష్ట్యమునకును జోరత్వమునకును దగినశిక్ష చేసెదను.

వ—అగునైన మేము నీప్రతిబింబములము. కృష్ణా! నీవెప్పుడును జపలుఁడవేకదా! నీ న్యాయమర్యాదలు మాయట్టిమానవులకు దుర్గ్రాహ్యములు. నీమాయ నీకేతెలియవలయుఁ; గాని నిన్నుమాత్ర మీబృందావనమునకుఁబ్రభువుగా నెవరుచేసిరి? దానిపై నీకున్నయధికారము మాకుమాత్రములేదా? 100

మధు—ఓవృద్ధబకమా! ఇటుమాఱు! నీకు ముదిమిచే మతిచెడినది. ఈపడుచుబిత్తరులకు బుద్ధిచెప్పుటకుమాఱు వారిని మఱింత పురికొల్పుచున్నావు. ఇది నీకుఁగూడదు. 101

వ—ఔను నేను వృద్ధురాలను, నీవు చంటిపాపవు. నీవు బ్రాహ్మణుఁడవేకాని బుద్ధిమాత్రము ఖరజాతిది. 102

ల—(మధుమంగళునితో) ఓవృద్ధవానరమా! నిన్నెవరుపిలిచిరి? ఈవిషయములలో మాకు నీమాధ్యస్థ్యమెందులకు? 103

మధు—ఓమాటలమారిమిటారీ! నే నున్నతపదవియందున్న బ్రాహ్మణోత్తముఁడనని యెఱుఁగవా? బృందావనాధినాథుఁడు శ్రీకృష్ణుఁడు. నేనాతని సచివుఁడను, మీఁదుమిక్కిలి పురోహితుఁడను. 104

వ—కృష్ణా! ఈబృందావనము గోపికలది. నీకు నిజముగాఁ బుష్పములేకావలయు నెడ

ల వారిఁగూర్చి వారితోఁగలహించిన లాభములేదు. నేను జెప్పినట్లువినుము. విన్రముఁడవై రాధను బూవులిమ్మని వేఁడుకొనుము. ఆమెయనుగ్రహించి కొన్ని నీకిచ్చును. 105

( అని బలవంతముగఁ గొన్నిపూవులు రాధచేఁ గృష్ణునిమీఁదవేయించును. )

రా—(రక్తకపోలయై ముసిముసినగవులతో) వరా! ఎంతపనిచేసితివి? శివునిబూజించుకొనుటకై యీపూవులు గోసికొంటినే! వాని నెట్లు దుర్వినియోగపఱచితి వో చూడు! 106

వ—మన మింటికిఁబోదమురమ్మ! ఎదుటివారు బలవత్తరులు; న్యాయయుద్ధముజరుగునట్లు కనఁబడదు. 107

రా—శివునిబూజించుటకై వచ్చితిమి. ఆపావనకృత్యము నెఱవేర్చుకొనక యెట్లుపోఁగలము? 108

మధు—వచ్చుటకుఁ బోవుటకు మీయిష్టమేనా? ఊరకపోవుటకు వీలుపడదు. మీరు బృందావనముంజొచ్చి నేరముచేసితిరి. దండనధనముచెల్లించినఁగాని పోనీయము.

వ—దండనధనమేల? దండనము విధించెడువారెవరు? 110

(ఒకగోపకుమారుఁడు) బృందావనపాలకుఁడు శ్రీకృష్ణుఁడనియు నిందుఁగాలుపెట్టినవారెల్ల నతనికిఁ బన్ను చెల్లింపవలెనని యతనిశాసనమనియు నీవెఱుఁగవా యేమి?

(ఇట్లుకొంతసేపు వాక్కలహము జరిగినపిదప సిగ్గుచే నెఱ్ఱవాఱిన మొగముతోఁ దలవంచుకొనియున్న రాధకెదురుగా నిలువఁబడి) కృష్ణుఁడు—రాధా! రాధా! మొగమెత్తిచూడవేమి? కరగ్రహణమునకై వేచియుంటిని జాలముచేయక నా కీయవలయుకరము నాకిమ్ము. 111

రా—అయ్యో! నాథా! నేను నిఱుపేదరాలనుగదా! ఏమర్పింపఁగలను? 112

కృ—అట్లైన స్వార్పణముచేసికొనుము. 113

( రాధారక్షణార్థము వరవచ్చి యామెను శ్రీకృష్ణునకును నడుమనిలుచును. ఆమె నావలకుగెంటి కృష్ణుఁడు రాధను స్పృశింపఁబోవును.)

శా. రాధాకృష్ణుల సంగమఁ న్గనుట కో ♦ ర్వన్నేరు పాపాత్ములా
నీధాత్రీజనులంచు నెంచియొ మఱొం ♦ డేదైన నూహించియో
వేధంగాంచినతండ్రి, మిశ్రిజుఁడు కా ♦ వించెన్విచిత్రంబొకం
డాధామాంతరమందు దృష్టహరిలీ ♦ లాంతంబున న్వ్రీడయై. 114



వ. అదెద్దియన. 115

సీ. అచ్యుతుండంతలో ♦ నద్వైతుఁడై పోయె ;
‘ వర ’ మాఱినితియయ్యె ♦ నరయుచుండ ,
లలితాలతాంగి, మ ♦ ఱల గదాధరుఁడయ్యె ;
నారదసంయమి ♦ మాఱి తొంటి
శ్రీవాసుఁడైతోఁచెఁ ; ♦ బావనగోలోక
పోషకభటుఁడు శై ♦ లూషవిభుఁడు
హరిదాసుఁడయ్యెను ♦ మఱల ; నిట్లందఱుఁ
బూర్వపురూపము ♦ ల్పొరసి ; రింక

గీ. రాధమాత్రము నిమిగ మా ♦ ఱఁగలేదు ;
కాని పరమాత్మశక్తి చి ♦ త్కళలఁ బ్రోవు,
దుర్గ, భగవతి, యానంద ♦ దుగ్ధవార్ధి,
సర్వరక్షిక, త్రైలోక్య ♦ జననియయ్యె. 116

గీ. రాధికయుఁ గృష్ణుపైఁగల్గు ♦ రాగభక్తి
లేమహాభక్తులోఁ గాని ♦ యెనయలేమి
నన్యతారణబుద్ధి గౌ ♦ రాంగుఁడిట్టు
లందఱకుఁ దల్లియైతోఁచె ♦ నద్భుతముగ. 117

వ. అట్లుమాఱి యాజగజ్జనని చివ్వన నాటకరంగంబువిడిచి. 118

సీ. కోటులకొలఁదిగాఁ ♦ గూఁతులఁ గొడుకులఁ
గనుతల్లివత్సలా ♦ ననముతోడ
శతసహస్రార్బుద ♦ సంతానమునుజూడఁ
దగినట్టి దీర్ఘనే ♦ త్రములతోడ
సర్వప్రపంచ సం ♦ సారంబుసవరింప
దక్షంబులైన హ ♦ స్తములతోడ

బహుజీవతతులకుఁ ♦ బాలిచ్చి పెంచుట
కిమ్ముతావలుఁద పా ♦ లిండ్లతోడ

గీ. రమ్యతమమైన దివ్యవి ♦ గ్రహముతోడఁ
జంద్రశేఖరు దేవతా ♦ ర్చవపుగదికి
నేగి దేవతాపీఠము ♦ నెక్కి యచటి
చిఱుతపానుపుపై సుఖా ♦ సీనయయ్యె. 119

వ. అంతఁ గట్టకట్టలుగ నాటకముంగట్టినవారును జూచినవారును వయోభేదంబు లేక. 120

క. పాలకునై యేడ్చుచు గృహ
పాలిక, తల్లికడకేగు ♦ పాపలపగిదిన్
వాలాయంబుగ నేగిరి
స్త్రీలుం బూరుషులు నంబ ♦ చెంతకు వెంటన్. 121

సీ. ఆఁకొంటి నాఁకొంటి ♦ నమ్మ! పాలీయవే!
యని పోరుపెట్టుచు ♦ నరిగెనొకఁడు
పరువెత్తుచుండఁగాఁ ♦ బడి దెబ్బఁదింటినే
నూఁదవే! యనియేడ్చు ♦ చుండెనొకఁడు
దుమ్ము నాపైఁబోసె ♦ నమ్మ! నాచిన్నన్న!
పోయవే! నీళ్లని ♦ పోయెనొకఁడు
లాఁగుచినిఁగిపోయె ♦ బాగైన దొక్కటి
కుట్టింపవే! యని ♦ కోరెనొక్క

గీ. డప్పదిట్టెను గొట్టవే! ♦ యనియెనొకతె
యాటకేమైనఁబెట్టవే! ♦ యనియెనొకతె
యమ్మ! వేవేగ తలదువ్వు ♦ మనియెనొకతె
యాఘ్రులించుచు, జోకొట్టు ♦ మనియెనొకతె. 122



క. ఎందేనొక్కఁడుపుట్టినఁ
గొందలపడిపోదురిండ్లఁ ♦ గోమలులిఁకనీ
యిందీవరాక్షి బహుసుత
సందోహము నెట్లు తాను ♦ సవరించెనొకో! 123

ఉ. పంకరుహాక్షి 'దాసుఁ' గని ♦ బాలక! రమ్మనిపిల్చి ప్రేమతో
నంకమునందుఁ జేర్చికొని ♦ యాతనిచెక్కులదువ్వి బాహుప
ర్యంకమునందు మూర్ధమిడి ♦ యట్టిటులూఁచెను; భక్తుఁడున్నిరా
తంకముగాఁ బ్రశాంతిసుఖ ♦ తన్మయతన్గనె నెట్టిధన్యుఁడో? 124

ఆ. అంతమేనుగల్గు ♦ హరిదాసుఁ, డంబయు
త్సంగమందునిలిచెఁ ♦ దల్లిపాలు
కూర్కుచుండి త్రావు ♦ కుఱుపాపవలె; జగ
జ్జనని మహిమపొగడఁ ♦ జాలునెవఁడు? 125

గీ. నేను నీప్రియురాలను ♦ నిర్మలాత్మ!
యనుచు రాధికపగిది నీ ♦ శునిభజించు
టెంతొకష్టము; వానిఁ ద ♦ ల్లీ! యటంచుఁ
గొలువవచ్చును భక్తులు ♦ సులభముగను. 126

వ. అను సత్యంబుపదేశించుటకై గౌరాంగుండిట్లు వెలసె. 127

ఊ. కొంగునుబట్టియూఁగి యొక ♦ కొందఱు, వ్రేళులలాఁగికొంద, ఱు
త్తుంగశుభాంగమున్గదిసి ♦ ద్రుళ్లునఁబ్రాఁకఁగఁ దొట్టికొంద, ఱి
బ్భంగి, శిశూత్కారంబులు కృ ♦ పాపరిపూర్ణమనస్కుడైన త
ల్లింగని పొంగినట్లు, వెడ ♦ లించిరి మోదమునంబచెంగటన్. 128

గీ. చాలమందిని హరిదాసు ♦ సరణి, జనని
పొంతకుం దీసికొని కూర్మి ♦ బుజ్జగింప
వారు నాట్యముసేసిరి ♦ పరవశులయి

యంబచుట్టును సందిత ♦ హాస్తులగుచు. 129

వ. అంత. 130

గీ. పూర్ణమోదంబులోనుండఁ ♦ బ్రొద్దువొడిచె ;
నెంతపాపాత్ముఁడమ్మ ! యీ ♦ యినుఁడు ! వచ్చి
యెట్టియానందమును జెడఁ ♦ గొట్టెనంచుఁ
దిట్టసాగిరి కినిసి యా ♦ దిత్యునపుడు. 131

గీ. మాయమైపోయె లీలల ♦ మహిమ మెల్ల
నర్కుఁడుదయింప ; నొకస్వప్న ♦ మందిలేచి
నట్టులైరంత నందఱు ; ♦ నందుఁగొంద
ఱేడ్చి రెంతమోదము నశి ♦ యించెనంచు. 132

గీ. చంద్రశేఖరు నిలువీడి ♦ చనియె నిమియుఁ ;
గాని యాయింట మిఱుమిట్లు ♦ గలుగఁజేయు
నొక్కశతచంద్రచంచలా ♦ ద్యుతి యనిశము
ప్రబలికాన్పించెనఁట యేడు ♦ వాసరములు. 133

వ. దీనిసత్యం బీక్రింద లిఖింపంబడినవానివలనఁ దెలియనగు ; నందు మొదటిది యీలీలఁ దానుగను లారఁగాంచి మురారిగుప్తుండు తన్చైతన్యచారిత్రమను సంస్కృతగ్రంథమునందు వ్రాసినది. రెండవది శ్రీగౌరాంగు నిత్యసహచరులైన శ్రీవాసనిత్యానందుల ప్రోత్సాహంబున నారాయణీసుతుం డగుబృందావనదాసుచే ‘వంగ’ భాషలో వ్రాయఁబడిన శ్రీచైతన్యభాగవతమునందలిది. 134

(1) శ్రీచంద్రశేఖరాచార్య రత్నవాట్యాం మహాప్రభుః
ననర్తయత్ర తత్రాసీత్తేజస్తు మహదద్భుతం
సప్తాహంశీతలం చంద్రతేజసాసదృశం హరిం
చంచలేవ సుదుష్ప్రేక్ష్యం చిత్తహ్లాదకరం శుచిం
యేయేతత్రా గతాలోకా ఊచుస్తత్రకథంద్విజోః
ఉన్మీలనేన శక్తాస్స్మవిద్యుత్వత్ప్రేక్ష్యభూతలే.

(2) సప్తదిన శ్రీఆచార్యరత్నేరమందిరే
పరమఅద్భుత తేజచ్ఛిలనిరంతరే
చంద్రసూర్యవిద్యుత్ ఏకత్రయేనజ్వాలే
దేఖయేసుకృతిసబ మహాకుతూహలే
యతేకఆఇసేలోక ఆచార్యేరఘరే
చక్షుమేలివారే శక్తికేహానాహిధరే
లోకే బలేకికారణే ఆచార్యే రఘరే
దు ఇచక్షుమేలితే ఫుటియాయేనఘడే.



క. గౌరాంగుఁడు నీలసదవ
తారంబఁట ! యతనిసుచరి ♦ తంబును వ్రాయన్
గోరితి సంపూర్ణంబుగ ;
శ్రీరామ ! యభీష్టసిద్ధిఁ ♦ జేయుము నాకున్. 135

మాలి. ధరణి భరణశీలా ♦ ధః కృతత్రాతలేంద్రా !
యరిగజమదభంగ ♦ వ్యాపృతాంచన్మృగేంద్రా !
దరదదురితభూభృ ♦ ద్దారణైకామరేంద్రా !
సురుచిరగుణసాంద్రా ! ♦ జోత ! శ్రీరామచంద్రా ! 136

క. వందన మానందాత్మక
వందనమో చిత్స్వరూప ♦ వందనమభవా !
వందనము భక్తకల్పక !
వందన మఖిలప్రపంచ ♦ పాలక ! రామా ! 137

శ్రీ శ్రీ శ్రీ

సీ. సత్యంబునను హరి ♦ శ్చంద్రుండు, గుప్తదా
నరతుఁడు, పీఠికా ♦ పురవరుండు,
తరుణవయోరాజ్య ♦ ధనసమృద్ధుండయ్యు
శమదమసంపన్న ♦ సత్వగుణుఁడు
పరులబాధలు కర్ణ ♦ పథమునఁబడినంత
మాత్రాన మదినెంతో ♦ మరగుచేఁడు
మితభాషణమున న ♦ న్యతరుణీవిముఖతఁ
బరికింప సరిగ నీ ♦ వంటివాఁడు

ఆ. శ్రితసురాగ, మార్య ♦ నుత సౌమ్యశీలుండు
రావుసూర్యరావు ; ♦ రామచంద్ర !
వాని, వాసిరాణి, ♦ వారిసంతును,జిరా
యుష్యసుఖములొసఁగి ♦ యోము ! తండ్రి ! 1

గీ. అంచితరసజ్ఞుఁ డాంధ్రభా ♦ షాభిమాని
నీతిమంతుఁడు మా సూర్య ♦ నృపతి, రామ !
యీాగి నాతనిచేతికి ♦ నెముక లేదు !
పుష్కలానందమతని కా ♦ పొల్కనిమ్ము ! 2

గీ. నాకొసఁగి చిత్తశాంతి గ్రం ♦ థరచనమునఁ
జాలఁదోడ్పడె సూర్యభూ ♦ పాలవతాళి ;
రాజులకు రాజవీవు శ్రీ ♦ రామచంద్ర !
సతతమతనికి నురుమన ♦ శ్శాంతినిమ్ము ! 3

శ్రీ శ్రీ శ్రీ.



ఈ గ్రంథకర్త చేత నే రచింపఁబడిన

# శ్రీ రామకృష్ణపరమహంస జీవితమును బోధములును.

## వెల రు 0-8-0.

దానిఁగూర్చి వ్రాయఁబడిన బుధజనాభిప్రాయములు.

I. శ్రీ రామకృష్ణపరమహంస చరిత్రము — హిందూమతధర్మములను, ముఖ్యముగ భక్తిమార్గమును, చక్కనివాక్యములతోను, మంచియుపమానములతోను, నవీనులకు బోధఁజేసిన మహనీయులలో శ్రీరామకృష్ణపరమహంసగారు ముఖ్యులని చెప్పవచ్చును. వీరు క్రీ.శ. 1833 సం॥మున వంగదేశమున జనించిరి. వీరు సాధారణపుమతస్వాముల వలెను, సన్యాసులవలెను, జనసామాన్యమును హేయముగఁజూచువారుగాక, సదా వారికి మంచిత్రోవఁజూపుటయందే పాటుపడుచుండువారు. ఇట్లు పరోపకారార్థమై తన శక్తియుక్తులనన్నిటిని ధారవోసి యీ పుణ్యపురుషుఁడు 1886 వ సం॥మున బరమపదము జెందెను. ఈసత్పురుషునిచరిత్రమును, వీరిసుబోధనలను తెలుఁగుదేశీయుల యుపయోగార్థమై, గోదావరిమండలములోని పీఠాపురము పాఠశాలా ప్రథమోపాధ్యాయు లగు శ్రీ కూచి నరసింహము బి.యే. గారు, ఆంధ్రమునఁ బద్యరూపమునరచించిరి. మంచికాగితములమీఁద బాగుగముద్రింపఁబడి, 164 పుటలుగల యీగ్రంథము వెల 8 అణాలు మాత్రమే. సులభమును మనోహరమును నగుశైలితో రచింపఁబడిన యీపద్యకావ్యము, అమృతోపమానములగు శ్రీపరమహంసగారివాక్యములసొంపును, ఆమహనీయుని చరిత్రనైర్మల్యమును, వర్ణించుట కెంతోయనువుపడియున్నదని చెప్పవచ్చును. కృతికర్తయగు శ్రీ నరసింహముగారు, ఆంధ్రాంగ్లేయభాషలలో మంచియభిరుచియును ప్రజ్ఞయునుగలవారు. మంచిప్రవీణత, సుస్వభావము, దైవభక్తి మొదలగుసుగుణములచేఁ జెన్నొందు వీరిట్టిసద్గ్రంథరచనకుఁ దొడఁగుట మిక్కిలి చక్కగనున్నది. వీరింక నిట్టి గ్రంథముల నాంధ్రమునరచించి జనులకృతజ్ఞతకుఁ బాత్రులగుదురని నమ్మెదము.

కవిత్వధోరణిఁ జూపించుటకై పుస్తకములోని కొన్నిపద్యముల నిచటఁ జేర్చుచున్నాము :—

ఆ. అపుడు నిన్నుఁ బెండ్లియాడిన రామకృ, ష్ణుండు కృతిని జెందె సుదతి యిపుడు
కాంతలందు నాశఁ గాలియేచూపట్టు, నుర్విలేమలందు నొకతెవీవు.

చ. సుగుణగణప్రశస్త యగు సుందరి గావున శారదాంబ నె
వ్వగ యిసుమంతఁ జిత్తమును బట్టఁగనీయక ప్రాణనాథ! భా
ర్యగ ననుఁ జేకొనంగఁ దమ కంకిలియైనను శిష్యురాలఁగా
నగుదు ననుగ్రహించి తమయంతికమందున నుండనిండనెన్.

ఉ. కమ్మనితావులన్నొలుపు కల్వను బెట్టిన పేడపుర్వు పు
ష్పమ్మునవిల్వలేక తనపట్టునఁగుం బరువెత్తుభంగి దై
వమ్మను గూర్చి మూర్ఖులను బల్కెడుతావుల నుండలేక శీ
ఘ్రమ్ముగఁ బాఱిపోవు నిహకాంక్షులఁ జిక్కనరాధముండిలన్.

విజయనగరము. } 171, 172, 173 పుటలు. ఇట్లు
డిశంబరు 1904 సం॥రం } జనానాపత్రిక.

---

II. శ్రీరామకృష్ణపరమహంసచారిత్రము—ఈ పేరుగల పొత్తమొకటి పిఠాపురము ఆర్. సి. ఎచ్. హైస్కూలు హెడ్మాష్టరుగారగు కూచి నరసింహము బి. ఏ గారిచే రచియింపఁబడి గ్రంథకర్తలచే మాకొకప్రతి దయాపూర్వకముగఁ బంపఁబడినందున నాదరణముగ గైకొని సంతసమందినారము. ఇందు మొదటిభాగమున రామకృష్ణపరమహంసచరిత్రమును, రెండవభాగములో పరమహంసగారి యుపదేశములును వ్రాయఁబడియున్నవి. పొత్తమునఁగల 164 పుటలలో మొదటిభాగము 48 పుటలలోనుఁ దక్కినది తక్కిన పుటలలోనున్నది. గ్రంథారంభమునఁ బరమహంసగారి పటమొకటి చేర్చఁబడియున్నది. గ్రంథమానంద ముద్రాక్షరశాలయందు మంచి నునుపుకాగితముల మీఁద బెద్దయక్షరములతో మనోహరముగా నుండునట్లు ముద్రింపఁబడియున్నది. ఇందు రెండవభాగమున నుపదేశపద్యములకొకవైపున నుపదేశవాక్యసంఖ్యయు నొకవైపునఁ బద్యసంఖ్యయు వేయఁబడియున్నవి.

ఇందు మొదటిభాగమున 244 పద్యములును రెండవభాగమునఁగల 387 బోధనలకు 575 పద్యములును గలసి 819 పద్యములున్నవి. ఇంతవరకు వ్రాసినవానినిఁబట్టియే గ్రంథ మెంతోయుపయుక్తమయినదని తేలుచున్నను మేము ముఖ్యముగాఁ దెలుపవలసిన శైలి విశేషమును గూర్చి వ్రాయుచున్నాము. ఈగ్రంథము మృదుమధురమైన ద్రాక్షాపాకమున వినువారివీనులకు విందుగొలుపునట్లుగను జదువువారి హృదయమునకు నె



న్నరాని సంతసమిచ్చునట్లును వ్రాయఁబడియున్నది. గ్రంథము జగద్విఖ్యాతులగు పరమహంసగారిచరిత్రమగుటచేతను శైలి యమృతమొలుకుపలుకులచే నలరియుండుటచేతను జదివి తీరవలసినదియేకాని వ్రాయఁదగముకాదు. ఈగ్రంథము శ్రీరామాంకితము చేయబడియున్నది. అవతారికయు మనోహరముగనున్నది. పెంచి యెంతవ్రాసినను గ్రంథశ్రేష్ఠతఁ దెలుపఁజాలము గాన గ్రంథస్థములగు రెండుమూడుపద్యము లిందుదాహరించి వివరించెదము.

ఉ. ఎక్కడవీఁడు రాతరచియించిన విగ్రహమేడ దానికిన్
మ్రొక్కనఁ గాలిదేవి తనమ్రోలను నిల్చుటయేడవీఁడు బ
ల్టక్కరియంచుఁ గొందఱు వెడంగనికొందఱు వ్యాధిపట్టి నెం
పెక్కనటంచుఁ గొందఱు వచింపఁగ సాగిరి పెక్కుభంగులన్. 1 భా

మ. నిరహంకారుఁడు యోగివర్యుఁడు సదా నిర్లిప్తచిత్తుండు
దుర్భరసంసారలతాలవిత్ర విమలప్రజ్ఞానసంపన్నుఁ డీ
శ్వరచింతాపరతంత్రుఁ డింద్రియములన్ బంధించి లోఁగొన్న నే
ర్పరి శాంతాత్ముఁడు రామకృష్ణునకు వారల్వీరలున్సాటియే. 1

ఉ. కంజము బాలుఁడూఁతగను గైకొని పాతభయంబులేక చు
ట్టుంబరువెత్తుమాడ్కి నెపుడుం బరమాత్మయెయూఁతగాఁగ డెం
దంబున భక్తినమ్మకముఁ దాల్చి మెలంగెడు మానవుండు లో
కంబునఁ స్వేచ్ఛగాఁ దిరుగఁ గల్గెడు వీత విషాద చిత్తుఁడై. 2 భా

ఉ. వంటెనక్రింద నీరమొకవంకను జొచ్చుచు దానిక్రింద నా
వంతయు నిల్వ కవ్వలకు నంతయు బాఱెడురీతి మంచి వే
దాంతవచస్సు నీచుచెవులందున నొక్కటిఁబట్టిగూరి యొ
క్కింతయు నిల్వకుండఁ బరువెత్తును రెండవవీను త్రోవనే. 2 భా

ఉ. బిలుసుగ నెత్తినుండు మెలివెండ్రుక నెంతగఁ దిద్దఁ జేసినం
గలుగనుండురీతి నిహకాంక్షులఁ జిక్కెడువాని కెంతగాఁ
గఱపిన నీతివాక్యములు జ్ఞానము నొందక వాడునీచుఁడై
మరగుచుఁ బాపవృత్తి ఋజుమార్గము నంటిచరింపలేఁడుగా. 2 భా

కంతేరు. } ఇట్లు,
ది 16 అక్టోబరు 1904. } దేశోపకారి.

---

III శ్రీరామకృష్ణపరమహంసచరిత్రము — ఈపరమహంసదేవగారి చరిత్రమును దెలిసికొనుటకు నాగరికముగలదేశములలో నుండుప్రజలందరు గోరుచున్నారు. ఇంగ్లాండులో ప్రొఫెసర్ మాక్సు ముల్లరుగారు ఆంగ్లేయభాషలో నీదివ్యచరిత్రమును వ్రాసియున్నారు. అమెరికాలో ననేకులు యీపరమహంసగారిశిష్యులకు శిష్యులై వీరియాత్మబోధనువిని చరితార్థులగుచున్నారు. ఉత్తరఇండియాలో బెంగాలి హిందీభాషలలోను వీరిశుభచరిత్రము వ్రాయఁబడినది. ఇఁక మనరాజధానిలో అరవభాషలో ముగ్గురీచరిత్రమును వ్రాసిరి. ఈపరమహంసగారి శిష్యులొకరు మాపత్రికలో నీవిషయమును వ్రాయుచున్నారుకదా ఇటులుండఁగా గోదావరిజిల్లా పిఠాపురములో శ్రీరాజా చెల్లాయమ్మారావు బహద్దరుగారి హైస్కూలు హెడ్‌మాస్టరగు మ. రా. రా. శ్రీ కూచి నరసింహం బి. ఎ. గారీచరిత్రమును పద్యములుగ రచించిరి. మె॥ నరసింహంగారు మంచి పండితులని మంచికవియని యీగ్రంథమే చెప్పుచున్నది. ఈగ్రంథము 164 పుటలుగలది. ఇది ఆనందముద్రాక్షరశాలలో ముచ్చటగ ముద్రింపఁబడినది. దీనిధర 8 అణాలు దీనిలో శ్రీపరమహంసగారి మంచిపటముగలదు. గ్రంథకర్తగారికవన మిట్టిదని విశదపరచుటకై కొన్ని పద్యములను నిందువ్రాయుచున్నాము.

శా. పూతంబౌ నల రామకృష్ణసువచః ♦ పుంజంబువర్ణింప నా
చేతంగాదని చెప్ప మానుమనె నా ♦ చేత న్మహాయోగివా
గ్జాతంబు ల్గొఱఁ జెందునే? సరసత ♦ న్గల్పించు మద్వాణికి౯
స్ఫీతామోదదమైన కప్పురము దా ♦ విగ్గెల్పదే? పేటికి౯.

ఈగ్రంథమును శ్రీరామునికి అంకితమిచ్చుచు కవిగారిటుల వ్రాసిరి.

క. నాకృతి కన్యారత్నము, నీకుం బరిణయ మొనర్తు ♦ నిశ్చయ మింక
న్నాకులము పావనంబగు, నీకృప భవదంఘ్రిపద్మ ♦ నీరావాప్తి౯.

శ్రీపరమహంసగారి తలిదండ్రు లిటుల వర్ణింపఁబడిరి.

క. చందనకర్పూరంబుల, చందంబున సతియుఁబతియు ♦ సౌఖ్యోన్నతులై
యుందురు నిర్మలచేత, స్పందిత దైహాపరక్తి ♦ సాంద్రయుగాఁగ౯.

చిన్ననాడే పరమహంసగారికి సకలవిద్యలు లభించినవని కవిగారుచెప్పుట.

గీ. బుద్ధికుశలతఁజూచి త♦న్మూర్తిఁజూచి, యుక్తిఁజూచి విలక్షణ ♦ వ్యక్తిఁజూచి
యీతఁడు మహానుభావుఁ డీ♦యిలనుబుట్టె, ననుచుఁ బ్రస్తుతి సేయుచు♦రందఱతని

పండితులు శ్రీపరమహంసగారిని గారవించుట యిటుల వర్ణింపఁబడినది.



గీ. దండిమగలైన షట్శాస్త్ర♦పండితులును, రామకృష్ణుండు మెలఁగు తె♦ఱంగుఁజూచి
గర్వములుడించి యాతని♦కడకుఁజేరి, కోరుదురు జ్ఞానభిక్షను ♦ గురుఁడవంచు.

చెన్నపురి.
డి 18-10-1904.

ఇట్లు,
శశిలేఖపత్రిక.

---

IV. శ్రీరామకృష్ణపరమహంసచరిత్రము — ఈపుస్తకము గోదావరిజిల్లా పిఠాపురమునందలి హైస్కూలులో హెడ్డుమేస్టరుగానున్న కూచి నరసింహము బి. ఏ. గారిచే తెనుగున పద్యకావ్యముగా రచింపబడినది. ఇందు లోకప్రసిద్ధిగాంచిన శ్రీరామకృష్ణ పరమహంసగారి చరిత్రమును, వారుబోధించిన నీతివాక్యములును, విపులముగ దెలుపబడియున్నవి. పద్యములు సులభశైలిని వ్రాయబడియున్నవి. చదువదగినవిషయములు పెక్కులిందుగలవు. వెల 8 అణాలు. వెలస్వల్పము. ఫలమధికము. మతాభిమానమును దైవచింతగలవారెల్లరును ఈగ్రంథమును జదివి యానందింపవచ్చును.

చెన్నపట్టణము.
డి 29-10-1904

ఇటు,
ఆంధ్రప్రకాశిక

---

V. శ్రీరామకృష్ణపరమహంసచారిత్రమును, ఆతండొనర్చిన బోధయును బద్యకావ్యముగా నొనరింపఁబడి యేతద్గ్రంథకర్తలగు బ్రహ్మశ్రీ కూచి నరసింహము బి. ఏ. గారిచే సుకప్రతి మాకార్యస్థానమున కనుపఁబడినది. తొల్లి రాముఁడు పూతచారిత్రముచేతను గృష్ణుఁడు బోధచేతను లోకమున కమితమగు మహోపకారంబొనర్చిరి. కాని శ్రీరామకృష్ణపరమహంసయను నీయవతారపురుషుఁడు రామునివలెఁ బూతచారిత్రమును గృష్ణునివలె చక్కనిబోధనుగూడఁజేసి లోకమునకు దారిచూపుటకై యవతరించినట్లు భక్తులు చెప్పుకొందురు. ఈపగమసాధుని పావనచారిత్రమును ఖండాంతరులగు మోక్షమూలరు దొరవారు మున్నగువారు వ్రాయుటచేతనే యీతఁడెంత ఘనుఁడో బోధపడగలదు. ఈతనిబోధలు మధురములు సర్వజన సమాదరణీయములునై యున్నవి. ఇట్టివాని చారిత్రమును నీతులను బద్యరూపముగా నొనర్చుట చాల లోకోపకారమయిన పని. ఈతనిచారిత్రమును, బోధలను, నిదివఱకుఁ గొందరు తెలుఁగున వచనరూపముగా జేసియే యున్నారు కాని పద్యరూపముగానున్న యెడల పఠించుకొనుటకు నెక్కుడు వీలుగానుండును గాన నీపద్ధతి యెక్కువ స్తవనీయముగానున్నది. ఇందుండికొన్ని పద్యముల నిందు క్రిందనిచ్చుచున్నాము.

క. జనకునిగా సర్వేశ్వరు మనమున ధ్యానించుకంటె మాతగ భావిం
చినవాఁడు శీఘ్రముగఁ దా నెనయును మోక్షంబటంచు నెంచఁగవలయున్.

తే.గీ. అతివలందఱు భగవతి యంశమునసె, జన్మమొందినవారను సత్యమెఱిఁగి
భక్తుఁడై మోక్షమునుగోరువాఁడు వారి మాతృసదృశలుగా గణింపంగవలయు.

తే.గీ. మాతముగాదని మతియొక మతముఁబూని, కొంచముచదివి యన్నివర్జించుకంటె
నేదియో యొక్కటి యొయంటి కృషి నిజేయ. మంచిగల్గునుముక్తి ప్రాప్తించుఁదుదను

తే.గీ. హిందువులలోన మతము లెన్నేనిగలవు, వానిలో నెద్ది గైకొనవలయునవక
యన్ని యెట్లున్న నీకేమి? యంటి నీదు, మతనిధుల శ్రద్ధ కోఁజల్పు మానకుండ.

కాకినాడ.
నవంబరు 1904 సం॥

ఇట్లు,
శ్రీ సావిత్రిపత్రిక

---

VI. ... ... ...

You have put into beautiful Telugu verse the teachings of an Indian sage whose sublime religious philosophy has won the admiration of distinguished men like the late Prof. Max Muller. We have in Sanscrit a large number of books on religion, but most of them do not suit people who wish to study Hindu religion from a non-sectarian point of view. As your book gives the lofty religious philosophy of a man who was a typical Hindu *Yogee*, it deserves to be read by those who would have an idea of religion as understood and practised by one of the greatest of Indians in modern times

VIJIANAGARAM.
25-11-1904.

K. Ramanujachari Garu,
M. A. B. L.

---



VII. ... ... ... ...

I congratulate you on the simple and sweet way in which you have written the verses. Let me hope this will be the first of a series of useful books from your pen. For such a long time you have been rather silent. Silence on the part of a gentleman of your abilities is not at all excusable.

... ... ... ...

VIZIANAGARAM,
15-10-1904.

R. Venkatasivudu Garu,
B. A. L. T.

---

VIII. ... ... ...

Your Life and Teachings of Rama Krishna Paramahamsa to hand. I have gone through a great portion of the book carefully and I must say that I could not help admiring the simplicity and chastity of its diction. Your book has been purposely written in the "New style" inaugurated by Rao Bahadur K. Veerasalingam garu than whom no one has done more in recent times for the improvement of Telugu literature ... ... ...

I am glad to observe that your refined taste has enabled you to steer clear of all tiresome conventionalities and to present a handy book to the public in a lucid and intelligible language. ... ... ...

SOMPETA.
1-11-1904.

G. Gangadhara Somayajulu Garu,
M. A. B. L.

---

IX. ... ... ...

Krishna Row garu gave me the other day the copy that you sent me through him, of the "Life and Teachings of Srimat Paramahamsa Rama Krishna" which

you had so excellently done into Telugu poetry. It has given me no small pleasure to read the life of the true Mahatman of Dakshineswar, the greatest saint of modern times which India and India alone as mother of religion, had the privilege of bearing even in these days of rank materialism, in such sweet and flowing verse as yours; and you have laid the Telugu reading public under a deep debt of gratitude by enabling them to read such an ennobling and soul-lifting life in their own vernacular. ... ...

NUZVID. } K. Sudarsana Row garu,
9-10-1904. } B. A. L. T.

---

X. ... ... ...

I have gone through the book carefully and I am much pleased with the simple and elegant style you adopted all through. You have done good service to the religious public; and I trust your labours will meet with commensurate compensation. Trusting that the booklet will command a rapid sale, and you will be incited to do further good in the field you have chosen ... ...

NUZVID, } S. Venkoba Row garu,
26-10-1904. } B. A. B. L.

---

XI. ... ...

Please excuse me for the delay in acknowledging receipt of your excellent work. I went through portions of it, and I find it written in good, clear style. I hope it will be largely read by the Telugu public, who are sure to find it very useful. The life of such a great saint must of course have very good effect ... ...

RAJAHMUNDRY, } N. Durgayya garu,
18-2-1905. } B. A.



XII. ... ... ...

I thank you for the copy you have kindly sent me, which so far as I have perused is very delightful reading. I congratulate you both on the happy choice of your subject and the very excellent manner in which you have executed the task. ... ...

MASULA. } C. Bhanumurti garu,
20-10-1904. } B. A. L. T.

---

XIII. ... ... ...

ఉత్పలమాలాపంచకము.

1 ధాత్రి సురాన్వయాంబుధి సు ◆ ధాకర కూచి నృసింహరాయ తా
పత్రయమోచనుండు ఘన ◆ పాతక తూలదవానలుండు వా
క్యత్రయవేదియై పరమ ◆ హంసయనంబడు రామకృష్ణచా
రిత్రము పద్యకావ్యముగ ◆ రీతిని మీరొనరింప; దాని నా
2 మిత్రునియొద్దఁ గైకొని త ◆ మిమ్ జదువం జదువంగనద్దిరా!
శ్రోత్రములందు వాక్యసుధఁ ◆ జొన్పుచు పోలిని గూర్చుపద్యముల్
గాత్రమునందు నిండఁ బుల ◆ కల్! జనియింపఁగఁజేయునర్థముల్
నేత్రపథంబునం దెదుట ◆ నిల్పినయట్టుల తోఁచుభావముల్
3 పాత్రములైనరీతులు సె ◆ బాసు! బలా! యనఁ జేయుశైలియున్
బుత్రుల మిత్రుల న్సతుల ◆ భూముల గీముల నేమఱించి కా
లత్రయిదేవుపై మనసు ◆ లగ్నముగా నొనరించు బోధముల్
సూత్రమునందు ముత్యములఁ ◆ జొన్పినపోలికనుండు కూరుపుమ్
4 జిత్రముగాఁ గనంబడియె; ◆ నే నొకసారియె చూచి యంతలో
నాత్రముతోడ వ్రాసినది ◆ యా! యిది; నిశ్చలమానసుండనై
స్వత్రి చతుష్కవారములు ◆ వేదసమంబుగ దీనిఁ జూచితిమ్
గాత్రము సౌఖ్యవృత్తిఁ బుల ◆ కల్ చిలుకన్; బళిరయ్య! వర్ణనా
5 మాత్రముగాదు. దీనిఁ బలు ◆ మాఱులు చూడఁగఁ జూడ నెన్నియో
చిత్రములైన యూహలను ◆ జేయఁగఁ జాలుదునంచు నెంచితిన్
మిత్రమ! దీని మీఁదికి ◆ మెప్పునకుం బొనరించు నాముఖ

స్తోత్రము గాఁగ నెంచకుఁడి! శుద్ధమనస్కుఁడనై వచించితిన్

... ... ...

పిఠాపురము.
6-2-1905. } ఓలేటి పార్వతీశకవిగారు.

---

XIV. ... ... ...

మొదట ఆపరమహంసచరిత్రమునందును ఆమహనీయుని యుపదేశములందును జనులకు మిక్కిలిప్రీతి. అందుపయి మీపుస్తకముశైలి మృదువయి సుబోధమయి యింపుగానున్నది. ఈరెండిటికిని తోడు అచ్చును స్ఫుటమయి రమ్యమయియున్నది.

మీపుస్తకమును అనేకులు చదివి ఆనందించి మిమ్మభినందింతురనుటకు సందేహము లేదు.

... ... ... ...

అనకాపల్లి.
8-10-1904. } బులుసు పాపయ్యశాస్త్రిగారు.

---

XV. ... ... ..

సగమువఱకుఁ జదివినాను. Introduction చాలబాగున్నది. తమ కావ్యకన్యకు మంచివరుని సంపాదించినారు. కథానాయకుఁడును దమచిత్తానుసారమే చిక్కినాఁడు. తమకవిత్వశైలి నింత విపులముగా ముందెన్నఁడు నేను వినియుండలేదు. 56, 59, 75 నంబరులపద్యములు కంఠపాఠము చేయుటకై గుర్తుపెట్టియుంచినాను ఇట్టిపద్యము లింకఁ జాలనుండవచ్చును. ఇట్టి మృదుమధురశైలియగుటచేత నిది సర్వజనాదరణీయమై యున్నది. కొందఱు స్నేహితులవలనఁగూడ నివే remarks వినఁగలిగితిని. ... ...

నూజవీడు.
10-11-1904. } చేతపూడి భగవంతరావుగారు.

---

